# వీక్షణం

VEEKSHANAM, TELUGU MONTHLY
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
సంపుటి : 15 సంచిక : 6 హైదరాబాద్ 191 జూన్ 2017 పేజీలు : 68 రు. 20

* ప్రజా వ్యతిరేక భూసేకరణ చట్టం-2016
* జలవనరుల రక్షణకు రైతుల బలిదానాలు
* మిర్చి రైతుల మృత్యు ఘోష
* కశ్మీర్‌కు రాజకీయ చర్చలే పరిష్కారం
* సుక్మా ఎన్‌కౌంటర్ అనంతర పరిణామాలు
* బాబ్రీ కేసు - రెండు తీర్పులు
* ప్రమాదకరమైన ట్రంప్ యుద్ధోన్మాదం

# ఆర్ఎస్ రావు స్మారకోపన్యాసం - 2017



గత ఆరు సంవత్సరాలుగా క్రమం తప్పకుండా జరుగుతున్న వార్షిక ఆర్ఎస్ రావు స్మారకోపన్యాసం ఈ సంవత్సరం ఆర్ఎస్ రావు వర్ధంతి సందర్భంగా జూన్ 17న జరుగుతుంది. ఈ సంవత్సరం స్మారకోపన్యాసం అంశం **'ఆర్.ఎస్.రావు దృక్పథంలో ప్రజాస్వామిక హక్కులు - మరొకసారి చర్చ' (Revisiting Democratic Rights through R.S. Rao)** **జూన్ 17, శనివారం, సాయంత్రం 6 గంటలకు షోయెబ్ హాలు, సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో** జరుగుతుంది.

వక్త: **పంకజ్ దత్,** రాజకీయార్థిక శాస్త్రవేత్త.

**అందరూ ఆహ్వానితులే.**

## వీక్షణం
## రచయితల సమావేశం

**జూలై 9, 2017 ఆదివారం**
**మహబూబ్‌నగర్**

వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక గత తొమ్మిది సంవత్సరాలుగా ప్రతి సంవత్సరం రచయితల సమావేశాలు జరిపి, వీక్షణం పనితీరు మీద సమీక్ష, భవిష్యత్తుకు సూచనలు చర్చిస్తున్న సంగతి మీకు తెలుసు. రాష్ట్ర విభజన తరువాత తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌లలో విడివిడిగా ఈ సమావేశాలు జరుగుతున్నాయి. ఈ సంవత్సరం నుంచి ఈ సమావేశాలు జిల్లాలలో కూడా జరపాలని ఆలోచిస్తున్నాం. తెలంగాణ సమావేశం మొదటి సారిగా మహబూబ్‌నగర్ జిల్లాలో జరపనున్నాం. వీక్షణం రచయితలు, పాఠకులు, శ్రేయోభిలాషులు అందరికీ ఆహ్వానం.

**వై. రామచంద్రం** (9949391028) ను సంప్రదించండి




## కె.వి.ఆర్.
## కవిత్వం

కె.వి.ఆర్. శారదాంబ కమిటీ ప్రచురణ

**పేజీలు : 350** **వెల : రు. 170**

ప్రతులకు

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫోన్: 040 66843495

191 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జూన్ 2017
సంపుటి : 15
సంచిక : 06





‘వీక్షణం’లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. ‘వీక్షణం’ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

‘వీక్షణం’ పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
VEEKSHANAM
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై ‘VEEKSHANAM’ అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2017 మే నెలలో వచ్చిన విరాళాలు - యామిని క్రిష్ణ, హైదరాబాద్ - రు. 3000; జొన్నవిత్తుల శ్రీరామమూర్తి, హైదరాబాద్ - రు. 2,000; టి. సంతోష్‌కుమార్, కరీంనగర్ - రు. 20,000; చరసాల ప్రసాద్, యు.ఎస్.ఎ. - రు. 10,000. మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

వీక్షణం మే సంచికలో వరవరరావు రాసిన 'నక్సల్బరీ ప్రాసంగికత' అనే వ్యాసం చదివి నేనీ 'ఇ-మెయిల్' రాస్తున్నాను. చాలా రోజులుగా వారి నుండి మంచి ఎడ్యుకేటివ్ విలువ గలిగిన ఇటువంటి వ్యాసం కోసం నేను ఎదురుచూస్తున్నాను. నేనే కాదు, బహుశా నాలానే, ఇంకా చాలా మంది ఇలానే ఆశించి ఉంటారని నేను భావిస్తున్నాను. నక్సల్బరీ తాత్వికతను, అది ప్రతిపాదించి ఆచరిస్తూ వస్తున్న విలువలను, నక్సల్బరీ తప్ప వేరే మార్గం లేదని నిరూపితమైన క్రమాన్ని ఈ వ్యాసం అద్భుతంగా క్రోడీకరించి శాస్త్రీయంగా వివరించింది. ఈ వ్యాసం త్వరితగతిన అన్ని ఇతర భాషల్లోనికి అనువదించబడి ప్రచారంలోకి తేవడం చాలా అవసరమని నేను భావిస్తున్నాను. ప్రస్తుత సంక్లిష్ట సందర్భంలో ఇటువంటి వ్యాసం ప్రజలకు అందించినందుకు రచయితకు, అలాగే నక్సల్బరీ పై ఈ వ్యాసంతో పాటు మరో 4 వ్యాసాలు కూడా ప్రచురించినందుకు వీక్షణానికి నా ధన్యవాదాలు. 'మే' నెల వీక్షణం ఇప్పుడు గమనంలో ఉన్న ఇరు తెలుగు, భారతదేశ సమాజాల విశ్లేషణాత్మక చిత్రపటాన్ని ప్రజల ముందు ప్రభావితంగా ఆవిష్కరించింది. ఈ సంచికలోని వ్యాస రచయితలందరికీ నా ధన్యవాదాలు.

– బి.ఎస్. రాజు
బోకా-రేటన్, ఫ్లోరిడా యు.ఎస్.ఎ

వీక్షణం మే సంచికలో అచ్చయిన 'సత్యం బాబు తొమ్మిదేళ్ల వృథా జైలు జీవితం' వ్యాసం చదివాక మనసు మూగగా రోదించింది. కళ్లు చెమర్చాయి. చేయని నేరానికి ఎనిమిదేళ్లకు పైగా జైలులో గడపడం అధికారుల నిర్లక్ష్యానికి దర్పం పడుతోంది. అతనికి అయిన ఖర్చులకు గాను ఎన్ని లక్షలు ఇచ్చినప్పటికీ 'సత్యం' పడ్డ మానసిక క్షోభ వెలకట్టలేనిది. వంద మంది దోషులు తప్పించుకున్నప్పటికీ ఒక నిర్దోషి శిక్షింపబడకూడదని పై అధికారులు ఎప్పటికి తెలుసుకుంటారో, ఏమో? ఏదేమయినప్పటికీ ఇలాంటి పొరపాట్లు పునరావృతం కాకుండా ప్రభుత్వం జాగ్రత్తపడాలి.

– బిక్కునూరు రాజేశ్వర్,
పొన్కల్, నిర్మల్

మే సంచికలో అచ్చయిన నక్సల్బరీకి యాభై ఏళ్లు నిండిన సందర్భంగా అచ్చువేసిన వ్యాసాలు కొత్త తరానికి పార్లమెంటరీ రాజకీయాలకు ప్రత్యామ్నాయంగా వచ్చిన నక్సల్బరీ ఉద్యమం గురించి తెలుసుకునే వీలుకలిగింది. అందులో విషయానికి వస్తే నక్సల్బరీకి 2017 మే 25కు యాభై ఏళ్లు నిండుతాయి. 1967 మే 23-25న పశ్చిమ బెంగాల్ రాష్ట్రం డార్జిలింగ్ జిల్లా సిలిగురి తాలూకా నక్సల్బరీ అనే ఒక సంథాల్ తెగకు చెందిన కుగ్రామంలో ప్రారంభమైన సాయుధ పోరాటం నేడు దేశంలో 13 రాష్ట్రాలలో 220 జిల్లాలలో కార్యక్రమాలు నిర్వహిస్తున్నప్పటికీ అవి అన్ని గిరిజన ప్రాంతాలు. బాగా వెనకబడిన ప్రాంతాలు. 2014 సెప్టెంబర్ 21న మావోయిస్టు పార్టీగా ఏర్పడినప్పటికీ ఆశించినంతగా బలపడలేదు. నిర్బంధం అణచివేత బాగా పెరిగింది. పారా మిలిటరీ బలగాల బందిఖానాలో లక్షలాది మంది గిరిజనులున్నారు. ఉద్యమం పురుడుపోసుకున్న రెండు తెలుగు రాష్ట్రాలలో నేడు ఉనికి కోల్పోయింది. మేధావి సంఘీభావం పూర్వం కంటే తగ్గింది. రైతాంగం, కార్మిక వర్గానికి ఈ ఉద్యమం త్యాగాలు ఎందుకు చేస్తున్నదో తెలుసుకోవడంలేదు. మీడియా వాస్తవాలను పూర్తిస్థాయిలో వెలుగులోనికి తీసుకొని రావడంలేదు. అందరు నక్సలైట్లకు, పోలీసులకు ఘర్షణగా చూస్తున్నారు. దోపిడి రాజ్యానికి వ్యతిరేకంగా జరుగుతున్న పోరుగా తెలుసుకోరు. ఖనిజ తవ్వకాలు జరిగితే దేశంలో 2 కోట్ల మంది గిరిజనులు నివాసం ఉపాధి కోల్పోతారని చాలా మందికి తెలియదు. యాభై ఏళ్ల ఉద్యమం నాడు - నేడు ఉన్న పరిస్థితులు, కులానికి వర్గానికి ఉన్న సంబంధం, కులం భారతీయ సమాజంలో పునాదినీ, ఉపరితలాన్ని ప్రభావితం చేస్తున్న అంశం మొదలగు అనేక అంశాలు సమీక్షించుకోవలసి ఉంది. అణగారిన ప్రజలు సాయుధ పోరుకు సిద్ధంగా నేడు ఉన్నారా? కార్మిక వర్గం, రైతాంగం, విద్యార్థులు, పార్లమెంటరీ పంథాలో కనీసం ఎందుకు ఉద్యమించలేక పోతున్నారు? నేడు శ్రామిక వర్గం ఏ దశలో ఉంది. మననం చేసుకోవాలి. ఓటర్లు అమ్మకపు సరుకుగా మారిపోయారు. ఇదంతా నేను ఆవేదనతో రాస్తున్నాను. వ్యతిరేకతతో కాదు. పాఠకులు అర్థం చేసుకోగలరు.

– తుంపాల శ్రీరామమూర్తి,
గాజువాక, విశాఖపట్నం

ఆయేషా మీరా హత్య కేసుకు సంబంధించి వీక్షణం పత్రిక మే సంచికలో వచ్చిన రెండు వ్యాసాలు సమగ్ర సమాచారంతో ఉన్నాయి. ఆయేషా మీరా హత్య కేసులో ప్రధాన దోషిగా సత్యంబాబును ఎనిమిది సంవత్సరాలపాటు చట్టబద్ధంగా శిక్షించి చివరకు అవే చట్టాలు ఆయనను నిర్దోషిగా పేర్కొంటూ తీర్పునిచ్చాయి. హైకోర్టు ఇచ్చిన ఈ తీర్పు తీవ్రత ఉన్నత న్యాయస్థానానికి, ఆ కింద ఉన్న న్యాయస్థానాలకు మధ్య ఉన్న అంశాలవారీ వ్యత్యాసాన్ని స్పష్టం చేసింది. ఈ తీర్పు ద్వారా క్షేత్రస్థాయిలో, పరిమిత పరిధిలో కేసులను ఏ రకంగా తారుమారు చేయొచ్చో ఆ పరిధిలోని అధికార సహాయక ప్రభావిత యంత్రాంగం పరోక్షంగా ప్రజలకు తేటతెల్లం చేసినట్లయింది. ఈ కేసులో అన్యాయంగా ఎనిమిది సంవత్సరాలు జైలు జీవితం గడిపిన సత్యంబాబుకు వ్యక్తిగతంగా కేవలం యావజ్జీవ శిక్ష నుండి సంపూర్ణ ఉపశమనం, నింద తొలగిందనే తృప్తి వీటికి మించి గొప్ప న్యాయం జరగలేదనే చెప్పాలి. హైకోర్టు తీర్పులో భాగంగా నష్టపరిహారం కింద సత్యంబాబుకు దక్కేది కేవలం లక్ష రూపాయలు. ఈ సందర్భంగా.. ఆయేషా మీరా హత్య నాటి నుండి సత్యంబాబును దోషిగా ప్రకటిస్తూ విజయవాడ మహిళా సెషన్స్ కోర్టు తీర్పునిచ్చేంతవరకు జరిగిన మొత్తం విచారణకు ప్రభుత్వం వెచ్చించిన వ్యయం

(మిగతా 47వ పేజీలో...)

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ముత్తనగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్;

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కడప - కొండ్రాయుడు; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి - కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం - ఆర్. శ్రీలత; విశాఖపట్నం - పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# దేశ భవిష్యత్తుకు సూచిక ఉత్తరప్రదేశ్

అసమానతను, అణగారిన వారి పట్ల దౌర్జన్యాన్ని సమర్థించే సంఘ్ పరివార్ రాజకీయాధికారం సమాజానికి ఎంత హానికరంగా మారుతుందో దేశవ్యాప్తంగా మూడు సంవత్సరాల మోడీ పాలన నగ్నంగా చూపుతుండ గానే, అంతకు మించిన దుర్మార్గాలతో ఉత్తరప్రదేశ్ లో యోగి ఆదిత్యనాథ్ పాలన కొద్ది వారాల్లోనే సమాజాన్ని తాము ఎంత అతలాకుతలం చేయగలరో చూపుతున్నది. సంఘ్ పరివార్‌కు పుట్టినినాటి నుంచీ ఉన్న ముస్లిం వ్యతిరేకతతో పాటు దళిత వ్యతిరేకత కూడ ప్రస్తుతం ఉత్తరప్రదేశ్ లో విషపు కోరలు చాస్తున్నది. చాతుర్వర్ణ హిందూ బ్రాహ్మణీయ ధర్మాన్ని కాపాడడమే, నిచ్చెనమెట్ల కులవ్యవస్థను చెదిరిపోకుండా నిలబెట్టడమే సంఘ్ పరివార్ లక్ష్యం. దళిత, శూద్ర కులాల చైతన్యాన్ని, ప్రతిఘటనను అణచివేయడమే దాని ఆశయం. ఆ ఆశయం ఉత్తరప్రదేశ్ లో స్పష్టంగా బైటపడుతున్నది.

మరీ ముఖ్యంగా నెలరోజులకు పైగా సహారన్‌పూర్ జిల్లాలో జరుగుతున్న ఘటనలు సంఘ్ పరివార్ సమాజ విచ్ఛిన్నక, దళిత వ్యతిరేక విద్వేష రాజకీయాలకు అద్దం పడుతున్నాయి. అంబేడ్కర్ జయంతి సందర్భంగా ఏప్రిల్ 24న ఊరేగింపుగా వెళ్తున్న దళితుల మీద భారతీయ జనతా పార్టీ మూకలు దాడి చేసి గాయపరచడం ఇటీవలి ఘర్షణలకు నాంది. ఆ రోజు సహారన్‌పూర్ జిల్లాలోని షబ్బీర్‌పూర్‌లో ఉన్న రవిదాస్ ఆలయం లోపల అంబేడ్కర్ విగ్రహాన్ని నెలకొల్పాలని దళితులు ఊరేగింపుగా వెళ్తున్నారు. ఆ ఊరేగింపు మీద భాజపా కార్యకర్తలు దాడి చేశారు. ఈ ఘర్షణల గురించి నమోదైన కేసులో ప్రధాన నిందితుడు సహారన్‌పూర్ పార్లమెంటు సభ్యుడు, భారతీయ జనతా పార్టీ నాయకుడు రాఘవ్ లఖన్‌పాల్ అంటేనే భాజపా కేంద్ర, రాష్ట్ర అధికారాలతో పెట్రేగిపోయి, తన విద్వేష రాజకీయాలను ఉధృతం చేయబూనుకున్నదని అర్థం. ఆ తర్వాత మే 5, మే 9, మే 23 అలా ఘర్షణలు జరుగుతూనే ఉన్నాయి. ఇప్పటికి ఈ ఘర్షణలలో కనీసం ముగ్గురు చనిపోయారు, డజన్ల కొద్దీ గాయపడ్డారు. ఇళ్లు, వాహనాలు తగులబెట్టడం జరిగింది. మే 5న మహారాణా ప్రతాప్ విగ్రహానికి పూలదండ వేయడానికి వెళ్తున్న 20–25 మంది ఠాకూర్ అగ్రవర్ణాల యువకులు దళితుల రవిదాస్ ఆలయం ముందు నుంచి వెళ్తున్నప్పుడు వాళ్లు వాయిస్తున్న బాజాల ధ్వని తగ్గించాలని స్థానిక దళితులు అడిగినందుకు మళ్లీ దాడి చేశారు. దళితులు ప్రతిఘటించడంతో ఇరువర్గాలూ రాళ్లతో, కర్రలతో ఘర్షణ పడ్డాయి. అక్కడికి చేరిన పోలీసులు అప్పటికి ఠాకూర్ యువకులను పంపించివేసినప్పటికీ, కొద్ది సేపట్లోనే వాళ్లు మరింతమందితో తిరిగివచ్చి షబ్బీర్ పూర్ గ్రామం మీద దాడి చేశారు. దాదాపు ఇరవై దళితుల ఇళ్లను తగులబెట్టారు. వాహనాలను తగులబెట్టారు. ఈ మే 5 ఘటనలకు ప్రతిగా మే 9 న దళితులు ఠాకూర్ల మీద దాడి చేశారు. ఒక ఠాకూర్ చనిపోయాడు. ఈ ఘర్షణల నేపథ్యంలో సహారన్‌పూర్‌లో బహుజన్ సమాజ్ పార్టీ నాయకురాలు మాయావతి మే 23న ఒక సభ ఏర్పాటు చేసింది. ఆ సభ తర్వాత మరొకసారి దళితులకు, భాజపా నాయకత్వం లోని అగ్రవర్ణాలకూ ఘర్షణ జరిగింది.

అంతకు ముందు జరిగిన రెండు ఘర్షణల విషయంలో ఏ చర్యలూ తీసుకోని పోలీసులు, మే 9న జరిగిన ఘర్షణల విషయంలో దళితులను ఎడాపెడా అరెస్టులు చేసి, దాదాపు 30 మంది మీద కేసులు పెట్టారు. భీం ఆర్మీ నాయకుడు చంద్రశేఖర్ ఈ ఘర్షణలలో నిందితుడిగా ప్రకటించారు. తనను తాను రావణ్ అని పిలుచుకునే 30 సంవత్సరాల యువకుడు చంద్రశేఖర్ గత రెండు సంవత్సరాలుగా సహారన్‌పూర్ దళిత చైతన్య ప్రజ్వలనానికి సూచికగా ఉన్నాడు. 18–25 ఏళ్ల మధ్య యువకులను చేర్చుకునే భీం ఆర్మీ ఏకతా మిషన్ దళిత క్రియాశీల రాజకీయాలకు చిహ్నంగా అభివృద్ధి చెందుతున్నది. ప్రస్తుతానికి ప్రధానంగా చమార్, జాతవ్ కులాలకు చెందిన దళితులు మాత్రమే ఇందులో ఉన్నప్పటికీ, ఇతర దళిత కులాలన్నిటికీ విస్తరించాలనే లక్ష్యం ఉంది. కనీసం ఏడెనిమిది శాతం ముస్లింలను కూడ చేర్చుకోవాలనీ, దళిత–ముస్లిం ఐక్యతకు చిహ్నంగా ఈ సంస్థను తయారు చేయాలనీ ఆశిస్తున్నారు. ప్రస్తుతానికి చైతన్యీకరణ కార్యక్రమంలో ఉన్న భీం ఆర్మీ కనీసం 300 స్టడీ సర్కిళ్లను నడుపుతున్నదని, వేలాది మంది సభ్యులు ఉన్నారని ఒక అంచనా. సహారన్‌పూర్ ఘర్షణలకు కారణంగా చూపుతూ, భీం ఆర్మీ మీద నేరారోపణలు చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం ప్రయత్నిస్తున్న నేపథ్యంలో భీం ఆర్మీ ఢిల్లీ జంతర్ మంతర్ దగ్గర ప్రదర్శన నిర్వహించింది. సహారన్ పూర్ లో అజ్ఞాతవాసం నుంచి చంద్రశేఖర్ ఆజాద్ రావణ్ ఇచ్చిన ఈ పిలుపు విజయం సాధిస్తుందా అని చాలమంది అనుమానించారు గాని, ఢిల్లీ పోలీసుల అంచనా ప్రకారం పదివేల మంది, స్వతంత్ర పరిశీలకుల అంచనా ప్రకారం ఇరవై వేల మంది హాజరైన ఈ ప్రదర్శన భీం ఆర్మీ బలాన్ని ప్రకటించింది. బహుజన్ సమాజ్ పార్టీ కూడ భీం సేన వంటి క్రియాశీల శక్తి ఎదుగుదలను సహించడం లేదని పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు.

హిందూ బ్రాహ్మణీయ కులవిద్వేష రాజకీయాలను ముందుకు తీసుకుపోదలచుకున్న సంఘ్ పరివార్ ఒకవైపు, అధికారం తమకు అండగా ఉన్నదనే గర్వంతో పెట్రేగిపోతున్న అగ్రవర్ణాలు మరొకవైపు, సాధారణంగా అగ్రవర్ణాలకే, వ్యవస్థ యథాతథ స్థితికే వత్తాసు పలుకుతూ దళితుల మీదనే దాడులు చేసే అధికార, పోలీసు వర్గాలు మరొకవైపు ఉండగా ఈ ముప్పేట దాడిని ఎదుర్కోవడానికి ఇతర పీడిత వర్గాలన్నిటితో ఏకం కావడం, క్రియాశీల ప్రతిఘటనను ప్రదర్శించడం మినహా దళితుల ముందు మరొక మార్గం లేదు. కాని పార్లమెంటరీ రాజకీయాల ఊబిలో తాము దిగి, అశేష దళిత జన బాహుళ్యాన్ని కూడ వంచించదలచిన దళారీ నాయకత్వాలు అందుకు సిద్ధంగా లేవు. గుజరాత్ ఊనాలో జిగ్నేష్ మేవానీ, ఉత్తరప్రదేశ్‌లో భీం ఆర్మీ వంటి ప్రయత్నాలు నడుమ తడబడకుండా, నిజమైన దళిత ప్రయోజనాల కోసం నిలబడడం, సమరశీల పోరాట రూపాలను కొనసాగించడం ఇవాళ్టి అవసరం. ఉత్తరప్రదేశ్ ఒకవైపు సంఘ్ పరివార్ రాజకీయాధికారానికీ, నేరుగా కాషాయధారులు అధికారపీఠాలు అధిరోహించడానికీ, కుల మత విద్వేష రాజకీయాల విచ్చలవిడితనానికీ సూచికగా, మరొకవైపు దళిత ముస్లిం ఐక్యతకూ, ప్రతిఘటనకూ, సమరశీల పోరాటాలకూ కూడ సూచికగా నిలుస్తున్నది. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# తెలంగాణలో భాజపా పాదం మోపుతుందా?

కేంద్ర ప్రభుత్వ అధికారం సహాయంతో తెలంగాణలో రానున్న ఎన్నికలలో విజయం సాధించాలనో, కనీసం బలం పెంచుకోవాలనో భారతీయ జనతా పార్టీ తీవ్రంగా ప్రయత్నిస్తున్నది. రాష్ట్ర నాయకుల ప్రయత్నాలు సరిపోవడం లేదని, స్వయంగా భారతీయ జనతా పార్టీ అధ్యక్షుడు అమిత్ షా రంగంలోకి దిగాడు. దళితులతో సహపంక్తి భోజనాలు, రజాకార్ల దాడికి గురైన గ్రామం సందర్శన, విప్లవోద్యమానికీ సంఘ్ పరివార్‌కూ మధ్య ఘర్షణ జరిగిన గ్రామం సందర్శన, పనిలో పనిగా తెలంగాణ రాష్ట్ర సమితి మీద విమర్శ అనే కార్యక్రమాలతో మూడు రోజుల తెలంగాణ పర్యటన సాగింది. అయితే ఇవన్నీ బూటకపు కార్యక్రమాలే. దళితులతో సహపంక్తి భోజనం చేయడం దళితులకేమీ మెహర్బానీ కాదు. నిజానికి అది వారిని అవమానించడం కూడ. రజాకార్ల గురించీ, ప్రజల సాయుధ పోరాటం గురించీ భారతీయ జనతా పార్టీ మాట్లాడడం హాస్యాస్పదం. విప్లవోద్యమ ప్రభావం ఉండిన గ్రామాన్ని సందర్శించడం ఒక ప్రచార గారడీ తప్ప దానితో సాధించేదేమీ ఉండదు. ఇక తెరాస మీద విమర్శలు, దానికి ముఖ్యమంత్రి ప్రతి విమర్శలు ముందే కుదుర్చుకున్న ఒప్పందపు ప్రహసనం. సంఘ్ పరివార్ ఏ హైందవ బ్రాహ్మణీయ మూఢాచారాలకు ప్రతినిధిగా నిలుస్తున్నదో అవే మూఢాచారాలను, యాగాలను, హిందూ మత ధర్మాలను తెరాస అంతకన్న ఎక్కువగా అనుసరిస్తున్నది. వాళ్లు యోగిని ముఖ్యమంత్రిని చేస్తే, ఈ ముఖ్యమంత్రి జీయర్ స్వామిని తన కుర్చీలో కూచోబెట్టాడు. హిందూ మతోన్మాదాన్ని అనుసరించడంలో ఇద్దరి మధ్య ఏ తేడా లేదు. కేంద్ర ప్రభుత్వాన్ని నిరంతరం మెచ్చుకుంటూ, ఖండించదగిన సందర్భాలలో కూడ సమర్థిస్తూ, చివరికి రేపు జరగబోయే రాష్ట్రపతి ఎన్నికలలో కూడ మద్దతు ప్రకటిస్తూ ఉన్న తెరాస తనకు విశ్వసనీయ మిత్రుడేనని భాజపాకు తెలుసు. కాకపోతే తెలంగాణలో మరిన్ని స్థానాలు సంపాదించుకోవడానికి, ప్రతిపక్షం లాగ నటించడానికి ప్రణయ కలహం నటించవలసి ఉన్నది. ఆ నాటకంలో అమిత్ షా తన పాత్ర తాను నిర్వహించాడు. వెంటనే ముఖ్యమంత్రి తన పాత్ర నిర్వహించడానికి ముందుకు వచ్చి, పనిలో పనిగా మళ్లీ ఒకసారి తెలంగాణ భావోద్వేగాలను రెచ్చగొట్టడానికి ఆ అవకాశం వాడుకున్నాడు. ఏడు మండలాలు కొల్లగొట్టడం గురించి మూడు సంవత్సరాల్లో ఎన్నడూ గుర్తు రాని ముఖ్యమంత్రికి ఇప్పుడు అదే ఒక ఆధారమయింది. గణాంకాలు ఎంత దగాకోరువంటే వాటిని అటయినా ఇటయినా ఎవరికి కావలసినట్టు వాళ్లు వంచుకోవచ్చు. ఇంతకూ ఇతర ముఖ్యమంత్రులందరి మీద కక్ష సాధింపుకు సిబిఐని వాడుకున్నట్టుగా, తెలంగాణ ముఖ్యమంత్రి మీద కూడ వాడుకుంటే, వాడుకుంటామని బెదిరిస్తే ఈ గర్జనలన్నీ పిల్లి కూతలుగా మారిపోతాయి. ఇంతకూ అసలు సమస్య భాజపాకు ఏం చేసినా తెలంగాణలో పాదం మోపే స్థలం దొరుకుతుందా? ఎంతగా తెలంగాణ ఉద్యమంలో పాల్గొన్నానని చెప్పుకున్నా, కాకినాడ తీర్మానపు మోసం, లోకసభ, రాజ్యసభలలో చివరిరోజు అడ్డంకులు భాజపాను వదలవు. ఎంతకాదన్నా తెలంగాణ ప్రజానీకం మనసులో అది ఒక భూస్వాముల పార్టీ. అది ఎదగదని తెలిసి కూడ దాని మీద యుద్ధం చేస్తున్నట్టు నటించడం తెరాస అవసరం. అలా ఇద్దరూ నటనలో జీవిస్తున్నారు. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# ఎలుగెత్తుతున్న రాయలసీమ, ఉత్తరాంధ్ర

చంద్రబాబు నాయుడు పాలన ఆయన రాజకీయార్థిక విశ్వాసాల వల్లనే అసమాభివృద్ధికి దారితీయక తప్పదు. గత ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రోజుల నుంచీ తెలంగాణ మాత్రమే కాక, ఉత్తరాంధ్ర, రాయలసీమ, పల్నాడు కనీస అభివృద్ధికి, అభివృద్ధి ఫలాలలో న్యాయమైన వాటాకు నోచుకోలేదు. నిజానికి రాష్ట్ర విభజన సమయంలో అవశేష ఆంధ్రప్రదేశ్ లోని వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి ప్రత్యేక సౌకర్యాల సమస్య చర్చకు వచ్చింది. రాష్ట్ర విభజన బిల్లులోనే ఏర్పాట్లు జరిగాయి. కాని చంద్రబాబు నాయుడు అభివృద్ధి నమూనానే సమానాభివృద్ధికి, గతంలో నిర్లక్ష్యానికి గురైన ప్రాంతాలకు అదనపు సౌకర్యాలకు వ్యతిరేకం. కొత్తగా రాష్ట్రాన్ని పునర్నిర్మించే అవకాశం వచ్చినప్పుడైనా గతంలో చేసిన తప్పులు చేయగూడదని, వికేంద్రీకృత అభివృద్ధి సాధించాలని, నిర్లక్ష్యానికి గురైన ప్రాంతాలకు ప్రత్యేక అవకాశాలు ఇవ్వాలని కొత్త ప్రభుత్వం ఆలోచించలేదు. అందువల్లనే మూడు సంవత్సరాలు తిరగకుండానే ఇటు రాయలసీమలోను, అటు ఉత్తరాంధ్రలోను ప్రజలలో ప్రశ్నలు, కదలికలు, ఆందోళనలు ప్రారంభమయ్యాయి. ఆ ఆందోళనల్లో ప్రతిపక్షాల పాత్ర ఉందని, అవి స్వార్థపర శక్తుల ప్రయత్నాలని ఎవరైనా ఆరోపించవచ్చు గాని, అలా ఎవరైనా వాడుకోదలచుకున్నప్పటికీ, అసలు ప్రజలలో అసంతృప్తి లేకుండా సాధ్యం కాదు. తమకు దక్కవలసిన వాటా దక్కలేదని ఉత్తరాంధ్ర, రాయలసీమ ప్రజల్లో నిజమైన ఆవేదన ఉంది. ఆ ఆవేదనకు అర్థవంతమైన ఆందోళనారూపం దొరుకుతున్నదా, స్వార్థపర శక్తులు దాన్ని వాడుకొని తమ పబ్బం గడుపుకోవడానికి ప్రయత్నిస్తున్నాయా ఎంతైనా చర్చించవచ్చు గాని, ఆ ఆవేదనను మాత్రం గుర్తించక తప్పదు. ఉత్తరాంధ్ర వెనుకబాటుతనం – ప్రజల ఆకాంక్షలు అని ప్రతిపక్షపార్టీల ప్రతినిధులతో నిర్వహించిన సదస్సులో మూడు జిల్లాల నుంచి వందలాది మంది ప్రతినిధులు హాజరు కావడం, అధికారపక్షం, వైఎస్ఆర్‌సిపి మినహా అన్ని ప్రతిపక్షాలూ పాలు పంచుకొని, ఉత్తరాంధ్రకు జరిగిన అన్యాయాల గురించీ, ప్రజల కోరికల గురించీ చర్చించడం ఒక ఆహ్వానించదగిన పరిణామం. అలాగే రాయలసీమలో ఒకవైపు రాయలసీమ విద్యావంతుల వేదిక వైపు నుంచి నిరంతర చైతన్యీకరణ జరుగుతున్నది. ఒకప్పుడు తెలంగాణ ఉద్యమంలో జరిగినట్టుగా రాయలసీమకు జరిగిన అన్యాయాల గురించి భావ ప్రచారం జరుగుతున్నది. నీటిపారుదల విషయంలో జరిగిన అన్యాయాల మీద ప్రజల ప్రతిస్పందన ఆశావహంగా ఉన్నది. మరొకవైపు మొత్తంగా రాయలసీమ సమస్యలపై భిన్నాభిప్రాయం ఉన్నప్పటికీ, వామపక్షాలు కూడ రాయలసీమ దుర్భిక్ష పరిస్థితులపై రాష్ట్ర ప్రభుత్వపు నిర్లక్ష్య వైఖరికి నిరసనగా బంద్ కు ఇచ్చిన పిలుపు జయప్రదం కావడం ఆ ప్రాంతంలో రగులుతున్న అసంతృప్తికి అద్దం పడుతున్నది. ఆంధ్రప్రదేశ్ పాలకులు గత తెలంగాణ అనుభవం నుంచి అయినా గుణపాఠాలు తీసుకుని ఈ ప్రాంతీయ అసంతృప్తులను పరిష్కరించడానికి ప్రయత్నించకపోతే ఆంధ్రప్రదేశ్ సమాజం మరొకసారి విభజన దిశగా పయనించవలసి వస్తుంది. వీ

# ఆలోచనలను ప్రేరేపించే మాంచెస్టర్ దారుణం

బ్రిటన్‌లోని మాంచెస్టర్ నగరంలో ఒక సంగీత కార్యక్రమం ముగిసి శ్రోతలు ఇళ్లకు వెళ్లిపోతున్న సమయంలో ఒక ఒంటరి ఆత్మాహుతి బాంబర్ చేసిన దాడిలో ఇరవై రెండు మంది మరణించారు. దాదాపు 60 మంది గాయపడ్డారు. ఈ ఘటన జరిగిన వెంటనే ఇది తమ పనేనని ఐఎస్ఐఎస్ ప్రకటించింది గాని అది నిజమో కాదో తెలియదు. ఒకవేళ నిజంగా ఐఎస్ఐఎస్ చేసినా, ఆ సంస్థ పోరాడదలచుకున్న సామ్రాజ్యవాద శక్తులకూ ఈ ఘటనలో మరణించిన అమాయక సంగీతప్రియులకూ ఏమీ సంబంధం లేదు. సామ్రాజ్యవాద దేశంలో ఉన్నవారందరూ మా శత్రువులే అనే దుర్మార్గమైన వాదన చేస్తే తప్ప వారిని చంపడానికి కారణమేమీ లేదు. ఇటువంటి దాడి జరగగానే వెంటనే సామ్రాజ్యవాద పాలకులందరూ "ఇస్లామిక్ తీవ్రవాదం" పై ఎక్కుపెడుతూ తీవ్రాతి తీవ్రమైన ప్రకటనలు చేస్తారు గనుక, వారి దాడులను మరింతగా పెంచుతారు గనుక ఇటువంటి దాడి ఏ ప్రయోజనమూ సాధించజాలదు. నిజానికి తొలినుంచీ ఇటువంటి "తీవ్రవాద" శక్తులను ప్రోత్సహిస్తూ, వారికి ధన, ఆయుధ సహాయం చేస్తూ వచ్చిన సామ్రాజ్యవాద శక్తులు, వారి బూచి చూపి ఇరాక్, సిరియా, అఫ్ఘనిస్తాన్ తదితర దేశాలలో బాంబుల వర్షాలు కురిపించి వేలాది అమాయకుల ప్రాణాలు తీస్తున్న సామ్రాజ్యవాద శక్తులు ఇటువంటి "తీవ్రవాద" ఘటనలను చూపి, తాము పవిత్రులమైనట్టు, "ఇస్లామిక్ తీవ్రవాదం" ఇటువంటి అన్యాయమైన హత్యాకాండలు జరుపుతుందన్నట్టు ప్రచార యుద్ధం సాగిస్తారు. ఇటువంటి తీవ్రవాదాన్ని ఖండించడమంటే సామ్రాజ్యవాదాన్ని సమర్థించడమే అవుతుందేమోనని ప్రగతిశీల శక్తులు కూడ ఈ ఘటనలను సమర్థించడమో, మౌనంగా ఉండడమో చేస్తున్నారు. నిజానికి ఇటువంటి ఘటనలు పెరిగిపోతున్నాయి గనుక వాటి మీద ప్రగతిశీల శక్తులు తమ నిర్ద్వంద్వమైన అభిప్రాయాన్ని ప్రకటించవలసి ఉంది. ఇటువంటి ఘటనల్లో మరణిస్తున్న అమాయకుల పట్ల సానుభూతి ప్రకటించవలసి ఉంది. అసలు సామ్రాజ్యవాదాన్ని, పాలకవర్గ రాజ్యాన్ని మించిన తీవ్రవాదం మరేమీ లేదని ఎప్పటికప్పుడు చెప్పవలసి ఉంది. ఇవాళ వేరువేరు పేర్లతో సాగుతున్న "ఇస్లామిక్ తీవ్రవాద" బృందాలన్నీ మొట్టమొదట సామ్రాజ్యవాద శక్తుల, ప్రత్యేకించి అమెరికన్ పాలకవర్గాల ప్రోత్సాహంతోనే పుట్టి పెరిగాయని చారిత్రక వివరణ ఇవ్వవలసి ఉంది. చమురు దేశాల మీద సామ్రాజ్యవాదం కత్తిగట్టి అక్కడి ప్రజల వనరులను కొల్లగొట్టడానికి జరుపుతున్న అక్రమ యుద్ధాలే "ఇస్లామిక్ తీవ్రవాదానికి" బలం చేకూరుస్తున్నాయని, నానాటికీ దానికి ప్రజల్లో మద్దతు పెరుగుతున్నదని చూపవలసి ఉంది. అలా సామ్రాజ్యవాద వ్యతిరేకతతో తమలో చేరుతున్న శ్రేణులను నిజంగా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో భాగం చేయకుండా, అమాయకుల మీద చెదురుమదురు దాడుల సంచలనాత్మకతకు బలి చేస్తున్న ఈ "ఇస్లామిక్ తీవ్రవాద" సంస్థల నాయకత్వపు దివాళాకోరుతనాన్ని విప్పి చెప్పవలసి ఉంది. ఇవాళ్టి ప్రపంచ పరిస్థితిలో తప్పనిసరిగా సామ్రాజ్యవాదాన్ని ఎదిరించి పోరాడే శక్తుల ఐక్యత అవసరమనే వాస్తవాన్ని గుర్తెరిగి, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులు కాదగిన "ఇస్లామిక్" శక్తులలో నిజమైన సామ్రాజ్యవాద వ్యతిరేకతను పెంపొందించడానికి కృషి చేయవలసి ఉంది. వీ





❖ **మార్క్సిస్టు నిఘంటువు-1** - తత్వశాస్త్ర విభాగం (ఇంగ్లీష్ - తెలుగు - గ్రంథ కూర్పు: రావు కృష్ణారావు - లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ - 392 పేజీలు, 1/4 క్రౌన్, వెల రు. 350, ప్రతులకు: లెఫ్టిస్ట్ స్టడీసర్కిల్, డి.రాధాకృష్ణమూర్తి, ఇ.నెం. 5-85-4/బి, పండరీపురం, 1వ లైన్, గుంటూరు - 522 002. సెల్: 9848877596



❖ **ఇం...కొకప్పుడు** - ఇప్పటి కవిత్వం - దేవిప్రియ - సమత బుక్స్ - 172 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: సమత బుక్స్, 204, రాచకొండ టవర్స్, అల్వాల్, సికింద్రాబాద్ - 500 010



❖ **ఇసిత్రం** - తెలంగాణ మాండలిక కవితలు - పంచరెడ్డి లక్ష్మణ - ఇందూరు భారతి సాహితీ సంస్థ ప్రచురణ - 64 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 50, ప్రతులకు: ఇందూరు భారతి, తెలుగు రచయితల సమాఖ్య, 6-15-105/1, పవన్ నగర్, నిజామాబాద్-503001; సెల్: 9440007101, 9160164225



❖ **రాయలసీమ నీటి వాటాపై చట్టబద్ధ హక్కు కల్పించాలి** - పాణి - రాయలసీమ విద్యావంతుల వేదిక - 24 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 5, ప్రతులకు: పాణి, డోర్ నం.50-348-1, 19/బి2, సెకండ్ ఫ్లోర్, అరోరా నగర్, బి క్యాంప్ (పోస్ట్), కర్నూలు-2;



❖ **మా ఊరి పెద్దర్వాజ** - గుట్టల విధ్వంస వ్యతిరేక కవిత్వం - సంపాదకులు: నల్లెల్ల రాజయ్య - వరంగల్ రచయితల సంఘం - 92 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: నల్లెల్ల రాజయ్య, ఇ.నెం. 7-1-384/6, పద్మాక్షి కాలనీ, హన్మకొండ, వరంగల్ - 506 001




❖ **సాంగ్ ఆఫ్ ఫర్రోస్** - ఇక్బాల్ కవిత్వం - పాలమూరు అధ్యయన వేదిక - 94 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 200, ప్రతులకు: ఎం. రాఘవచారి, ప్లాట్ నెం. 41, శాంతిచంద్రిక, ఇ.నెం. 3-148, బాలాజీనగర్, మహబూబ్‌నగర్; ఫోన్: 9490909792



❖ **చితి** - పెరుమాళ్ మురుగన్ - అనువాదం: కె. సురేష్ - మంచి పుస్తకం - 168 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: మంచి పుస్తకం, 12-13-439, వీధి నెం. 1, తార్నాక, సికింద్రాబాద్ - 500017; ఫోన్: 9490746614;
ఇమెయిల్: info@manchipustakam.in; www.manchipustakam.in




❖ **వేమన్న వెలుగులు** - డా. ఎన్. గోపి - శాంతా-వసంతా ట్రస్ట్ - 500 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 250, ప్రతులకు: ఎన్. అరుణ, 13-1/5బి, శ్రీనివాసపురం, రామంతపూర్, హైదరాబాద్ - 500013; ఫోన్: 040 - 27037585; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **ఈ యుగం మాది** - దళిత మహాకావ్యం - కవిత్వం - డా. కత్తి పద్మారావు - లోకాయత ప్రచురణలు - 480 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 500, గ్రంథాలయ ప్రతి రు. 1000



❖ **దళితుల సామాజిక సాంస్కృతిక చరిత్ర - ప్రత్యామ్నాయ చరిత్ర** - డా. కత్తి పద్మారావు - లోకాయత ప్రచురణలు - 256 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 250
పై రెండు ప్రతులకు: కత్తి స్వర్ణకుమారి, లోకాయత ప్రచురణలు, లుంబినీ వనం, అంబేద్కర్ రీసెర్చ్ సెంటర్, అంబేద్కర్ కాలనీ, పొన్నూరు-522 124, గుంటూరు జిల్లా; ఫోన్: 9849741695




❖ **నా నాస్తికత్వం** - శ్రీశ్రీ - కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ - శ్రీశ్రీ సాహిత్యనిధి - 96 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80




❖ **మహా స్వాప్నికుడు** - డా. పాపినేని శివశంకర్ - కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ - శ్రీశ్రీ సాహిత్యనిధి - 32 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 30



❖ **మహాకవీ... చిరంజీవి మానవుడా...** - కెవియస్ వర్మ - కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ - శ్రీశ్రీ సాహిత్యనిధి - 32 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 30
పై మూడు ప్రతులకు: శ్రీశ్రీ సాహిత్యనిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతినగర్, విజయవాడ-520 004. ఫోన్: 0866-6617375, సెల్: 9246277375; ఈమెయిల్: srisri_sahityanidhi@yahoo.com




❖ **ఒక్కపదం - అర్థాలెన్నో...** - రాజావాసిరెడ్డి మల్లీశ్వరి - నవచేతన పబ్లిషింగ్ హౌస్ - 196 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 140



❖ **కొమర్రాజు వేంకటలక్ష్మణరావు** - జీవితచరిత్ర - డా. అక్కిరాజు రమాపతిరావు - నవచేతన పబ్లిషింగ్ హౌస్ - 108 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 70




❖ **కవుల తెలంగాణం** - తెలంగాణ కవుల కవిత్వ పరామర్శ - రాచపాళెం చంద్రశేఖరరెడ్డి - నవచేతన పబ్లిషింగ్ హౌస్ - 208 పేజీలు, 1/8 డెమీ, వెల రు.140

పై మూడు పుస్తక ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జి.ఎస్.ఐ పోస్టు, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్-500 068, తెలంగాణ
ఫోన్ : 040-24224453/54
ఈమెయిల్: navachethanaph@gmail.com

# ప్రజా వ్యతిరేక భూసేకరణ చట్టం - 2016

*అభివృద్ధి పేరుతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కార్పొరేట్, సంపన్న వర్గాలకు అనుకూల, ప్రజా వ్యతిరేక విధానాలను ముందుకు తెస్తూ రాజ్యాంగ మౌలిక సూత్రాలనే కాలరాస్తున్నాయనడానికి నిదర్శనం భూసేకరణ చట్టానికి సవరణలు అంటున్నారు* **బి. రామకృష్ణ**

**భూ**సేకరణ చట్టం–2013 (ది రైట్ టు ఫేర్ అండ్ ట్రాన్స్‌పరెన్సీ ఇన్ ల్యాండ్ ఆక్విసిషన్, రిహాబిలిటేషన్ అండ్ రీ సెటిల్‌మెంట్ ఆక్ట్ –2013) అంటే మొదటగా మోదీకి ఆ తరువాత తెలంగాణ ముఖ్యమంత్రి కల్వకుంట్ల చంద్రశేఖర్ రావుకు కంపరం పుడుతున్నది. బహుళజాతి, సామ్రాజ్యవాద కంపెనీలకు ఎర్ర తివాచీ పరచడానికి అటు మోదీ ఇటు తెలంగాణలో కెసిఆర్ ఈ చట్టాన్ని తుంగలో తొక్కడానికి అడుగడుగునా ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. దేశ, విదేశీ పెట్టుబడిదారీ శక్తులకు, సంపన్న వర్గాల ప్రయోజనాలు నెరవేర్చడానికి ఉన్న చట్టాలలో మార్పులు, కొత్త చట్టాల రూపకల్పనలకు వేగిర పడుతున్నారు. అందులో భాగంగా మోదీ గారికి భూసేకరణ చట్టం - 2013పై కోపం వచ్చింది. మే 2014లో అధికారం చేపట్టిన తరువాత డిసెంబర్ 2014, ఏప్రిల్ 2015, మే 2015లలో ఈ చట్టానికి సవరణలు తెస్తూ ఆర్డినెన్స్‌లు తెచ్చారు. ఈ సవరణలతో బిల్లును లోక్‌సభలో నెగ్గించుకున్నారు కాని రాజ్యసభలో ఇది వీగిపోయి చట్టం కాలేకపోయింది. అందుకు భారత ప్రజానీకం కొంతమేరకైనా సంతోషించవల్సిందే.

భూసేకరణ చట్టం–2013 లోని ప్రజా ప్రయోజన ప్రస్తావనలు పాలకులకు నచ్చడం లేదు. ఈ చట్టంలో సవరణలకు సంబంధించి పార్లమెంట్‌లో ఓడిపోయిన మోదీ, రాష్ట్ర ప్రభుత్వాలకు వారి వారి రాష్ట్రాల్లో సవరణలు చేసుకొమ్మని అప్పుడే గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశాడు. తాను ముఖ్యమంత్రిగా వరుసగా మూడుసార్లు పనిచేసిన గుజరాత్ రాష్ట్రంలో అక్కడి బిజెపి ప్రభుత్వం 2016లో ఆ పని చేసి చూపించింది. మిగతా రాష్ట్రాలకు ఈ రాష్ట్రం ఆదర్శంగా నిలిచి కెసిఆర్‌కు భలే నచ్చేసింది. ఇంతకు ముందే 2015లో ప్రభుత్వ ఉత్తర్వులు 123, 190,214లను తెచ్చి దొడ్డిదారిన భూములను సేకరించడం అనేకంటే లాక్కోవడం మొదలుపెట్టింది కెసిఆర్ ప్రభుత్వం. ఈ ఉత్తర్వులు భూసేకరణ చట్టం – 2013కు పూర్తిగా విరుద్ధమైనవి. ఇవి ప్రభుత్వానికి తమ భూములను అమ్ముకుంటున్నట్లు ప్రజలు చేసుకునే ఒప్పందాన్ని సూచిస్తాయి. వీటి ప్రకారం భూసేకరణ చట్టంలోని ప్రజా ఉపయోగ అంశాలైన సామాజిక ప్రభావ అంచనా, గ్రామ సభల అంగీకారం, ప్రాజెక్టు బాధిత ప్రజల అంగీకారం, భూస్వంతదారులకు ప్రాజెక్టు కమాండ్ ఏరియాలో భూములు ఇవ్వడం, నిర్వాసిత ప్రజలకు భూసేకరణ చేపట్టేలోపే పరిహారంతో పాటు పునరావాసం, పునః స్థాపనలు కల్పించడం, ఆ ప్రాంతంలోని భూమిలేని ప్రజలకు కూడా పరిహారం, పునరావాసం కల్పించడం, అన్ని వసతులతో నిర్వాసిత ప్రజలకు గ్రామాల పునర్నిర్మాణం చేయడం, పంటలు పండే భూములను సేకరించవద్దు అనేవి ఏవీ కూడా ఉండవు.

జి.ఓ.123 ప్రకారం ప్రభుత్వానికి తోచిన మొత్తంను భూములు కోల్పోతున్న వారికి ఇవ్వడం, ఆ మొత్తం న్యాయ సమ్మతమైనదేమీ కాదు. ఓ రకంగా చెప్పాలంటే స్వల్ప మొత్తం మొహాన కొట్టి తరిమేయడమే. ఆ ప్రాంతంతో వారికుండే అనుబంధాలు, అక్కడ సామాజిక సంబంధాలు, జీవనాధారం, జీవన భద్రత, సామాజిక భద్రతలు అనేవి ఏవీ పట్టవు. భూసేకరణ చట్టం–2013 ప్రకారం ప్రజలు నష్టపోతారని బాధపడిపోతున్నారు. ఈ చట్ట ప్రకారం మార్కెట్ రేటుకు మూడు రెట్లు చెల్లించాల్సి ఉంటుంది. కాని మేము ఆరు రెట్లు, పది రెట్ల వరకు చెల్లిస్తున్నామని చెబుతున్నారు. మార్కెట్ రేట్లను ఎప్పటికప్పుడు సవరించాల్సి ఉంటుంది. అవి ఎప్పటివో రేట్లుంటాయి. ఎప్పుడు కూడా ల్యాండ్ రిజిస్ట్రేషన్ విలువలు వాస్తవ ధరల కంటే ఎన్నోరెట్లు తక్కువగానే ఉంటాయన్నది ఏలినవారు తెలుసుకోలేనంత అమాయకులు కారు. భూసేకరణ చట్టం–2013 కేవలం పరిహారం గురించే కాదు మాట్లాడింది ఇంతకు ముందే ప్రస్తావించిన మరెన్నో విషయాల గురించి మాట్లాడింది. వీటి గురించి ప్రభుత్వాలు మాట్లాడడం లేదు. ఆ విషయాలే కదా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు భూసేకరణకు సంబంధించి కంట్లో నలుసుగా మారాయి. ఆదివాసీ ప్రాంతాల్లో అమల్లో ఉండాల్సిన పెసా 1/70 చట్టాలు రాజ్యాంగం షెడ్యూల్ 5లోని రక్షణలు వీరికి పంటి కింద రాళ్లుగా తయారయ్యాయి.

విద్యా, వైద్య, ఉపాధి రంగాలను విపరీతంగా ప్రైవేటీకరణ చేస్తూ, వాటిని ప్రజలకు అందించడానికి బాధ్యత పడకుండా, అందుకొరకు చొరవ చూపకుండా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కార్పొరేటు శక్తుల ప్రయోజనాల కొరకు తెగ తపించిపోతున్నాయి. చట్టాలను మారుస్తున్నారు. వారి ప్రయోజనాలకు కించిత్ నష్టం కలగకుండా భూసంపదను పళ్లెంలో పెట్టి అప్పగించడానికి వేగిరపడుతున్నారు. అందుకోసమే కేంద్ర ప్రభుత్వం అధికారంలోకొచ్చిన ఏడాదిలోనే భూసేకరణ చట్టం–2013ను సవరిస్తూ మూడుసార్లు ఆర్డినెన్స్‌లు చేసింది. ఆపై వెంటనే చట్టం చేయడానికి లోక్‌సభలో నెగ్గించుకుని రాజ్యసభలో చతికిలపడింది. ఇక్కడ తెలంగాణలో కెసిఆర్ 123 పేరుతో ఉత్తర్వులు తెచ్చాడు. వాటిని హైకోర్టు కాదన్నది. ప్రజలు తీవ్రంగా వ్యతిరేకించారు. నేటికీ వ్యతిరేకిస్తున్నారు.

మల్లన్నసాగర్ ప్రాజెక్టుకు తమ భూములు ఇవ్వమని, ఒకవేళ ఇస్తే భూసేకరణ చట్టం – 2013ను అన్వయించమని వేములఘాట్ ప్రజలు నిరంతరాయంగా సంవత్సరం నుండి నిరాహారదీక్షలు చేస్తున్నారు. చరిత్రలో నిలిచి పోయే పట్టుదలను, తెగువను చూపిస్తున్నారు. ఈ క్రమంలో ఈ అడ్డంకులు తొలగించుకోవడానికి తెలంగాణ భూసేకరణ చట్టం–2016 పేరుతో భూసేకరణ చట్టం–2013కు సవరణలు తెచ్చారు. ఈ సవరణలను భూసేకరణ చట్టంలోని సెక్షన్ 107ను అనుసరించి చేస్తున్నామని చెప్పుకుంటున్నారు. భూసేకరణ చట్టం –2013లోని సెక్షన్ 107 ప్రకారం ఈ చట్టంలో సూచించిన దానికంటే మెరుగైన పరిహారం, పునరావాసం, పునః స్థిరీకరణలు చేయొచ్చునని చెప్పింది. దీనికి విరుద్ధంగా తక్కువ మొత్తంలో పరిహారం చెల్లిస్తూ, పునరావాసం, పునః

స్థిరీకరణల ఊసెత్తకుండా సవరణలు చేస్తూ మోసానికి పాల్పడుతున్నారు.

నిజానికైతే కేంద్రం చేసిన చట్టం, రాష్ట్రం చేసిన చట్టాలలో రెండింటికీ మధ్య సమస్య తలెత్తినప్పుడు కేంద్ర చట్టానికే సాధికారిత ఉంటుంది. ఈ విషయం రాజ్యాంగంలోని కేంద్ర, రాష్ట్ర అధికారాలలో సంబంధించిన ఉమ్మడి జాబితా వివరిస్తున్నది. ఈ నేపథ్యంలో చూసినప్పుడు తెలంగాణ రాష్ట్రం చేసిన భూసేకరణ చట్టానికి చట్టబద్ధత ఉండదు. రాష్ట్రపతి ఆమోదమూ తెలుపకూడదు. భూసేకరణ చట్టం-2013 కోరలు పీకి బలహీన పరచడానికి తెలంగాణ అసెంబ్లీలో చట్ట సవరణలు చేస్తూ ఒంటిచేత్తో నెగ్గించుకున్నారు. డిసెంబర్ 2016లో అసెంబ్లీలో ముఖ్యమంత్రి కెసిఆర్ మాట్లాడుతూ భూసేకరణ చట్టం-2013ను తాడు బొంగరం లేని వారు తయారు చేశారని, అది దండగమాలినదని చాలా హేళన చేశాడు. ఆ చట్టంను అమలు చేయమని అంటున్న ప్రజలను, వారికి మద్దతిస్తున్న మేధావులను కోర్టులో వాదిస్తున్న న్యాయవాదులను చులకన చేశాడు. తద్వారా నిర్వాసితులు కాబోయే ప్రజలను అవమాన పరిచాడు.

గతంలో మోదీ చేసిన సవరణలు, గుజరాత్‌లోని బిజెపి ప్రభుత్వం చేసిన సవరణలనే ఇంచుమించుగా సారాంశంలో ఏమార్పులేకుండా తెలంగాణ ప్రభుత్వము భూసేకరణ చట్ట సవరణలు చేసి జనవరి 2017లో కేంద్ర ఆమోదానికి పంపింది. కేంద్ర న్యాయమంత్రిత్వ శాఖ ఐదు చిన్న చిన్న విషయాలను ఎత్తిచూపుతూ 2017 ఏప్రిల్ 19న లా సెక్రటరీ సురేష్ చంద్ర పేరుమీద లేఖను తెలంగాణ ప్రభుత్వానికి పంపింది. ఇవి అభ్యంతరాలే కావు. మంచినీళ్లలో వేళ్లు ముంచి రుచి చూసినట్లుగా ఉంటాయి. ఇవి తెలంగాణ ప్రభుత్వం గతంలో అసెంబ్లీలో చేసిన సవరణలకు వ్యతిరేకమైనవేమి కావు. ఈ విషయంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సరదాగా సయ్యాటలు ఆడుకుంటున్నట్లున్నాయి.

గతంలో అసెంబ్లీలో ఆమోదించిన బిల్లును కేంద్రం సూత్రప్రాయంగా అంగీకరించిందని, ముఖ్యంగా ప్రాజెక్టులు, ఇతర ప్రజోపయోగ అభివృద్ధి పనులు చేసే సందర్భంలో సామాజిక ప్రభావ అంచనా పేరిట జరిగే కాలయాపన లేకుండా చేయాలనే రాష్ట్ర ప్రభుత్వ అభిప్రాయానికి ఆమోదం లభించిందని, కొన్ని సాంకేతిక అంశాలను అది కూడా పదాల కూర్పులో కొన్ని మార్పులను సూచించింది. ఈ సూచనల మేరకు సవరణలు చేయడానికి బిల్లు ప్రవేశపెడుతున్నామని తెలంగాణ ప్రభుత్వం ప్రకటించింది. ఈ ఒక్క బిల్లు కోసమే ప్రత్యేకంగా అసెంబ్లీని సమావేశపరిచి ఆదివారం అనికూడా చూడకుండా 2017 ఏప్రిల్ 30న అసెంబ్లీలో ప్రవేశపెట్టారు. కేవలం పదంటే పది నిమిషాల్లోనే దీనికి కేంద్ర సూచనలకు ఆమోదం ప్రకటింపచేసుకున్నారు. ఆరోజు రాత్రే గవర్నర్‌చే సంతకం చేయించారు. మారునాడే (2017 మే 1న)రెవెన్యూ శాఖ కార్యదర్శి బి.ఆర్. మీనా చేత బిల్లు ప్రతులను ఢిల్లీకి పంపారు. ప్రభుత్వ ప్రధాన సలహాదారు రాజీవ్‌శర్మ కూడా అక్కడే ఉండి పర్యవేక్షించాడు. దీనికితోడు టి.ఆర్.ఎస్ పార్లమెంట్ సభ్యులు అక్కడే ఉండి చేసిన కృషితో తొమ్మిది రోజుల్లోనే కేంద్ర హోం, న్యాయశాఖలు తెలంగాణ ప్రభుత్వం తెచ్చిన భూసేకరణ సవరణల చట్టానికి ఆమోదం తెలిపాయి. ఆ వెంటనే 2017 మే 10న రాష్ట్రపతి ఆమోదం పొందింది.

ప్రభుత్వ ఉత్తర్వులు 123ను ప్రజలు వ్యతిరేకించినప్పుడు భూసేకరణ చట్టం 2013 లేదా జి.ఓ.123 ప్రకారం ఏదంటే అదే అమలు చేస్తామని చెప్పారు. అలాంటప్పుడు భూసేకరణ చట్టంలో సవరణలెందుకు? ఆ సవరణలు మరో రూపంలో జి.ఓ. 123ని అమల్లోకి తెచ్చేవేనన్నది స్పష్టం. ఇది ప్రజలను వంచించడం కాక మరేమవుతుంది.

సామాజిక ప్రభావ అంచనా వల్ల కాలయాపన జరుగుతుందని అంటున్నారు. నిజానికి చట్టంలోనే 90 రోజుల్లో దీన్ని పూర్తిచేయాలని చెప్పారు. లక్షలాదిగా నిర్వాసితులవుతున్నప్పుడు, పెద్దమొత్తంలో పర్యావరణానికి, ప్రకృతి సమతుల్యతలకు నష్టం జరిగే పక్షంలో ప్రాజెక్టులను ఎలా అంగీకరిస్తాం. ఆ అధ్యయనం లేకుండానే అశాస్త్రీయంగా ముందుకెళ్లడం అంటే ప్రజల జీవించే హక్కును ఖాతరు చేయకపోవడమే అవుతుంది. ఇలా అధ్యయనం చేయకుండా తొందరపడడం ద్వారా రాబోయేకాలంలో నిర్వాసిత ప్రజలకు, ప్రకృతికి జరగబోయే భారీ నష్టాలకు ఎవరు బాధ్యులు? ఈ మూడు నెలలు పాలకులకు పెద్ద సమస్య కాదు కాని అంతకుమించిన ప్రయోజనాలు, దుష్ట తలంపులున్నాయి. ఏలినవారు చిత్తశుద్ధితో ప్రజల కోసం పని చేయాలనుకుంటే ప్రాజెక్టులకు సంబంధించి సామాజిక ప్రభావ అంచనా కష్టతరమూ కాదు కాలయాపనా కాదు.

ప్రాజెక్టులు నిజంగా అభివృద్ధికోసమే అయితే ఎటువంటి అభివృద్ధి, ఎవరి అభివృద్ధి అనే స్పష్టత ఉండాల్సిందే కదా! ఏదేని ప్రాజెక్టు వల్ల ప్రజలకు, పర్యావరణానికి ప్రకృతికి కలిగే ప్రయోజనాలు, దుష్పరిణామాలు, దుష్ఫలితాలను బేరీజు వేయాల్సిందేకదా! ఈ వివరాలన్నీ పార దర్శకంగా చర్చించబడాలి కదా! వాటిపై సందేహాలను నివృత్తి చేయాలి కదా! ఈ వివరాలనే డి.పి.ఆర్ - డిటేల్డ్ ప్రాజెక్ట్ రిపోర్ట్ అంటారు. ఇంతవరకు టి.ఆర్.ఎస్. ప్రభుత్వం ఏ ప్రాజెక్టుకు సంబంధించి డి.పి.ఆర్‌లను బయటపెట్టింది లేదు. ఎందుకంత రహస్యం? ఎందుకంత గూఢుపుఠాని?

ఒకవేళ తొందరంతా వేగవంతమైన అభివృద్ధే అనుకుందాం. అప్పుడు ప్రతిపాదిత ప్రాజెక్టుల వల్ల నిర్వాసితులవుతున్న వారికి ఆ ప్రాజెక్టు వల్ల కలిగే అభివృద్ధిలో చోటు కల్పించడానికి తొందరెందుకులేదు? వారికి పరిహారం, పునరావాసం, పునః స్థిరీకరణలను కల్పించడంలో తొందరెందుకులేదు? ప్రాజెక్టు బాధిత ప్రజలు ఈ ప్రాంతం వారే కదా! వారేమైనా ఇతర ప్రాంతాలకు చెందినవారా? ప్రాజెక్టుల వల్ల తమ జీవితాలను కోల్పోతున్న వారికి ప్రాజెక్టు ప్రయోజనాల్లో భాగస్వామ్యం ఉండడం అనేది కనీస ప్రమాణం కాకుండా పోవడం ఏ ప్రజాస్వామిక విలువను సూచిస్తుంది. ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పకుండా చేతిలో అధికారం ఉందికదా అని చట్టాలు చేసుకుంటూ పోతూ అవి ఉన్నవారికి చుట్టాలుగా తాయారు చేయడం సరైందెలా అవుతుంది? ప్రజాస్వామ్యం పేరుమీద కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజా వ్యతిరేక, కార్పొరేట్, సంపన్న వర్గాల, అనుకూల విధానాలను ముందుకు తెస్తూ రాజ్యాంగ మౌలిక సూత్రాలనే కాలరాస్తున్నారు.

ప్రాజెక్టులు ప్రజా సంక్షేమం కోసమా? కార్పొరేటు, సంపన్నవర్గాల, పెట్టుబడిదారీ శక్తుల, కాంట్రాక్టర్ల, పాలకవర్గాల ఆశ్రితులకు బంగారు బాతులా మార్చడం కోసమా? నిజంగా ప్రజల కోసమే అయితే వారి జీవన భద్రతల గురించి ఆలోచిస్తారు కదా. అటువంటి ప్రయోజనాలను ఉద్దేశించిన భూసేకరణ చట్టం-2013ను దిక్కుమాలినదని, తాడు బొంగరం లేని వారు తయారుచేసిందని గేలిచేయగలుగుతారా? వ్యతిరేకించే ప్రజలతో తమ ప్రతిపాదిత ప్రాజెక్టుల గురించి పూర్తి వివరాలతో చర్చలు చేయవచ్చు. ఆ ప్రాజెక్టుల ప్రయోజనాలను, వాటిలోని శాస్త్రీయతలను వివరించే ప్రయత్నం చేయవచ్చు. తమ నిజాయితీని చిత్తశుద్ధిని నిరూపించుకోవచ్చు. అదికదా! ప్రజాస్వామ్యం అంటే.

వేలాదిగా, లక్షలాదిగా ప్రజల జీవితాలను దుర్భరం చేసే ప్రాజెక్టులు మనకెందుకు? మెజారిటీ ప్రయోజనాలకోసం ఎవరో కొందరు

# మిర్చి రైతుల మృత్యు ఘోష

*ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలు, దళారుల రాజ్యం, ప్రకృతి ప్రకోపం అన్నీ కలిసి రైతుల జీవితాలను ఛిద్రం చేస్తున్నాయని, ఆరుగాలం కష్టపడి ఉత్పత్తి చేసిన పంటకు గిట్టుబాటు ధర రాక వారు బతుకులు చాలిస్తున్నారని అంటున్నారు* **షేక్ కరిముల్లా**

**లా**లు నాయక్, మన మిర్చి రైతు కృష్ణా నదిలో దూకి ఆత్మహత్య చేసుకున్నాడు... ఆరుగాలం శ్రమించి... చెమట చిందించి... కోత కూలీ కూడా దక్కక ఆవేదనతో ఆవేశానికి లోనైతే ఖమ్మంలో మిర్చి రైతులపై కేసులు... సంకెళ్లు... చెరసాలలు చెరశాలలు – ఉరికొయ్యలు... రాబందుల రెక్కల చప్పుళ్లు... కల్లాల్లో మిర్చి కల్లోలంలో రైతు అకాల వర్షాలు, పిడుగు పాటులు, ధరాగాతాలు, మరణ మృదంగాలు, మిర్చి రైతు మృత్యు ఘోషలు...

ఏమని రాయను రైతుల బాధలు... కన్నీళ్లు... కడగళ్లు... గడిచిన మూడు నెలల్లో తెలుగు నేలపై సుమారు 50 మంది రైతులు పంటకు గిట్టుబాటు ధర లభించక, అప్పులు తీర్చే మార్గం కనిపించక బలవన్మరణానికి గురయ్యారు. ఆరుగాలం శ్రమించి, అష్ట కష్టాలు పడి, పండించిన పంటను రైతులు మార్కెట్‌కు తీసుకెళితే పట్టపగలే చుక్కలు కనిపిస్తున్నాయి. ధర గిట్టుబాటు కావడం లేదు. గతంలో వ్యవసాయం దండగన్న చంద్రబాబు ప్రభుత్వం చోద్యం చూస్తుంది. మొసలి కన్నీరు కార్చడం తప్ప రైతులకు మేలు చేసే ఒక్క పని చేయడం లేదు.

ఇలాగైతే పంట సాగుకోసం చేసిన అప్పులు ఎలా తీర్చాలి? పిల్లలను ఎలా చదివించు కోవాలి? ఎదిగివచ్చిన ఆడపిల్లలకు ఎలా పెళ్లిళ్లు చేయాలి? కుదువ పెట్టిన బంగారాన్ని ఎలా తెచ్చుకోవాలి? రోజూవారీ ఏం తినాలి? తిరిగి పంట ఎలా సాగు చేసుకోవాలి? ఈ ప్రశ్నలకు సమాధానం దొరక్క అన్నదాతలు విలవిల్లాడి పోతున్నారు.

ఉబికి వస్తున్న బాధను, ఏడుపుని దిగమింగుకుని లోలోన కుమిలిపోతూ ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. ప్రతిరోజూ ఎక్కడో ఒక చోట రైతు బలవన్మరణం పొందని రోజంటూ లేదు. వ్యవసాయం అత్యంత మానవీయ వృత్తి. దేశానికి అన్నం పెట్టే రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. అంటే ఆ వ్యవస్థ రోగ గ్రస్థమైందని అర్థం.

'భారతీయ రైతు అప్పుల్లో పుట్టి, అప్పుల్లో పెరిగి, అప్పుల్లోనే మరణిస్తాడు'. – ఆర్థర్‌లూయి (ఆర్థ శాస్త్రవేత్త).

మూడు దశాబ్దాల కింద ఒక విదేశీ అర్థ శాస్త్రవేత్త అన్న ఈ మాట ఎంత సత్యమో మన కళ్లముందున్న నిజం తెలుపుతుంది. రైతుల పట్ల పాలకుల విధానాలే నేడు ఈ దుస్థితికి కారణం. గుణశేఖర్ అడగ్గానే 'రుద్రమదేవి' సినిమాకి, బాలకృష్ణ అడగ్గానే 'శాతకర్ణి'కి, రాజమౌళి అడగ్గానే 'బాహుబలి'కి గిట్టుబాటు ధర కల్పించి కార్పొరేట్లకు లాభాల రాయితీలు ఇచ్చారు. మరి అన్నం పెట్టే రైతన్నలకు గిట్టుబాటు ధర ఎందుకు ఇవ్వరు?

ఓ పాలకురాలా! మీకు రైతుల విలువ తెలియదా? తెలుసుకోవాలంటే ప్లాస్టిక్ బియ్యం తినండి దెబ్బకు తెలుస్తుంది. రైతు ఎంత గొప్పవాడో. డబ్బులు తిని బతకలేం. అన్నం, పళ్లు, పాలు, కూరగాయలు తినే బతికేది. ఈ చిన్న ప్రాథమిక సత్యం తెలుసుకోండి. ఇవాళ రైతులు చనిపోతూ ఉంటే మనం చోద్యం చూస్తూ కూర్చుంటే, వ్యవసాయమే లేకపోతే ఆహార సంక్షోభం సంభవిస్తుంది. ఇప్పటికే ఆహార సమస్య తీవ్రంగా ఉంది.

ఆహారం మానవ హక్కు. ఈ హక్కును పాలకులు కాలరాస్తున్నారు.

---

నష్టపోవడం అనేది సహజమే అని అనేవారు ఉంటారు. వారికొక ప్రశ్న–ప్రాజెక్టుల వల్ల నష్టాల పాలయ్యే, నిర్వాసితులయ్యే ప్రజలకు ఆ ప్రాజెక్టుల వల్ల కలిగే ప్రయోజనాల్లో చోటుండడం సహజ న్యాయం కాదా? అలాకాకుండా ఎవరివో ప్రయోజనాల కోసం కొందరు నష్ట పోవాల్సిందేననడం దుర్మార్గం కాదా? సాపేక్షికంగా తక్కువ వ్యత్యాసాలతోనైనా అభివృద్ధి ప్రయోజనాలు నిర్వాసితులయ్యే వారికి చెందే విధానాలు చేయలేమా? అటువంటి దిశల్లో ముందడుగుగా ఉన్న భూసేకరణ చట్టం–2013ను అమలు చేయకపోగా, దానిలోనే దుర్మార్గమైన సవరణలు తేవడం ద్వారా టి.ఆర్.ఎస్ ప్రభుత్వం ఎవరి వర్గ ప్రయోజనాలను నెరవేర్చడానికి సిద్ధమయిందో తేలిపోతున్నది.

మెరుగైన తెలంగాణ కోసం పనిచేస్తామని, బంగారు తెలంగాణ అని కమ్మకమ్మని, తీయతీయని మాటలు చెప్పి అధికారంలోకి వచ్చినవారు ఏరుదాటేదాక ఓడమల్లన్నా, ఏరుదాటాకా బోడిమల్లన్న అన్నచందంగా మిగిలిపోతున్నారు. ఇప్పటికీ ఇంకా ఈ మాటలతో మాయ చేయాలని అనుకోవడం జరుగుతూనే ఉన్నది. ప్రజలను వంచించడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య ఎంత సఖ్యత ఉందో, అవి దొందూ దొందే అని చెప్పడానికి భూసేకరణ చట్టానికి సవరణల విషయంలో తేటతెల్లం అవుతున్నది.

ఎంతగా భూసేకరణ చట్టం–2013 మెరుగైందని అనుకుంటున్నప్పటికీ దానిలో లోపాలు లేవని కాదు అది సాపేక్షికంగా మేలు చేసేది అని అనుకోవాలి. అత్యవసర పరిస్థితి, అని జాతీయ ప్రయోజనాలనే పేరుమీద ఎటువంటి భూములైన ఎప్పుడైనా, ఎక్కడైనా సేకరించే వెసులుబాటు ప్రభుత్వాలకు ఈ చట్టం ద్వారా అధికారం ఉండనే ఉంది. ఈ అధికారం లా ఆఫ్ ఎమినెంట్ డొమైన్ అనే తాత్వికత పై ఆధారపడి ఉంది. భూసేకరణ చట్టానికి చేసిన ప్రజా వ్యతిరేక సవరణలను వెనక్కు తీసుకునేలా, భూసేకరణ చట్టం–2013ను అమలు చేయమని, అలాగే ఆ చట్టంలో ఉన్నటువంటి వాటి కంటే కూడా మెరుగైన ప్రయోజనాలు అందేలా ప్రభుత్వాలు చర్యలు తీసుకునేందుకు ప్రజా ఒత్తిడి పెరగవల్సి ఉంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

ఇది క్షమించరాని నేరం. ప్రస్తుతం దాదాపు వంద దేశాలలో ఆహార సమస్య తీవ్రంగా ఉందని నివేదికలు తెలుపుతున్నాయి. కాబట్టి పౌర సమాజం, మేధావులు, కవులు, కళాకారులు రైతులను బతికించుకునే కార్యాచరణను రూపొందించుకోవాలి. ప్రజలను కదిలించి రైతు అనుకూల వ్యవసాయ విధానంకై పోరాడాలి.

మండుటెండా... మిరపకాయల కోరు... అన్నదాతల ఆకలి దప్పులు... ధరలేక పురుగు మందు తాగి నోట నురగలు కక్కుకుంటున్న రైతు... ఇదే అదునుగా దోచుకుంటున్న దళారులు. గుంటూరు మిర్చి యార్డులో నెల రోజులుగా జరుగుతున్న తంతు ఇది. కొన్ని రోజులు మార్కెట్ మూత పడుతుందని ప్రచారం జరగడంతో ఒక్కసారిగా రద్దీ పెరిగింది. వందలాది మంది రైతులు తమ సరుకును అమ్ముకునేందుకు ప్రయత్నించారు. మిర్చిని ఎక్కడికక్కడ కొనుగోలు చేసే పేరిట కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాలలో ఏర్పాటు చేసిన అదనపు కొనుగోలు కేంద్రాలకు వ్యాపారులు ముఖం చాటేశారు. ఈ సెంటర్లలో మిర్చి రేటు మరి దారుణంగా పతనమైంది. మరోవైపు యార్డులో బస్తాలు బూజు పడుతున్నాయి.

వ్యవసాయ మార్కెటింగ్ శాఖ అంచనా ప్రకారం ఈ ఏడాది రాష్ట్రంలో మిర్చి దిగుబడి 92 లక్షల క్వింటాళ్లు. ఇందులో ఇప్పటికే రైతులు 49 లక్షల క్వింటాళ్లను తెగనమ్ముకున్నారు. మిగిలిన సరుకులో గరిష్టంగా 20 లక్షల క్వింటాళ్లు కొంటామని రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. కాని ఆచరణకు నోచుకోలేదు. రాష్ట్రంలో మిర్చి ధరలు దారుణంగా పతనమయ్యాయి. అమ్మకాల సీజన్ ప్రారంభంలో తేజరకం క్వింటాల్ మిర్చికి రు.10 వేల నుంచి రు. 11 వేల ధర పలికితే, ఇప్పుడు నాలుగైదు వేలకు పడిపోయింది. సాధారణ రకాలైతే రు. 1,800 నుంచి రు. 2,000కు పడిపోయింది. ఇప్పుడు ఆ ధర రు. 800కు దారుణంగా పడిపోయింది. ఈ నేపథ్యంలో రాష్ట్ర ప్రభుత్వం క్వింటాకు రు. 1,500 రాయితీ ప్రకటించింది. కేంద్ర ప్రభుత్వం మిర్చిధరను క్వింటాకు గరిష్టంగా రు. 5 వేలు నిర్ణయించింది. అయినా ఈ ధర ఎవ్వరూ ఇవ్వడం లేదు.

రైతాంగానికి గిట్టుబాటు ధర కల్పించి, ఆదుకోవడానికి రు. 5 వేల కోట్లతో ధరల స్థిరీకరణ నిధి ఏర్పాటు చేస్తామని చంద్రబాబు ఎన్నికల సమయంలో హామీ ఇచ్చారు. అధికారంలోకి వచ్చి మూడేళ్లు అవుతున్నా ఈ వాగ్దానం నీటి మూటగానే మిగిలిపోయింది. రైతు సాధికార సంస్థ, సలహాదారులు, మిషన్లు ఉన్న రైతుకు ఒరిగింది శూన్యం. సరైన ధరల విధానం, ధరల స్తిరీకరణ విధానం లేక, రైతులకు గిట్టుబాటు ధరలు దక్కక అప్పుల పాలవుతున్నారని వ్యవసాయ రంగ నిపుణులు చెబుతున్నారు.

సర్కారు నిర్లక్ష్యం, వ్యాపారుల మాయాజాలం, దళారుల దోపిడీ వెరసి మిర్చి రైతును మింగేస్తున్నాయి. వ్యాపారులపై ప్రభుత్వానికి అజమాయిషి లేకపోవడంతో వారు చెప్పిందే ధరగా పరిస్థితి మారింది. వరుసగా మూడేళ్లుగా వ్యవసాయం సంక్షోభానికి గురైంది. నిరుడు పత్తి పంట దెబ్బతినగా, ఈసారి మిర్చితో పాటు వివిధ పంటలకు గిట్టుబాటు ధర లేక రైతులు తీవ్రంగా నష్టపోయారు.

ఎకరానికి రు. లక్ష నుంచి రు. లక్షన్నర వరకు ఖర్చు పెట్టి రైతులు మిర్చి సాగు చేశారు. కనీసం పెట్టుబడి అయినా రాకపోయేసరికి రైతు నిరాశ చెందాడు. పొలంలో కాపు ఉండగానే దున్నేసుకుంటున్నారు. ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. అప్పుల బాధ తాలలేక గుంటూరు జిల్లా వెల్దుర్తి మండలం దావుపల్లి గ్రామానికి చెందిన గిరిజన రైతు లాలు నాయక్ కృష్ణా నదిలో దూకి ఆత్మహత్య చేసుకున్నాడు.

గిట్టుబాటు ధర కోసం నిద్ర నటిస్తున్న ప్రభుత్వాన్ని కదిలించడానికి ఖమ్మం వ్యవసాయ మార్కెట్‌లో ఆందోళన చేసిన మిర్చి రైతులను ప్రభుత్వం కటకటాలపాలు చేసింది. ప్రభుత్వ ఆస్తుల ధ్వంసం, కుట్ర కేసులు పెట్టింది. చివరికి కరుడు కట్టిన నేరస్తుల తరహాలో చేతులకు సంకెళ్లు వేసి దండించింది.

ప్రపంచంలోనే అత్యుత్తమ కర్షకులున్న ప్రాంతం తెలుగు రైతాంగం అంటూ 1925లోనే బ్రిటిష్ రాయల్ కమిషన్ నుంచి ప్రశంసలు అందుకున్న ఘనత మన తెలుగు రైతాంగానిది. 70 సంవత్సరాల స్వతంత్ర భారతం రైతులకు ఆత్మహత్యలే మిగిల్చింది. రైతన్నల ఆత్మహత్యలు గత మూడు దశాబ్దాలుగా దేశంలో ఆందోళనకర స్థాయిలో కొనసాగు తున్నాయి. జాతీయ నేర గణంకాల సంస్థ తాజా అధ్యయనం ఈ విషయం వెల్లడిస్తుంది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో 2011లో 2,206 మంది, 2012లో 2,572 మంది, 2013లో 2,104 మంది మరణించారు. 2015లో రెండు తెలుగు రాష్ట్రాల్లో 1,979 మంది ఆత్మహత్యలు చేసుకున్నారు. ఎపిలో 160 మంది రైతులు, 472 మంది వ్యవసాయ కూలీలు, అదే తెలంగాణలో 898 మంది రైతులు, 449 మంది వ్యవసాయ కూలీలు ఆత్మహత్యలు చేసుకుని చనిపోయారు. ఆంధ్ర రాష్ట్రంలో తెలుగుదేశం ప్రభుత్వం ఏర్పడిన 2014 నుంచి 2017 జనవరి వరకు 2,284 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నట్లు అంచన. గత ఏడాదిన్నరగా తెలంగాణలో రోజుకు నగటున 15 మంది వరకు రైతులు రాలిపోతున్నారు. ఆహార భద్రతకు ఆయు పట్టులైన రైతులు ఆత్మహత్యలు చేసుకోవడం మన ఆర్థిక వ్యవస్థలోని సంక్షోభానికి సంకేతం. గత రెండు దశాబ్దాల కాలంలో దేశంలో మూడు లక్షల మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. 'అభివృద్ధి'ని ఊతపదంగా జపించే పాలకులు దీనికి ఏమి సమాధానం చెబుతారు?

దేశంలో వ్యవసాయ రంగంపై ప్రత్యక్షంగా ఆధారపడిన ప్రజల శాతం తరతమ తేడాలతో 90 శాతం నుండి 70 శాతానికి మారుతూ వచ్చిన 100 శాతం ప్రజలు ఆధారపడిన ఏకైక రంగం వ్యవసాయం మాత్రమే. కాబట్టి దేశానికి కావల్సింది బూటకపు 'హరిత విప్లవం' కాదు, 'వ్యవసాయ విప్లవం'.

వ్యవసాయ ఆధారిత గ్రామీణ చిన్న తరహా పరిశ్రమలు విరివిగా స్థాపించాలి. ప్రజలందరికి ఉపాధి గ్యారంటీని ఇవ్వాలి. రైతు వ్యతిరేక ప్రపంచ బ్యాంకు వంటి 'లూటి' సంస్థలు చెప్పిన ఆర్థిక సంస్కరణల బాట నుండి దేశం బయట పడాలి. మొత్తం వ్యవసాయ విధానమే మారాలి.

రైతు అనుకూల ప్రత్యామ్నాయ వ్యవసాయ విధానం కావాలి. ముఖ్యమైన అంశం ఏ దేశమైన అభివృద్ధి చెందాలంటే భూ సంస్కరణలు జరగాలి. ఈ దేశంలో అర్ధ భూస్వామ్య వ్యవస్థ రద్దయ్యే విధంగా భూములు పంచాలి. 'సెజ్'లకు వ్యతిరేకంగా పోరాటం చేయాలి. రైతుల్ని, మనల్ని మనమే కాక ముందు తరాలను కూడా రక్షించుకోవాలి. అందుకు అందరూ కృషి చేయాలి. అప్పుడు మాత్రమే ఆత్మహత్యలు లేని సమ సమాజం ఆవిష్కరించబడుతుంది. కుక్క కూడా ఆకలి చావు చావని నూతన సమాజాన్ని మనం నిర్మించుకోవాలి. వీ

*(రచయిత సామాజిక విశ్లేషకులు)*

# జలవనరుల రక్షణకు రైతుల బలిదానాలు

**ఇసుక కొల్లగొట్టడాన్ని అడ్డుకున్న రైతు కూలీలను రాజకీయ నాయకులు, రియల్ ఎస్టేట్ మాఫియా వాహనాలతో తొక్కించడాన్ని వ్యతిరేకిస్తూ, జలవనరులను కాపాడుకోవాలని, యేర్పేడు రైతాంగాన్ని స్ఫూర్తిగా తీసుకొని పోరాడాలని అంటున్నారు ముప్పాళ్ళ భార్గవశ్రీ**

మానవాళి మనుగడకు కీలకమైన జలవనరులు తరిగిపోకుండా నిరంతరం కాపాడే ఇసుక ముఖ్యంగా అధికారపక్ష రాజకీయ శక్తులకు కల్పతరువుగా మారిపోయింది. అధికార పార్టీ రాజకీయ నాయకులు మైనింగ్, రెవెన్యూ అధికారులను తమ గుప్పిటలో పెట్టుకొని ఇసుక తవ్వకాల్లో పాటించాల్సిన నిబంధనలను తుంగలో తొక్కి యథేచ్ఛగా ఇసుకను తరలించి వందలకోట్ల రూపాయలకు పడగలెత్తుతున్నారు. ముఖ్యమంత్రి మొదలుకొని కింది స్థాయి నాయకుల వరకు ఇసుక దందా శక్తులను కఠినంగా శిక్షిస్తామని ప్రకటనలు చేస్తూ చివరికి ఉచిత ఇసుక విధానం పేరుతో ఒక వైపు ప్రజలను మభ్యపెట్టి రెండోవైపు ఇసుకు మాఫియా శక్తుల దోపిడికీ గేట్లు బార్లా తెరిచారు. అక్రమ ఇసుక తవ్వకాల వలన జలవనరులు తగ్గిపోయి పంటలు నష్టపోతున్నామని అనేక ప్రాంతాల్లో రైతులు అందోళనలు చేస్తున్నా సమస్యను పరిష్కరించే చర్యలు తీసుకోక పోగా అడ్డుకున్న రెవెన్యూ అధికారులను, అందోళన చేస్తున్న రైతులపై దాడులు చేయటం, చివరికి ప్రాణాలను కూడా పోగొట్టుకున్న చిత్తూరు జిల్లా యేర్పేడు లారీ దుర్ఘటన ఇసుక మాఫియా దౌర్జన్యకాండకు సాక్షిభూతంగా నిలుస్తుంది.

ఇంతలో జనం కలవరపడేలా ఏప్రిల్ 21న చిత్తూరు జిల్లా యేర్పేడు దుర్గటన సాక్ష్యంగా నిలుస్తుంది. ఈ ఘటనలో మునగలపాలెం గ్రామానికి చెందిన రైతులు తమ పొలాలలో నీటి వనరులు తగ్గిపోవటానికి కారణమైన ఇసుక మాఫియా శక్తులపై చర్యలు తీసుకోవాలని తహశీల్దారు కార్యాలయం వద్ద ఆందోళన చేస్తుంటే, ఊహించని విధంగా ఒక లారీ అదుపు తప్పి రైతులపై దూసుకుపోయిన ఫలితంగా 15 మంది అక్కడికక్కడే చనిపోవడం, 24మందికి తీవ్ర గాయాలయ్యాయి. ఆందోళన చేస్తున్న రైతుల ప్రాణాలను కబళించిన ఈ ఘటన ఊహించని విధంగా జరిగిందా లేక ఇసుక మాఫియా శక్తుల హస్తం ఇందులో ఉందా అనే అనుమానాలను రైతులు బలంగా వ్యక్తం చేస్తున్నారు. ఇసుక మాఫియా శక్తుల ఆగడాలు, దాడులతో అనుభవాలున్న రైతులు 'ఇసుకాసురుల ధన దాహం వలన ఊరు వల్లకాడయిందనీ, ఇది ప్రమాదం కాదు, ముమ్మాటికీ చేసిన హత్యలేనని' నిర్భయంగా ప్రకటించారు. గతంలో ఇసుక మాఫియా శక్తులను అడ్డుకున్న రెవెన్యూ అధికారులను ట్రాక్టర్లతో తొక్కించి చంపిన ఘటనలకు ఒడిగట్టిన శక్తుల పట్ల అనుమానాలు రావటం ఏ మాత్రం ఆశ్చర్యం కాదు. ఈ దుర్ఘటనపై ప్రతిపక్ష పార్టీలతో పాటు వివిధ రైతు సంఘాలు సి.బి.ఐ విచారణ జరపాలని డిమాండ్ చేశాయి.

మునగాల పాలెం రైతులు దక్షిణ గంగగా పేరుపొందిన స్వర్ణముఖి నది గర్భాన్ని ఇసుక మాఫియా శక్తులు తోడేళ్లలా ప్రొక్లెన్‌లతో ఇసుకను తోడేస్తున్న ఫలితంగా ఈ ప్రాంత గ్రామాలలో నీరు అందకుండా భూగర్భ జలాలు అడుగంటిపోయాయి. చాలా కాలంగా పంటలు పండక పోవటంతో ఎక్కువ భాగం సన్నకారు రైతులుగా ఉన్న ఈ ప్రాంత రైతులు ఒక్కటై ఇసుకాశురుల అరాచకాలపై పోరాటం ప్రారంభించారు. మంత్రులు, ఎం.ఎల్.ఏలు నెలల తరబడి స్పందించకపోవడంతో మండల స్థాయిలో మూడుసార్లు ఆందోళనలకు దిగితే చివరికి ప్రాణాలనే పోగోట్టుకోవలసిన దుస్తితిలో పడ్డారు. ఇంతకి ఆందోళనకు దిగిందీ, లారీ ప్రమాదంలో ప్రాణాలను కోల్పోయినదీ టి.డి.పికి చెందిన రైతులే అన్నది విషాదకరం. ఈ ప్రాంతంలో ఇసుక మాఫియా అధికారపార్టీ అండదండలతో ఇక్కడి ఇసుకను రాత్రికి రాత్రే చెన్నై, బెంగుళూరులకు లారీలలో తరలించి కోట్లు కొల్లగొడుతున్నది బహిరంగ రహస్యం. ఈ ప్రాంతంలో అధికార పార్టీకి చెందిన బ్రదర్స్‌గా పేరుగాంచిన ధనుంజయ నాయుడు, చిరంజీవి నాయుడులను పార్టీ నుంచి బహిష్కరించడమేకాక అరెస్టు చేసి కఠినంగా శిక్షించాలని ముఖ్యమంత్రి స్వయంగా ప్రకటించవలసి వచ్చిందంటే అధికారపార్టీ నాయకులు ఎంతగా అవినీతి ఊబిలో కూరుకుపోయారో అర్థమవుతుంది.

అటు చిత్తూరు జిల్లా నుంచి ఇటు నెల్లూరు జిల్లా అంచుల దాకా విస్తరించి, విజృంభిస్తున్న ఇసుక స్మగ్లర్లకు నదిలోని ఇసుక కోట్లు సంపాదించి పెడుతుంటే, స్వర్ణముఖి నది ఒడ్డున ఉండే గ్రామాలు నీటికి కటకటలాడిపోతుంటాయి. స్వర్ణముఖి పారినంతమేర ఇసుక మేటలు అక్రమ తవ్వకాల వలన మాయమైపోతున్నాయి. ఇసుక మేటలపై తిష్టవేసి మాఫియాను నడుపుతున్నారు. యేర్పేడు, శ్రీకాళహస్తి, తొట్టెంబేడు మండలాల్లోని గ్రామాల్లో, నెల్లూరు జిల్లా పరిధిలోని పుల్లూరులో ఇసుక దందా వలన రైతులు వ్యవసాయం చేసుకోలేని దుస్థితిలోకి నెట్టబడ్డారు. స్వర్ణముఖి నది నుంచి మూడు నిమిషాలకు ఒక ట్రాక్టర్ వంతున ఇసుక తరలిపోతూ ఉంటుంది. ఒక ట్రాక్టర్‌లో 4 టన్నులు (2.30 క్యూబిక్ మీటర్లు) ఇసుక పడితే ఈ లెక్కన గంటకు 50 క్యూబిక్ మీటర్లు, రోజుకు 800 క్యూబిక్ మీటర్లు తరలివెళ్లిపోతుంది. ఇసుక ఉచితం కాకముందు స్మగ్లర్లు దొంగచాటుగా తరలిస్తే, ఉచితం అయిన తరువాత స్థానిక నాయకులు, స్మగ్లర్లు జమిలిగా దోచేయడం సాగిస్తున్నారు. జిల్లా సరిహద్దులో ఉన్న తడ, శ్రీసిటి ప్రాంతాలకు ఒక ట్రాక్టర్ ఇసుకను ఐదు వేలకు అమ్ముతున్నారు. స్థానిక నేతల అండతో పొరుగు రాష్ట్రాలలోని చెన్నై, బెంగుళూరు నగరాలకు లారీ రు. 50 వేల నుంచి రు.70 వేల వరకు అమ్మి ఇసుక మాఫియా కోట్లకు పడగలెత్తుతున్నారు.

యేర్పేడు మండలంలోని మునగపాలెం మొదలకు గ్రామాలన్నీ స్వర్ణముఖి నది ఒడ్డు గ్రామాలు కావటం వలన, భూగర్భ జలాలు 30–40 అడుగుల లోతులోనే బోరు బావులు, ఫిల్టర్ పంపులు వేస్తే పుష్కలంగా సాగునీరు లభించేది. ఉచిత ఇసుక విధానం ప్రారంభమైన తర్వాత భూగర్భ జలాలు అడుగంటిపోయి బోరు బావుల్లో నీరు లేకపోవటంతో ఈ ప్రాంతంలో అత్యధికంగా ఉన్న చిన్న, సన్నకారు రైతులు నీటి

వనరులను రక్షించు కోవటానికి ఆందోళన బాట చేపట్టారు. గత మూడు సంవత్సరాలుగా వివిధ రూపాలలో రైతులు ఆందోళన చేస్తూనే ఉన్నారు. ఈ సంవత్సరం మార్చ్‌లో జాతీయ రహదారి దిగ్బంధనం చేయడం, ట్రాక్టర్లు, జె.సి.బిలు నదిలోకి వెళ్లకుండా కందకాలు తవ్వి, కాపలా కాయడం, తవ్విన కందకాలను జె.సి.బిలతో పూడ్చడానికి చేసిన ప్రయత్నాలను రైతులు ధైర్యంగా ఎదుర్కొని, ఇసుక మాఫియా శక్తులపై కఠిన చర్యలు తీసుకోవాలని ఏప్రిల్ 21న తహశీల్దార్ కార్యాలయానికి 40మంది పైగా రైతులు చేరుకున్నారు. తహశీల్దార్ ఆఫీస్‌కు రారని తెలియడంతో ఆసమయంలో తిరుపతి అర్బన్ ఎస్.పి. జయలక్ష్మి ఉన్నారని తెలుసుకొని ఆమెను కలవటానికి రైతులు మండుటెండలో ఎదురు చూసినా, రైతుల గోడు వినకుండా నిర్లక్ష్యంగా వెళ్లిపోయిన ఎస్.పి. పై రైతులు ఆగ్రహం వ్యక్తం చేస్తున్న సమయంలోనే అకస్మాత్తుగా లారీ దూసుకొచ్చి రైతుల ప్రాణాలను నిలువునా బలిగొంది.

ఈ దుర్ఘటనను కేవలం లారీ ప్రమాదంగా కాక, రైతులను రోడ్డెక్కించిన ఇసుక మాఫియా అక్రమాలను అడ్డుకోకుండా ఉద్దేశపూరితంగా నిర్లక్ష్యం ప్రదర్శించిన జిల్లా, ఉన్నతాధికారుల నేరంగానే పరిగణించాలి. ఇసుక దందా శక్తుల చర్యల వలన జరిగిన ప్రమాద ఘటనకు కారణమైన వారే, ప్రజల క్రోధావేశాలు అధికార పార్టీపై రాకుండా చల్లబర్చేందుకు చనిపోయిన వారంతా తమ పార్టీ కార్యకర్తలనే అని వారి సంగతి తాము చూసుకుంటామని, ఇంకెవరూ మాట్లాడవలసిన అవసరం లేదని అధికార పార్టీ బుకాయించి – మంత్రులు, లోకేష్‌ను పంపి మృతుల కుంటుబాలకు రు.10 లక్షలు పరిహారం ఇచ్చి చేతులు దులుపుకున్నారు. ఆసుపత్రుల్లో ప్రాణాపాయ స్థితిలో ఉన్నవారి భవిష్యత్‌కు ఎటువంటి బరోసా ఇవ్వకుండా అధికార పార్టీ నాయకులు జారుకున్నారు. యేర్పేడు ఘటన వెనుక ఉన్న అసలు కారణాలను మరుగుపరుస్తూ, లారీ డ్రైవర్ తప్పిదం కారణంగానే ఈ దుర్ఘటన జరిగిందని, లారీ డ్రైవర్ మీదుగా విషయాన్ని అంతా దొర్లించుకు పోవాలని, డ్రైవర్‌ను అరెస్టు చేయించి చేతులు దులుపుకోవాలని అధికార పార్టీ నాయకులు కుంతత్రాలు పన్నుతున్నారు.

“గత మూడేళ్లుగా ఇసుక మాఫియా అగడాల గురించి, వ్యవసాయ స్థితిగతుల గురించి చెబుతూనే ఉన్నాం. ఏనాడు పట్టించుకోలేదు. ఈరోజు ఊరు వల్లకాడయ్యిందంటూ ముసలి కన్నీరు కారుస్తున్నావ్. నీకు మాట్లాడే అర్హత లేదు. మీరు ఇసుక మాఫియాకు అండదండగా నిలిచారు. అందువల్లనే వారు రెచ్చిపోయారు.” అంటూ మునగలపాలెం గ్రామస్తులు మే 9న గ్రామంలో జరిగిన కార్యక్రమానికి విచ్చేసిన మాజీ మంత్రి బొజ్జల గోపాల కృష్ణమూర్తిని గ్రామస్తులు నిలదీసి తమ ధర్మాగ్రహాన్ని వ్యక్తం చేశారు.

గతంలో ఇసుక రీచ్‌ల వేలం పాటలు, తర్వాత లాటరీ విధానం ద్వారా ఇసుక విధానాన్ని కొనసాగించినంత కాలం ఇసుక మాఫియాను నియంత్రణ చేయలేకపోగా, ఇసుకమాఫియా శక్తులే ప్రభుత్వాన్ని నియంత్రణలోకి తెచ్చే పరిస్థితులు ఏర్పడ్డాయంటే ఏమాత్రం ఆశ్చర్యపో నవసరం లేదు. ఒక దశలో ఇసుక మాఫియా అక్రమాలను అరికట్టడానికి ఇసుక రీచ్‌లలో తవ్వకాలు, రీచ్‌ల వేలం పాటలను నిలిపివేయాలని సాక్షాత్తు హైకోర్టు తీర్పు ఇవ్వాల్సి వచ్చింది. ఇసుక అక్రమార్కుల ఆగడాలను నియంత్రించలేని స్థితిలో కొత్త రాష్ట్రం ఏర్పడిన తర్వాత ఆగస్టు 2014లో మహిళా సాధికారతకు పెద్దపీట వేస్తున్నాననే పేరుతో చంద్రబాబు ప్రభుత్వం డ్వాక్రా మహిళా గ్రూపులకు ఇసుక బాధ్యతను అప్పగించింది. ఇసుక తవ్వకం, రవాణా బాధ్యతలను డ్వాక్రా గ్రూపులకు అప్పజెప్పినప్పటికీ ఆచరణలో ఆయా ప్రాంతాల రాజకీయ నాయకుల పెత్తనంతో పాటు అధికార పార్టీకి చెందిన చోటా మోటా నాయకుల అక్రమాలు, ఆధిపత్యం ముందు డ్వాక్రా మహిళా సంఘాలు సంవత్సరంన్నర కాలంలో కీలు బొమ్మలుగా మారిపోయాయి. నానాటికీ అంతులేకుండా పోతున్న ఇసుక మాఫియా శక్తుల ఆగడాలు పెరిగి అధికార పార్టీపై అవినీతి మచ్చ పెరిగిపోవటంతో ఈ అప్రతిష్ట నుంచి బయట పడడానికి ప్రజల్లో పెరుగుతున్న అసంతృప్తిని పక్కదారి పట్టించడానికి చంద్రబాబు ప్రభుత్వం ఉచిత ఇసుక విధానం అనే మాయజాలంతో ప్రజల్ని మభ్యపెట్టడానికి పూనుకుంది.

ఈ ఉచిత ఇసుక విధానం అమల్లోకి వచ్చి తొమ్మిది నెలలు కాకముందే ఇసుక అక్రమార్కులను పిడియాక్టు కింద అరెస్టు చేస్తానని స్వయంగా చంద్రబాబే ప్రకటించే స్థితి వచ్చిందంటే ఉచిత ఇసుక విధానం ఇసుకాసురులకు ఏవిధంగా వరంగా మారిపోయిందో వేరే వివరించ నవసరం లేదు. ఈ విధానం ఆచరణలో అధికార పార్టీకి చెందిన ప్రాంతీయ స్థాయి నాయకులు మొదలుకొని జిల్లా, రాష్ట్ర స్థాయి ఎం.ఎల్.ఏ, ఎం.పి., మంత్రుల స్థాయి వరకు దందా చేసి పెద్దఎత్తున సొమ్ము చేసుకోవడానికి సాధనంగా ఉపయోగపడుతున్నది. ఆచరణలో ఈ విధానం పేద, మధ్యతరగతి వర్గాలకు అందని ద్రాక్షపళ్లలాగా తయారైంది. ఇసుక అక్రమార్కుల దందావలన పేద వర్గాలు డబ్బులు ముట్టచెప్పినా, వారు రవాణా చేసుకోవటానికి లారీలు, కూలీలు దొరకకుండా అడ్డంకులు కల్పిస్తున్నారు. ఉచిత ఇసుక విధానం వలన ప్రభుత్వానికి ఆదాయం తగ్గినా సామాన్యుడికి ఎంతోమేలు జరుగుతుందని చంద్రబాబు చేసే ప్రచారం నేతిబీరకాయలో నెయ్యి చందంగా తయారైంది. ఇందుకు రాష్ట్ర వ్యాపితంగా ఇసుక మాఫియా సాగిస్తున్న అక్రమ ఇసుక త్రవ్వకాలే నిదర్శనంగా నిలుస్తాయి.

ఉచిత ఇసుక విధానంలోని నిబంధనల ప్రకారం వాల్టా చట్టం, పర్యావరణ పరిరక్షణ చట్టం ప్రకారం ఇసుక తవ్వకానికి యంత్రాలను ఉపయోగించకూడదనీ, ఇసుక లోతును బట్టి ఒకటి నుండి రెండు మీటర్ల లోతుకు మించి తవ్వకూడదని ఉన్నా, ఇసుక అక్రమార్కులు పెద్దఎత్తున యంత్రాలు ఉపయోగించి 5–10 మీటర్ల లోతును రెవెన్యూ, గనుల శాఖల అధికారులకు లంచాల ఎరచూపి ఇసుకను తోడేస్తూ కోట్లకు పడగలెత్తున్నారు. నిబంధనలకు నిలువెత్తు పాతర వేయటం వలన గత ఆగస్టు నెలలో జరిగిన పుష్కరాల్లో గుంటూరు జిల్లా సరిహద్దులోని కృష్ణానది పాయలో పుష్కర స్నానానికి కృష్ణాజిల్లా నుంచి వచ్చిన ఐదుగురు విధ్యార్థులు ఒకరి వెంట ఒకరు పైకి కనిపించని 30 అడుగుల గుంటలోకి జారపోయి ఒకరిని కాపాడబోయి ఒకరు మొత్తం ఐదుగురు జలసమాధి అయిపోయారు. అక్రమార్కులు విచ్చలవిడిగా సాగించిన ఇసుక తవ్వకాలతో ఐదుగురు యువకుల ప్రాణాలను బలిగొన్నారు. ఇటీవల కూడా ఈ ఇసుక గుంటల వలన కృష్ణా, గుంటూరు జిల్లాలకు చెంది కొందరు యువకులు మరణించారు. ప్రభుత్వం గుర్తించిన ఇసుక రీచ్‌లలోనే తవ్వకాలు సాగించాల్సి వుండగా గ్రామాల్లో ఉన్న పెత్తందారీ శక్తులు వందల సంఖ్యలో అక్రమ తవ్వకాలు సాగించారని మీడియా కోడై కూసింది. ఇసుక అక్రమ నిల్వలు, ఇతర రాష్ట్రాలకు రవాణా చేయకూడదని నిబంధన ఉన్నా దీనికి పూర్తి విరుద్ధంగా అక్రమార్కులు పెద్దఎత్తున వ్యాపారం చేసినా వారిపై నామమాత్రపు చర్యలు తప్పితే కఠిన చర్యలు తీసుకోలేదంటే వీరికి అధికారుల, మంత్రుల అండదండలు ఎంతగా ఉన్నాయో బోధపడ్తుంది. అధికార పార్టీ ఎం.ఎల్.ఏ చింతమనేని ప్రభాకర్ ఇసుక దందాను నిజాయితీగా

ఎదుర్కొన్న తహసీల్దారి వనజాక్షి లాంటి వారు బలిపశువులు కావటాన్ని చూస్తున్నాం. స్వయాన సి.ఎమ్. ఆమె నోరు మూయించి చింతమనేని పై కేసు లేకుండా చేయించగలిగారంటే తెలుగు తమ్ముళ్లకు దందా లైసెన్సులకు అధికారిక ముద్ర వేయటమే కదా!

ఈ ఉచిత ఇసుక విధానం ప్రకారం వినియోగదారుడు ప్రభుత్వం గుర్తించిన ఇసుక రీచ్ నుంచి ఇసుకను తీసుకెళ్లడానికి రవాణా ఛార్జీలు చెల్లిస్తే చాలునని ఎంత ఇసుకైనా ఉచితంగా తీసుకెళ్లవచ్చునని, స్వంత ఇళ్ల నిర్మాణాలు మొదలుకొని బడా ఇళ్ల సముదాయల నిర్మాణాలకు కూడా ఉచితంగా ఇసుకను తీసుకెళ్లే విధానాన్ని ప్రభుత్వం ప్రకటించింది. ఇంతటి సాహసోపేతమైన నిర్ణయాన్ని తీసుకోవటం ఒక్క చంద్రబాబు వల్లనే సాధ్యమైందని చాలామంది మెచ్చుకున్నారు. మొదట పేద, మధ్యతరగతి వర్గాల ప్రజలు సంతోషపడ్డారు. ఈసంతోషం మూణ్ణాళ్ల ముచ్చట్లగానే మిగిలి పేద, మధ్యతరగతి వర్గాల ప్రజలు శాపనార్థాలు పెట్టేస్థాయికి వచ్చింది. మరో వైపు ఇసుక మాఫియా శక్తులు చెలరేగిపోవడంతో చివరికి చంద్రబాబు ఇసుక అక్రమ రవాణాకి పాల్పడే తమ స్వంత పార్టీ వారినైనా ఉపేక్షించననీ, ప్రకటించాల్సి వచ్చింది.

ఈ ఉచిత ఇసుక విధానం అమల్లోకి వచ్చి తొమ్మిది నెలలు కాకముందే అధికార పార్టీ శక్తుల ఇసుక దందాలు వెలుగులోకి రావడం, ప్రజల్లో నిరసన పెరిగిపోవడంతో ఇసుక అక్రమార్కులను పిడియాక్టు కింద అరెస్టు చేస్తానని స్వయంగా చంద్రబాబే ప్రకటించే స్థితి వచ్చిందంటే ఉచిత ఇసుక విధానం ఎంత లోపభూయిష్టంగా ఉందో వేరే వివరించనవసరం లేదు. ఈ విధానం ఆచరణలో అధికార పార్టీకి చెందిన ప్రాంతీయ స్థాయి నాయకులు మొదలుకొని జిల్లా, రాష్ట్ర స్థాయి ఎం.ఎల్.ఏ, ఎం.పి., మంత్రుల స్థాయి వరకు దందా చేసి పెద్ద ఎత్తున సొమ్ము చేసుకోవడానికి సాధనంగా ఉపయోగపడ్తున్నది. ఆచరణలో ఈ విధానం పేద, మధ్యతరగతి వర్గాలకు అందని ద్రాక్షపళ్లలాగా తయారైంది. ఇసుక అక్రమార్కుల దందా వలన పేద వర్గాలు డబ్బులు ముట్టచెప్పినా, వారు రవాణా చేసుకోవడానికి లారీలు, కూలీలు దొరకుండా అడ్డంకులు కల్పిస్తున్నారు. ఉచిత ఇసుక విధానం వలన ప్రభుత్వానికి ఆదాయం తగ్గినా సామాన్యుడికి ఎంతోమేలు జరుగుతుందని చంద్రబాబు చేసే ప్రచారం నేతి బీరకాయలో నెయ్యి చందంగా తయారైంది. ఇందుకు రాష్ట్ర వ్యాపితంగా ఇసుక మాఫియా సాగిస్తున్న అక్రమ ఇసుక తవ్వకాలే నిదర్శనంగా నిలుస్తాయి.

చంద్రబాబు ప్రభుత్వపు ఉచిత ఇసుక విధానం పేద, మధ్యతరగతి వర్గాల ప్రయోజనాల కోసం కాక ఆచరణలో మాఫియా శక్తుల ప్రయోజనాలను కాపాడే సాధనంగా మారిపోవడానికి ముఖ్య కారణం అసలు ప్రభుత్వం ఇసుక విధానంలోనే లోపం ఉంది. ఈ విధానం ప్రకారం ఉచిత ఇసుకను సామాన్య ప్రజలతో పాటు రియల్ ఎస్టేట్ దార్లు, బడా కార్పొరేట్ బిల్డర్లు, సంపన్న వర్గాలు కూడా వాడుకోవచ్చు. అసలు పెద్దఎత్తున ఇసుకను ఉపయోగించేది బడా రియల్ ఎస్టేట్, కార్పొరేట్ వర్గాలే అయినప్పుడు, వీరు దీని ద్వారా పెద్దఎత్తున లాభాలు గడిస్తున్నప్పుడు ఈ వర్గాలకెందుకు ఉచితంగా ఇసుకను ఇవ్వాలి. ప్రకృతిలో లభించే అపారమైన ఖనిజవనరుల్లో ఇసుకు చాలా ముఖ్యమైనది. బొగ్గు, బాక్సైట్, పెట్రోలియం, సహజ వాయువులకు ధరలు నిర్ణయించి, ప్రభుత్వాలు పెద్ద ఎత్తున ఆదాయ వనరులను పొందుతున్నప్పుడు మనకు అపారంగా ఉన్న ఖనిజవనరైన ఇసుకను బడా కార్పొరేట్ వర్గాలకు ఎందుకు ఉచితంగా అందించాలి!

అంతకు ముందు వరకు ఇసుక రీచ్‌లను వేలం పాటలు తర్వాత లాటరీ విధానం ద్వారా కోట్లాది రూపాయలను ప్రభుత్వం ఆదాయం పొందినా ఇప్పుడు ఎందుకు ఉచిత ఇసుక విధానాన్ని చేపట్టినట్లు! పైకి ఉచిత ఇసుక విధానం ఆకర్షణీయంగా కనిపించినా ఆచరణలో తమకు అన్ని విధాలా ముఖ్యంగా ఎన్నికల సందర్భాల్లో వెన్నుదన్నుగా నిలబడే కార్పొరేట్ వర్గాలకు, ఇసుక మాఫియా శక్తులకు లాభం చేకూర్చడమే ప్రధానమని ఆచరణలో కళ్లముందు జరుగుతున్న పరిణామాలు బాగా రుజువు చేస్తున్నాయి. ఇందుకు ఇటీవల జరిగిన యేర్పేడు దుర్ఘటన ఇసుక మాఫియా హత్యకాండకు తాజా ఉదహరణగా నిలుస్తుంది.

ఇసుక దందా, ఇతర అక్రమాల ద్వారా కోట్లకు పడగలెత్తుతున్న చిత్తూరు జిల్లా పేరం బ్రదర్స్ కుటుంబాల ఆస్తులను జప్తు చేయాలని, వీరిని పిడి చట్టం కింద అరెస్టు చేసి, వీరి అక్రమాలకు సహకరిస్తున్న మైనింగ్, రివెన్యూ అధికారులపై కఠిన చర్యలు తీసుకోవాలని, ప్రాణాలు కోల్పోయిన 15మందికి రు.25 లక్షల చొప్పున, గాయపడిన వారికి రు.15 లక్షల చొప్పున నష్టపరిహారం అందచేయాలని, బాధితుల కుటుంబంలోని వారికి ఔట్ సోర్సింగ్ ఉద్యోగాలు కాకుండా పర్మినెంట్ ఉద్యోగాలు కల్పించాలని, స్వర్ణముఖి నదిలో అక్రమ ఇసుక తవ్వకాలను వెంటనే ఆపుచేయించి జలవనరులను కాపాడాలని, యేర్పేడు దుర్ఘటన భవిష్యత్తులో పునరావృతం కాకుండా పటిష్టమైన చర్యలు తీసుకోవాలని, ఇసుక మాఫియా - కార్పొరేట్ శక్తులకు ఉపయోగపడే ఉచిత ఇసుక విధానాన్ని తక్షణమే నిలుపదల చేసి, భూగర్భజల వనరులను కాపాడే విధంగా సమగ్ర ఇసుక విధానాన్ని రూపొందించాలన్న డిమాండ్లతో రైతాంగంతో పాటు ప్రజాస్వామిక శక్తులు సమైక్యంగా ముందుకు కదలటం నేటి కర్తవ్యం.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాల ఫలితంగా మనకు అపారంగా లభించే సహజ ఖనిజవనరైన ఇసుకను కేవలం ఆదాయ వనరుగా చూసి, ఆదాయాన్ని పెంచుకోవడమే లక్ష్యంగా ప్రభుత్వాలు విధానాలను రూపొందిస్తున్నాయి. ఫలితంగా మనకు అపారంగా లభించే జలవనరులు నానాటికి తగ్గిపోయి విశాల భూభాగాలు ఎడారులుగా మారిపోతున్న ఫలితంగా సాగు నీరు లేక పంటలు పండక వ్యవసాయ రంగం సంక్షోభంలో కూరుకుపోవటానికి, ఫలితంగా రైతులు ఆత్మహత్యలు చేసుకోవడానికి ముఖ్యకారణంగా పరిణమించింది. మరోవైపు తాగునీరు లభించటం నానాటికి తగ్గిపోతూ ఉండడంతో గ్రామాల్లో మహిళలు మైళ్లకొలది నడిచి వెళ్లాల్సి రావడం, పట్టణ ప్రాంతాల్లో నీటిని లీటర్ల లెక్కన కొని తాగాల్సిన పరిస్థితి, ఇసుక అక్రమ తవ్వకాల ఫలితంగా కృష్ణా, గోదావరి లాంటి నదీ పరీవాహక ప్రాంతాల్లో 150-200 అడుగుల బోర్లు వేయాల్సి వస్తున్నది. రాష్ట్రంలో వివిధ ప్రాంతాల్లో రాయలసీమ జిల్లాలతో పాటు వివిధ ప్రాంతాల్లో కరువు విలయతాండవం చేయటానికి ముఖ్య కారణం జల వనరులు తీవ్రంగా కొరవడడమే ముఖ్యకారణం.

కావున మానవాళి జీవనానికి కీలకమైన జలవనరులు ఇసుక తవ్వకాల వలన తగ్గిపోకుండా జలవనరుల రక్షణే ప్రధాన ధ్యేయంగా, ఉచిత ఇసుక విధానాన్ని సమూలంగా మార్చే విధి విధానాలను రూపొందించటం కోసం ప్రజాస్వామిక శక్తులు నడుం కట్టాలి. జలవనరులను దిగమింగే విధంగా ఇసుక తవ్వకాలు చేయకుండా రాక్‌శాండ్ లాంటి ప్రత్యామ్నాయ వనరుల కోసం శాస్త్రవేత్తలు నిత్యం అన్వేషణలు జరపటానికి తగిన ప్రణాళికలు రూపొందించటం అవసరం. అలానే జలవనరులను కాపాడుకోవటానికి యేర్పేడు ప్రాంత రైతాంగం సాగించిన పోరాటాన్ని రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల రైతాంగం స్ఫూర్తిగా తీసుకొని కొనసాగించటానికి సమైక్యంగా ముందుకు కదలి రావాలి!

*(రచయిత సి.పి.ఐ (యం.యల్) రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

# సుక్మా దాడి అనంతర పరిణామాలు

***సుక్మా జిల్లాలో ప్రభుత్వ అర్ధ సైనిక బలగాలపై మావోయిస్టులు జరిపిన తాజా దాడి నేపథ్యంలో జరుగుతున్న చర్చలను విశ్లేషిస్తున్నారు* ఎడ్ల పోచయ్య**

**చ**త్తీస్‌గఢ్‌లోని సుక్మా జిల్లా బుర్కాపాల్, చింతగుప్ప గ్రామాల మధ్య కాలాపత్థర్ ప్రాంతంలో ఏప్రిల్ 24 మధ్యాహ్నం పారామిలిటరీ బలగాలపై మావోయిస్టు దళాలు, ఆదివాసులు జరిపిన మందు పాతరల, కాల్పుల దాడిలో కమాండర్‌తో సహా ఒక ఎస్ఐ, ముగ్గురు ఎఎస్ఐ లు, ఆరుగురు హెడ్ కానిస్టేబుళ్లు, పద్నాలుగు మంది కానిస్టేబుళ్లు మొత్తం 25 మంది చనిపోయారు. మరొక ఆరుగురు జవాన్లు గాయపడ్డారు. వీరందరూ కేంద్ర రిజర్వ్ పోలీసు ఫోర్స్ (సిఆర్‌పిఎఫ్) 74వ బెటాలియన్‌లో కమాండర్ రఘుబీర్ సింగ్ నేతృత్వంలోని కంపెనీ (99 మంది)కి చెందినవారు. ఈ దాడిలో 300 మందికి పైగా ఆదివాసులు, మావోయిస్టు సాయుధ దళాలు పాల్గొన్నారని వార్తలు వెలువడ్డాయి. దాడి చేసినవారిలో ఎక్కువమంది గ్రామస్తులు, మహిళలు అని గాయపడిన పోలీసులు కూడ పత్రికలకు చెప్పారు. ఈ ఘటనలో మావోయిస్టుల వైపు నుంచి పది, పన్నెండు మంది మరణించి ఉంటారని గాయపడిన పోలీసులు మొదట చెప్పారు గాని ఆ తర్వాత కనీసం ముగ్గురు మరణించి ఉంటారని, కాని వారి మృతదేహాలు కూడ దొరకలేదని అధికారులు ప్రకటించారు. ఈ దాడిలో మావోయిస్టులు ఎకె-47, ఎస్ఎల్ఆర్ ఇన్సాస్ రైఫిల్ వంటి ఆధునిక ఆయుధాలతో పాటు సాంప్రదాయిక ఆయుధాలు, బాంబులు అమర్చిన బాణాలు వాడారని, దాడి తర్వాత మృతులైన సీఆర్పీ జవాన్లకు చెందిన ఆధునిక ఆయుధాలు భారీగా మావోయిస్టుల చేత చిక్కాయని కూడ పత్రికలు రాశాయి.

ప్రభుత్వ సాయుధ బలగాలకూ, విప్లవోద్యమ సాయుధ బలగాలకూ మధ్య ఘర్షణలు, దాడి-ప్రతిదాడులు, ఇరువైపులా కొద్దో గొప్పో ప్రాణనష్టాలు జరగడం ఇదే మొదటిసారి కాదు. బహుశా చివరిసారీ కాబోదు. కాని ఈసారి కనబడుతున్న ప్రతిస్పందన మాత్రం అసాధారణంగా ఉంది. గతంలో జరిగిన పెద్ద ఘర్షణల సందర్భంలో, ప్రభుత్వ బలగాలు పెద్ద నష్టానికి గురైన సందర్భాలలో కూడ జరగనంత పెద్ద ఎత్తున చర్చ, పథక రచన జరుగుతున్నాయి.

ఇది పొరుగున ఉన్న దంతెవాడ జిల్లాలోని చింతల్నార్ సమీపంలో 76 మంది సీఆర్పీ బలగాలు మరణించిన 2010 ఏప్రిల్ 6 దాడి తర్వాత అతి పెద్ద దాడిగా అధికారవర్గాలు చెపుతున్నాయి. ఈ మధ్యలో కూడ కొన్ని దాడులు జరిగాయి గాని ప్రస్తుత దాడి విషయంలో పాలకవర్గాల వైపు నుంచి గతంలో కన్న పెద్ద ఎత్తున ప్రతిస్పందన వెలువడింది. వెంటనే స్వయంగా రాష్ట్రపతి, ప్రధానమంత్రితో సహా ఎందరో ప్రభుత్వాధినేతలు, సోనియా గాంధీ, రాహుల్ గాంధీ, మమతా బెనర్జీ, సీతారాం యేచూరి వంటి ప్రతిపక్ష నేతలు ఈ దాడిని ఖండించారు. దాడి జరిగిన కొద్ది గంటల్లోనే ప్రధాన మంత్రి నరేంద్ర మోడీ ట్విట్టర్ పై దీనికి ఖండన ప్రకటించారు. కేంద్ర హోం మంత్రి రాజ్‌నాథ్ సింగ్, రాష్ట్ర ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ పత్రికా సమావేశాలు ఏర్పాటు చేసి ఖండించడం మాత్రమే కాక, హుటాహుటిన హోంశాఖ సహాయమంత్రి హన్స్‌రాజ్ అహిర్‌ను, హోంశాఖ సంయుక్త కార్యదర్శి (మావోయిస్ట్ ఆపరేషన్స్) ప్రవీణ్ వశిష్ఠను చత్తీస్‌గఢ్‌కు పంపించారు. స్వయంగా కేంద్ర హోం మంత్రి, రాష్ట్ర గవర్నర్ బలరాంజీ టాండన్, రాష్ట్ర ముఖ్యమంత్రి ఆ మర్నాడు ఘటనా స్థలిని సందర్శించారు. సీఆర్పీ తాత్కాలిక డైరెక్టర్ జనరల్ సుదీప్ లక్టాకియాతో పాటు, సీఆర్పీ మాజీ డైరెక్టర్, ప్రస్తుత హోంశాఖ సీనియర్ సలహాదారు, వీరప్పన్‌ను, కిషన్ జీని చంపిన వ్యక్తిగా పేరుపొందిన కె విజయకుమార్‌లను చత్తీస్‌గఢ్‌లోనే ఉండి ఎదురుదాడిని పర్యవేక్షించమని ఆదేశించారు. ఈ దాడి తర్వాత రెండు వారాలు తిరగకుండానే మే 8న నక్సలైట్ ప్రభావిత రాష్ట్రాల ముఖ్యమంత్రుల సమావేశం జరిపి, మావోయిస్టుల అణచివేతకు కొత్త పథకాలు రూపొందించారు. ఈ సమావేశానికి కేంద్ర ప్రభుత్వ రహదారులు, రైల్వే, పౌర విమానయాన, గ్రామీణాభివృద్ధి, విద్యుచ్ఛక్తి, టెలికమ్యూనికేషన్స్ తదితర మంత్రులను, అధికారులను కూడ ఆహ్వానించారు. అప్పటివరకూ కలకత్తాలో ఉన్న సిఆర్‌పిఎఫ్ ప్రాంతీయ కార్యాలయాన్ని హుటాహుటిన రాయపూర్ కు తరలించారు.

ప్రచార సాధనాలన్నీ ఈ దాడిని ఖండించాయి. ప్రత్యేకించి ఇంగ్లీష్ ప్రచార సాధనాలు ఈ దాడి గురించి ప్రత్యేక కథనాలు, ఖండనలు ప్రసారం చేశాయి, ప్రత్యేక వ్యాసాలు, విశ్లేషణలు ప్రచురించాయి. ఎంతో మంది పాలకవర్గ మేధావులు ఈ దాడి ప్రాధాన్యతను ఎత్తిచూపుతూ, మావోయిస్టులను అణచివేయవలసిన అవసరం గురించి ప్రభుత్వానికి సూచనలు, సలహాలు అందించారు. మే 8 ముఖ్యమంత్రుల సమావేశం రోజున ఒక రకంగా ఆ సమావేశంలో ఏమి చర్చించాలో సూచిస్తూ "సుక్మాలో నిర్ణయాత్మక దాడికి సిద్ధం కావాలి. నక్సల్ వ్యతిరేక చర్యలలో ఇది ఒక మూలమలుపు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సుక్మాలో నిర్ణయాత్మక దాడికి అవసరమైన పోలీసు మోహరింపుకు నిర్ణయం తీసుకోవలసిన పరిస్థితి ఆసన్నమయింది" అని ది ఎకనమిక్ టైమ్స్ రాసింది. "సీఆర్పీఎఫ్ బలగాల మీద గత ఏడు సంవత్సరాలలో మావోయిస్టులు జరిపిన అత్యంత భీకరమైన దాడి తర్వాత తన నిఘా వ్యూహాలను, చర్యా వ్యవహారాలను, నష్టపరిహారాలను సమీక్షించుకోవలసిన అవసరాన్ని గుర్తిస్తూ ప్రభుత్వం మేలుకుంటున్నట్టు కనబడుతున్నది" అని ది న్యూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్ రాసింది.

ముఖ్యమంత్రుల సమావేశానికి విప్లవోద్యమ ప్రభావం ఉన్న పది రాష్ట్రాల ముఖ్యమంత్రులను, పోలీసు ఉన్నతాధికారులను ఆహ్వానించగా, చత్తీస్‌గఢ్, జార్ఖండ్, మహారాష్ట్ర, బీహార్, ఒడిషా, ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రులు హాజరయ్యారు, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్, మధ్య ప్రదేశ్, పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రులు హాజరు కాలేదు. అన్ని రాష్ట్రాల పోలీసు ఉన్నతాధికారులు, మావోయిస్టు ప్రభావం ఉన్న 35 జిల్లాల ఎస్పీలు, కలెక్టర్లు కూడ పాల్గొన్నారు. "నక్సల్స్ వ్యతిరేక కార్యక్రమాల్లో మరింత కఠినంగా, మరింత దూకుడుగా ముందుకు వెళ్లాల్సిన అవసరం ఉంద"ని ఈ సమావేశం పిలుపునిచ్చింది. "మన విధానాల్లో దూకుడు పెంచాలి. మన ఆలోచనల్లో, వ్యూహాల్లో, బలగాల మోహరింపులో, వ్యూహాల అమలులో, మావోయిస్టు ప్రభావిత ప్రాంతాల్లో రోడ్ల నిర్మాణంలో ఈ దూకుడు కనిపించాలి. మితిమీరిన ఆత్మరక్షణతో ఉండడం వల్లే కార్యాచరణలో పక్కాగా వ్యవహరించలేకపోతున్నాం" అని రాజ్‌నాథ్ సింగ్ అన్నారు. "మావోయిస్టుల ఆర్థిక వనరులను దెబ్బకొట్టడమే ఈ పోరాటంలో అత్యంత కీలకం. సరిపోయేన్ని ఆర్థిక వనరులున్నప్పుడే వారు ఆయుధాలు కొంటారు. అందుకే ఆర్థిక వనరులను దెబ్బతీయడం అవసరం" అని ఆయన నొక్కి చెప్పారు. ఏకీకృత కమాండ్ నెలకొల్పవలసి ఉన్నదన్నారు.

ఎనిమిది రకాల కార్యాచరణను ప్రతిపాదించి ఆ ఎనిమిది అక్షరాలతో 'సమాధాన్' అనే పదం రూపొందించి అదే తమ ప్రస్తుత వ్యూహం అని హోంశాఖ ప్రకటించింది. ఎస్ అంటే స్మార్ట్ లీడర్‌షిప్ (చురుకైన నాయకత్వం), ఎ అంటే అగ్రెసివ్ స్ట్రాటజీ (దూకుడు వ్యూహం), ఎం అంటే మోటివేషన్ ట్రెయినింగ్ (ప్రేరణ శిక్షణ), ఎ అంటే యాక్షనబుల్ ఇంటిలిజెన్స్ (కార్యాచరణకు ఉపయోగపడే నిఘా), డి అంటే డాష్ బోర్డ్ బేస్డ్ ఇండికేటర్స్ (చేతికి అందుబాటులో ఉండే సూచికలు), ఎచ్ అంటే హార్నెసింగ్ టెక్నాలజీ (సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకోవడం), ఎ అంటే యాక్షన్ ప్లాన్ ఫర్ ఈచ్ థ్రెట్ (ప్రతి సవాలుకూ తగిన కార్యాచరణ ప్రణాళిక), ఎన్ అంటే నో యాక్సెస్ టు ఫైనాన్సింగ్ (ఆర్థిక వనరులను అడ్డగించడం) అనే సమాధాన్ ఈ వ్యూహం. ఒకవైపు ఈ దూకుడు వ్యూహాన్ని ప్రకటిస్తూనే "నక్సల్స్ ఏరివేతకు సైన్యం సహాం తీసుకోబోము" అని సన్నాయి నొక్కులు కూడ నొక్కారు.

ఈ సమావేశం తరువాత పత్రికలతో మాట్లాడుతూ మహారాష్ట్ర ముఖ్యమంత్రి దేవేంద్ర ఫడ్నవీస్ 'సాయిబాబా, తదితరులకు విధించిన శిక్షకు ప్రతీకారంగానే సుక్మా దాడి జరిగింద'ని అన్నాడు. 'ఇవాళ మనం జరపవలసిన ప్రచార యుద్ధం మావోయిస్టుల కంచుకోటలైన గడ్చిరోలిలో, సుక్మాలో కాదు. ఢిల్లీ, పుణె, పట్నా, హైదరాబాద్‌లలోని విశ్వవిద్యాలయాలలో జరపవలసి ఉంది. అక్కడే నక్సలైట్ల వ్యూహాలు తయారవుతున్నాయి. ఆయుధాలు పట్టుకున్న కార్యకర్తలకన్న నక్సల్ సానుభూతిపరుల సైన్యమే ప్రమాదకరం' అన్నాడు. తెలంగాణలో, ఆంధ్రప్రదేశ్‌లో విప్లవోద్యమం బలహీన పడిందని, లేదని ఒకవైపు ప్రతిరోజూ ప్రకటనలు చేస్తున్న ఈ రెండు రాష్ట్రాల పోలీసు ఉన్నతాధికారులు ఢిల్లీ సమావేశంలో మాత్రం తమకు నక్సల్ వ్యతిరేక నిధులు పెంచాలని కోరారు.

ఒకవైపు ఈ ఢిల్లీ ఉన్నతస్థాయి సమావేశం జరుగుతుండగానే పాలకవర్గ మేధావులూ, కార్పొరేట్ శక్తుల ప్రయోజనాలు కాపాడే ప్రధాన స్రవంతి దినపత్రికలు ప్రచారదాడిని ముమ్మరం చేశాయి. సుక్మా ఘటనను ఖండించడం లేదేమని కేంద్ర మంత్రి వెంకయ్య నాయుడు ఘటన జరిగిన వెంటనే హక్కుల సంఘాల మీద తన దాడిని ఎక్కుపెట్టారు. "విశ్వ విద్యాలయాల్లో కూర్చొని, మావోయిస్టులను అణచేందుకు ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలను ఖండించే మానవ హక్కుల నేతలు జవాన్లపై జరిగిన దాడిని ఖండించకపోవడం దారుణం" అని వెంకయ్య నాయుడు అన్నారు. ఆ తక్షణ ప్రతిస్పందనతో పాటు, ప్రత్యేకంగా ఆంధ్రజ్యోతిలో 'ఎందుకీ ద్వంద్వ ప్రమాణాలు?' అంటూ ఒక పెద్ద వ్యాసం రాసి ప్రజా ఉద్యమాలను, విప్లవోద్యమాన్ని, ప్రజా ఉద్యమాలను సమర్థించే బుద్ధిజీవులను నిందించడానికి, అడ్డగోలు వాదనలు చేయడానికి ప్రయత్నించారు. భారతీయ జనతా పార్టీకి చెందిన రాజ్యసభ సభ్యుడు, ప్రస్తుతం జాతీయోన్మాద సంఘ్ పరివార్ ప్రచార వాహికగా ఆర్నబ్ గోస్వామి నడుపుతున్న రిపబ్లిక్ టివి చానల్ పెట్టుబడిదారు రాజీవ్ చంద్రశేఖర్ ది హిందూలో ఒక వ్యాసం రాస్తూ, "వామపక్ష తీవ్రవాదానికీ, మావోయిస్టులకూ వ్యతిరేకంగా మనం జరుపుతున్న యుద్ధంలో ఈ ఘటన 26/11 (ముంబాయి తీవ్రవాదుల దాడి) తో సమానమైనది" అంటూ ఎంత కఠినమైన, సమగ్రమైన వ్యూహంతో మావోయిస్టులను అణచివేయాలో సూచనలు చేశారు. మావోయిస్టులను అణచివేయడానికి సీఆర్పీ సరిపోదని, సైన్యం వంటి సుశిక్షితులైన బలగాలు కావాలని సూచిస్తూ మేజర్ జనరల్ (రిటైర్డ్) జిడి బక్షీ ది న్యూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో వ్యాసం రాస్తూ, "అంతగా శిక్షణలేని ఈ సీఆర్పీ బలగాలను మావోయిస్టుల మీదికి పంపితే కొన్ని మరణాలు సంభవించడంతో పాటు, అంతకన్న ఎక్కువ ప్రమాదకరంగా కీలకమైన ఆయుధాలు, పరికరాలు మావోయిస్టుల చేతికి చిక్కి వారి దళాలను బలోపేతం చేస్తాయి" అని హెచ్చరించారు. మావోయిస్టుల కంచుకోటలుగా ఉన్న కీలక ప్రాంతాలలోకి చొచ్చుకు పోవడమే తమ లక్ష్యమని బస్తర్ రేంజి ఐజిగా కొత్తగా నియమితుడైన వివేకానంద్ ఎకనమిక్ టైమ్స్‌కు ఇచ్చిన ప్రత్యేక ఇంటర్వ్యూలో అన్నారు. రానున్న రోజుల్లో ఇంకా తీవ్రమైన ఘర్షణలు జరుగుతాయని చత్తీస్‌గఢ్ నక్సల్ వ్యతిరేక ఆపరేషన్స్ స్పెషల్ డిజి డిఎం అవస్థి అన్నాడు. మానవరహిత విమానాలను ప్రయోగించి మావోయిస్టుల ఆచూకీ కనిపెట్టి దాడులు చేస్తామని అధికారులు ప్రకటిస్తున్నారు. ఇలా దాదాపు ప్రతి వేదిక మీదా సుక్మా ఘటన సాకుగా పెట్టుకుని విప్లవోద్యమం మీద పెద్ద ఎత్తున ప్రచార దాడి ప్రారంభమైంది.

ఒక రకమైన మానసిక యుద్ధం (సైకలాజికల్ వార్) లో భాగమైన ఈ దాడిలో మావోయిస్టుల మీద దుష్ప్రచారంతో, అబద్ధాలతో, అర్ధసత్యాలతో మధ్యతరగతిని తప్పుదారి పట్టించి, ఉద్యమానికి మధ్యతరగతి సానుభూతి అందకుండా చేసే పకడ్బందీ వ్యూహం ఉంది. అందువల్లనే, ఈ దాడి వార్తలలో, వ్యాఖ్యలలో అన్నిట్లోనూ దాడికి గురైన సీఆర్పీ దళం అక్కడ వేస్తున్న రహదారికి భద్రత కల్పించడానికి ఉన్నదని, రహదారి అనే అభివృద్ధి సూచికను ఆదివాసులకు అందకుండా చేయడానికే మావోయిస్టులు ఈ దాడి చేశారని ఒక కథనాన్ని ప్రచారంలో పెట్టారు. "మావోయిస్టులు బస్తర్‌లో రోడ్ల అభివృద్ధిని సహించలేకపోతున్నారు. రోడ్ల నిర్మాణానికి భద్రత కోసం వచ్చిన సీఆర్పీ జవాన్ల మీద దాడి రోడ్డు నిర్మాణాన్ని అడ్డుకోవడానికే. జాగర్‌గొండ అటవీ ప్రాంతం లోపలికి

ప్రభుత్వం మూడు వైపుల నుంచి రహదారి నిర్మిస్తున్నది. ఆ రహదారి పూర్తయితే ఇక రాష్ట్రంలో మావోయిస్టులకు తల దాచుకునే స్థలం కూడ మిగలదు" అని పోలీసులు, ప్రభుత్వ వర్గాలు ప్రచారం చేస్తున్నాయి. "అభివృద్ధి లేకనే ఆదివాసులు తుపాకులు పట్టవలసి వస్తున్నదని అంటున్న మావోయిస్టులు రోడ్డుపనులు, సెల్ ఫోన్ టవర్లు, బడులు, ఆరోగ్య కేంద్రాలు వంటి అభివృద్ధి కార్యక్రమాల మీద ఎందుకు దాడి చేస్తున్నారు" అని వాళ్లు ప్రశ్నిస్తున్నారు. మావోయిస్టుల సురక్షిత స్థావరమైన జాగర్ గొండ అటవీ ప్రాంతాన్ని దోర్నపాల్ దగ్గర జాతీయ రహదారికి కలుపుతూ నిర్మిస్తున్న 60 కిమీ రోడ్డును నిలువరించడమే సుక్మా దాడి లక్ష్యమని కేంద్ర ప్రభుత్వం అంటున్నది. జాగర్‌గొండకు మరి రెండువైపుల బీజాపూర్‌తో, కిరండుల్‌తో రోడ్డు మార్గం ఏర్పడితే, ఈ ప్రాంతానికి అభివృద్ధిని తీసుకువెళ్లడం తేలికవుతుంది అని అంటున్నది.

ఈ ప్రచారమంతా పచ్చి అబద్ధం. అసలు ఈ రోడ్ల నిర్మాణానికి లక్ష్యం సుదూరంగా కూడ ఆదివాసుల అభివృద్ధి కాదు. కార్పొరేట్ శక్తులకు అటవీ, ఖనిజ వనరులను అప్పగించడానికి కుదుర్చుకున్న ఒప్పందాల ప్రకారమే, బహుళ జాతి సంస్థలకు, వారి దళారీలకు ఖనిజ నిలువలను అందుబాటులోకి తేవడం కోసమే ఈ రోడ్ల నిర్మాణం. ఈ వనరుల దోపిడీని అడ్డుకుంటున్న ఆదివాసులను, వారికి నాయకత్వం వహిస్తున్న విప్లవోద్యమాన్ని అణచివేయడానికి పోలీసు, అర్ధసైనిక బలగాలను సులభంగా తరలించడానికే ఈ రోడ్ల నిర్మాణం. మారుమూల ప్రాంతాల్లో కూడ సీఆర్పీ, అర్ధసైనిక శిబిరాలు ఏర్పాటు చేయడానికి, ఆ శిబిరాలకు నిరంతర సరఫరాల కోసం రోడ్లు నిర్మిస్తున్నారు. రోడ్ల నిర్మాణం పేరుతో లోలోపలికి చొరబడుతున్న అర్ధసైనిక బలగాలు ఆదివాసి గ్రామాల మీద, విప్లవ ప్రజా సంఘాల మీద పెద్ద ఎత్తున దాడులు చేస్తున్నాయి. ఆ దాడులను నిలువరించడానికీ, దాడులకు గురవుతున్న ప్రజల్లో స్థైర్యం నింపడానికీ అవసరమైన ప్రతిఘటనగానే సుక్మా ఘటన జరిగి ఉండవచ్చు.

అలాగే, ఈ దాడిలో మావోయిస్టులు పెద్ద ఎత్తున ఆయుధాలు సంపాదించుకోవడం పాలకవర్గాల వెన్నులో వణుకు పుట్టిస్తున్నది. ఈ దాడిలో పన్నెండు ఎకె 47లు, 4 ఎకె ఎం రైఫిళ్లు, మూడు ఇన్సాస్ ఆటోమాటిక్ రైఫిళ్లు, రెండు లైట్ మెషిన్ గన్ (ఎల్ ఎం జి) లు, మూడు ఇన్సాస్ రైఫిళ్లు, ఐదు అండర్ బారెల్ గ్రెనేడ్ లాంచర్లు (యుబిజిఎల్), వాటికి అవసరమైన 55 షెల్స్, ఐదు వైర్ లెస్ సెట్లు, రెండు బైనాక్యులర్లు, 15 రేడియో సెట్లు, 22 బుల్లెట్ ప్రూఫ్ జాకెట్లు, ఎకె 47, ఎకె ఎంలకు ఉపయోగించే 3,500 రౌండ్ల మందుగుండు, 10 బాటరీలు, మందుపాతరలను గుర్తించే మెటల్ డిటెక్టర్ ఒకటి మావోయిస్టుల చేత చిక్కాయని పత్రికలు రాశాయి. అందుకే సీఆర్పీ జవాన్ల ప్రాణాల కన్న ఇలా ఆయుధాలు వారి చేతికి చిక్కడమే ఎక్కువ నష్టమని మాజీ సైనికాధికారి స్పష్టంగానే రాశాడు.

నక్సలైట్లు ఆయుధాలు ఎత్తుకుపోవడం పెద్ద సమస్యగా మారిందని, అందువల్ల ఇకమీదట అలా ఎత్తుకువెళ్లే ఆయుధాలు వారికి ఉపయోగ పడకుండా అవి ఎక్కడున్నా గుర్తించేలా ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించాలని ఈ ఘటన తర్వాత కేంద్ర హోంశాఖ సూచించింది. బయోమెట్రిక్ గన్స్, జిపిఎస్ ట్రాకర్స్ ఏర్పాటు చేస్తే ఆ ఆయుధాలను నక్సలైట్లు ఉపయోగించలేరని, అవి ఎక్కడున్నాయో పట్టిస్తాయని హోం శాఖ అంటున్నది. కాని ఇది అతిశయోక్తి. ప్రస్తుతం పాలకవర్గాలు సాంకేతిక పరిజ్ఞానం బూచిని చూపి తనకు లేని, సమకూరడానికి అవకాశంలేని శక్తి ఉన్నట్టు చెప్పుకోవడానికి ప్రయత్నిస్తున్నది. బయోమెట్రిక్, జిపిఎస్ సాంకేతిక పరిజ్ఞానాలకు అంత శక్తి లేదనేది ఒక వాస్తవమైతే, ఆ సాంకేతిక పరిజ్ఞానాన్ని కూడ నిరుపయోగం చేయగల సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులో ఉన్నదనేది మరొక వాస్తవం.

తమ రాజకీయాలు డబ్బుతో, డబ్బుతో మాత్రమే నడుస్తాయి గనుక ప్రజా రాజకీయాలు కూడ అలాగే ఉంటాయని పాలకవర్గాలు భ్రమ పడుతున్నాయి. అందువల్లనే ఆర్థిక వనరుల మీద దెబ్బతీయడం ద్వారా మావోయిస్టు ఉద్యమాన్ని అణచివేయవచ్చునని వ్యూహాలు రచిస్తున్నాయి. పెద్దనోట్ల రద్దు సందర్భంలో స్వయంగా ప్రధానమంత్రి, ఛత్తీస్‌గఢ్ ముఖ్యమంత్రి ఆ చర్యతో మావోయిస్టుల దగ్గరి ఖజానా పనికి రాకుండా పోతుందని, దానితో వారి పని అయిపోతుందని ప్రకటించారు. సుక్మా ఘటన తర్వాత, ఆ పాత ప్రకటనలను గుర్తుచేస్తూ, భాజపా మిత్రపక్షమే అయిన శివసేన నాయకుడు ఉద్ధవ్ ఠాక్రే ఎద్దేవా చేశాడు. పెద్ద నోట్ల రద్దుతో మావోయిజం తగ్గిపోయి ఉంటే ఇలా 25 మంది సీఆర్పీ జవాన్లను చంపగలిగే శక్తి వారికెట్లా వచ్చిందని ప్రశ్నించాడు.

సుక్మా ఘటన తర్వాత మరొకసారి రాజకీయ నాయకులు, పాలకవర్గ మేధావులు ఈ మావోయిస్టుల ఆర్థిక మూలాలను అరికట్టాలనే ప్రచార ఉధృతి పెంచారు. నిజానికి ప్రజా ఉద్యమాలకు, ప్రజా రాజకీయాలకు డబ్బు అవసరమే గాని, డబ్బే సర్వస్వం కాదు. ఈ ఉద్యమాలు ప్రజల ఆకాంక్షల నుంచి, ప్రజల భాగస్వామ్యం నుంచి పుట్టి పెరిగి విస్తరిస్తాయి. అవి సాయుధ ఉద్యమాలు కూడ అయినప్పుడు, విస్తరించిన నిర్మాణం అయినప్పుడు వాటికి నిధులు అవసరమవుతాయి. ఆ నిధులు సమకూర్చుకునే వ్యూహాలు, పద్ధతులు ఉంటాయి. ఏవో కొన్ని మూలాలను అరికట్టగానే ఉద్యమం ఆగిపోతుందని అనుకోవడం పాలకవర్గాల భ్రమ.

అలాగే లక్షలాది మంది అర్ధసైనిక, పోలీసు బలగాలను మోహరించి, వందల కోట్ల రూపాయల నిధులు కేటాయించి, అత్యంత ఆధునిక ఆయుధ సామగ్రి సమకూర్చి, అధునాతన సాంకేతిక పరిజ్ఞానం ఏర్పాటు చేసుకుని కూడ విఫలమవుతున్న పాలకవర్గాలు ఇటువంటి ఒక సవాల్ రాగానే ఎవరి మీద నింద మోపుదామా, ఎవరిని సాకుగా చూపుదామా అని ప్రయత్నిస్తున్నాయి. ఈ దాడి జరిగిన సమయంలో సీఆర్పీకి నాయకుడు లేని స్థితిలో ఉందని, డైరెక్టర్ జనరల్ కోడె దుర్గాప్రసాద్ ఫిబ్రవరి 28న పదవీ విరమణ చేశాక, ఇప్పటివరకూ పూర్తికాలం డైరెక్టర్ జనరల్ ను నియమించలేదని, మార్చ్ 1 నుంచీ ఎడిజి సుదీప్ లక్టాకియా తాత్కాలిక బాధ్యతలు నిర్వహిస్తున్నారని, డైరెక్టర్ జనరల్ లేకపోవడం వల్లనే విధాన నిర్ణయాలు తీసుకోవడంలో ఇబ్బందులు ఏర్పడ్డాయని ఇప్పుడు అంటున్నారు. గ్రామాల మీద, ప్రజల మీద దాడులు చేయడం, ఇళ్లు తగులబెట్టడం, స్త్రీల మీద అత్యాచారాలు చేయడం, యువకులను నిర్బంధించి చిత్రహింసలు పెట్టడం, చంపివేయడం మాత్రమే శిక్షణ ఇచ్చిన, ప్రజలను శత్రువులుగా భావించమని నూరిపోసిన అర్ధసైనిక బలగాలకు పైన ఒక డైరెక్టర్ జనరల్ ఉన్నాడా లేడా అనేది ప్రధానం కానేకాదు.

# కశ్మీర్‌కు రాజకీయ చర్చలే పరిష్కారం

***మోడీ ప్రభుత్వం కశ్మీర్ ప్రజల ఉద్యమాన్ని శాంతి భద్రతల సమస్యగా మార్చి, అణచివేసే ప్రయత్నం చేస్తోందనీ ఇవేవీ కశ్మీరీల మౌలిక సమస్యకు పరిష్కారం కావని చర్చల ద్వారా రాజకీయ పరిష్కారం కనుక్కోవాలనీ అంటున్నారు ఎ. నర్సింహా రెడ్డి***

గత సంవత్సరం జూలై 8న హిజ్బుల్ – ముజాహిద్దీన్‌కు చెందిన కమాండర్ బుర్హాన్‌వానీ ని సాయుధ బలగాలు ఎన్‌కౌంటర్‌లో హత్య చేసినప్పటి నుండి కశ్మీర్ ప్రజల నుండి ప్రతిఘటన రోజురోజుకు తీవ్రమవుతోంది. ఈ పోరాటం కశ్మీర్ అంతటా దావానలంలా విస్తరించింది. దక్షిణ కశ్మీర్‌లో ఇవాళ నిరసనోద్యమం తీవ్రంగా ఉంది. గ్రామీణ ప్రాంతాలలో నిరసన ఉద్యమ కేంద్రాలు వెలిశాయి. దక్షిణ కశ్మీర్‌లో భద్రతాదళాలు జరిపిన కాల్పుల్లో అనేకమంది మిలిటెంట్లు చనిపోయారు. దీనితో పరిస్థితి మళ్లీ మొదటికివస్తోంది. ఇవాళ గ్రామీణ యువత వైఖరి ప్రభుత్వానికి ఎదురుతిరగడంగా మారింది. 2015 చివరి నుండి కశ్మీర్ గ్రామస్థులు భద్రతాబలగాలకు వ్యతిరేకంగా మిలిటెంట్ల రక్షణకు పూనుకోవడం ప్రారంభించారు. గ్రామస్థులలో వచ్చిన మార్పు ఢిల్లీ ప్రభుత్వం సరిగా గమనించినట్లు లేదు. కశ్మీర్‌లో గ్రామీణులు, ముఖ్యంగా యువకులు, ఇప్పుడు మిలిటెంట్లకు అనుకూలంగా మారారు.

2016 ఆగస్టు 22న కశ్మీర్ మాజీ ముఖ్యమంత్రి ఒమర్ అబ్దుల్లా నేతృత్వంలోని ప్రతినిధి బృందం ప్రధాని మోడీని కలుసుకున్నప్పుడు కశ్మీర్‌లో అశాంతికి స్వస్తి పలుకాలంటే చర్చలు జరపడం 'తప్పనిసరి' అని నిర్ద్వంద్వంగా చెప్పారు. 2016 అక్టోబర్‌లో లోయలో పర్యటించి వచ్చిన బిజెపికి చెందిన మాజీ విదేశాంగ మంత్రి, ఆర్థికమంత్రి యశ్వంత్‌సింగ్ చర్చలు జరుపాలని చేసిన సూచనను సైతం మోడీ నిరాకరించారు. శ్రీనగర్, అనంత్‌నాగ్ ఉప ఎన్నికలను వాయిదా వేయమని దీనంగా మెహబూబా ముఫ్తీ లేఖ రాసినా మోడీ పెడచెవిన పెట్టారు. కశ్మీర్ సమస్య కేవలం పాకిస్తాన్ ప్రేరేపితమనో లేక కశ్మీర్‌లోని భారతదేశ వ్యతిరేక శక్తుల ప్రోత్సాహమనో కొట్టిపారేస్తే వారిని శాంతింపచేసే చర్యలపై సరైన నిర్ణయాలకు రావటం సాధ్యం కాదు.

శ్రీనగర్ ఉప ఎన్నిక సందర్భంగా ఏప్రిల్ 8న జరిగిన నరమేధం తరువాత మెహబూబా ఢిల్లీకి వచ్చి... కశ్మీర్ మరొక తిరుగుబాటులోకి దిగజారిపోయేలోగా ప్రభుత్వం చర్చలు జరపవలసి ఉంటుందని మోడీ, రాజ్‌నాథ్ సింగ్‌లు ఇద్దరినీ కోరింది. 'వేర్పాటువాదుల'తో ఎలాంటి చర్చలూ జరిపేది లేదని ఇద్దరూ తేగేసి చెప్పారు. ముఫ్తీ ప్రతిపాదనను మోడీ ఎందుకు తోసి పుచ్చారు? ఇక చివరగా, కశ్మీర్ సమస్యపై బహుముఖ చర్చలకు ఏర్పాటు చేస్తామని టర్కీ అధ్యక్షుడు ఎర్డోగాన్ ప్రతిపాదిస్తే .... మొరటుగా అది ద్వైపాక్షిక సమస్య మాత్రమేనని మోడీ నొక్కి చెప్పాడు. కశ్మీరీల ఆజాదీ కోరికను పాశవిక బలప్రయోగంతో అణిచిపారేయడమే తప్ప కశ్మీరీలకు నచ్చజెప్పగలిగే కృషికి మోడీ ఏమాత్రం ప్రయత్నం చేయలేదు. దీంతో ఆయనకు ఆ ఉద్దేశమే లేదనేది స్పష్టంగా కనిపించే వాస్తవం.

---

నాయకులే నిర్ణాయక శక్తులుగా ఉంటారనే ఆ పాలకవర్గ దృక్పథం వల్లనే ప్రజా ఉద్యమ కదలికల విషయంలో కూడ నాయకుల వైపు చూపడం, కొందరి పేర్లు బైటపెట్టి వారికి "వ్యూహ రచనలో నిపుణుడు" వంటి విశేషణాలు చేర్చి ప్రచారం చేయడం భవిష్యత్ హత్యాకాండకూ, ఉద్దేశపూర్వకంగా వారిని వేటాడడానికీ రంగం సిద్ధం చేసుకోవడం మాత్రమే. ఈ ఘటనలో మూడు నాలుగు వందల మంది పాల్గొన్నారని, అందులో 70 శాతం మహిళలేనని, ఈ దాడికి ఎంత విస్తృత ప్రాతిపదిక, భాగస్వామ్యం ఉన్నాయో చెప్పకనే చెపుతున్నారు. అదే నోటితోనే ఈ దాడికి కారణం దండకారణ్య కార్యదర్శి రామన్న అని, వ్యూహ రచనలో నిపుణుడైన సీతూ అని, స్థానికుడూ, ప్రాంతం మీద పట్టు ఉన్నవాడూ అయిన హిద్మా అని ప్రచారం సాగిస్తున్నారు.

మొత్తం మీద సుక్మా దాడినీ, తదనంతర పరిణామాలనూ జాగ్రత్తగా పరిశీలిస్తే విప్లవోద్యమపు విస్తృతీ, శక్తీ, ప్రజల్లో స్థైర్యాన్ని పెంచగల వ్యూహమూ ఒకవైపు, పాలకవర్గాల బెదురూ, మేకపోతు గాంభీర్యమూ, ప్రగల్భాలూ మరొకవైపు స్పష్టంగా కనబడుతున్నాయి. పాలకవర్గాల వైపు నుంచి గతంలో కన్న ఎక్కువగా ఈ పరిణామాలు, ప్రతిస్పందనలు కనబడడానికి కారణాలు అనేకం ఉండవచ్చు. కేంద్రంలోనూ, ఈ ఘటన జరిగిన రాష్ట్రంలోనూ భారతీయ జనతా పార్టీ అధికారంలో ఉండడం ఒక కారణం కావచ్చు. గత నాలుగైదు సంవత్సరాలుగా మావోయిస్టు విప్లవోద్యమం బలహీనపడుతున్నదని తామే పదేపదే ప్రకటిస్తున్న నేపథ్యంలో ఇంత పెద్ద ఎత్తున దాడి జరగడం మరొక కారణం కావచ్చు. మావోయిస్టు విప్లవోద్యమాన్ని, ఆదివాసులూ ప్రజలూ జరుపుతున్న అనేక ఉద్యమాలనూ సమర్థిస్తున్న మధ్యతరగతిని భయపెట్టి ప్రజా ఉద్యమాల నుంచి దూరం చేయడానికి రాజ్యం ప్రయత్నిస్తున్న వాతావరణంలో జరిగిన ఘటనగా సుక్మా ఘటనకు ప్రాధాన్యత పెరిగి ఉండవచ్చు. దండకారణ్య విప్లవోద్యమాన్ని అణచివేయడానికి పోలీసు, అర్ధసైనిక బలగాలు సరిపోవనీ, సైన్యాన్ని దించవలసిందేననీ కొంతకాలంగా వాదిస్తున్న యుద్ధోన్మాదులకు తమ వాదనను మరింత బలంగా వినిపించడానికి ఇది ఒక అవకాశంగా కనబడుతుండవచ్చు. ఏది ఏమైనా సుక్మా దాడి భారత విప్లవోద్యమ చరిత్రలో, పాలకవర్గాల ప్రతిస్పందన చరిత్రలో కూడ కీలకఘట్టంగా చెప్పుకోవాలి.

*(రచయిత పాత్రికేయులు)*

వీ

కశ్మీర్ పట్ల కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న వైఖరి ఆందోళనకరంగా మారుతోంది. కంచే చేను మేసిన చందంగా సొంత ప్రజలనే శత్రువును చూసినట్లు చూస్తూ 'రాళ్లకు పెల్లెట్ల'తో బదులిస్తూ భద్రతా దళాలు అనుసరిస్తున్న తీవ్ర అణచివేత చర్యలను అంతర్జాతీయ సమాజంతో పాటు మన పరమోన్నత న్యాయస్థానం కూడా తప్పు పడుతుండడం గమనార్హం. స్వతంత్రతకు, సొంత గుర్తింపునకు అధిక ప్రాధాన్యతనిచ్చే కశ్మీరీలు తమపై ఎవ్వరి ఆధిపత్యాన్నీ సహించరు. అలాంటి సున్నితమైన మనోభావాలున్న కశ్మీరీలపై అణిచివేత చర్యలకు దిగడమంటే సొంత కన్నును పొడుచుకోవడమే తప్ప మరోటి కాదు. కశ్మీరీ ప్రజల్లో విశ్వసనీయతను పాదుకొల్పి భారతదేశాన్ని అసలైన సొంత దేశంగా వారు భావించి బతకాల్సిన పరిస్థితులు కల్పించాల్సిన కేంద్ర ప్రభుత్వం ఆ పని చేయకుండా మతతత్వ పోకడలతో అనాలోచిత నిర్ణయాలు తీసుకోవడం నిస్సారమైన ఆలోచన.

నిత్యం హింసాత్మక ఘటనలతో విద్యకు దూరమవుతున్న అక్కడి యువతరం వేర్పాటువాద శక్తులను దగ్గరవుతుండడం, మిలిటెంట్లను అదుపు చేయటం అనే సాకుతో అనాలోచిత, హేతురహిత, ఉన్మాదపూరిత కార్యక్రమాన్ని కేంద్రం మళ్లీ మొదలుపెట్టింది. ఒకరివెంట ఒకరుగా మిలిటెంట్లను 'గాదెలో ఎలకల'ను ఏరివేసినట్లు ఏరివేస్తామని హెచ్చరికలు చేస్తోంది. మూడు మాసాలుగా ఒక గ్రామంలోకి మిలిటెంట్ వచ్చాడన్న సమాచారం అందగానే భద్రతాదళాలు చుట్టుముట్టి పట్టుకోవడం సాధ్యం కాకపోతే మట్టుబెడుతున్నాయి. అలా చాలా మంది మిలిటెంట్లు ఇటీవలికాలంలో భద్రతా బలగాల కాల్పుల్లో మరణించారు. ఈ నేపథ్యంలో తీవ్రవాద వర్గాల్లో ప్రభుత్వం తమతో శాంతికి సిద్దంగా లేదనే అభిప్రాయం బలపడింది. పోరాటంలో మరణించడమే ఉత్తమ మార్గమనే నిర్ణయానికి కూడా వారిని కేంద్ర ప్రభుత్వ విధానమే పురిగొల్పింది.

గత నాలుగు మాసాలుగా కశ్మీర్‌లో కర్ఫ్యూ కొనసాగుతుంది. ప్రజల రోజువారీ జీవితాలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. పర్యాటకుల స్వర్గధామమైన కశ్మీర్ నిరసనలతో అట్టుడుకుతున్నది. ప్రభుత్వంపై అక్కడి యువతలో ఆగ్రహం కట్టలు తెంచుకుంటున్నది. కశ్మీరీలు లిఖిస్తున్న నిరసన సంతకాలు దేనికి సంకేతమన్న ఆలోచనలు ఆందోళన రేకెత్తిస్తున్నాయి. బుర్హాన్ వనీ ఎన్‌కౌంటర్‌ను నిరసిస్తూ శ్రీనగర్ ఎంపి థారీక్ హమీద్ కర్ర (పిడిపి) సెప్టెంబర్ 2016లో రాజీనామా చేయడంతో ఏర్పడిన ఖాళీకి ఇటీవల ఏప్రిల్ 9న జరిగిన శ్రీనగర్ ఉప ఎన్నికల్లో ఓటింగ్ శాతం అత్యంత దారుణంగా ఎన్నడూ లేనంతగా 7 శాతానికి పడిపోవడమూ రీ పోలింగ్ జరిగిన కేంద్రాలలో 2 శాతం ఓటింగ్ జరగడం ఎన్నికలపట్ల కశ్మీరీల నిరాసక్తతకు నిలువెత్తు నిదర్శనం. శ్రీనగర్ పార్లమెంట్ పరిధిలో మొత్తం 12 లక్షల ఓటర్లు ఉండగా కేవలం 80 వేల మంది మాత్రమే ఓటు వేశారు. మాజీ ముఖ్యమంత్రి ఫారుఖ్ అబ్దుల్లా 58 వేల ఓట్లు, అంటే 5 శాతం ఓట్లు పొంది ఎం.పి అయ్యారు.

ఇవాళ కశ్మీర్ యువత రోడ్లపై తమ నిరసనను పలు రూపాల్లో వ్యక్తపరుస్తున్నారు. భద్రతా దళాలు యువతను వేధిస్తున్న తీరుపై సోషల్ మీడియా వేదికగా కశ్మీర్ యువత మండిపడుతున్నది. సామాజిక మాధ్యమాల్లో కశ్మీరీ యువత భారత వ్యతిరేక పోస్టులను పెట్టేవరకూ పరిస్థితి దిగజారింది. ఇవాళ కశ్మీర్ ప్రజల్లో పిడిపి–నేషనల్ కాన్ఫరెన్స్ పార్టీల పట్ల విశ్వాసం లేదు. కశ్మీర్‌లో ప్రతి 18 మందికి ఒక సైనికుడు ఉన్నాడు. పాలక పిడిపి-బిజెపి ప్రభుత్వం అనుసరిస్తున్న అణిచివేత విధానాలకు వ్యతిరేకంగా కశ్మీరీల నిరసన వీధి పోరాటాలకు పాకింది. చివరికి స్కూల్ విద్యార్థినులు సైతం భద్రతా దళాలపై రాళ్లు రువ్వడం, పోలీస్ వాహనాలపై దాడులకు పాల్పడటం వంటి చర్యలకు పాల్పడుతున్నారు. పాఠశాల విద్యార్థినులు ఆందోళనల్లో పాల్గొనడం బుర్హాన్ వనీ హత్య తర్వాత బహుశ ఇదే మొట్టమొదటిసారి.

ఏప్రిల్ 9న శ్రీనగర్ ఉప ఎన్నిక రోజున రాళ్లు విసిరేవారి నుంచి రక్షణ కవచంగా ఒక సైనిక వాహనానికి కశ్మీర్ పౌరుడిని కట్టివేయడానికి నిరసనగా పుల్వామా జిల్లాలోని డిగ్రీ కాలేజీలో జరిగిన నిరసన ప్రదర్శన పైన పోలీసులు, పారా మిలిటరీ బలగాలు జరిపిన కాల్పుల్లో 60 మంది విద్యార్థులు గాయపడ్డారు. రాళ్లు విసిరే యువకులను దేశ ద్రోహులుగా పేర్కొంటూ బిజెపి పరిశ్రమ మంత్రి చంద్ర ప్రకాశ్ గంగా చేసిన వ్యాఖ్య కశ్మీరీలకు కోపం తెప్పించింది. ఆ యువకులను కొట్టి, వారిపై కాల్పులు జరపాలని కూడా మంత్రి చేసిన వ్యాఖ్యతో ప్రజల్లో వ్యతిరేకత పెరిగింది. ఈ అర్థంలేని వ్యాఖ్యలు సమర్ధనీయం కాకపోగా అత్యంత ప్రమాదకరమైనవని పిడిపి ఉపాధ్యక్షుడు సరాజ్ మద్ని విమర్శించారు. దేశంలో ఒక రాజకీయ పార్టీ ప్రయోజనాల కోసం కశ్మీరీలపై యుద్ధ ప్రకటన జరిగిందని సీనియర్ పిడిపి మంత్రి అల్తాఫ్ బుకారీ ఆందోళన వ్యక్తం చేసారు.

బిజెపి ప్రధాన కార్యదర్శి రామ్ మాధవ్ నిస్సిగ్గుగా ఎన్నికల సమయంలో సైన్యం పౌరులను రక్షణ కవచాలుగా వాడడాన్ని సమర్థించారు. అంతటితో ఆగకుండా 'ప్రేమలో, యుద్ధంలో ఏదైనా సవ్యమే' అని కూడా మాధవ్ అన్నారు. దీనిపై పిడిపి మంత్రి అల్తాఫ్ బుకారీ ప్రతిస్పందిస్తూ చట్ట ప్రకారం సమర్ధనీయం కాని దానిని మాధవ్ సమర్థిస్తున్నారు. దేశంలో నెలకొన్న మితిమీరిన జాతీయవాద ధోరణులకు ఆ ప్రకటనలు నిదర్శనం. దురదృష్టవశాత్తూ కశ్మీర్‌లో మానవ హక్కులను ఏమాత్రం సమర్థించినా జాతి వ్యతిరేకులు అనే ముద్రను మితవాదులు వేస్తున్నారు. ఏ నాగరిక మానవ సమాజంలోనూ మనుషులను దాడుల నుంచి రక్షణకు కవచంగా వాడడాన్ని సమర్థించరని ఆయన అన్నారు. మొదటి నుంచి కశ్మీరీ ప్రజలను కుట్రదారులుగా, ఉగ్రవాదానికి మద్దతుదారులుగా అభివర్ణించడం బిజెపి ఒక పనిగా పెట్టుకుంది.

డాక్టర్ జితేంద్రసింగ్, కేంద్ర మంత్రి మాట్లాడుతూ "జమ్మూ-కశ్మీర్ విషయంలో స్వయం ప్రతిపత్తికి మూలమైన ఆర్టికల్ 370 గురించి కేంద్రం పునరాలోచిస్తున్నది" అని అన్నారు. స్వయం ప్రతిపత్తిని కల్పిస్తున్న ఆర్టికల్ 370ని రద్దు చేసే వ్యూహాలను తెరపైకి తేవడం, కశ్మీరీ యువతపై వేర్పాటువాద ముద్ర వేయడం వంటి చర్యలు పరిస్థితిని మరింతగా దిగజార్చేలా చేసింది. ఈ చర్యలతో కశ్మీరులుంచిన విశ్వాసంపై నీళ్లు కుమ్మరించడంతో వారిలో తిరిగి అనుమాన బీజాలు రేకేత్తాయి. ఈ సందర్భంగా ఒమర్ అబ్దుల్లా, జమ్మూ-కశ్మీర్ మాజీ ముఖ్యమంత్రి మాట్లాడుతూ "జితేంద్రసింగ్ బాధ్యతారాహిత్యంగా మాట్లాడుతున్నారు. ఆర్టికల్- 370ని తొలగిస్తామని చెప్పడం అక్కడి పరిస్థితిని మరింత దిగజారుస్తుంది. భారత్, కశ్మీరీల మధ్య ఉన్న లంకె ఆర్టికల్-370 మాత్రమే. దాన్నే తొలగిస్తే భారత్‌కు జమ్మూ-కశ్మీర్‌తో ఉన్న బంధం తెగిపోతుంది" అన్నారు.

విద్యార్థినులు అగ్రభాగాన ఉండి భద్రతా దళాల చర్యలకు నిరసన తెలపడంతో చెలరేగిన ఘర్షణల్లో ఓ బాలిక తీవ్రంగా గాయపడడంతో

మరోసారి భారీ స్థాయిలో పుల్వామాలో బాలికలు విజృంభించారు. స్టన్ గ్రెనేడ్లు, పావా తూటాలు, బాష్పవాయులు గుండ్లు వీరిని ఆపలేకపోయాయి. విద్యార్థినులు దాదాపు మూడు గంటలకుపైగా ఆందోళన చేశారు. బాష్పవాయువు తూటాలను సైతం లెక్కచేయకుండా కశ్మీరీ విధ్యార్థినులు తమ ఉగ్రరూపాన్ని ప్రదర్శించారు. తమ రాష్ట్రానికి అన్యాయం జరుగుతుంటే చూస్తూ ఊరుకునేది లేదని హెచ్చరించారు. రాళ్లు చేతబట్టి ఖాకీలకు ముచ్చెమటలు పట్టించారు. వారి వాహనాలను రాళ్లతో కొట్టారు. హిజాబ్‌లో ఉండే బాలికలు రోడ్లపైకి వస్తే పరిస్థితి ఎలా ఉంటుందో పోలీసులకు రుచి చూపించారు. వారి పెట్రోలింగ్ వాహనాన్ని వెంబడించి మరీ తరిమిగొట్టారు.

ఈ నేపథ్యంలో జమ్మూ, కశ్మీర్‌లో ఇంటర్‌నెట్ సేవలను నిలిపివేస్తున్నట్టు ఆ రాష్ట్ర ప్రభుత్వం ఆదేశాలిచ్చింది. ఒక నెల వరకు లేదా తదుపరి ఆదేశాలిచ్చే వరకు ఈ సేవల నిలిపివేత కొనసాగుతుందని అధికారులు తెలిపారు. టెలిగ్రాఫ్ చట్టం, ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ చట్టం కింద హోంశాఖ తన అధికారాలను వినియోగించుకుని ఇంటర్‌నెట్ సేవలను నిలిపివేసినట్టు అధికారులు తెలిపారు. భద్రతాదళాలు విద్యార్థులపై చేసిన అమానుష దాడులు, వాటికి సంబంధించిన ఘటనలు సామాజిక మాధ్యమంలో ప్రచారం అవుతున్నాయి. కశ్మీరీలో నెలరోజులపాటు సామాజిక మాధ్యమాలను నిషేధించడం వెనక అసలు ఉద్దేశం నిరసనకారులు ఒకరిని ఒకరు సంప్రదించుకోకుండా, ఏకం కాకుండా నివారించడానికే నన్నది స్పష్టం. ప్రజాందోళనలు, భద్రతా దళాల అఘాయిత్యాలు వీడియోల ద్వారా ప్రచారంలోకి రాకుండా నిషేదించి, సైన్యం పోలీసులు బాహాటంగా ఉల్లంఘించిన మానవ హక్కులకు సాక్ష్యాధారాలు దొరకకుండా జాగ్రత్త పడడానికేనన్నది ప్రభుత్వం వ్యూహంగా కన్పిస్తుంది.

ఇప్పటికే ఒక తరం కశ్మీరీలు క్షమార్హం కాని సెన్సార్షిప్, దౌర్జన్యం కొనసాగిన పరిస్థితుల్లోనే జీవించారు. తాజాగా సామాజిక మాధ్యమాల మీద నిషేధం విధించడంలో ప్రభుత్వ ఉద్దేశం కశ్మీరీలు భారత రాజ్య వ్యవస్థను ఎలా పరిగణిస్తున్నారో బయటి ప్రపంచానికి తెలియకుండా చేయడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేస్తున్న కుట్రలో భాగమని గుర్తించాలి. శాంతి భద్రతల పరిరక్షణ నెపంతో కశ్మీర్‌లో సైన్యాన్ని వినియోగించినట్టుగానే సామాజిక మాధ్యమాలను కూడా నిషేధించారు. ఇది మాట్లాడే హక్కు లేకుండా చేయడమే. ఇది కశ్మీరీలకు అభ్యంతరకరమైన, ఉద్రేక పూరితమైన సమాచారం బయటి ప్రపంచానికి అందకుండా చేయడానికి ఉద్దేశించిందే. నిరసనకారులు రాళ్లు విసరడానికి సంబంధించిన, నిరసనలకు సంబంధించిన వీడియోలు 'సంఘ వ్యతిరేకం' అయినవి కావని అవి నిజానికి రాజ్య వ్యవస్థకు వ్యతిరేకమైనవన్న వాస్తవాన్ని ప్రభుత్వం కావాలనే విస్మరిస్తోంది.

'రోజురోజుకూ కశ్మీరీ ప్రజల జీవితాలు దుర్భరమవుతున్నాయి. వేలాది మంది మహిళలు సైనిక అత్యాచారాలకు బలయ్యారు. వందలాది మంది యువకులు మిస్సింగ్ అయ్యారు. అనేకమంది ప్రాణాలు కోల్పోతున్నారు. రెండు దశాబ్దాలుగా నిర్బంధం నీడలో జీవిస్తున్నామని ప్రజలు భావిస్తున్నారు. ఇంత జరుగుతుంటే చూస్తూ ఎలా ఊరుకోగలం? కశ్మీర్ సమస్యను శాశ్వతంగా పరిష్కరించే నిర్ణయాత్మక దశకు సమయం ఆసన్నమైంది' అని కోఠిబాగ్ స్కూల్‌లో 12వ తరగతి విద్యార్థిని ఉద్రేకంగా మాట్లాడటం అక్కడి ప్రజల ఆక్రోశానికి ఒక వ్యక్తీకరణ మాత్రమే. కశ్మీర్ సమస్య కశ్మీర్ జాతి రాజకీయ సమస్య–దాని పరిష్కారానికి రాజకీయ చొరవలు అత్యావశ్యకం. భారత్–పాకిస్థాన్‌ల మధ్య ఉద్రిక్తోపశమనం, విశ్వాసకల్పన చర్యలు కశ్మీర్‌లోయ రాజకీయ వాతావరణాన్ని చల్లబరుస్తాయి. మోడీ ప్రభుత్వం తన స్వీయ రాజకీయ ప్రయోజనాలకు పాకిస్థాన్‌తో వైరం పెంచుకోవటం దేశ ప్రయోజనాలకు, కశ్మీర్ ప్రయోజనాలకు భంగం కలిగిస్తుంది.

ప్రభుత్వంలో పరస్పర విరుద్ధ సిద్ధాంతాలు కలిగిన పిడిపి–బిజెపి భాగస్వాములు కావడం కశ్మీరీ యువతను గందరగోళపరుస్తున్నది. గత రెండేళ్లుగా అధికారంలో ఉన్న బిజెపి–పిడిపి సంకీర్ణ కూటమి ప్రభుత్వం ఎన్నికల సమయంలో ప్రకటించినట్లు యువతకు ఉపాధి, అభివృద్ధికి చర్యలు, కశ్మీర్ సమస్య పరిష్కారానికి చర్చలు జరుపుతామన్న హామీలు నిలబెట్టుకోలేకపోవడం, వీటికి తోడు దేశంలోని ఇతర ప్రాంతాల్లో గోరక్షణ పేరిట ముస్లింలపై బిజెపి, దాని అనుబంధ సంస్థలు దాడులు చేయడమూ కశ్మీర్ యువతలో ఆగ్రహానికి కారణమవుతున్నది. కేంద్రంలోని మోడీ ప్రభుత్వం కశ్మీరీ పండితులకు, సాయుధ బలగాలలో పనిచేసి పదవి విరమణ చేసిన కశ్మీరేతరులకు దక్షిణ కశ్మీర్‌లో నూతనంగా కాలనీల నిర్మాణం చేపట్టింది. ఈ ప్రక్రియ కశ్మీరీలలో మరింత అభద్రతను పెంచుతుంది. ఇచ్చిన హామీలు అమలు చేయకుండా, చర్చలు జరిపి శాంతి నెలకొల్పకుండా, కశ్మీరీ సమస్యను శాంతిభద్రతల సమస్యగా పరిగణించి సాయుధ బలగాలతో అణచివేయడానికి పూనుకోవడంతో కశ్మీరీల్లో అసమ్మతి తీవ్రత పెరుగుతోంది.

కశ్మీర్ లోయలో మోడీ 10 కి.మీ. భూసొరంగాన్ని ప్రారంభించడానికి వెళ్లినప్పుడు ప్రసంగిస్తూ 'కశ్మీరీలు టూరిజం కావాలో, టెర్రరిజం కావాలో' తేల్చుకోవాలని చేసిన సూచనపై కశ్మీరీ యువత మండిపడుతున్నది. తమ సుదీర్ఘ పోరాటాన్ని ప్రధాని మోడీ వక్రీకరించారనే ఆందోళన వారిలో వ్యక్తమవుతున్నది. మరోవైపు కశ్మీర్ యువతలో పెచ్చుమీరిన మతపరమైన తిరుగుబాటుపై సైన్యం ఆందోళన చెందుతున్నది. ఉగ్రవాదులకు ప్రజల తోడ్పాటు, మతపరమైన అలజడులు పెరగడం మంచిదికాదని కశ్మీర్‌లో ఉన్నత సైనికాధికారి లెఫ్టినెంట్ జనరల్ జెఎస్ సాధు ఆందోళన వ్యక్తం చేశారు. వీధుల్లో రాళ్లు రువ్వే ఆందోళనకారుల కంటే మతపరమైన తిరుగుబాటు ప్రమాదకరమని ఆయన అన్నారు. నిజానికి మోడీ అధికారంలోకి వచ్చాక కశ్మీర్‌ను రాజకీయ సమస్యగా కాక కేవలం భద్రతా సమస్యగా చూడడం ఆరంభమైంది. స్థానికులను కుట్రదారులుగా, ఉగ్రవాదానికి తోడ్పాటు దారులుగా అభివర్ణించడమే జరుగుతున్నది.

కశ్మీర్‌లో ప్రస్తుత పరిణామాలను విశ్లేషిస్తూ నేషనల్ కాన్ఫరెన్స్ నేత మాజీ సిఎం ఫరూక్ అబ్దుల్లా సంచలన వ్యాఖ్యలు చేశారు. ప్రభుత్వం అప్రమత్తమై చర్చలకు చొరవ చూపని పక్షంలో భారత్ కశ్మీర్‌ను కోల్పోయే ప్రమాదం ఉందని హెచ్చరించారు. కశ్మీర్ అంశంలో పాకిస్తాన్‌తో పాటు వేర్పాటువాదులు, ఇతర గ్రూపులు, రాజకీయ పార్టీలు, మైనారిటీ హిందువులతో భారత్ చర్చలు ప్రారంభించాలని కోరారు. సమస్యకు పరిష్కారం సైనిక తరహాలో కాకుండా రాజకీయ పరిష్కారానికి చొరవ చూపాలని సూచించారు. కశ్మీర్‌లో అయిదు లక్షలకు పైగా భద్రతా బలగాలున్న క్రమంలో భూభాగాన్ని భారత్ కోల్పోయే ప్రమాదం లేకున్నా భావోద్వేగాల పరంగా, మానసికంగా కశ్మీర్ భారత్‌కు వేగంగా దూరమవుతున్న సంకేతాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

కశ్మీర్ స్వయం నిర్ణయాధికారానికీ, ప్రజాభిప్రాయ సేకరణకి

1950లోనే నెహ్రూ ప్రభుత్వం హామీ పడింది. ఏడు దశాబ్దాలుగా బుల్లెట్ నీడలో ఎన్నికలు జరుగుతూనే ఉన్నాయి. మూడు దశాబ్దాలుగా సైనిక నియంత్రణలో ప్రజలు మగ్గుతున్నారు. కేంద్రం అణచివేత, దౌర్జన్యం, హింస రచన రీత్యా భారతసైన్యం విదేశాల మీద దాడి చేసినట్లు కశ్మీరీలపై వ్యవహరిస్తుంది. మన పాలకులు ప్రజలను పాలితులుగా తప్ప పౌరులుగా చూడడం లేదు. స్వీయ అనందంలో మన పాలుకులు మునిగిపోతున్నారు. ఉపద్రవాలు ముంచుకొస్తున్న తమ పరిస్థితి సజావుగా (అధికారం, ఆదాయం) ఉంటే చాలు అనుకుంటున్నారు. అయినా మనది ప్రపంచం లోనే అతి పెద్ద ప్రజాస్వామ్యమని మన పాలకులు బీరాలు పలుకుతున్నా, ఇప్పటికీ జాతుల, తెగల సమస్యలు పరిష్కారం కాలేదు.

1947 నుండి ఇలాగే కశ్మీర్ ఏదో ఒకరకంగా రక్తమయ చరిత్రతో నిండి ఉంది. కశ్మీర్ యువతలో 60 శాతం వరకు 30 ఏళ్ల వయస్సులోపు వాళ్లే. వాళ్ల మనోభావాలను ఏ రాజకీయ పార్టీ అర్థం చేసుకొని పరిష్కరించకపోవడం చాల అప్రజాస్వామికం, అన్యాయం. జమ్మూ-కశ్మీర్ సమాజంలో శాంతి, సామరస్యాన్ని నెలకొల్పేందుకు తీసుకోవలసిన చర్యలపై అధ్యయనం చేసి సూచనలు ఇచ్చేందుకు యుపిఏ ప్రభుత్వం 2010 అక్టోబర్‌లో దిలీప్ పడగావ్‌కర్ కమిటీని నియమించింది. ఏడాది తర్వాత ఈ కమిటీ అప్పటి కేంద్ర హోంశాఖ మంత్రి పి. చిదంబరానికి నివేదిక అందజేసింది. ఈ నివేదిక 1952 ఒప్పందం తర్వాత జమ్మూ-కశ్మీర్ రాష్ట్రానికి వర్తింపజేసిన కేంద్ర చట్టాలన్నింటినీ సమీక్షించడానికి రాజ్యాంగ నిపుణులతో ఒక రాజ్యాంగ కమిటీని ఏర్పాటు చేయాలని సూచించింది. అలాగే జమ్మూ-కశ్మీర్ రాష్ట్రానికి వర్తించే ఆర్టికల్ 370లో 'తాత్కాలికంగా' అనే పదాన్ని తొలగించి 'దాన్ని శాశ్వతం' గా వర్తింపజేసే విధంగా చర్యలు తీసుకోవాలని ప్రతిపాదన చేసింది.

గత ప్రధానుల వైఖరికీ, ప్రస్తుత ప్రధాని మోడీ వైఖరికి తేడా ఉంది. భారత్ నుంచి కశ్మీర్ విడిపోవడం తప్ప, మిగతా అంశాలపై కశ్మీర్‌లోని అన్ని వర్గాలతోని చర్చలకు సిద్ధమన్నది పి.వి. నర్సింహారావు, వాజ్‌పేయిల వైఖరీ. అందుకు భిన్నంగా మోడీ వైఖరీ ఉంది. వేర్పాటు వాదులతో చర్చించే ప్రసక్తేలేదని మోడీ అంటున్నారు. చర్చలు ప్రత్యర్థులతో కానప్పుడు సమస్య పరిష్కారం ఏలా సాధ్యమవుతుంది? కశ్మీర్‌పై పాకిస్థాన్‌తో చర్చలు ఉండనే ఉండవని, పాకిస్థాన్ ఆధీనంలో(పిఓకె) గల కశ్మీర్ భాగాన్ని 'విముక్తం' చేయడం తమ ముందున్న అజెండా ఒక్కటేనని కూడ ప్రభుత్వ వర్గాలు పదేపదే ఉటంకిస్తున్నాయి. అంటే పాకిస్థాన్‌తో యుద్ధానికి సన్నద్ధం అవుతున్న సంకేతాలు కన్పిస్తున్నాయి. అశ్చర్యకరమైన విషయమేమంటే కశ్మీర్ ప్రజల మనోభావాలను, వారి హక్కులను గుర్తించ నిరాకరించడమే విషాదం.

కశ్మీర్ లోయలో సుదీర్ఘ ప్రశాంతత తర్వాత 1989లో ఘర్షణలు ఆరంభమయ్యాయి. అయితే, ఇప్పుడు ఘర్షణల నేపథ్యం వేరుగా ఉంది. 28 ఏళ్లుగా ఎడతెరిపిలేని హింసాకాండ, అణచివేత, మానవ హక్కుల ఉల్లంఘన కొనసాగుతున్నది. ఇప్పటిదాకా ఇతర భారతీయులు అనుభవిస్తున్న స్వేచ్ఛలు తమకు కూడా కావాలని కశ్మీరీలు కోరుకునేవారు. అయితే, ఇప్పుడు భారత ప్రజాస్వామ్యంపై, భారత పాలకులపై కశ్మీరీలకు నమ్మకం సన్నగిల్లింది. భారత ప్రభుత్వాన్ని భారత రాజ్యాంగాన్ని కశ్మీరీలు విశ్వసించడం లేదు. కశ్మీర్ లోయ నిరంతరం రగులుతూ ఉండడం భారత్‌కు ఏ మాత్రం క్షేమకరం కాదు. భౌగోళికంగా ఇరుగు పొరుగు పరిస్థితి ఆందోళనకరంగా ఉన్నది. అఫ్ఘనిస్థాన్ పరిణామాలు ఏ మలుపు తిరుగుతాయో తెలువడం లేదు. పాకిస్థాన్‌లో ప్రజా ప్రభుత్వం ఎంత కాలం ఉండేది చెప్పలేని పరిస్థితి. పాక్ ప్రధాని నవాజ్ షరీఫ్ పరిస్థితి కత్తిమీద సాము చేస్తున్నట్టుగా మారింది. భారత్-చైనా వైషమ్యం పెరిగిపోతున్నది. చైనా పాక్ ఎకనమిక్ కారిడార్ నిర్మితమవుతున్నది. ఈ నేపథ్యంలో కేంద్రంలోని ఎన్‌డిఏ ప్రభుత్వం ఈ విపత్కర పరిణామాలను గ్రహించి, కశ్మీర్‌లో ప్రశాంతత నెలకొల్పడానికి రాజకీయ పరిష్కారం చూపాలి.

పిడిపితో కూటమికి సంబంధించిన ఎజెండాలో తాము చేసిన ఏ ఒక్క వాగ్దానాన్ని నిలబెట్టుకోలేకపోయింది. పైగా గత మూడేళ్ల మోడీ ప్రభుత్వ పాలనలో మొరటుతనం, మతతత్వవాదం ప్రబలింది. ఇవి రెండూ కలసి మోడీ ప్రభుత్వానికి అణచివేత తప్ప మరే పద్ధతిని ప్రయోగించే ఉద్దేశమే లేదనే నమ్మకాన్ని మరింతగా బలోపేతం చేశాయి. మోడీపై కశ్మీరీలో ఏ ఒక్కరికీ ఏ కొద్ది మాత్రమూ నమ్మకం లేదనేది నగ్న సత్యం. కశ్మీర్‌లో అలజడి వాతావరణం, ఘర్షణల నేపథ్యంలో ముఖ్యమంత్రి మెహబూబా ముఫ్తీ మరోసారి చర్చల ప్రతిపాదనను ముందుకు తెచ్చారు. తీవ్రవాదదాడులు హింస కొనసాగినంత కాలం వేర్పాటు వాదులు ఇతర గ్రూపులతో చర్చలు జరపలేమని ప్రధాని నరేంద్ర మోడీ హోంమంత్రి రాజ్‌నాథ్ సింగ్ తేల్చి చెప్పారు.

సంఘ్‌పరివార్ సీనియర్ నేత ప్రవీణ్ తొగాడియా కశ్మీర్‌లో 'కార్పెట్ బాంబింగ్' చేయాలని డిమాండ్ చేశారు. 'కార్పెట్ బాంబింగ్' చేయాలనడం అంతర్జాతీయ నియమాలు, యుద్ధ నైతికతల ప్రకారం అది ఒక భయంకరమైన, అమానుషమైన ఆలోచన. సాధారణంగా బాంబులు వేయడం ఆయా లక్షిత స్థావరాలపై, కేంద్రాలపై జరుగుతుంది. 'కార్పెట్ బాంబింగ్' అంటే విచక్షణ లేకుండా బాంబులు వేయడం. ఆ దాడి వల్ల సమస్త ప్రాణులు, నిర్మాణాలు, పంటలు సహా సమస్తం ధ్వంసమై పోతాయి. అంటే కశ్మీర్‌ను భస్మీపటలం చేయాలన్న ఫాసిస్టు దురాలోచన తప్ప మరోటి కాదు. మరోవైపు ఆర్ఎస్ఎస్ సాధువులతో రాళ్లు రువ్వే దళాలను సన్నద్ధం చేస్తుంది. అమెరికా వియత్నాంపై 'కార్పెట్ బాంబింగ్' చేసింది.

కశ్మీర్ విలీన ఒప్పందం, 1952 ఢిల్లీ ఒప్పందాల ప్రాతిపదికపై కశ్మీర్‌తో కేంద్ర ప్రభుత్వం చర్చలు ప్రారంభించాలి. కశ్మీర్ రక్షణ, విదేశాంగ విధానం, ఆర్థిక విధానం, సమాచార సంబంధాలు, మార్కెట్టు, విద్యావ్యవస్థలపై సాధికారత కశ్మీర్ ప్రభుత్వానికే ఉంటుందన్న ఒప్పందాలతోనే కశ్మీర్ భారత్‌లో విలీనమైంది. అయితే కేంద్ర ప్రభుత్వం పాలనాపరమైన శాసనాలతో లోయలో భద్రతా దళాల అణిచివేత కొనసాగుతుంది. అందువలన జమ్మూ-కశ్మీర్ ప్రజల నుంచి ఏమి లాగేసుకోకుండానే కశ్మీర్‌ను కశ్మీరీలకు మాత్రమే అప్పగించే కశ్మీర్ ప్రభుత్వాన్ని అందించగల వ్యవస్థ ఆ రాష్ట్రానికి అవసరం. దీన్ని కేవలం జమ్మూకశ్మీర్ ప్రజలు మాత్రమే పరిష్కరించుకోగలుగుతారు. కేంద్రం వెంటనే ఏకపక్ష కాల్పుల విరమణను ప్రకటించాలి. దాన్ని అనుసరించి జైళ్లలో ఉన్న వందలాది మంది రాళ్లురువ్వే వారుగా అరెస్టయిన యువకులను విడుదల చేసి, వారిపై ఉన్న కేసులను ఉపసంహరించుకోవాలి. తక్షణం కశ్మీర్‌లో శాంతి పునరుద్ధరణకు చర్యలు తీసుకోవాలి. ఒంటెత్తు నిర్ణయాలు కశ్మీర్ సమస్య పరిష్కారానికి తోడ్పడవని మోడీ ప్రభుత్వం గుర్తించాలి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# అసహనానికి చిహ్నం ధర్నా చౌక్ రద్దు

***దాదాపు రెండు దశాబ్దాలుగా రాష్ట్ర ప్రజల నిరసన గళాలకు వేదికగా ఉండిన ధర్నా చౌక్‌ను రద్దు చేయదలచిన తెలంగాణ ప్రభుత్వ నిర్ణయాన్నీ, పర్యవసానాలనూ చర్చిస్తున్నారు* రాజవరం పార్థసారథి**

ఫిబ్రవరి 22న నిరుద్యోగుల సమస్యలపై, తెలంగాణ ఏర్పడి మూడు సంవత్సరాలు కావస్తున్నా నియామకాల ప్రక్రియ సక్రమంగా సాగకపోవడంపై నిరుద్యోగుల పక్షాన తెలంగాణ జెఎసి సుందరయ్య విజ్ఞాన కేంద్రం నుంచి ఇందిరా పార్క్ వరకు ఊరేగింపును, ఇందిరా పార్క్ ముందరి ధర్నా చౌక్ లో నిరసన ప్రదర్శనను తలపెట్టింది. ఈ ఊరేగింపుకూ నిరసన ప్రదర్శనకూ పోలీసులు అనుమతి నిరాకరించారు. రాష్ట్ర వ్యాప్తంగా వందలాది మందిని అరెస్టు చేసి, చివరికి జెఎసి నాయకుడు ఎం కోదండరాం ఇంటి మీద అర్ధరాత్రి దాడి చేసి, తలుపులు పగులగొట్టి, ఆయనను, సహచరులను అరెస్టు చేశారు. ఇది పోలీసుల అత్యుత్సాహం అని కొందరు పోలీసుల మీదికి నెపం నెట్టబోయారు గాని, ప్రభుత్వ ఆదేశాల ప్రకారమే పోలీసులు ప్రవర్తించారని తర్వాతి పరిణామాలు రుజువు చేశాయి.

ఈ నిరసన ప్రదర్శన మీద ఉక్కుపాదం మోపిన రెండో రోజునే అసలు ధర్నా చౌక్‌నే ఇందిరాపార్క్ దగ్గరి నుంచి ఎత్తివేయాలని ప్రభుత్వం నిర్ణయించిందని, ఆ మేరకు పోలీసులకు ఆదేశాలు ఇచ్చిందని, మియాపూర్, ఉప్పల్, నాగోల్, రాజేంద్ర నగర్ లలో ధర్నా చౌక్ ఏర్పాటు చేయడానికి స్థలం అన్వేషించమని కూడ ఆదేశించిందని పత్రికలు రాశాయి. అప్పటి నుంచి ధర్నాచౌక్‌లో ఎవరు ఎంత చిన్న నిరసన ప్రదర్శన, శిబిరం వేసుకోవడానికైనా పోలీసులు అనుమతి నిరాకరించడం ప్రారంభించారు. సిపిఎం రాష్ట్ర కార్యదర్శి తమ్మినేని వీరభద్రం నాలుగు నెలల పాదయాత్ర ముగిసిన సందర్భంగా మార్చ్ 19న బహిరంగ సభకు లాల్ బహదూర్ స్టేడియం గాని, నిజాం కాలేజి మైదానం గాని అనుమతి కోరితే సరూర్‌నగర్ స్టేడియం అయితేనే అనుమతి ఇస్తామన్నారు. అలా ప్రభుత్వాన్ని విమర్శించే గళం ఏదీ నగరం నడిబొడ్డున వినబడగూడదని పాలకులు ఆదేశించారు.

ధర్నా చౌక్‌లో ఎప్పుడూ ఏదో ఒక శిబిరం ఉండడం, ప్రత్యేకంగా శాసనసభ సమావేశాల సమయంలో ఎన్నో శిబిరాలు ఉండడం అలవాటే. కాని ఈ సంవత్సరం మార్చ్ లో జరిగిన బడ్జెట్ సమావేశాల సందర్భంగా ధర్నా చౌక్‌లో ఒక్క శిబిరానికి కూడ పోలీసులు అనుమతించలేదు. ఈ నేపథ్యంలో ప్రతిపక్ష పార్టీలు, జెఎసి, ప్రజాసంఘాలు కలిసి ధర్నా చౌక్ పరిరక్షణ సమితి ఏర్పాటు చేసి, మరే బహిరంగ ప్రదేశంలోనూ అనుమతి ఇవ్వకపోవడంతో సిపిఐ కార్యాలయం మఖ్దూం భవన్ ఆవరణలో ఏప్రిల్ 15 నుంచి నెలరోజుల పాటు ప్రతి రోజూ ఒక్కొక్క ప్రజాసమూహం చొప్పున రిలే నిరాహార దీక్షలు జరిపారు. చివరికి మే 15న 'చలో ఇందిరా పార్క్' ధర్నా చౌక్ ముట్టడికి పిలుపునిచ్చారు.

ఈ చలో ఇందిరాపార్క్‌ను అడ్డుకోవడానికి ప్రభుత్వం చేసిన కుట్రలు, పన్నాగాలు చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఈ ప్రభుత్వం నడుపుతున్న తెలంగాణ రాష్ట్ర సమితి కూడ మూడు సంవత్సరాల కింది వరకూ అదే ధర్నాచౌక్‌ను వాడుకుందా అని అనుమానం కలుగుతుంది. ఇవాళ రాష్ట్ర ప్రభుత్వంలో ఉన్నవాళ్లలో ధర్నాచౌక్ ప్రదర్శనలలో పాల్గొననివారు, అక్కడ ప్రసంగించనివారు ఒక్కరు కూడ లేరంటే అతిశయోక్తి కాదు. కాని అదే ప్రభుత్వ పెద్దలు, ఇందిరాపార్క్ ధర్నాచౌక్ ట్రాఫిక్‌కు అంతరాయం కలిగిస్తున్నదని, స్థానిక ప్రజలు అభ్యంతరం చెపుతున్నారని, ఇందిరా పార్క్ వాకర్స్ అభ్యంతరం చెపుతున్నారని, అసలు తెరాస పాలనలో నిరసన ప్రదర్శనల అవసరమే లేదని అనేక సాకులు చూపుతూ ప్రజాభిప్రాయాన్ని తనకు అనుకూలంగా మార్చుకోవడానికి ప్రయత్నించారు. చలో ఇందిరాపార్క్ కార్యక్రమానికి విస్తృతమైన మద్దతు రావడం చూసి, పోలీసు నిర్బంధాన్ని, కుట్ర పద్ధతులను ఆశ్రయించి ఆ కార్యక్రమాన్ని అడ్డుకోవడానికి ప్రయత్నించారు. సరిగ్గా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రోజుల్లో అమలైన పద్ధతిలోనే పోలీసు జులుం, విపరీతమైన పోలీసుల మోహరింపు, ముళ్ల కంచెలు, లాఠీచార్జిలు, వీడియో చిత్రీకరణలు, సిద్ధంగా వాటర్ కానన్లు, బాష్పవాయు గోళాలు కొనసాగాయి.

మే 15 చలో ఇందిరాపార్క్ సందర్భంగా ప్రభుత్వం మరొక దుర్మార్గానికి కూడ పాల్పడింది. మే 14 వరకూ అనుమతి ఇవ్వకుండా, ఆంక్షలతో నిర్బంధాలతో తాత్సారం చేసిన పోలీసులు, చివరి నిమిషంలో అనుమతి ఇచ్చారు. మే 15 ఉదయం ఇందిరా పార్క్ దగ్గర పోలీసు మోహరింపును కూడ తగ్గించారు. కాని తీరా తెలిసిందేమంటే, ధర్నా చౌక్ అక్కడి నుంచి ఎత్తివేయాలని ఒక కుహనా ఆందోళనను ప్రోత్సహించి, వాకర్స్ అసోసియేషన్, స్థానికుల సంఘాలకు కూడ అదే ప్రాంతంలో ప్రదర్శన జరుపుకోవడానికి అనుమతించారు. ధర్నా చౌక్ ను తరలించవద్దని ఆందోళన చేస్తున్న ధర్నా చౌక్ పరిరక్షణ సమితి ఆందోళన కారులు అక్కడికి వెళ్లేసరికి ఇందిరా పార్క్ రోడ్డుకు అటూ ఇటూ పెద్ద పెద్ద షామియానాలు, ఆ షామియానాల కింద అయిదారువందల కుర్చీలు వేసి పెట్టారు. అక్కడ వందలాది కుర్చీలు ఉన్నప్పటికీ నిండా యాభై మంది లేరు. ఉన్నవారు కూడ స్థానికులు కారు, నగరంలోని వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన తెలంగాణ రాష్ట్ర సమితి కార్యకర్తలు. చివరికి సివిల్ దుస్తుల్లో ఉన్న పోలీసు అధికారుల, కానిస్టేబుళ్ల చేతుల్లో కూడ ధర్నా చౌక్ ఎత్తివేయాలి అనే ప్లకార్డులు పెట్టారు.

ధర్నా చౌక్ పరిరక్షణ సమితి ఆందోళన కారులు ఆ రోడ్డు మీదికి వెళ్లాలంటే వారిని దాటుకుని వెళ్లవలసిందే. అలా వెళ్లేటప్పుడు ఇరువర్గాలకూ ఘర్షణ జరగాలనీ, ఆ ఘర్షణ సాకుగా చూపి శాంతి భద్రతల సమస్య అని చెప్పి తాము ప్రవేశించి ధర్నా చౌక్ ను శాశ్వతంగా మూసివేయాలని ప్రభుత్వం, పోలీసులు దొంగ నాటకం ఆడారు.

అయితే ధర్నా చౌక్ ఎత్తివేయాలనే ఆందోళనే కుహనా ఆందోళన

గనుక దానికి స్థానికుల నుంచి కూడ మద్దతు రాలేదు. అధికార పార్టీ కార్యకర్తలు, మఫ్టీ పోలీసులు ఎంత ప్రయత్నించినా ధర్నా చౌక్ పరిరక్షణ సమితి ఆందోళన కారులను అడ్డుకోలేకపోయారు. జరిగిన కొద్దిపాటి ఘర్షణలో కొన్ని కుర్చీలు విరిగిపోవడాన్ని చూపించి, ఆందోళనకారుల మీద పోలీసులు విరుచుకుపడి లాఠీ చార్జి చేసి, కొందరిని ఎంచుకుని కొట్టారు. కొందరు నాయకులకూ కార్యకర్తలకూ తీవ్రమైన గాయాలు అయి ధర్నాచౌక్ లో రక్తం చిందింది. చివరికి, ధర్నా చౌక్ ఎత్తివేయాలని ప్రభుత్వ ప్రోత్సాహంతో, అధికారపార్టీ మద్దతుతో వేసిన షామియానాలు, కుర్చీలు ధర్నా చౌక్ పరిరక్షణ సమితి ఆందోళనకారులకే రోజంతా ఉపయోగపడ్డాయి.

అంతకు ముందు ఎంత దుర్మార్గ ప్రభుత్వాలైనా ప్రజల న్యాయమైన ఆగ్రహ ప్రదర్శనలను అణచివేశాయి గాని, పోటీ ప్రదర్శనలు ఏర్పాటు చేయలేదు, వాటికి మద్దతు ఇవ్వలేదు. తెలంగాణ ఏర్పడడానికి మూడు నాలుగేళ్ల ముందు నుంచి తెలంగాణ జన ప్రదర్శనలకు పోటీగా సమైక్య రాష్ట్రం కోరుతూ సభలు, జన సమీకరణలు జరపడానికి అప్పటి ప్రభుత్వం ప్రయత్నించింది గాని, అవి కూడ మరోచోట, ఘర్షణకు తావు ఇవ్వకుండా జరిపింది. తెలంగాణ ప్రదర్శనలు జరుగుతున్న చోటనే పోటీ ప్రదర్శన జరిపి శాంతిభద్రతల సమస్యను తామే సృష్టించి పబ్బం గడుపుకోవాలనే ఘనమైన ఊహ అప్పటి పాలకులకు కూడ రాలేదు. ప్రజలను చీల్చడానికి, ఒక న్యాయమైన నిరసన ప్రదర్శనకు వ్యతిరేకంగా ఒక కుహనా నిరసన ప్రదర్శనను రెచ్చగొట్టడానికి, ప్రోత్సహించడానికి తెలంగాణ ప్రభుత్వం ప్రయత్నించింది. కాని ఆ కుహనా ప్రదర్శన ఓడిపోయింది.

అసలు ధర్నాచౌక్ ఉండగూడదని తెలంగాణ ప్రభుత్వం అనుకోవడమే అత్యంత అప్రజాస్వామికమైన, నిరంకుశమైన ఆలోచన. ప్రజలకు ఏ ఇబ్బంది వచ్చినా, సమస్య వచ్చినా ప్రభుత్వానికి ఆ సమస్యలు తెలియ జేయడానికి ఒక మార్గం తెరిచి ఉంచాలి. అలాగే ప్రభుత్వ విధానాల పట్ల ప్రజలలో ఎంత చిన్న సమూహానికైనా ఉండే విమర్శను, నిరసనను తెలియజెప్పే మార్గం తెరిచి ఉండాలి.

నిజానికి ఈ అవసరాన్ని రాచరికం రోజుల్లోనే గుర్తించారు. అందుకే రాజాంతఃపురం బైట ధర్మగంట ఏర్పాటు చేశారు. రాజాస్థానంలోకి ప్రవేశం దొరకని వారు కూడ వీధిలోని ఈ గంట మోగిస్తే వెంటనే రాజు వారి సమస్య ఏమిటో తెలుసుకునే పద్ధతి ఏర్పాటు చేశారు. రాచరికం రోజుల్లోనే అమలైన ఈ పద్ధతి ప్రజాస్వామ్యం అని చెప్పుకునే సమాజంలో మరింత విస్తృతంగా అమలు జరగాలి.

తమ అవసరాల గురించి విజ్ఞప్తి చేయడానికి, తమ సమస్యలు తెలియజేయడానికి, తమ నిరసన ప్రకటించడానికి ప్రదర్శనలు జరిపే హక్కు ప్రజలకు ఉంటుందని అన్ని రాజ్యాంగాలు గుర్తించాయి. ప్రజలు ఇలా తమ విజ్ఞప్తులు, సమస్యలు, నిరసనలు తెలియజేసేది గాలికి కాదు గనుక, నేరుగా ప్రభుత్వానికి గనుక, ప్రభుత్వం కొలువుదీరే శాసనసభ, సచివాలయం ప్రదర్శనల కేంద్రాలుగా గుర్తింపు పొందాయి.

అందుకే చలో అసెంబ్లీ, చలో సెక్రటేరియట్ ప్రజాస్వామిక సంప్రదాయంలో అనివార్యమైన భాగాలయ్యాయి. కాని అసెంబ్లీ, సెక్రటేరియట్‌లు నానాటికీ ప్రజలకు దూరమయి పోతున్నాయి. రాజ్యమంటే పోలీసులు మాత్రమే అయిపోయి, అసెంబ్లీ, సెక్రటేరియట్‌లు పోలీసుల చక్రబంధంలో బందీ అయిపోయాయి. శాసనసభ ప్రజలకు అందుబాటులో లేకుండా పోయింది. ప్రజల సభ అని చెప్పుకునే శాసనసభకు రెండు కి.మీ. పరిధిలోకి ప్రజలు రావడానికి వీలులేని స్థితి వచ్చింది.

ఇక ప్రభుత్వం ఉండే మరొక కేంద్రమైన సెక్రటేరియట్ నానాటికీ రక్షణ వలయంలో చిక్కుకుపోయి, అనుమతి లేకుండా లోపలికి వెళ్లలేని స్థితి వచ్చింది. ఆంధ్రప్రదేశ్ సెక్రటేరియట్ గేటువరకూ ప్రదర్శనలను అనుమతించడం, గేటుకు అటూ ఇటూ నిరసన శిబిరాలను అనుమతించడం 1980ల వరకూ ఉండేది. 1990లలో వాటిని ఒక ఫర్లాంగు అవతలికి తెలుగుతల్లి విగ్రహం దగ్గరికి జరిపారు. 2000లో రెండు కిమీ అవతలికి, అప్పటికి ఎవరికీ వినిపించని, కనిపించని చోటుగా ఉన్న ఇందిరాపార్క్ గేటు ముందుకు జరిపారు.

తెలంగాణ ప్రభుత్వం దీన్ని మరింత "అభివృద్ధి" చేసి ఆ ఇందిరాపార్క్ ధర్నా చౌక్‌ను కూడ రద్దు చేయదలచింది. ఇరవై కి.మీ. అవతల స్థలం సూచిస్తానని అంటున్నది.

నిజానికి భిన్నాభిప్రాయం ప్రకటించడం, నిరసన తెలపడం, తన అభిప్రాయాల కోసం, ప్రయోజనాల కోసం ఆందోళన చేయడం మనిషి జన్మహక్కు. ఆకలి ఎంత సహజమో, తన మీద అమలు కాబోతున్న విధానానికి వ్యతిరేకత ప్రకటించడం కూడ అంతే సహజం. తన మీద దెబ్బపడుతున్నప్పుడు అడ్డుకోవడానికి చెయ్యి అడ్డుపెట్టడం మనిషి మాత్రమే కాదు, ప్రతి జీవీ చేసే పని.

ఆ నైసర్గిక, సహజ హక్కును అరికట్టే, ఆ హక్కు మీద ఆంక్షలు విధించే అధికారం ఏ ప్రభుత్వానికీ ఉండదు. పైగా స్వయంగా తానే అటువంటి ఆంక్షలను ధిక్కరించి, పోరాడి అధికారంలోకి వచ్చిన పార్టీ ప్రభుత్వం అటువంటి ఆంక్షలనే విధించడం హాస్యాస్పదం. అంతేకాదు, నిరసన తెలిపే హక్కుకు రాజ్యాంగం కూడ హామీ ఇచ్చింది గనుక, రాజ్యాంగ బద్ధంగా పాలించవలసిన ప్రభుత్వానికి ఆ హక్కును ఉత్తరించే అధికారం లేదు.

అందువల్లనే ధర్నాచౌక్ రద్దు నిర్ణయం పట్ల తెలంగాణ ప్రజానీకంలో పెద్ద ఎత్తున అసంతృప్తి చెలరేగింది. నెల రోజుల పాటు విభిన్న ప్రజా సమూహాలు ప్రతి రోజూ రిలే నిరాహార దీక్షలు జరిపాయి. ధర్నా చౌక్ మీద ఆంక్షలు తొలగించమని ప్రభుత్వానికి అనేక రూపాల్లో విజ్ఞప్తి చేశాయి. ఈ నెలరోజుల్లో ప్రభుత్వం వైపు నుంచి కనీస చర్చలు లేవు, ఈ ప్రతిష్టంభనను తొలగించడానికి సామరస్యపూర్వక ప్రయత్నాలు లేవు. నిన్నటివరకూ తానూ గొంతెత్తిన ధర్నా చౌక్‌ను ఇవాళ ఎందుకు మూసివేయవలసి వస్తున్నదో ఒక కనీస వివరణ లేదు.

ఇక స్థానికుల అభ్యంతరాల పేరుతో ముందుకు తెచ్చిన సాకులేవీ వాదనకు నిలిచేవి కావు. అభ్యంతరం చెప్పిన వారిలో వాకర్స్ ఇందిరా పార్క్‌లో ఉదయం ఐదు నుంచి ఎనిమిది వరకు మాత్రమే నడుస్తారు. ధర్నాల సమయం పదకొండు నుంచి సాయంత్రం ఐదు వరకు గనుక వాకర్స్‌కూ ధర్నాలకూ సంబంధమే లేదు. ఎంత పెద్ద ధర్నా జరిగినా రోడ్డు మూసివేయకుండానే జరుగుతుంది. మూడు ప్రత్యామ్నాయ రోడ్లు కూడ ఉన్నాయి. పైగా సరిగ్గా ధర్నా చౌక్ శిబిరాలు ఎన్‌టిఆర్ స్టేడియం గోడ పక్కన ఉంటాయి. ఇటు రోడ్డంతా స్టేడియం గోడ, అటు రోడ్డంతా ఇందిరా పార్క్ గోడ ఉండడం వల్ల స్థానికులకూ ధర్నాల గురించి ప్రశ్నించే అవకాశమే లేదు. నిజానికి మే 15న స్థానికులే తమ ఇళ్లలోంచి మంచినీరు సరఫరా చేసి ప్రదర్శకులను ఆదుకున్నారంటే స్థానికులకు అభ్యంతరం లేదని తేలిపోయింది. ప్రభుత్వం, పోలీసులు అంతకంతకూ నిరంకుశంగా మారిపోతూ ప్రజల కనీస భావప్రకటనా స్వేచ్ఛను కాలరాయదలచు కున్నారని ఈ ఉదంతం మరింత నగ్నంగా రుజువు చేసింది.

*(రచయిత పాత్రికేయులు)* వీ

# జస్టిస్ కర్ణన్‌కు జైలు శిక్ష

***న్యాయమూర్తులలో జవాబుదారీతనం, పారదర్శకత, బాధ్యత లోపిస్తున్నాయనీ, ప్రజలకు రోజు రోజుకూ న్యాయ వ్యవస్థపై నమ్మకం సన్నగిల్లుతున్నదనీ అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

**2009**లో చెన్నై హైకోర్టు న్యాయమూర్తిగా నియమించబడిన జస్టిస్ కర్ణన్ ప్రస్తుతం పశ్చిమ బెంగాల్ రాజధాని కలకత్తా హైకోర్టు న్యాయమూర్తిగా విధులు నిర్వహిస్తున్నారు. ఈయన దళిత కులానికి చెందినవాడు. 2017 మే 9న ఈయనకు సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తితో కూడిన రాజ్యాంగ ధర్మాసనం ఆరు నెలల జైలు శిక్ష విధించింది. ఇది భారత న్యాయ వ్యవస్థ చరిత్రలో (ఒక సిట్టింగ్ హైకోర్టు జడ్జికి శిక్ష విధించడం) మొదటిసారి.

అంతకు మునుపు జస్టిస్ కర్ణన్, భారత ప్రధాన న్యాయమూర్తితో పాటు ఏడుగురు న్యాయమూర్తులకు ఎస్‌సి/ఎస్‌టి (పిఒఎ) యాక్ట్ 1989 కింద ఐదు ఏళ్ల కారాగార శిక్ష, లక్షల రూపాయల జరిమానా విధించారు. ఒక హైకోర్టు న్యాయమూర్తి, భారత న్యాయమూర్తికి, మరికొంత మంది న్యాయమూర్తులకు శిక్ష విధించడం కూడా ఈ దేశ చరిత్రలో మొదటిసారి.

జస్టిస్ కర్ణన్ కలకత్తాలో మీడియా సమావేశం ఏర్పాటు చేసి, భారత సుప్రీంకోర్టులోనూ, మద్రాస్ (చెన్నై) హైకోర్టు న్యాయమూర్తులలో 20 మంది అవినీతి, అక్రమాలు, కుల వివక్షత, బంధుప్రీతి ఉన్నవారేనని, వారందరిపై విచారణ జరిపి, తొలగించాలని డిమాండ్ చేశాడు. ఇది చాలా సంచలనాత్మకమైన విషయం.

దీనిని సుప్రీంకోర్టు 'ధిక్కారం' కింద పరిగణిస్తూ స్వచ్ఛందంగా 'క్షమాపణ' చెప్పాలని, సుప్రీంకోర్టు ఎదుట హాజరై వివరణ ఇవ్వాలని కూడా ఉత్తర్వులు ఇచ్చారు. కానీ తనను 'దళితుడను' కాబట్టి భారత సుప్రీంకోర్టు న్యాయమూర్తులు వేధిస్తున్నారని, నేను వారి ఎదుట హాజరు కావలసిన అవసరంలేదంటూ, తనకు తానుగా 'సుమోటొ' కింద సుప్రీంకోర్టు న్యాయమూర్తులందరిపై ఎస్‌సి/ఎస్‌టి అత్యాచార నిరోధక చట్టం కింద కేసు నమోదు చేసి, వారిని వెంటనే అరెస్ట్ చేయాలని తనకు తానుగా ఒక ఆర్డర్ ఇచ్చి, ఢిల్లీ డిజిపికి వారిని అరెస్ట్ చేయాలని ఉత్తర్వులు ఇచ్చారు. ఇది పెద్ద సంచలనం సృష్టించింది.

ఇది ఎంత వరకు అమలవుతుందనే విషయం పక్కకు పెట్టి, అసలు జస్టిస్ కర్ణన్ సుప్రీంకోర్టు న్యాయమూర్తులపై చేసిన ఆరోపణపై సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి, లేదా భారత పార్లమెంట్ విచారణ జరిపించాల్సిన అవసరం ఉంది. లేదా భారత ప్రభుత్వం (కేంద్ర ప్రభుత్వం) ఒక ప్రత్యేక న్యాయ విచారణ కమిషన్ ఆరోపణలపై నిర్ధారణకు నియమించి ఉంటే బాగుండేది.

ఇదంతా ఏదో సుప్రీంకోర్టు న్యాయమూర్తులకు, ఒక హైకోర్టు న్యాయమూర్తికి ఉండే వివాదం (వ్యక్తిగతం) గా కాకుండా మొత్తం భారత ప్రజాస్వామ్య వ్యవస్థలో భారత ప్రజలకు న్యాయ వ్యవస్థపై ఉండే నమ్మకం, విశ్వాసం, గౌరవం లేదా 'ఒక భరోసా'లకు భంగం వాటిల్లే పరిస్థితికి ఈ సమస్య వచ్చింది. ఇది చాలా విచారకరం, బాధ్యతా రాహిత్యం, భారత ప్రభుత్వం కూడా తమకు ఏమీ సంబంధం లేనట్లు వ్యవహరించడం కూడా ఖండించాల్సిన విషయం. పైగా సుప్రీంకోర్టు ఆయన నుంచి 'వ్యక్తిగత హాజరు'కు బెయిలబుల్ వారెంట్ జారీ చేసే సమయంలో ఆయనకున్న అన్ని హోదాలను కూడా రద్దు చేసింది. ఆయన తీర్పులను కూడా ఎవరూ పరిగణనలోనికి తీసుకో అవసరం లేదంటూ రాష్ట్రాలకు కూడా ఉత్తర్వులు జారీ చేసింది.

అసలు ఒక హైకోర్టు జడ్జిని నియమించే సమయంలో సుప్రీంకోర్టు అభిప్రాయాన్ని కూడా భారత రాష్ట్రపతి తీసుకుంటాడు. 2009లో అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం (కేంద్రంలో), రాష్ట్రంలో ఎఐఎడిఎంకె (తమిళనాడు) అధికారంలో ఉన్న వీరెవ్వరి సిఫారసు లేకుండానే జస్టిస్ కర్ణన్ నియమించ బడ్డాడంటే నమ్మశక్యం కాని విషయం.

జస్టిస్ కర్ణన్‌ను నియమించడమే ఒక వివాదాస్పదం అయిన విషయం. అది 'కొలీజియం' చేసిన తప్పిదమే. అయినప్పటికీ, జస్టిస్ కర్ణన్ ఏమీ తెలియనివాడు కాదు. అర్హత లేనివాడు కూడా కాదు. ఈ సమస్యను భారత సుప్రీంకోర్టు కూడా 'ఒక వివాదం' (అంతర్గత) గా భావించింది. కాని ఆయన చేసిన ఆరోపణలపై ఎందుకు విచారణకు ఆదేశించలేదు? అనేది కూడా ఒక చర్చనీయాంశమే.

ఒక ప్రత్యేక సుప్రీంకోర్టు అధికారిని లేదా సుప్రీంకోర్టు బార్ అసోసియేషన్‌లోని ప్రముఖమైన న్యాయవాదుల బృందాన్ని ఒక 'అమికస్‌క్యూరీ'గా నియమించి, జస్టిన్ కర్ణన్ రాతపూర్వకమైన విచారణాంశాలను తీసుకోవలసింది లేదా అతని స్టేట్‌మెంట్ రికార్డ్ చేయవలసింది (కలకత్తాలోనే). అది కూడా జరగలేదు. ఒకేసారి సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తితో కూడిన న్యాయమూర్తుల బృందం అతనికి శిక్ష విధించడం ద్వారా సుప్రీంకోర్టు ప్రతిష్ట నిలబడుతుందని భావించింది. ఇది కూడా సరిగా లేదు.

జస్టిస్ కర్ణన్ లేవనెత్తిన అంశాలు అస్పష్టమైనవేం కావు. వాస్తవానికి న్యాయ వ్యవస్థలో ఆ విధమైన 'కుల వివక్షత' ఉంది కూడా సుస్పష్టంగా కనిపిస్తూ ఉన్నది. దానిని ఏ విధంగా నిర్మూలించాలి, సుప్రీంకోర్టుగా తమవంతు బాధ్యత ఏమిటి అనే విషయం అయినా సుప్రీంకోర్టు ధర్మాసనం స్పష్టపరచలేదు. అవినీతి రాజ్యమేలుతుందని కూడా జస్టిస్ కర్ణన్ బహిరంగంగానే చెప్పాడు. 20 మంది సుప్రీంకోర్టు, మద్రాస్ హైకోర్టు న్యాయమూర్తులు అవినీతిపరులని విస్పష్టంగా, బహిర్గతం చేశాడు. ఎవరెవరు వారు? ఆయన దగ్గర ఉన్న ఆధారాలేమిటి? అనేవి మాత్రం వివరించలేదు. బహుశా కమిషన్ వేస్తే, వారికి ఆధారాలి వచ్చునేమో! కాని ఒక హైకోర్టు జడ్జి స్థాయి వ్యక్తి ఆ విధంగా ఎందుకు

ప్రవర్తించాడు? అది న్యాయమూర్తుల ప్రవర్తనా నియమావళి 1985కు విరుద్ధమా? లేదా? అనేది కూడా సుప్రీంకోర్టు సంపూర్ణంగా విచారించినట్లుగా లేదు. ఇది కేవలం పరిపాలనా కోణం (అడ్మినిస్ట్రేటివ్ గ్రౌండ్) లోనే సుప్రీంకోర్టు చూసి జస్టిస్ కర్ణన్‌కు ఆరు నెలల జైలు శిక్ష విధించినట్లు అర్థమవుతుంది.

వాస్తవానికి భారతదేశంలో రాష్ట్ర హైకోర్టు, సుప్రీంకోర్టు న్యాయమూర్తులు రాష్ట్రపతి చేత నియమించబడతారు. కాబట్టి వారిపై అభిశంసన అనేది పార్లమెంటులో 2/3 వంతు సభ్యుల మెజారిటీ ద్వారానే తొలగించాలి తప్ప మరో మార్గం లేదు. ఇది చాలా అరుదుగా జరిగే విషయం. జస్టిస్ వి. రామస్వామి, ఇదే కలకత్తా హైకోర్టు న్యాయమూర్తి సౌమిత్రీసేన్‌లపై పార్లమెంట్‌లో అభిశంసన తీర్మానం చేశారు. సౌమిత్రీసేన్ పార్లమెంట్‌లో తీర్మానం చేసే సమయానికే రాజీనామా చేశాడు. కాని ఇప్పుడు కింది స్థాయి న్యాయమూర్తులపై ఏవైనా అవినీతి ఆరోపణలు వస్తే, వారిపై చర్యలు తీసుకునే అధికారం రాష్ట్ర హైకోర్టులకు ఉన్నది. అది పరిపాలనా వ్యవహారంలో భాగంగా చేస్తారు. కాని అదే హైకోర్టు, సుప్రీంకోర్టు న్యాయమూర్తుల అవినీతి, అక్రమాల వ్యవహారంలో వారిపై విచారణ, తొలగింపు వ్యవహారం కేవలం పార్లమెంట్‌కు మాత్రమే ఉంది. ఒక జాతీయ స్థాయిలో ఒక 'జ్యుడీషియల్ కమిషన్' ఏర్పాటు చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఎంత అవినీతి వ్యవస్థలో మనం జీవిస్తున్నప్పటికీ కొద్దో, గొప్పో న్యాయం జరుగుతుందనే విశ్వాసం రాష్ట్ర హైకోర్టులపై ఉన్నది కాబట్టి ఆ క్రమంలోనే మనం చూడాలి తప్ప అంతకన్నా ఎక్కువ ఈ న్యాయ వ్యవస్థలో ఆశించలేం.

అంతే కాకుండా, రోజు రోజుకూ ప్రజలకు న్యాయ వ్యవస్థపై నమ్మకం సన్నగిల్లుతున్నది. వారికి జవాబుదారీతనం, పారదర్శకత, బాధ్యతా అనేవి లోపించినట్లు కనబడుతున్నది. ఒక పౌరుడు ఎన్నో కష్ట నష్టాలకోర్చి, ఎందుకు హైకోర్టును ఆశ్రయించాడనే దానికన్నా దాని నుంచి ఏ విధమైన నష్టం/లాభం జరుగుతున్నది అనే విషయంపై ఎక్కువ చర్చ జరుగుతున్నది.

'ప్రజలకు (పౌరులకు) సరియైన సమయంలో న్యాయం జరగకపోతే, న్యాయం జరగనట్లే లెక్క' అనేది ప్రాథమిక న్యాయసూత్రం. అంతేకాకుండా న్యాయం జరిగినట్లు బాధితునికి కనిపించాలి, దానిని అనుభవించాలి బాధితుడు. గతంలో 'లా కమిషన్' చేసిన సిఫారసులు కూడా ఏమీ అమలు కావడం లేదు. తప్పుచేసిన వాడు పైకోర్టులలో ఏదో ఒక విధంగా తప్పించుకోవచ్చనే భావనతోనే ఉన్నారు. కిందిస్థాయి కోర్టులలో న్యాయమూర్తులు వ్యక్తి అన్ని కోణాలు చూసి తీర్పులిస్తున్నారు. 30 సంవత్సరాల క్రితం జస్టిస్ పి.ఎన్. భగవతి ఒక పోస్ట్ కార్డు ముక్క రాస్తే, దానిని రిట్ పిటిషన్‌గా స్వీకరించి, విచారణ జరిపించి చర్యలు తీసుకున్నారు. అదే ప్రజా ప్రయోజనాల వ్యాజ్యం (పిఐఎల్) గా మారింది. కాని ప్రస్తుతం ఆ పరిస్థితి లేదు.

కోర్టులలో జరుగుతున్న అవినీతి, అక్రమ చర్యలపై ఎన్ని ఫిర్యాదులు చేసినప్పటికీ చర్యలు తీసుకోవడానికి చాలా సమయం పడుతుంది. అది కొన్ని సంవత్సరాలైనా జరిగే పరిస్థితి నెలకొనింది. దేశంలో విద్యావంతుల సంఖ్య రోజు రోజుకూ పెరుగుతున్నప్పటికీ, ప్రజాస్వామిక వ్యవస్థ మాత్రం ప్రజాస్వామికీకరించబడడం లేదు. దానికి భిన్నంగా ఏ రకమైన అన్యాయం జరుగుతున్నప్పటికీ, 'మనకెందుకులే' అనే ధోరణి కనబడుతున్నది. అంతే కాకుండా, నిజంగా న్యాయ వ్యవస్థ ఇంత ప్రజాస్వామికంగా ఉంటే పోలీసులు ఇన్ని ఆకృత్యాలు, అరాచకాలు చేసేవారు కాదు. పోలీసుల ఆకృత్యాలు, అరాచకాలు, చట్ట వ్యతిరేక ధోరణి, అప్రజాస్వామిక చర్యలకు భారత న్యాయమూర్తులలోని చైతన్య రాహిత్యాన్ని తెలియజేస్తుంది. పోలీసులు చేసిన హింసకు, ఇటీవల కర్ణాటక రాష్ట్రంలో కింది స్థాయి న్యాయమూర్తి 'ఆత్మహత్య' చేసుకున్నాడు. రోజు రోజుకూ పోలీసులలో హింసా ప్రవృత్తి, అసాంఘిక ధోరణి పెరిగి పోతున్నది. దీనిని నిర్మూలించే దిశగా 'భారత న్యాయ వ్యవస్థ' ప్రవర్తించడం లేదు. న్యాయమూర్తులలో చాలా మంది పోలీసుల చర్యలను సమర్థించే వారున్నారు. ఇది విచారకరం.

రాజ్యాంగం కల్పించిన ప్రాథమిక హక్కులు అడుగడుగునా కాలరాయబడుతుంటే, సుమోటోగా ఎందుకు న్యాయ మూర్తులు ఆదేశాలివ్వడం లేదు? హైకోర్టు, సుప్రీంకోర్టులు – ప్రజల ప్రాథమిక హక్కులకు ఉల్లంఘన జరిగినప్పుడు స్పందిస్తున్న తీరు కూడా సందేహాస్పదంగా ఉన్నది. తనకు పోలీసులు 'అన్యాయం' చేశారనీ ఒక వ్యక్తి కోర్టును ఆశ్రయించవచ్చనే విషయం కూడా చాలా మంది ప్రజలకు తెలియదు. మీడియా కూడా పోలీసులకు అనుకూలంగానే ఉంటున్నది. గ్రామీణ స్థాయిలో అయితే అధికారులు, పోలీసులు, అధికార పార్టీ నాయకులు, మీడియా ప్రతినిధులు అందరూ కలిసే ప్రజల సొమ్మును కాజేస్తున్నారు. ఫిర్యాదు చేసిన చైతన్యవంతమైన యువకులపై బెదిరిస్తూ, అక్రమ కేసులు బనాయిస్తున్నారు.

భారత ప్రజాస్వామ్యంలో 'స్వతంత్ర న్యాయ వ్యవస్థ' అంటూ మనం రాజ్యాంగంలో రాసుకున్నప్పటికీ స్వతంత్రత, ప్రజాస్వామిక, లౌకికత, అందరూ చట్టం ముందు సమానులే (ఆర్టికల్ 14) అనే మౌలికాంశాలు ఇంకా అందడం లేదు. 70 ఏళ్ల స్వాతంత్ర్య పాలనలో ప్రజల మౌలిక సమస్యలు పరిష్కరించబడలేదంటే దానికి ఇంత వరకు ఏలిన పాలకులందరి బాధ్యత. ప్రజలు నిరంతరం అప్రమత్తులై ఈ పాలకులను ప్రశ్నించడం ద్వారా, పోరాడడం ద్వారానే న్యాయ వ్యవస్థ ప్రక్షాళన కూడా సాధ్యపడుతుంది. వీ

*(రచయిత ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)*

**వచ్చే సంచికలలో...**

- **పార్లమెంటరీ ప్రజాస్వామ్యం - నక్సల్బరీ - ప్రొ. హరగోపాల్**
- **పూష్కిన్ - ఒక ప్రశంస - మాక్సిమ్ గోర్కీ**
- **బహుజనులకు రాజ్యాంగ హోదా - సి.హెచ్. బిక్షమయ్య**
- **పాలకుల కుట్రతో బలిపీఠం పై ప్రజారోగ్యం - తక్కళ్లపెల్లి సూరి**

# బాబ్రీ మసీదు కేసు - రెండు తీర్పులు

***బాబ్రీ మసీదు కూల్చివేత జరిగి రెండు దశాబ్దాలకుపైగా గడిచిందనీ, ఈ సున్నితమైన కేసులో రాజకీయ పార్టీల జోక్యం లేకుండా, ఒక వర్గానికి పక్షపాతం వహించకుండా కేసు సాగితేనే సరైన న్యాయం లభిస్తుందనీ అంటున్నారు అరణ్య***

స్వాతంత్ర్యానంతర భారతదేశ చరిత్రలో బాబ్రీ మసీదు విధ్వంసానికి సంబంధించిన కేసులో చూసినన్ని మలుపులు మరే ఇతర కేసు విషయంలోనూ చూడలేం. ఆ విధ్వంసం తర్వాత దేశంలో జరిగిన ఏ మత సంబంధితమైన దాడి గానీ అల్లర్లు గానీ ఏదో ఒక స్థాయిలో దానితో సంబంధం లేకుండా జరిగినవి కాదంటే ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు. అట్లాంటి కేసుకు సంబంధించి సుప్రీంకోర్టు ఈ మధ్య రెండు విభిన్నమైన తీర్పులను ప్రకటించింది.

మొదటిది – కోర్టుకు బయట, చర్చల ద్వారా వివాదాన్ని పరిష్కరించుకొమ్మని సూచించింది. ఈ సందర్భంగా మధ్యవర్తిత్వం విషయమై న్యాయవాదులు సంశయపడగా అవసరమైతే తాను మధ్యవర్తిగా ఉంటానని సుప్రీంకోర్టు చెప్పింది. వివాదాస్పద స్థలాన్ని సమానంగా మూడు ముక్కలు చేసి రామ్‌లల్లాకు, సున్ని వక్ఫ్ బోర్డ్‌కు, నిర్మోహి అఖారాకు పంచాలని అలహాబాద్ హైకోర్టు 2010లో ఇచ్చిన తీర్పును నిలిపివేసిన సుప్రీంకోర్టు దానిపై తీర్పు ఇవ్వవలసి ఉన్నది. ఈ క్రమంలో జస్టిస్ ఖేహర్, చంద్రచూడ్, ఎస్.కె. కౌల్‌లు వెలువరించిన ఈ తీర్పు అనేక అనుమానాలకు తావిచ్చేదిగా ఉన్నది.

అసలు ఒక సమస్య కోర్టు పరిధిలోకి ఎందుకు వస్తుంది? దానికి పరిష్కారం ఇండ్లలోనో, వీధుల్లోనో దొరకనపుడు అది కోర్టులోకి వస్తుంది. కోర్టు ఒక పెద్దమనిషిగా రాజీ ప్రయత్నాలు, చర్చల ప్రయత్నాలను సూచిస్తే దాన్ని తప్పు పట్టడానికి వీలులేదు. అయితే అది ఎప్పుడు జరగాలి? కేసు మొదట్లో ఇరువర్గాలకు ఆ సూచన ఇవ్వాలి. నచ్చితే రాజీకొస్తారు. చర్చలు చేస్తారు. నచ్చకుంటే 'చర్చల ద్వారా పరిష్కరించుకోలేం, ఏదో ఒక తీర్పు ఇవ్వండి' అంటారు. ఇక అప్పటి నుంచి కోర్టు అన్ని కోణాలలోనూ విచారించి అంతిమంగా తీర్పు చెప్తుంది. చెప్పడం దాని విధి. అయితే చర్చల మార్గంలో వెళ్లండని కోర్టు తనవైపు నుంచి కేసు మొదట్లోనే చెప్పాలి గానీ, మాకు చర్చలు కుదరవని తెగేసి చెప్పాక కూడా ఏళ్లకేళ్లు కేసును లాగి చివరకు 'మీరే చర్చించి పరిష్కరించుకోండి' అనడం కొండను తవ్వి ఎలుకను పట్టడం అవుతుంది. ఒకవేళ కేసు నడుస్తున్న క్రమంలో ఇరువర్గాలూ 'మేం చర్చలు జరుపుకుంటాం. ఆ దిశగా పరిష్కారానికి మాకు అనుమతివ్వండి' అని కేసు మధ్యలో కోరితే అప్పుడు కోర్టు చర్చలు జరుపుకొమ్మని సలహా ఇవ్వవచ్చు. అది వేరే సంగతి. కానీ ఒక అతి ముఖ్యమైన కేసులో, ప్రజాస్వామ్యం లౌకికత్వం అనే మౌలికాదర్శాల మనుగడను నిలబెట్టే కేసు విషయంలో అదేదో తనకు పెద్దగా సంబంధం లేనట్టు, పట్టింపులేనట్టు 'మీరే చూసుకోండి' అని చెప్పటం కోర్టు బాధ్యతా రాహిత్యానికి నిదర్శనం.

ఒకవేళ కోర్టు సూచించినట్లే చర్చల ప్రక్రియ విషయంలోకి వెళ్లి చూసినా ఆ మార్గంలో పరిష్కారం దొరకడం జరిగేపనికాదు. అసలు ఈ చర్చలు ఎవరెవరి మధ్యన జరగాలి? ఎవరెవరు చర్చల్లో కూర్చోవాలి? కోర్టులో కేసు దాఖలు చేసిన పక్షాలు కూర్చోవాలనుకుంటే కోర్టులో కేసు వేయని అనేక సంస్థలు, ప్రజాసమూహాలు ఈ కేసుతో ముడిపడి తీర్పుకోసం చూస్తున్నాయి. మరి వారందరి అభిప్రాయాలు పరిగణనలోకి రాకుండా పోతాయి. హిందువులు, ముస్లింల వివాదం కనుక ఆ రెండు మతాల వాళ్లు చర్చలకు కూర్చోవాలనుకుంటే ఆయా మతాల ప్రతినిధులుగా ఎవరు కూర్చోవాలి? హిందూ మతంలోనే బోలెడన్ని శాఖలు, గుంపులు, సంస్థలున్నాయి. ముస్లింలలోనూ సున్నిలు, షియాలతో పాటు ఇతర వర్గాలున్నాయి. వీళ్లందరిలో ఎవరు చర్చల్లోకి రావాలి? అట్లాగే రాజకీయ పక్షాలన్నీ చర్చలకు కూర్చోవాలనుకుంటే ఒకరికొకరికి మధ్య భావజాలాల తేడాలున్నందున అది తెమిలేపని కాదు. కనుక సుప్రీంకోర్టు చెప్పినట్లు చర్చలతో పరిష్కరించుకోవాలనుకుంటే అసలు చర్చలలో ఎవరు పాల్గొనాలనే విషయం దగ్గరనే వ్యవహారమంతా ఆగిపోతుంది. ఇద్దరు వ్యక్తుల మధ్యనో, రెండు బృందాల మధ్యనో కేసు నడుస్తుంటే ఎవరైనా బైటి వాళ్ల మధ్యవర్తిత్వంతోనో, చొరవతోనో చర్చలు జరిగే వాతావరణం ఏర్పడుతుంది గానీ బహుళ సమూహాల, సంస్థల, వర్గాల ఉమ్మడి సమస్యగా ఉన్నపుడు ప్రత్యేకంగా మధ్యవర్తిత్వంతోనే చర్చలు విజయవంతమవడం చాలా కష్టం. సరికదా అసలు చర్చల వాతావరణమే ఏర్పడటం కష్టం. ముఖ్యంగా 1992 నుంచీ ఈ బాబ్రీ మసీదు కేసే అనేక సందర్భాలలో ఇదే విషయాన్ని నిరూపించి ఉన్నది కూడా. అయినా ఇదేదీ గుర్తుకు తెచ్చుకోకుండా సుప్రీంకోర్టు చర్చల సలహా ఇచ్చింది.

ఒకవేళ ఇంకాస్త ముందుకెళ్లి సుప్రీంకోర్టు చెప్పినట్లే ఏవో రెండు పక్షాలకు చెందిన వాళ్లు చర్చలకు కూర్చుంటారనే అనుకుందాం. చర్చలలో ఏం మాట్లాడతారు? బాబ్రీ మసీదు ముస్లింలదే, కనుక అక్కడి దేవుళ్ల విగ్రహాలు వెనక్కి తీసుకుపోయి, హిందువులు పూజలు మానేయాలి అంటారనుకుందాం. అలా అంటే హిందువులు, వాళ్ల సంస్థలు, పార్టీలు ఒప్పుకోవు. ఆ స్థలంలో గతంలో గుడి ఉండేదట, దాన్ని బాబర్ కూలగొట్టించాడట, అందుకే ముస్లింలు ఆ స్థలాన్ని ఇచ్చి వేయండని అంటే ముస్లింలు, వాళ్ల సంస్థలు ఒప్పుకోవు. పోనీ, 2010 అలహాబాద్ కోర్టు లక్నో బెంచ్ తీర్పు తరహాలో వివాదాస్పద 2.77 ఎకరాల భూమిని ఏదో రకంగా పంచుదామంటే ఎవ్వరూ ఒప్పుకునే పరిస్థితి లేదు. ఈ తీర్పు మీద రెండు మతాల వాళ్లు సుప్రీంకోర్టుకు పోయే ఉన్నారు కూడా.

అట్లా ఏదీ ఒక కొలిక్కి రాని పరిస్థితుల్లో మధ్యవర్తిగా కూర్చుంటానన్న సుప్రీంకోర్టు మాత్రం ఏం మాట్లాడుతుంది? బలవంతంగానైతే ఏ వర్గాన్నీ ఒప్పించలేదు కదా! కనుక సుప్రీంకోర్టు చెప్పింది కదా ఏవో కొన్ని వర్గాలు చర్చల్లో కూర్చున్నాక కూడా ఏదో ఒకవర్గం నిరాశతోనే ఉంటుంది. ఉమ్మడి పరిష్కారం వీలుకానేకాదు. నిరాశ చెందిన వర్గం మళ్లీ న్యాయం కోసం ఎక్కడికి వెళ్లాలి? సుప్రీంకోర్టు దగ్గరికే కదా! అర్థం చేసుకుంటే

చాలా చిన్న విషయం ఇది. ఇంత చిన్న విషయాన్ని సుప్రీంకోర్టు గమనించలేక నిర్లక్ష్యంగా చర్చల ప్రస్తావన తెచ్చింది.

ఇరవై ఐదు ఏళ్లుగా కేసు చరిత్రను చూస్తే సుప్రీంకోర్టు తెచ్చిన చర్చల ప్రతిపాదన కొత్తదేమీ కాదు. చంద్రశేఖర్, పి.వి. నర్సింహారావులు ప్రధానులుగా ఉన్నప్పటి నుంచీ ఈ ప్రయత్నాలు జరుగుతూ వచ్చాయి. అంతకుముందు కూడా 1986లో కంచి కామకోటి పీఠాధిపతి శంకరాచార్యకు, అప్పటి ముస్లిం పర్సనల్ లా బోర్డు అధ్యక్షుడు అలీమియా నద్వీల మధ్య చర్చలు జరిగాయి. ఈ చర్చల్లోనే ఈ చర్చలు జరిపే అధికారం వాళ్లకెక్కడిదంటూ రెండు వర్గాల్లోనూ ఆగ్రహాలు వ్యక్తమై చర్చలు విఫలమైనాయి.

1989 సార్వత్రిక ఎన్నికలకు ముందు మధు దండావతే నేతృత్వంలోని త్రిసభ్య కమిటీ హిందూ, ముస్లిం నేతల మధ్య ముఖాముఖి చర్చలు సాగించేందుకు ప్రయత్నాలు చేసింది. దీని ఫలితంగానే చంద్రశేఖర్ ప్రభుత్వం బాబ్రీమసీదు ఉద్యమ సమన్వయ సంఘం (బిఎంఎంసిసి)కి, విశ్వహిందూ పరిషత్ (విహెచ్‌పి)కి మధ్య చర్చలు ఏర్పాటు చేసింది. అయితే మాజీ ప్రధాని విపి సింగ్ సన్నిహితుడైన ఢిల్లీలోని జామామసీదు ఇమాం బుఖారికి అనుకూల సంస్థ అయిన బిఎంఏసి తనను చర్చలకు ఎందుకు పిలవలేదని అభ్యంతరం చెప్పగా చర్చలు విఫలమైనాయి. తర్వాత 1990లో బిఎంఏసిని చర్చలకు పిలిస్తే బిఎంఎంసీసీ అడ్డు చెప్పింది. అట్లా చర్చలు ముందుకు జరగలేదు. పివి నరసింహారావు కూడా కాంగ్రెస్ నాయకుడు సుభోద్‌కాంత్ సహాయ్ ద్వారా చర్చల ప్రయత్నాలు చేశాడు. ఇవేవీ విజయవంతం కాలేదు.

కనుక చర్చల మార్గం ఎంత క్లిష్టమైందో ఈ చరిత్ర చెప్తుంది. ఈ విషయం తెలిసీ, అనేకసార్లు చర్చలు ఒక ప్రహసనంగా అనవసర తంతుగా జరిగిన విషయమూ తెలిసి కూడా ఇరవై ఐదేళ్లుగా, అరవై ఏడేళ్లుగా, ఇంకా ముందుకు వెళ్తే 1885 నుండీ నలుగుతున్న కేసుకు సంబంధించి, వేలాదిమంది ప్రాణాలు పోయాక కనీసం ఇప్పుడైనా తీర్పు వెలువడుతుందేమోననుకున్న ప్రజలకు మళ్లీ సుప్రీంకోర్టు చర్చల సలహా ఇవ్వడం అపరిమిత ఆశ్చర్యానికి గురిచేసింది. ఎవరివైపు న్యాయం ఉందో చట్టం ఆధారంగా, రాజ్యాంగం ఆధారంగా తీర్పు చెప్పవలసిన సుప్రీంకోర్టు సెంటిమెంటును కారణంగా చూపించి చర్చలు జరుపుకోండని చెప్పడమంటే ఏ కారణం వల్లనో, ఎవరికో మేలు చేయడం కోసమో తన బాధ్యతను విస్మరిస్తున్నదేమోననే అనుమానం కలుగుతున్నది.

ఇక సుప్రీంకోర్టు ఇచ్చిన రెండో తీర్పు ఏమిటంటే బాబ్రీ మసీదును కూల్చివేసేందుకు కారణంగా పేరుబడ్డ అద్వాని బృందాన్ని విచారించక పోవడాన్ని పేర్కొంటూ సుప్రీంకోర్టు ఇందుకు సంబంధించిన కేసులన్నింటినీ లక్నోకు తరలించి రోజువారి విచారణ జరిపి తుది తీర్పు ఇవ్వమని లక్నో కోర్టును ఆదేశించింది. విచారణ పూర్తయ్యే వరకు కేసును విచారిస్తున్న న్యాయవాదులను బదిలీ చేయరాదని ఆదేశించింది. విచారణ ఎదుర్కోబోయే బృందంలో అద్వాని, మురలిమనోహర్‌జోషి, కళ్యాణ్‌సింగ్, ఉమాభారతి, వినయ్ కటియార్ మొదలైన వాళ్లు 13 మంది ఉన్నారు. 1992లో బాబ్రీ మసీదును కూల్చివేశాక దీనిపై రెండు కేసులు నమోదయ్యాయి. గుర్తు తెలియని కరసేవకులపై ఒక కేసు లక్నో కోర్టులో, బిజెపి, ఆరెస్సెస్, విహెచ్‌పి నేతలు 21 మందిపై రాయ్‌బరేలి కోర్టులో మరోకేసు నమోదైనాయి. వీరిలో అశోక్‌సింఘాల్, బాల్ థాక్రే, గిరిరాజ్ కిశోర్ మొదలైన ఎనిమిది మంది విచారణ సమయంలోనే మరణించారు. 2011లో సిబిఐ వేసిన పిటిషన్‌పై బెంచ్‌లు మారుతూ వచ్చిన ఆరేళ్ల తర్వాత సుప్రీంకోర్టు ఈ తీర్పు ఇచ్చింది.

ఇదొక క్రిమినల్ కేసు. చర్చల ప్రస్తావన తెచ్చిన పైన మొదట చెప్పుకున్న కేసు సివిల్ కేసు. ఈ క్రిమినల్ కేసుకు సంబంధించి గతంలో 2001లో లక్నో కోర్టు అద్వాని సహా మిగిలిన వారిపై నేరారోపణలు కొట్టివేసింది. ఈ తీర్పును సిబిఐ హైకోర్టులో సవాల్ చేసింది. కానీ 2010 తీర్పులో హైకోర్టు లక్నో కోర్టు తీర్పునే సమర్థించింది. దాంతో హైకోర్టు తీర్పును సుప్రీంకోర్టులో సిబిఐ సవాల్ చేసింది.

ఈ క్రమంలో 2011లో సిబిఐ వేసిన ఈ పిటిషన్‌పై ఆరేళ్ల తర్వాత ఇప్పుడు అద్వాని బృందంపై కుట్ర అభియోగాల ఉపసంహరణను సవాల్ చేస్తూ సిబిఐ దాఖలు చేసిన పిటిషన్‌పై సుప్రీంకోర్టు జరిపిన విచారణలో కుట్ర అభియోగాల ఉపసంహరణను తప్పుపట్టింది. 13 మందిపై అభియోగాలు నమోదు చేసి విచారణ జరపమని ఆదేశించింది. అయితే ఇందులో రాజస్తాన్ గవర్నర్‌గా రాజ్యాంగబద్ధ పదవిలో ఉన్న కళ్యాణ్‌సింగ్‌పై ఆయన పదవీకాలం ముగిసే దాకా అంటే మరో రెండున్నర సంవత్సరాలు ఆగిన తర్వాత అడిషనల్ చార్జిషీట్‌ను దాఖలు చేయమని కోర్టు చెప్పింది. ఈ ఆదేశాల మేరకు గుర్తుతెలియని కరసేవకులపై కేసును, ఈ కేసును రెండింటినీ కలిపి లక్నో కోర్టు విచారించనున్నది.

అసలు 2011లోనే ఈ రెండు కేసులనూ కలిపి విచారించేలా ఆదేశించమని సిబిఐతో కేంద్ర ప్రభుత్వం ఒక చిన్న లేఖ ఇప్పించాల్సింది. కానీ ఆనాటి యుపిఏ ప్రభుత్వం ఆపని చేయలేదు. భారత క్రిమినల్ చట్టంలో ఒకే సంఘటనకు సంబధించి రెండు కేసులు నడవడం, రెండు ట్రయల్స్ రావడం జరగకూడదు. కానీ బాబ్రీమసీదు కూల్చివేత అనే ఒకే సంఘటనపై రెండు కేసులు విడివిడిగా లక్నో కోర్టులో ఒకటి, రాయ్ బరేలి కోర్టులో ఒకటి నడుస్తున్నా అధికారాల్లో ఉంటూ వచ్చిన యుపిఎ, ఎన్‌డిఎ ప్రభుత్వాలు రెండింటినీ కలిపి ఒకేకేసుగా పరిగణనలోకి తీసుకొమ్మని సిబిఐతో చెప్పించలేక పోయాయి.

1992 నుంచి ఇప్పటిదాకా అధికారంలో ఉన్న ఏ ప్రభుత్వమైనా బాబ్రీమసీదు కూల్చివేత అంశాన్ని తమ ఓట్ల, ఎన్నికల ప్రయోజనాలకు వాడుకుంటూ వస్తూ, ఆ కేసును వీలైనంత నిర్వీర్యం చేస్తూ వచ్చాయి. ముస్లింలకు వ్యతిరేకంగా, హిందూ మతతత్వ సంస్థలకు అనుకూలంగా ఉండేలా ప్రభుత్వాలు చర్యలు తీసుకుంటున్నాయి. అది పివి నర్సింహారావైనా ఇంకెవరైనా. ఇక న్యాయవ్యవస్థ తీర్పులైతే ఎంత విచిత్రంగా ఉంటున్నాయంటే ఒకే కేసుకు సంబంధించి కోర్టులు విభిన్నమైన తీర్పులిస్తూ వాటిపై సంబంధం లేని వివరణలిస్తూ వస్తున్నాయి. అందుకే తీర్పులు అభాసుపాలవుతూ వస్తున్నాయి.

ఏది ఏమైనా మొత్తానికి బాబ్రీ మసీదు కూల్చివేతకు కారకులైన వారిపై మళ్లీ విచారణ ప్రారంభించమని సుప్రీంకోర్టు ఆలస్యంగానైనా తీర్పు చెప్పింది. ఈ ఆదేశాల దరిమిలా సిబిఐ వెంటనే పని ప్రారంభించాలి. అయితే ఈ విచారణ సాంతం సిబిఐ, కోర్టులు సరైన మోటివ్‌తో ఉంటూ, రాజకీయాల జోక్యాన్ని తిప్పికొడుతూ ఉండే వాతావరణంలో పనిచేస్తూ ఉంటేనే అసలైన దోషులకు శిక్షపడే అవకాశం ఉంటుంది తప్ప ఇంత ఆర్భాటంగా ఇట్లాంటి ఆదేశాలు వచ్చిన తర్వాత కూడా అంతా నీరుగారిపోయేలా అయిపోతే బాధిత వర్గం వారికి న్యాయం జరగబోదు. కోర్టు బయట చర్చలు సాధ్యం కావని గుర్తిస్తూనే, లక్నో కోర్టు జరపబోయే రానున్న రెండేళ్ల విచారణను ఓకంట కనిపెడుతూ ఉండాల్సిన అవసరం ఇప్పుడు సుప్రీంకోర్టు మీద ఉన్న పెద్ద బాధ్యత.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# ప్రమాదకరమైన ట్రంప్ యుద్ధోన్మాదం

*అమెరికా యుద్ధోన్మాదాన్ని, సామ్రాజ్యవాద జోక్యాన్ని ప్రపంచ దేశాలు ముఖ్యంగా అభివృద్ధి చెందుతున్న దేశాలలోని కార్మికులు, యువత రాజకీయంగా, ఐక్యంగా అడ్డుకోవాలనీ, లేకుంటే అది మానవాళి నాశనానికే దారితీస్తుందనీ అంటున్నారు* **సంతోష్**

అమెరికా అధ్యక్షుడిగా బాధ్యతలు చేపట్టి పట్టుమని నాలుగు మాసాలు కూడా కాకముందే ట్రంప్ సిరియా, అఫ్ఘనిస్తాన్‌లపై దండెత్తడం, ఉత్తరకొరియాపై కవ్వింపు చర్యలకు దిగడం ఇవన్నీ అమెరికా ఎంతటి నైరాశ్యంలో ఉందో తెలియజేస్తున్నాయి. అంతర్జాతీయ చట్టాలను బాహాటంగా ఉల్లంఘిస్తూ సిరియా, అఫ్ఘనిస్తాన్‌లపై బందిపోటు మాదిరిగా దాడులకు దిగడం, ఉత్తర కొరియాతో కయ్యానికి కాలుదువ్వడం, ఇస్లామిక్ ఫోబియాను రెచ్చగొట్టడం, మానవ హక్కులను, మహిళా హక్కులను కాలరాయడం, సామాన్యులపై భారాలు మోపి బడా కార్పొరేట్లకు పన్నుల్లో భారీ రాయితీలు కల్పించడం... ఇదీ ట్రంప్ ఈ మూడున్నర నెలల్లో సాధించిన ఘనత! కూలిపోతున్న సామ్రాజ్యవాద ఆధిపత్యాన్ని పునరుద్ధరించేందుకు అమెరికా అధ్యక్షుడు అనుసరిస్తున్న దుందుడుకువాద చర్యలు ప్రపంచానికే పెను విపత్తుగా తయారయ్యాయి. ఇంటా బయటా తీవ్ర నిరసనలు ఎదురవుతున్నా ట్రంప్ లెక్కచేయడం లేదు. సామ్రాజ్యవాద లాబీ, బలమైన యుద్ధ లాబీ అండతో ఒక దేశంపై దాడి తరువాత మరో దేశంపై దాడికి తెగబడుతున్నాడు. అధికారంలోకి వచ్చిన కొద్ది రోజులకే యుద్ధ కాంక్షతో ఇంతగా రగిలిపోయిన అధ్యక్షుడు అమెరికా చరిత్రలో బహుశా ట్రంపే మొదటివాడు కావచ్చు. అధికారం చేపట్టిన అనతి కాలానికే ప్రజల విశ్వసనీయత కోల్పోయిన అధ్యక్షుడు కూడా ఈయనే.

పదవీ స్వీకార ప్రమాణ సందర్భంగా అమెరికా ఆర్థిక వ్యవస్థను సౌభాగ్యవంతం చేస్తానని, ప్రజలకు పూర్తి భద్రత చేకూర్చుతానని, తన ప్రభుత్వం నిజాయితీకి మారుపేరుగా నిలుస్తుందని ట్రంప్ చేసిన ప్రకటనలు నిజమేననుకున్నారు. అమెరికన్ నిరుద్యోగ యువతకు ఉపాధి చూపడమే 'అమెరికా ఫస్ట్' విధానం మౌలిక లక్ష్యమన్నారు. అవన్నీ వట్టి బూటకాలని తేలడానికి ఎంతోకాలం పట్టలేదు. 'అమెరికా ఫస్ట్' అంటే ప్రపంచాధిపత్యం కోసం సామ్రాజ్యవాదం సాగించే దురాక్రమణ పూరిత దాడులని, అమెరికన్లకు భద్రత అంటే ముస్లింలను దేశంలోకి రానీయకుండా అడ్డుకోవడమేనని ఆచరణలో తేలింది. దీంతో ట్రంప్‌పై భ్రమలు ఒక్కొక్కటి తొలగిపోనారంభించాయి. ఈ మూడు నెలల్లో ట్రంప్ నాలుగొందలకు పైగా అబద్ధాలాడారని వాషింగ్టన్ పోస్ట్ పత్రిక వెల్లడించింది. పచ్చి మితవాది అయిన ట్రంప్ శ్వేతసౌధంలో అడుగు పెట్టిన వెంటనే మెక్సికోతో సరిహద్దు గోడ నిర్మాణానికి సంబంధించిన ఉత్తర్వుపై తొలి సంతకం చేశారు. ఈ గోడ నిర్మాణానికయ్యే వ్యయంలో కొంత మెక్సికో భరించాలన్నారు. దీనికి మెక్సికో తిరస్కరించడంతో ఆ దేశం నుంచి వచ్చే దిగుమతులపై 20 శాతం సుంకం విధించి, ఆ సొమ్ముతో గోడ నిర్మాణం చేపడతామని ప్రకటించడం అగ్రరాజ్య దురహంకారానికి పరాకాష్ఠ. ఆ తరువాత భద్రత పేరుతో ముస్లిం దేశాలపై నిషేధానికి ట్రంప్ పూనుకున్నారు. దీనిని ఫెడరల్ కోర్టు ఒకసారి కాదు రెండు సార్లు కొట్టివేసింది.

ట్రంప్ తన ఎన్నికల ప్రచార హామీల్లో అతి ముఖ్యమైనదిగా ప్రచారం చేసిన ఒబామా ఆరోగ్య పథకానికి స్వస్తిపలికే చర్య చివరి మజిలీకి చేరింది. జనవరిలో అధ్యక్ష పీఠం అలంకరించిన తరువాత ఒబామా ఆరోగ్య పథకం రద్దుకు సర్వశక్తులు ఒడ్డుతున్నారు. విధాన నిర్ణేతలతో ఎడతెగని మంతనాలు జరుపుతున్నారు. 2010లో నాటి అధ్యక్షుడు బరాక్ ఒబామా సంతకంతో అమల్లోకి వచ్చిన ఆరోగ్య పథకం కింద సేవలు పొందుతున్న అనేక మంది తాజా బిల్లు పరిధిలోకి రారేమోననే శంకతో ఉన్నారు. దీనికి దిగువ సభ ఆమోదం తెలిపింది. అయినా ఈ బిల్లుకు ఎగువ సభలో ఇబ్బందులు తప్పేలా లేవు. ట్రంప్ మాత్రం విశ్వాసంతో ఉన్నారు.

భౌగోళికంగా వాతావరణంలో వస్తున్న మార్పులు, పర్యావరణ పరిరక్షణపై పారిస్‌లో 2015 డిసెంబర్‌లో జరిగిన సమావేశంలో పాల్గొన్న 195 దేశాలు అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్‌లతో సహా అభివృద్ధి చెందుతున్న దేశాలు చైనా, భారత్, బ్రెజిల్ తదితర అన్ని దేశాల పర్యావరణానికి ముప్పు కలిగిస్తున్న గ్రీన్‌హౌస్ వాయువులను 2025 నాటికి 2005 నాటి స్థాయికి తగ్గించాలని ఒప్పందం చేసుకున్నాయి. అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా పారిస్ అగ్రిమెంట్‌కు ముందే 2014లో బొగ్గు, శిలాజ ఇంధన విద్యుత్ ప్లాంట్‌లను మూసివేయాలని, కార్బన్ ఉద్గారాలను 2005 స్థాయికి అంటే 30 శాతానికి తగ్గించాలని ఆదేశించడం జరిగింది. అయితే జాతీయవాద బావోద్వేగాలను రెచ్చగొట్టి, ప్రజాకర్షక నినాదాలతో అధికారం చేపట్టిన అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ ప్రజల ఆరోగ్యాన్ని, పర్యావరణాన్ని పణంగా పెట్టి ఒబామా నిర్ణయాలను చెత్తబుట్టలో పడేశాడు. ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంలో పారిస్‌లో జరిగిన పర్యావరణ పరిరక్షణకు చేసుకున్న ఒప్పందాలకు తూట్లు పొడిచాడు.

అమెరికాలో ఉద్యోగాలు పోతున్నాయని, పర్యావరణ పేరుతో బొగ్గు, శిలాజ ఇంధన ఉత్పత్తి తగ్గిపోవడంతో పరిశ్రమలు మూత పడుతున్నాయన్న వాదనలు ముందుకు తీసుకువచ్చి పారిస్ ఒప్పందానికి తిలోదకాలివ్వడానికి పూనుకున్నాడు. అధ్యక్ష ఎన్నికల్లోనే బొగ్గు, శిలాజ ఇంధన గనుల యజమానులకు, థర్మల్ విద్యుత్ ప్లాంట్‌ల యజమానులకు హామీ ఇచ్చాడు. దానికనుగుణంగానే గత మాసంలో కార్యనిర్వాహక ఉత్తర్వులను జారీ చేశాడు. పైపెచ్చు పర్యావరణం, గ్రీన్‌హౌస్ వాయువులు

అసలు సమస్యే కాదని, ఇది చైనా సృష్టి అని, అమెరికా ఉద్యోగాలను చైనా కొల్లగొట్టుకుపోవడానికేనని వితండ వాదనలు చేయడం ట్రంప్ జాత్యాహంకారానికి నిదర్శనం. అమెరికా ఉద్యోగావకాశాలను దెబ్బతీస్తున్న బొగ్గు, శిలాజ ఇంధన వనరుల ఉపయోగంపై ఆంక్షలు ఎత్తివేసి చరిత్రాత్మక నిర్ణయం తీసుకున్నట్లు ట్రంప్ చేసిన ప్రకటన ఆయా రంగాల పారిశ్రామికవేత్తలను సంతృప్తిపరిచింది తప్ప, అమెరికా మేధావులను, శాస్త్రజ్ఞులను, విద్యావేత్తలను ఎవరినీ మెప్పించలేదు. ట్రంప్ నిర్ణయం అమెరికాకే పరిమితమనుకుంటే తప్పిదమవుతుంది. భూతాపం 2 డిగ్రీల సెల్సియస్ దాటితే ప్రపంచం మొత్తం తీవ్ర ప్రమాదంలో కూరుకుపోవడమే కాక సకల ప్రాణికోటి ప్రాణాలతో జీవించడం కష్టమవుతుంది.

ఎన్నికల ముందు 'నాటో' కూటమి దుర్మార్గమైనదని, దాని నుంచి అమెరికా బయటకు రావాల్సిందేనన్న ట్రంప్ ఇప్పుడది చాలా మంచి దంటున్నారు. అప్పుడు రష్యా మంచిదన్నారు. ఇప్పుడు చెడ్డదంటున్నారు. సిరియా అధ్యక్షుడు అసద్‌ను అప్పుడు మంచివాడన్నారు. ఇప్పుడు దుర్మార్గుడంటున్నారు. ట్రంప్ అవకాశావాదానికి ఇవి కొన్ని మచ్చు తునకలు మాత్రమే. ఇడ్లిబ్‌లోని ఖాన్ షెఖాన్ ప్రాంతంలో అసద్ ప్రభుత్వం రసాయనిక దాడికి దిగిందన్న ప్రచారంలో నిజానిజాలు నిర్ధారణ కాకముందే సిరియా ప్రభుత్వ విమానాశ్రయంపై క్షిపణి దాడికి ట్రంప్ ఆదేశించారు. 30 మంది అమాయక పౌరుల ప్రాణాలను బలిగొన్నారు. నిజానికి ఆ రసాయనిక దాడికి అసద్ ప్రభుత్వానికి ఏమాత్రమూ సంబంధం లేదని అమెరికన్ పాత్రికేయుడు సైమర్ హర్ష్ దర్యాప్తులో తేటతెల్లమైంది.

మిడిల్ ఈస్ట్ ఘర్షణల నుంచి దూరంగా ఉంటానని అధ్యక్ష ఎన్నికల ప్రచారంలో హామీనిచ్చిన ట్రంప్ ఇప్పుడు మిడిల్ ఈస్ట్ వివేకిగా వ్యవహరిస్తున్నారు. రెబల్స్‌పై రసాయనిక దాడికి ప్రతీకారమంటూ సిరియాపై బాంబుల వర్షం కురిపించాడు. రసాయనిక దాడులకు అసద్ ప్రభుత్వమే కారణమన్న ట్రంప్ వాదనను పలు మానవహక్కుల సంస్థలు ప్రశ్నించాయి. ఈ అంశంలో మూడవ పక్షంతో దర్యాప్తు జరిపించాలి. అంతర్జాతీయ పరిస్థితి చాలా గంభీరంగా ఉంది. తనకొక్కడికే దోషి ఎవరన్నది నిర్ణయించే హక్కు లేదన్న విషయాన్ని ట్రంప్‌కు తెలియ జెప్పాల్సిన అవసరం ఎంతైనా ఉంది. అఫ్ఘనిస్తాన్‌లో తాలిబాన్లను వేటాడే పేరుతో అతిపెద్ద అణుయేతర బాంబును ఆ దేశంపై అమెరికా ప్రయోగించింది. ఇటువంటి దుందుడుకు చర్యలు తాను చేస్తే ఒప్పు, ఇతరులు చేస్తే ఉగ్రవాదం అని ముద్ర వేయడం అమెరికాకే చెల్లింది. విదేశీ విధానంలో ట్రంప్ తన ఏకఛత్రాధిపత్యాన్ని ప్రమాదకర స్థాయికి తీసుకువెళ్లారు. మిగతా దేశీయుల భద్రత తనకు పట్టనట్లుగా కేవలం అమెరికా పౌరుల భద్రతకు హామీనిచ్చేట్లుగానే ఆయన మాట్లాడుతున్నారు. నేడు ప్రపంచంలో యుద్ధతరహా వాతావరణం ఉంది. అమెరికా ఏ క్షణాన్నైనా ఉత్తర కొరియాపై క్షిపణులు, వైమానిక దాడులకు తెగబడొచ్చు. తాజాగా ఉత్తరకొరియాపై దాడికి సన్నాహంగా ట్రంప్ ఇటువంటి దుష్ప్రచారాన్నే సాగిస్తున్నారు.

1950-53 కొరియా యుద్ధంలో అమెరికా బాంబుల వర్షం కురిపించి దాదాపు 30 శాతం మంది ఉత్తర కొరియా ప్రజలను పొట్టన పెట్టుకుంది. ఆ దురంతం గురించి అమెరికా మరచిపోవచ్చేమో కానీ ప్రపంచం ఇంకా మరచిపోలేదు. అక్కడ ఇరాక్‌ను, దుష్టరాజ్యంగా ముద్రవేసి దాడిచేసిన అమెరికా, ఇప్పుడు ఉత్తర కొరియాపై కూడా అదే విధంగా దాడి చేయాలని చూస్తున్నది. ఇందుకు రకరకాల కుట్ర సిద్ధాంతాలను తెరపైకి తీసుకొస్తున్నది. ట్రంప్ మూడు నెలల పాలనలో చేపట్టిన ఈ దుందుడుకు చర్యలన్నీ అమెరికా సామ్రాజ్యవాద స్వభావ్‌లో మౌలికంగా ఎలాంటి మార్పు రాలేదని మరోసారి ప్రపంచానికి తేటతెల్లం చేశాయి.

రెండవ ప్రపంచ యుద్ధానంతర రాజకీయాల మూలంగా 1953-56 మధ్య జరిగిన కొరియా యుద్ధంలో అమెరికాకు వ్యతిరేకంగా కొరియా వీరోచితంగా పోరాడింది. ఈ యుద్ధంలో 30 లక్షలకు పైగా చనిపోయారు. 22 నగరాలు నేలమట్టమయ్యాయి. 1956లో కొరియా ద్వీపకల్పం ఉత్తర కొరియా, దక్షిణ కొరియాగా విడిపోయింది. ఉత్తర కొరియా సోవియెట్ యూనియన్, చైనా దేశాల ప్రాబల్యంలో ఉంటే, దక్షిణ కొరియా అమెరికా కూటమి చేతిలో ఉన్నది. యుద్ధ విరమణ తర్వాత దక్షిణ కొరియాలలో క్షిపణులు, అణుబాంబులు ఉత్తర కొరియాకు, చైనా, రష్యాలకు వ్యతిరేకంగా మోహరించబడినవి. 1950 దశకం చివర 1960 దశకం ఆరంభంలో దక్షిణ కొరియాలో అన్ని రకాల యుద్ధ క్షిపణులు, యుద్ధ విమానాలు మోహరించబడినవి. బీ-61 న్యూక్లియర్ బాంబర్లు మొదలైనవి ఉంచబడినవి. 1980 మధ్య నాటికి 1720 అణు క్షిపణులు దక్షిణ కొరియాలో అమెరికా ఉంచింది.

అమెరికా, దక్షిణ కొరియాలు కలిసి సంవత్సరంలో కనీసం 40 దళాలు ఉత్తర కొరియా, చైనాకు వ్యతిరేకంగా నావికా విన్యాసాలు చేస్తున్నాయి. గువాన్ దీవుల్లో నౌకాస్థావరాలు ఏర్పాటు చేయబడినవి. అణ్వాయుధాలు, యుద్ధనౌకలు మోహరించబడినవి. ఆసియా-పసిఫిక్‌లో 5 లక్షలకుపైగా అమెరికా, దక్షిణకొరియా దళాలు చైనా, ఉత్తర కొరియాకు వ్యతిరేకంగా తరలించారు. గత్యంతరం లేని పరిస్థితుల్లో కొరియా సమస్యకు పరిష్కారం లభించక తన ఉనికిని కాపాడుకోటానికి సార్వభౌమాధికారాన్ని రక్షించుకోవటానికి ఉత్తర కొరియా ఉపక్రమించి అణ్వాయుధ పరిశోధనలు జరిపి అణ్వస్త్ర దేశంగా తయారు కావల్సి వచ్చింది. ఒక సార్వభౌమత్వ దేశంగా దానికి ఆ హక్కు ఉంది. దీనిని కాదనే హక్కు అమెరికాకు ఎక్కడిది?

ఇప్పుడు నాటో, చైనా మధ్య ప్రాబల్యం కోసం సాగుతున్న పోరాటంలో మళ్లా కొరియా ద్వీపకల్పం సంక్షోభంలో పడ్డది. ఇటీవల అమెరికా దక్షిణ చైనా సముద్రంలోని చిన్నదేశాలను చేరదీసి, అక్కడ తన బలగాలను పెంచి చైనాను దెబ్బకొట్టాలని ప్రయత్నించింది. కానీ తన చిరకాల మిత్ర దేశం ఫిలిప్పీన్స్‌తో సహా ఆ ప్రాంత దేశాలు అమెరికా పథకంలో భాగం కావడానికి విముఖత చూపుతున్నాయి. చైనా ఆ ప్రాంతంపై అమెరికా పట్టు బిగియకుండా సవాలు చేస్తున్నది. అక్కడితో ఆగకుండా, అమెరికా దృష్టిని కొరియా ద్వీపకల్పం వైపు మళ్లించింది. ఎన్ని దేశాలు దాడిచేసినా ఉత్తర కొరియాలోని పాలక వ్యవస్థను దింపడానికి చైనా అనుమతించదు. దక్షిణ చైనా సముద్రం, కొరియా ద్వీపకల్పం రెండూ అమెరికా, చైనా ఘర్షణలకు కేంద్రాలు. ఈ రెండు చర్చల ద్వారా సదవగాహనకు వస్తే తప్ప శాంతి నెలకొనదు. నిరంతరం యుద్ధాలలో

మునిగిపోవడం ఏ దేశానికీ క్షేమదాయకం కాదు.

ఉత్తర కొరియాపై యుద్ధ సన్నాహాలను ట్రంప్ తీవ్రతరం చేస్తున్నాడు. కార్ల్ విన్సన్ యుద్ధ విమాన నౌకతోపాటుగా అనేక యుద్ధ నౌకలు కొరియా ద్వీపకల్పం చుట్టూ మోహరించబడ్డాయి. వీటికి జపాన్, ఆస్ట్రేలియా యుద్ధనౌకలు, అమెరికా జలాంతర్గాములు కూడా తోడై ఉత్తరకొరియాపై దాడికి సన్నద్ధంగా ఉన్నాయి. దక్షిణ కొరియా అధ్యక్షురాలు పార్క్ గియున్ హై పదవీచ్యుతులు కాగా ప్రస్తుతం ఎన్నికలకు దేశం సిద్ధమవుతున్న తరుణంలో 'థాడ్' క్షిపణుల రక్షణ వ్యవస్థను ఏ మాత్రం ఆలస్యం చేయకుండా అమెరికా మోహరించింది. ఉత్తర కొరియా దాయాది దేశమైన దక్షిణ కొరియాలో తన క్షిపణి విధ్వంసక వ్యవస్థ 'ద టెర్మినల్ హై ఆల్టిట్యూడ్ ఏరియా డిఫెన్స్ (టిహెచ్ఏఏడీ) సిస్టం'ను ఏర్పాటు చేసే ప్రయత్నాలు ముమ్మరం చేసింది. సియోంగ్జు పట్టణానికి సమీపాన గోల్ఫ్ కోర్టులో టీహెచ్ఏఏడీని ఏర్పాటు చేయనున్నారు.

'థాడ్' వ్యవస్థ శత్రుదేశాలు ప్రయోగించిన భారీ, మధ్యతరహా క్షిపణులను ప్రారంభంలోనే గుర్తించి ధ్వంసం చేస్తుంది. అధ్యక్ష ఎన్నికల్లో రెండవ స్థానంలో ఉన్న డెమోక్రాటి మూన్ జే-ఇన్ 'థాడ్' వ్యవస్థను వ్యతిరేకిస్తున్నాడు. ప్రజలు వ్యతిరేకిస్తున్నారు. ఎన్నికలు జరిగిన తరువాత పరిస్థితులు ఏ రకంగా మారనున్నాయోనని ముందుగానే ఊహించిన ట్రంప్ క్షణం కూడా ఆలస్యం చేయక థాడ్ వ్యవస్థను దక్షిణ కొరియా మధ్య సియోంగ్యు ప్రాంతంలోని గోల్ఫ్ కోర్టులో స్థాపించడం జరిగింది. బాలిస్టిక్ క్షిపణుల ఆయుధ పోటీల్లో థాడ్ వంటి రక్షణ కవచాలతో శత్రుదేశాలపై ఒక రక్షణ క్షిపణితో పాటు మరొక సాధారణ బాలిస్టిక్ క్షిపణిని ప్రయోగిస్తే రక్షణ క్షిపణి వ్యవస్థ ఉన్న వారిదే పైచేయి అవుతుంది.

క్షిపణి విధ్వంసక వ్యవస్థ ఏర్పాటుతో తమ రక్షణ వ్యవస్థ బలహీనం అవుతుందని చైనా భయపడుతున్నది. దీంతో అమెరికా చర్యలపై మండి పడింది. ఇలాంటి చర్యలు ఆసియా ప్రాంతంలో రక్షణ రంగ అసమానతలు పెంచుతాయని విమర్శించింది. మరోవైపు అమెరికా వ్యూహానికి ప్రతీగా చైనా పూర్తి స్వదేశీ పరిజ్ఞానంతో తయారు చేసిన యుద్ధవిమాన వాహక నౌకను లియోగింగ్ ప్రావిన్స్‌లోని దలియాన్ డాక్‌యార్డ్‌లో ఇటీవలనే జలప్రవేశం చేయించింది. ఈ నౌక 2020 నాటికి పూర్తిస్థాయిలో సిద్ధం కానున్నది. దక్షిణ చైనా సముద్రజలాలపై పట్టు పెంచుకోవడంతోపాటు, ఉత్తర కొరియాపై అమెరికా దూకుడు వైఖరికి సమాధానంగా ఈ నౌకను ప్రారంభించినట్టు నిపుణులు భావిస్తున్నారు.

ఉత్తర కొరియా అణ్వస్త్ర పరీక్షలతో ప్రస్తుతం ప్రపంచంలో, అణ్వాయుధ దేశాల్లో తీవ్రమైన చర్చకు అస్కారం లభించింది. ప్రపంచంలో కొన్ని దేశాలే ఎందుకు మారణాయుధాల్ని తయారు చేసుకోవాలి? మిగతా దేశాలు ఎందుకు తయారు చేయకూడదు? అనే ప్రశ్నలు వస్తున్నాయి. అదే సమయంలో అణ్వస్త్ర రహిత సమాజం సాధ్యం కాదా? అనే చర్చ కూడా విస్తారంగా జరుగుతుంది. ప్రపంచం మొత్తంలో 14,900 అణ్వాయుధాలు 9 దేశాల గుప్పిట్లో ఉన్నాయి. రష్యా 7000 అమెరికా 6,800, ఫ్రాన్స్ 300, చైనా 260, యు.కె. 215, పాకిస్థాన్ 130, ఇండియా 120, ఇజ్రాయిల్ 80, ఉత్తర కొరియా 20 లోపు కలిగి ఉన్నాయి. వీటి శక్తిసామర్థ్యాలు హిరోషిమా నాగసాకీల కంటే పదులరెట్లు ఎక్కువ. ఈ భూగోళాన్ని అనేకసార్లు విధ్వంసం చేయగల శక్తిగలవి. ఈ అణ్వాస్త్రాలన్ని శాంతిసాధనకేనా? ప్రపంచ ప్రజలెవ్వరూ అణ్వాయుధాల్ని కోరుకోవటం లేదు. అణ్వస్త్ర రహిత సమాజం కోసం కృషి జరగాలి. మొత్తం ప్రపంచం మిలిటరీ ఖర్చులో 38 శాతం పైగా అమెరికా ఖర్చు చేస్తుంది. ఈ మొత్తం ఖర్చు తన క్రిందనున్న రష్యా, చైనా, యు.కె., ఫ్రాన్స్, జర్మనీ, సౌదీఅరేబియా, ఇండియా, జపాన్‌ల వంటి పది దేశాలు కూడా చేయటం లేదు. ఇది ప్రపంచ దోపిడీ, మిలిటరీ ఆధిపత్యం కోసమే.

ప్రత్యక్షంగా ఉత్తరకొరియాపై, పరోక్షంగా చైనాపై యుద్ధ సన్నాహాల్ని ఆసియా పసిఫిక్ ప్రాంతంలో ట్రంప్ ప్రభుత్వం ముమ్మరం చేస్తోంది. ఆసియా పసిఫిక్ ప్రాంతంలో అమెరికా, దక్షిణ కొరియా, జపాన్, ఆస్ట్రేలియా మిలిటరీ మోహరింపుల అసలు ఉద్దేశం ఉత్తరకొరియా సమస్యనేకాదు. ఏటా 5 లక్షల కోట్ల డాలర్ల వాణిజ్యం దక్షిణ చైనా సముద్రమార్గం గుండా ఓడల ద్వారా జరుగుతుంది. ఈ రవాణాను మిలిటరీ పరంగా స్తంభింపజేసి చైనా ఆర్థిక వ్యవస్థను నాశనం చేయటమే అమెరికా లక్ష్యం. చైనాను దీర్ఘకాలిక ఆర్థిక, భౌగోళిక -రాజకీయ పోటీదారుగా అమెరికా భావిస్తున్నది. కొరియా ద్వీపకల్పం మీద అమెరికా రగిలిస్తున్న యుద్ధజ్వాల ఆసియా-పసిఫిక్ ప్రాంతంలో అమెరికా ఆధిపత్యాన్ని చైనాను అంగీకరింపజేయాలనే ప్రయత్నం ఉన్నది. ఈ దిశగా సమస్య తీవ్రతరాన్ని పరిగణలోకి తీసుకొంటే, ఉత్తరకొరియాపై జరిగేదాడి చైనాపై జరిగినట్లే భావించాలి.

థాడ్ రక్షణ వ్యవస్థ పరోక్షంగా చైనా రష్యాలపై గురిచేసినట్లే గ్రహించాలి. ఒకవేళ కొరియా ద్వీపకల్పంలో యుద్ధం సంభవిస్తే అంతర్జాతీయ సంబంధాల్లో తీవ్ర ప్రతిబంధకాలు ఏర్పడనున్నాయి. మధ్యప్రాశ్చ్యాన్ని ఇప్పటికే చింపిన విస్తరిలా తయారు చేసిన అమెరికా సామ్రాజ్యవాదం అదే పంథాను ఆసియా-పసిఫిక్ ప్రాంతంలోను అనుసరించాలనుకొంటే మానవాళి క్షమించదు. శాంతి చర్చలతో పాటుగా అమెరికా సామ్రాజ్యవాదాన్ని ఆసియా పసిఫిక్‌లో ఎదుర్కోవటానికి ఉత్తరకొరియా, వియత్నాం, లావోస్, ఫిలిప్పీన్స్, చైనా, రష్యాల కూటమి అవశ్యకత నేడుంది. ఉత్తర కొరియా సార్వభౌమాధికారానికి ఈ కూటమి భరోసానిచ్చి తనపైనున్న ఆర్థిక ఆంక్షల ఎత్తివేత ద్వారా ఉద్రిక్తల నివారణకు ప్రయత్నాలు జరగాలి.

ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థలో దీర్ఘకాలంగా కొనసాగుతున్న సంక్షోభం నేపథ్యంలో అమెరికా విదేశాంగ విధానాన్ని అంచనా వేయాలి. ప్రపంచ స్థాయి, దేశీయ సంక్షోభాల నుంచి బయటపడటానికి యుద్ధం ఒక్కటే పరిష్కార మార్గమని అమెరికా పాలక వర్గాలు భావిస్తున్నాయి. 2008 సంవత్సరంలో ఏర్పడిన ఆర్థిక సంక్షోభం ఆస్తుల బుడగలు పగలటానికి దారితీసింది. తత్ఫలితంగా ఆర్థికాభివృద్ధిలో స్తబ్దత ఏర్పడింది. ఎంతగా ప్రయత్నించినప్పటికీ ఈ స్తబ్దత మంచి ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ కోలుకోకపోవటంతో సామ్రాజ్యవాద దేశాల పాలక వర్గాలు బెంబేలెత్తుతున్నాయి. అందుకే ఆర్థిక సంక్షోభం నుంచి బయటపడటానికి ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ యుద్ధాన్ని మార్గంగా ఎంచుకున్నది. నిజానికి యుద్ధం మూలాలు పెట్టుబడిదారీ వ్యవస్థ, సామ్రాజ్యవాదం, జాతి రాజ్యం స్వభావంలో ఉన్నాయి.

ఒకవైపు తూర్పు ఆసియా పరిణామాలపై ప్రపంచం తన దృష్టిని

# ఉద్యమాలకు చిరునామా ఉస్మానియా

*వంద సంవత్సరాలు పూర్తి చేసుకున్న ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థులకు విద్యాబుద్ధులతో పాటు ఉద్యమ పాఠాలు కూడా నేర్పిందనీ, చరిత్రలో నిలిచిపోయే ఎందరో ఉద్యమ సారథులను అందించిందనీ అంటున్నారు* **బైరెడ్డి సతీష్**

రాజరికపు రాపిడిలో నలుగుతున్న హైదరాబాద్ రాజ్యంలో బుద్ధిజీవుల చొరవ, సామాజిక ఒత్తిడితో ఉస్మానియా విశ్వవిద్యాలయం పురుడుపోసుకున్నది. ఆనాటి విద్యావంతులైన యువజనుల కృషి హైదరాబాద్ ఎడ్యుకేషన్ కాన్ఫరెన్స్-నిజాం రాజ్యంలో ఉర్దూ మాధ్యమంగా ఉన్నత విద్య, శాస్త్ర విజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞాన పరివ్యాప్తికై విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పాలనే సంకల్పమే 1917 ఏప్రిల్ 26న నిజాం ప్రభుత్వం ఫర్మానా రూపంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం నెలకొల్పేలా చేసింది. ఉర్దూ మెజారిటీ ప్రజల భాష కానప్పటికీ అది రాజ భాష అవడంవల్ల ఉర్దూ మాధ్యమంలో తొలి విశ్వవిద్యాలయంగా ఉస్మానియా విశ్వవిద్యాలయం రూపుదాల్చింది.

ఈ వంద సంవత్సరాల సుదీర్ఘ ప్రస్థానంలో సమాజపు కులీన వర్గాలతో పాటు అనేక ఇతర సామాజిక శ్రేణులకు, భాషలకు విస్తరించి ఒక నిరంతరాయ సంబంధాన్ని కొనసాగిస్తూనే ఉన్నది.

1928లో ఈ విశ్వవిద్యాలయానికి నిజాం ఆస్థానంలో సంగీత, సాహిత్య నృత్య రంగాల్లో, రాజకీయ రంగంలోనూ పేరుగాంచిన మహ్లాఖా భాయిచందా జాగీరు అయిన అడిక్‌మెట్ నుండి రెండున్నర వేల ఎకరాల భూమిని నిజాం కెటాయించడం జరిగింది. దర్జాగా దర్పంతో నిలబడి ఉస్మానియా అనగానే అందరికి స్ఫురించే ఆర్ట్స్ కాలేజీ 1923 జూలై 23న నిర్మాణం ప్రారంభమయి పదహారేళ్ల తర్వాత 1939 డిసెంబర్ 4న పూర్తయింది. రామాంతపూర్ వెనక ఉన్న గుట్టను ఆరడుగుల ఎత్తు, పొడవుగా ఉన్న బండరాళ్లుగా తొలిచి తళుకుబెలుకులతో ఉన్న ఆర్ట్స్ కాలేజీ నిర్మాణం జరిగింది. నిప్పులు కురిసే మండుటెండలోనైనా లోపలికి అడుగు పెట్టగానే చల్లని గాలులు ఒంటిని తాకే ఆర్ట్స్ కళాశాల భవనాన్ని తెలంగాణ ఒడ్డెరులు తమ నెత్తురును చెమటగా మార్చి గొప్ప కళా ఖండంగా మలిచారు.

శ్రమ సౌందర్యానికి నిలువెత్తు నిదర్శనంగా నిలబడి ఉన్నది ఆర్ట్స్ కాలేజీ. ఆ కాలేజీ వెనుకాలే ఆనాటి ఒడ్డెరుల వారసులు వడ్డెరబస్తి (మాణికేశ్వర్‌నగర్)లో నివాసం ఏర్పరచుకున్నారు. ఆ తర్వాత క్రమంలో లా కళాశాల, ఇంజనీరింగ్, సైన్స్, బిఇడి కళాశాల వంటి ఎన్నో చారిత్రక భవనాలు ఈ విశ్వవిద్యాలయంలో రూపుదిద్దు కున్నాయి. యూనివర్శిటీలో ప్రతి కట్టడం ఓ కళాఖండమే. కళాశాలలకు అనుబంధంగా నిర్మించిన ప్రతి హాస్టల్‌ది ఒక్కో చరిత్ర.

ఆర్ట్స్ కాలేజీలోని రూం నెంబర్ 57 మాత్రం ఎన్ని వేల మీటింగులకు, అభిప్రాయాల కలబోతకు వేదికయ్యిందో. యూనివర్శిటీలోని ఏ కళాశాల విద్యార్థి అయినా ఒక్కసారైనా ఆర్ట్స్ కాలేజీ రూం నెంబరు 57లో అడుగుపెట్టే ఉంటారు. అంతటి చారిత్రక పాత్రను పోషించింది ఆ రూం. ఆర్ట్స్ కాలేజీ ఆవరణలో ఏ ఉద్యమం బగ్గుమనాలన్నా ఈ రూం నెంబర్ 57లో రగులుకొనాల్సిందే. అంతటి ప్రాముఖ్యతను కలిగిన పాత్రను కలిగి ఉన్నది. ఆ మాటకొస్తే యూనివర్సిటీలోని అన్ని ప్రాంతాలు ఉద్యమ వ్యూహ క్షేత్రాలే. ప్రతి హాస్టల్ ముందున్న టీ కొట్టో, అందమైన లాండ్‌స్కేప్ ఆవరణనో, లైబ్రరీ మెట్లో, క్యాంటీన్ కుర్చీలలో కూర్చొని ఏదో అంశాన్ని మాట్లాడడమో, మదించడమో జరుగుతుండేది.

---

సారిస్తుండగానే మరోవైపు సిరియా, రష్యాలకు వ్యతిరేకంగా అమెరికా కవ్వింపు చర్యలకు పాల్పడుతున్నది. ఈ రెండు ప్రాంతాలలో జరుగుతున్న ఘర్షణలు జరగకూడని అణ్వస్త్ర యుద్ధానికి దారితీసేవే. ఈ నేపథ్యంలో సిరియాపై అమెరికా క్షిపణి దాడి చేయడాన్ని నిరసిస్తూ లక్షలాది మంది అమెరికాలో ఆందోళన చేశారు. అలాగే దక్షిణ కొరియాలోని సియోంగ్జు పట్టణంలో స్థానికులు అమెరికాకు వ్యతిరేకంగా నిరసన చేపట్టారు. అమెరికా ట్రక్కులు వస్తున్న సమయంలో ప్లకార్డులు, బ్యానర్లు పట్టుకొని 'యుద్ధం వద్దు' 'అమెరికా నువ్వు మాతో స్నేహం చేస్తున్నావా? మా దేశాన్ని ఆక్రమిస్తున్నావా?' అంటూ నిరసన తెలిపారు.

ట్రంప్ యుద్ధోన్మాద విదేశాంగ విధానాన్ని అమెరికాలోని రెండు ప్రధాన పార్టీలైన డెమోక్రాట్లు, రిపబ్లికన్లు స్వాగతిస్తున్నారు. నిరంతర యుద్ధాలు, తీవ్ర స్థాయి సామాజిక అసమానతలు అమెరికాలోని ఉదార ప్రజాస్వామిక వ్యవస్థ పునాదులను బలహీనపర్చాయి. ట్రంప్ అమెరికా అధ్యక్షుడిగా ఎన్నికవటమే ఉదారవాద బూర్జువా విలువల పతనాన్ని సూచిస్తున్నది. కార్పొరేట్ ప్రయోజనాలకు అమ్ముడుపోయే అవినీతిపరులైన ధనవంతులతో అమెరికన్ కాంగ్రెసులోని ఇరు సభలు నిండిపోయాయి. అమెరికన్ మీడియా ప్రభుత్వ ప్రచారానికి బాకాగా మారింది. ఒకసారి యుద్ధం అంటూ మొదలైతే అది అక్కడితో ఆగదు. పూర్తిస్థాయి యుద్ధంగా మారవచ్చు. మూడో ప్రపంచ యుద్ధానికి దారితీసినా తీయొచ్చని నిపుణులు చెబుతున్న దాన్లో నిజం లేకపోలేదు. దీని పర్యవసానాలు కూడా చాలా తీవ్రంగా ఉంటాయి. అందువల అమెరికా యుద్ధోన్మాదానికి, సామ్రాజ్యవాద జోక్యానికి వ్యతిరేకంగా, ప్రపంచ వ్యాప్తంగాను కార్మికులను, యువతను రాజకీయంగా సమీకరించి ఒక బలమైన సామ్రాజ్యవాద వ్యతిరేక శాంతి ఉద్యమాన్ని నిర్మించాలి. తద్వారా మాత్రమే యుద్ధాలను, అవి చేసే నరమేధాన్ని అడ్డుకోగలం.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

హైదరాబాద్ రాజ్యాన్ని భారత సైన్యాలు సైనిక చర్యతో కలిపేసు కున్నాక 'ఆధునికుడైన' నెహ్రూ సూచనలతోనే విశ్వవిద్యాలయం ఉర్దూ నుండి ఇంగ్లిష్ బోధనా భాషగా మారిపోయింది.

1963లో ప్రారంభమైన ఉస్మానియా లైబ్రరీ సుమారు 5,33,859 పుస్తకాలు, అనేక జర్నల్స్, థీసిస్‌లు, మ్యాన్‌స్క్రిప్ట్స్, డిజిటల్ డాక్యుమెంటరీలతో వేలాది మంది విద్యార్థులకు, పరిశోధకులకు ఉపయోగపడుతుంది. పర్షియన్, హిబ్రూ, టర్కిష్, తమిళ్, మళయాలం, కన్నడ, ఉర్దూ, హిందీ, ఇంగ్లిష్ భాషల్లో వేలాది గ్రంథాలు ఈ గ్రంథాలయంలో అందుబాటులో ఉన్నాయి. నిజానికి ఈ గ్రంథాలయం ఉద్యమ పుస్తకాల కంటే ఉద్యోగ పుస్తకాలకే నిలయంగా ఉన్నదని చెప్పుకోవాల్సిందే.

స్థానిక విద్యార్థులే కాకుండా దేశ విదేశీ విద్యార్థులు కూడా ఈ కళాశాలలో విద్యనభ్యసిస్తున్నారు. దేశంలోని మిగతా విశ్వవిద్యాలయాలకు ఉస్మానియాకు ఉన్న మౌలికమైన తేడా అంతా ప్రజాపోరాట వారసత్వాన్ని ముందుతీసుకు పోవడంలోనూ, నిరంతరాయంగా సమాజంతో సజీవ సంబంధాలను కొనసాగిస్తూ ప్రజాప్రత్యామ్నాయ వ్యవస్థను నిర్మించే ప్రక్రియలో ప్రత్యక్ష భాగస్వామ్యాన్ని కలిగి ఉండడం. సమాజం నుండి స్వీకరిస్తూనే సమాజ పురోగమనానికి అవసరమైన ఇంధనంగా ఉపయోగపడడం. మిగతా విశ్వవిద్యాలయాలు అప్రజాస్వామిక చర్యలను, ఫాసిస్టు భావజాలాన్ని అడ్డుకునే పోరాటంలో భాగమైనప్పటికీ నిరంతరం సమాజంతో ఒక ఆర్గానిక్ రిలేషన్‌ను నిలిపి ఉంచలేకపోయినవి. బహుశా ఈ సమాజపు చారిత్రక, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక స్వభావం, నేపథ్యం, పోరాట అనివార్యత వల్ల కావచ్చు భిన్నమైన గుణాత్మకమైన చారిత్రక పాత్రను ఉస్మానియా విశ్వవిద్యాలయం పోషించింది.

విద్యారంగంలో ఒక విశ్వవిద్యాలయంగా ఉస్మానియా యూనివర్సిటీ గొప్ప అకాడమిక్ రికార్డులను నెలకొల్పక పోవచ్చు, నూతన ఆవిష్కరణలు చేయలేకపోవచ్చు కాని మొత్తంగా సమాజంలో విద్యారంగం, అది పాదుకొల్పాల్సిన విలువలు, ప్రజల్ని పట్టించుకోవాల్సిన అనివార్యతను మాత్రం ఆవిష్కరించింది.

విశ్వవిద్యాలయంగా సమాజంలోని అనేక సంక్లిష్ట సమస్యలను విడివిడిగా అధ్యయనం చేయడం, పరిశోధించడం ద్వారా వాటికి పరిష్కారాలు సంపూర్ణంగా చూపెట్టకపోయిందేమోగాని ఉస్మానియా విశ్వవిద్యాలయం మొత్తంగా పునాది రంగాన్నే మార్చే, వ్యవస్థను సమూలంగా సంస్కరించే ప్రత్యామ్నాయ రాజకీయాలకు కేంద్రమయింది. బహుశా ఇంకే విశ్వవిద్యాలయం ఇవ్వని బుద్ధిజీవుల్ని, త్యాగధనుల్ని ఈ యూనివర్సిటీ సమాజానికి అందించింది.

ప్రాణత్యాగాలు చేసిన తరం ఈ యూనివర్సిటీలో ఉన్నంతగా మరో విశ్వవిద్యాలయంలో బహు తక్కువగా ఉండచ్చేమో. చదువంటే ఏదో ఒక సబ్జెక్టును ఎంచుకొని అధ్యయనం చేసి ఉద్యోగం సంపాదించి జీవితంలో హాయిగా స్థిరపడి సుఖపడడమనే అవగాహన నుండి చదువంటే సమాజంలోని సకల దుఃఖాల మూలాలను శోధించి సమూలంగా మార్చివేసే రాజకీయ పంథాను ఎన్నుకొని దుఃఖం లేని నూతన సమాజ ఆవిష్కరణ అనే ప్రాపంచిక అవగాహన కలిగించి జీవితాన్ని మల్లెల్లా అర్పించిన మహా మనుషులకు వేదికయింది ఉస్మానియా విశ్వవిద్యాలయం.

యూనివర్సిటీ అధ్యాపకుల చొరవతో ఏర్పడిందే కామ్రేడ్స్ అసోసియేషన్. ఫిలాసఫీ ప్రొఫెసర్ ఆలంఖుంద్ మేరీ, విద్యార్థులను సంఘటిత పర్చిన ఎస్.ఎం. జవాద్ రజ్వీ, తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటానికి పిలుపునిచ్చిన మగ్దూం మొహియుద్దీన్ ఉస్మానియా విద్యార్థి కాకపోయినా ఉద్యమ జీవితమంతా ఉస్మానియాతో పెనవేసుకొని పోయినదే. కరుడుగట్టిన భూస్వామ్యానికి దానికి వెన్నుదన్నుగా ఉన్న నిజాం రాజ్యానికి వ్యతిరేకంగా సాగిన పోరాటంలో ఉస్మానియా విద్యార్థులది, అధ్యాపకులదే అత్యంత కీలకమైన పాత్ర. వెట్టిచాకిరి, కట్టుబానిసత్వం, ఆర్థిక దోపిడి, సామాజిక పీడన అణచివేతలపై తిరుగుబాటు జెండా ఎగిరేసి సాయుధ మార్గంలో పయనించిన అనేక మంది ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఉస్మానియాతో సంబంధం ఉన్నవారే.

దేశంలోనే పురాతన యూనిర్సిటీలలో ఏడవది, దక్షిణ భారతదేశంలో మూడవది అయిన ఉస్మానియా యూనివర్సిటీ చైతన్యవంతమైన సామాజిక ఒత్తిడితో ఉనికిలోకి రావడమేకాదు అది స్థానిక వనరులపై, ఉపాధి ఉద్యోగ అవకాశాలపై స్థానికేతరుల పెత్తనాన్ని నిరసిస్తు నిలబడిన చైతన్యం ఈ వందేళ్ల చరిత్ర పొడుగూతా చిక్కనవుతూ, విస్తృతమవుతూ వస్తున్నది.

స్థానిక ఉద్యోగ అవకాశాలకు రక్షణనిచ్చే ముల్కీ నిబంధనలు పూర్తి స్థాయిలో అమలు కాకపోవడానికి వ్యతిరేకంగా, పరాయి ప్రాంతంనుండి వచ్చిన వారికి నిజాం సర్కారు కొలువులివ్వడం మీద తిరగబడిన ఉద్యమం మొదలు జాతీయోద్యమం, ప్రత్యేక తెలంగాణ ప్రజా ఉద్యమం, దేశాన్నే కుదిపేసిన నక్సల్బరీ గర్జనలోనూ, అస్థిత్వ రాజకీయాలకు, రిజర్వేషన్ అనుకూల ఉద్యమానికి, వర్గీకరణ వంటి అనేక ప్రజాస్వామిక, న్యాయమైన ఉద్యమాలకు ఉస్మానియా నాయకత్వాన్ని, మేధోజ్ఞానాన్ని ఇవ్వడమే కాకుండా అసమాన త్యాగాలతో వాటిని పరిపుష్టం చేసింది. సమాజ పురోభివృద్ధికి, చలనానికి మరింత ఊపును శక్తిని అందించింది. తను నడుస్తున్న చరిత్ర చేత ప్రభావితం అవడమే కాకుండా ఆ చరిత్రను కూడా ప్రభావితం చేసే, చరిత్రను మలుపు తిప్పిన అనేక కీలక ఘటనల్లో, పరిణామాల్లో కేంద్రంగా నిలబడింది.

నిజాంను స్తుతించే గీతమైన 'తా అబద్ ఖాలిఖే ఆలం' స్థానంలో వందేమాతరం అంటూ అనాటి రాజ్య ధిక్కారానికి ప్రతీక ఉన్న గీతాన్ని ఉస్మానియా విద్యార్థులు సామూహికంగా ఆలపించడం, ఆ ధిక్కారాన్ని సహించని నిజాం ప్రభుత్వ యంత్రాంగం విద్యార్థుల గొంతునొక్కే ప్రయత్నం చేసినా, నిర్బంధాన్ని విధించినా దాన్ని ధిక్కరిస్తూ సాగిన ఆనాటి విద్యార్థుల సమ్మె, అనేక అనుబంధ కళాశాలల విద్యార్థుల సంఘీభావం, ఆ ఉద్యమ ధాటికి దిగిరాక తప్పని స్థితి ఉస్మానియా విశ్వవిద్యాలయం చరిత్ర తొలినాళ్లలో జరిగిన సంచలనం.

పటేల్ సైన్యాల దాడితో ఇండియన్ యూనియన్‌లో హైదరాబాద్ రాజ్యంను విలీనం చేసుకున్నాక ఏర్పడిన సైనిక పాలనలోనూ ఆ తర్వాతి పౌర పాలనలోనూ ఉర్దూ భాషకు ప్రాధాన్యత తగ్గించి ఇంగ్లిష్ అధికారులను మద్రాసు నుండి రప్పించి హైదరాబాద్ రాజ్యంలో నింపడం, ఉద్యోగ నియామకాలలో వారికే ప్రాధాన్యత ఇవ్వడంతో స్థానికుల్లో ప్రత్యేకించి ఉస్మానియా విద్యార్థి లోకంలో రగిలిన అసంతృప్తి జ్వాలలు ముల్కీ ఉద్యమ రూపంలో బయటపడ్డాయి. ఏకంగా ముఖ్యమంత్రి వాహనాన్నే తగులబెట్టే స్థాయిలో ఈ ఉద్యమం కొనసాగడం, ఉద్యమిస్తున్న విద్యార్థులపై పోలీసులు కాల్పులు జరపడంతో ఐదుగురు విద్యార్థులు ప్రాణాలు కోల్పోయారు. అట్లా మొదలైన విద్యార్థుల ప్రత్యక్ష కార్యాచరణ

యూనివర్సిటీ స్వతంత్రత విషయంలో ప్రభుత్వం జోక్యం చేసుకున్న ప్రతి సందర్భంలోనూ చాలా క్రియాశీలంగా తిరగబడింది.

1967 నక్సల్బరీ వసంత మేఘ గర్జన, 1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఉస్మానియా విద్యార్థి లోకాన్ని తీవ్రంగా ప్రభావితం చేసాయి. ఒకవైపు దేశంలోనూ, స్వరాష్ట్రంలోనూ ఇలాంటి పరిణామాలు, మరోవైపు అంతర్జాతీయంగా ఫ్రెంచ్ విద్యార్థుల పోరాటాలు, చైనా శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవ ప్రభావం కూడా ఈ విద్యార్థులపై తీవ్రంగానే పడింది.

తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర పోరాటంలోనైతే 370 దాకా అమరు లయ్యారు. వీరిలో అత్యధికులు ఉస్మానియా విద్యార్థులే. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంపై ఉక్కుపాదం మోపడంతో అనేక విద్యార్థి నాయకులు విప్లవోద్యమంలోకి ప్రవేశించి పూర్తిస్థాయి ప్రజాఉద్యమ కార్యకర్తలుగా, నాయకులుగా ఆ తదుపరి భారత విప్లవ రాజకీయాలకు దిశానిర్దేశం చేశారు. ఈ నేపథ్యంలోనే సాంస్కృతిక జాతీయ వాదంతో ముందుకు వచ్చిన మతోన్మాదులు ఎబివిపి రూపంలో మనువాద బ్రాహ్మణీయ తాత్వికతను ఒంటబట్టించుకొని సమాజ గమనాన్ని వెనక్కితిప్పే పనిలో నిమగ్న మయ్యారు.

ప్రగతిశీల భావాలను, ఆ భావాలను ముందుకుతెచ్చే విద్యార్థి నిర్మాణాలను అడ్డుకోవాలనే కుట్రలో భాగంగానే విప్లవ విద్యార్థి నాయకుడైన జార్జిరెడ్డిని ఎబివిపి, సంఘ్‌పరివార్ శక్తులు కత్తులతో దాడిచేసి పాశవికంగా హత్యచేసి, నూరు పూలు వికసించి నూరు ఆలోచనలు సంఘర్షించాల్సిన చోట నెత్తుటి మడుగును ఏర్పరచి అనాగరిక సంస్కృతికి తెరలేపాయి. ఫిజిక్స్‌లో గోల్డ్ మెడలిస్ట్, నిరంతర అధ్యయనశీలి, మరో ప్రపంచ స్వాప్నికుడైన జార్జిరెడ్డిని మతోన్మాద శక్తులు పొట్టనపెట్టుకున్నా ఉస్మానియా ఉద్యమ కెరటాలను ఆపడం వారి తరం కాలేదు.

1974లో ఏర్పడిన రాడికల్ విద్యార్థి సంఘం (ఆర్‌ఎస్‌యు)తో విద్యార్థి రాజకీయాలు మరింత వేడెక్కాయి. తర్వాతి కాలంలో దేశంలో ఎమర్జెన్సీ విధించడంతో అనేక విప్లవ విద్యార్థి సంఘ నాయకులు అజ్ఞాతంలోకి వెళ్లిపోయి వారి కార్యాచరణకు మరింత పదునెక్కించారు. 1975లో గిరాయిపెల్లి ఎన్‌కౌంటర్‌లో సూరపనేని జనార్ధన్, మురళిమోహన్, ఆనంద్‌రావుల అమరత్వం, అదే సంవత్సరంలో నీలం రాంచంద్రయ్య, జంపాల్ ప్రసాద్‌లను ఎన్‌కౌంటర్ పేరుతో చంపివేశారు. పిడిఎస్‌యు విద్యార్థి నేత శ్రీహరిని పాకాల చెరువు వెనుక కాల్చి చంపారు.

1978లో ఆర్‌ఎస్‌యు ఇచ్చిన 'గ్రామాలకు తరలండి' క్యాంపేయిన్ విద్యార్థి లోకాన్ని పల్లెవాకిళ్ల ముందు నిలబెట్టింది. భూ సంబంధాల అధ్యయనం కోసం, భూముల్ని భూమిలేని ప్రజలకు స్వాధీన పర్చడం మొదలు అణగారిన వర్గాల్లో విశ్వాసాన్ని, ఉత్తేజాన్ని నింపి రాజ్యాధికార లక్ష్యంగా నడిపించే పోరాటానికి మరింత పదును పెట్టింది.

జగిత్యాల జైత్రయాత్ర, సిరిసిల్ల రైతాంగ పోరాటాలకు క్రియాత్మకమైన, సృజనాత్మకమైన చేయూత అందించింది. ఈ వెల్లువలోంచే మల్లోజుల కోటేశ్వర్‌రావు ఉస్మానియా నుండి కరీంనగర్, జంగల్ మహల్ వరకు జంగుసైరన్ ఊదాడు. ఎర్రంరెడ్డి సంతోష్‌రెడ్డి తన మేధోకృషిని విప్లవోద్యమానికి అందించి విప్లవ నాయకునిగా ఎదిగిన క్రమంలో తొలి అడుగు పడింది ఆర్ట్స్ కాలేజీ నుండే. విప్లవ రంగవల్లుల్ని వేసిన రంగవల్లి, విద్యార్థులను విప్లవోద్యమంవైపు మళ్లించిన మేకల దామోదర్ రెడ్డి, విజయ్‌కుమార్, రామేశ్వర్, రమణారెడ్డిలు వీరన్నగా ప్రసిద్ధుడైన వీరారెడ్డి వీరంతా ఉస్మానియా నుండి ఎగిసి పడిన కెరటాలే.

కులవర్గ ఉద్యమాలు జమిలీగా జరగాలని తానే పార్టీని స్థాపించిన మారోజు వీరన్నది మరో చరిత్ర. రిజర్వేషన్ పోరాటాలైన, విద్యారంగ ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమాలైనా మొత్తంగా సమాజ ప్రతి సంచలనంలో ఉస్మానియా విద్యార్థి లోకం ఉన్నది. విప్లవ విద్యార్థి సంఘాలపై నిషేధం, నిర్బంధంతో రాజ్యం విద్యార్థి లోకాన్ని వారి నుండి వేరు చేసే ప్రయత్నం ఒకవైపు, నూతన ఆర్థిక విధానాల నేపథ్యంలో కలుషితమైన సాంస్కృతిక వాతావరణంలో లేని ఉపాధి ఉద్యోగ అవకాశాలను ఉన్నట్టు భ్రమింపచేస్తున్న పాలకులు విద్యార్థులను ఉక్కిరిబిక్కిరి చేస్తున్న దశలోనే 1990 మధ్య భాగంలో మొదలైన మలిదశ తెలంగాణ స్పృహ అనేక వ్యక్తుల, సంఘాల, సంస్థల కృషి మునుపటి సైద్ధాంతిక స్ఫూర్తితో కాకపోయినా పోయినదేదో పొందాలన్న పట్టుదలతో ఉన్న విద్యార్థుల్ని తెలంగాణ ఉద్యమం వెల్లువలా బయటికి తీసుకవచ్చింది.

ఈ దఫా కూడా విద్యార్థి ఉద్యమానికి ఉస్మానియానే కేంద్రంగా నిలబడింది. పూర్వపు విద్యార్థి ఉద్యమ స్ఫూర్తి, సైద్ధాంతిక పునాది, నిబద్ధత లేకపోయినా ఒక విడవని పోరాటన్నయితే నిర్వహించారు. 2009లో ఏర్పడిన తెలంగాణ విద్యార్థి జెఎసి బూర్జువా పార్టీ నడిపిన ఉద్యమం కంటే భిన్నంగా వ్యవహరించి తెలంగాణ పోరాట ప్రజల్లో మరింత నమ్మకాన్ని పెంచింది. 'ఉద్యమ పార్టీ' నాయకుడు కాడి ఎత్తేస్తే ఎండగట్టింది, ఎత్తిచూపింది, బండారం బయటపెట్టింది ఉస్మానియా విద్యార్థులే.

లక్షలాది విద్యార్థులు ఉస్మానియా విద్యార్థి నాయకత్వం కింద ర్యాలి అయ్యారనేది వాస్తవం. తెలంగాణ సమాజమంతా మేయిన్ స్ట్రీం పార్టీలన్నీ ద్రోహం చేసినప్పుడల్లా, వంచనకు పాల్పడినప్పుడల్లా చూపులన్నీ ఉస్మానియా పైనే పెట్టుకుందంటే అతిశయోక్తి కాదేమో! తదనంతర కాలంలో రాజకీయ పదవీ ఆకర్షణలు, పార్టీ ప్రాయోజిత కార్యక్రమాల్లో పాలుపంచుకోవడం, ఒక సైద్ధాంతిక గొడుగు కింద కాకుండా చీలికలు పేలికలుగా అనేక జె.ఏ.సి.లు రావడం, నాయకులుగా చలామణి అయినవారు (అందరూ కాకపోయినా) లంపెనైజ్ కావడం, పార్టీల ప్రాపకం కోసం ప్రాకులాడడం, సమాజంలో వారికి వచ్చిన 'ఇమేజ్'ని అతిగా ఊహించుకొని 'ఎదుగుదల' కోసం వెంపర్లాడడం వంటివి అనేకం కనిపిస్తాయి.

ఇదే సమయంలో అస్థిత్వ ఉద్యమాలకు నాయకత్వం వహించిన, వహిస్తున్న విద్యార్థులు అంబేద్కర్ రాజకీయాలను ముందుపెట్టే క్రమంలో కొనసాగిస్తున్న మేధో కృషి ఆహ్వానించదగినది. ఈ సమూహమే విప్లవోద్య మానికి అనేక ప్రశ్నలను సంధిస్తూ కొన్ని సార్లు అభ్యంతకరంగానూ, అవమానకరంగానూ వ్యాఖ్యానించడం కూడా జరుగుతుంది. పైరవీల ప్రభావం పెరగడం, పరిశోధనా ప్రమాణాలు దిగజారిపోవడం ఒకింత ఉస్మానియా ప్రభను తగ్గించినప్పటికి భవిష్యత్తుపై భరోసాను కోల్పోవాల్సిందేమి లేదు.

వంద వసంతాల ఉస్మానియా మరిన్ని వందల, వేల వసంతాలు జరుపుకోవాలని నూతన సమాజావిష్కరణ జరిగేలా వైభవోజ్వల గతం నుండి పాఠాలు నేర్చుకుంటుందని ఆశిద్దాం.

వీ

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)*

# ముస్లిం రిజర్వేషన్‌లతో రాజకీయాలు

*తెలంగాణ ప్రభుత్వం ప్రకటించిన ముస్లిం రిజర్వేషన్ల వల్ల ముస్లిం ప్రజలకు జరిగే మేలు కన్నా పాలకవర్గాల రాజకీయ ప్రయోజనమే ప్రధానంగా ఉందని అంటున్నారు* **భాస్కర్ ఎంపెల్లి**

ఏప్రిల్ 16, 2017 న ముస్లిం, గిరిజనుల రిజర్వేషన్ పెంచడానికి ప్రవేశ పెట్టిన బిల్లును అసెంబ్లీ ఆమోదించడం జరిగింది. తెలంగాణ రాష్ట్ర సమితి (టి.ఆర్.ఎస్) పార్టీ ఎన్నికల్లో వాగ్ధానం చేసినట్టుగా ఒ.బి.సి లలో నాలుగు శాతంగా ఉన్న ముస్లిం రిజర్వేషన్‌లు పన్నెండు శాతానికి, ఆరు శాతంగా ఉన్న గిరిజనుల రిజర్వేషన్లు పది శాతానికి పెంచడానికి నిర్ణయించారు. ఈ పెంపుతో మొత్తం తెలంగాణలో రిజర్వేషన్ల శాతం అరవై రెండుకి చేరింది. గతంలో సుప్రీంకోర్టు రిజర్వేషన్‌లు యాభై శాతానికి మించకూడదు అని పరిధిని విధించడం జరిగింది. ఇది సుప్రీంకోర్టు రిజర్వేషన్ల పైన విధించిన పరిమితికి పన్నెండు శాతం ఎక్కువ. ఇప్పుడు రిజర్వేషన్‌లు పెంచడం అంటే రిజర్వేషన్లు యాభై శాతం మించకూడదు అనే సుప్రీం కోర్టు 1992 లో విధించిన పరిధిని మించడం. తెలంగాణ ప్రభుత్వం ముస్లింల, ఆదివాసుల రిజర్వేషన్‌ను పెంచడం కోసం ప్రత్యేకంగా అసెంబ్లీ సమావేశాలను ఏర్పాటు చేసి అందులో ఈ బిల్లును ఆమోదించి రాష్ట్రపతి ఆమోదానికి పంపడం జరిగింది. అసెంబ్లీలో ఐదుగురు సభ్యులున్న భారతీయ జనతా పార్టీ ఒక్కటి తప్ప మిగతా అన్ని పార్టీలు ఈ బిల్లుకి తమ మద్దతు తెలిపాయి. బి.జె.పి వాదన ఏమంటే ముస్లిం రిజర్వేషన్లు మతపరమైనవి. అటువంటి మతపరమైన రిజర్వేషన్లు ఇవ్వకూడదు అని. అయితే దీనిని ముస్లిం రిజర్వేషన్ అని పిలవడంలోనే రాజకీయం ఉంది. నిజానికి ఇప్పుడు పెంచిన రిజర్వేషన్ ముస్లింలు అందరికి వర్తించదు. ముస్లిం లలో సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడిన బిసి–ఇ కేటగిరిలోకి వచ్చే ముస్లింలకి మాత్రమే వర్తిస్తుంది. ఈ పన్నెండు శాతం రిజర్వేషన్లు విద్యాసంస్థలు, ప్రభుత్వోద్యోగాలలో ఇవ్వడం జరిగింది. దీనిని బి.సి. – ఈ రిజర్వేషన్ పెంచినట్టు ప్రభుత్వం పరిగణించవచ్చు. కాని ప్రభుత్వం పదే పదే ముస్లిం రిజర్వేషన్లుగా పేర్కొని ముస్లింల పక్షపాతిగా చూపే ప్రయత్నం చేసింది. దీంతో కేంద్రంలోని బి.జె.పి వ్యతిరేకించినా, సుప్రీంకోర్టు అనుమతి లేకపోయినా రిజర్వేషన్లు పెంచిన గొప్పతనం కె.సి.ఆర్ ప్రభుత్వంకి దక్కింది. అయితే అసెంబ్లీలో అందరు అంగీకరించి నప్పటికి దానిని ఎలా అమలు చేస్తారో ఎవరికీ అవగాహన లేదు. ముఖ్యమంత్రి కూడా చట్టంలోని లొసుగులను చూపించి అమలు చేస్తామని చెప్పాడే కాని దానికి రాజ్యాంగ బద్దత తీసుకువస్తామని, తీసుకురాగలమని కానీ ఎక్కడ చెప్పలేదు. అది అన్ని రాష్ట్రాలకి సంబంధించిన సమస్య. ఇప్పటికే తమిళనాడు చేసిన, ప్రభుత్వం సుప్రీం కోర్టు విధించిన పరిమితికి మించి (అరవై తొమ్మిది శాతం) రిజర్వేషన్లు అమలు చేసింది. దీనికి సంబంధించిన కేసు తొమ్మిది మంది సభ్యులతో కూడిన సుప్రీం కోర్టు బెంచ్ విచారిస్తుంది. ముఖ్యమంత్రి కె.సి.ఆర్ కూడా తమిళనాడును ఉదాహరణగా తీసుకుని ఈ రిజర్వేషన్లు పెంచుతున్నామని పదే పదే చెప్పడం జరిగింది. ఈ ముస్లిం రిజర్వేషన్లు పూర్తిగా ఆర్థిక పరమైన వెనుకబాటును దృష్టిలో పెట్టుకుని పెంచినవే కాని మతపరమైనవి కావు అని ప్రభుత్వం చెప్తోంది. అయితే ఇదివరకు వై.ఎస్. రాజశేఖర రెడ్డి ప్రభుత్వం 2004 జూలైలో ముస్లిం రిజర్వేషన్లు ఐదు శాతంగా పెంచి మొత్తం రిజర్వేషన్లు యాభై శాతానికి మించకుండా ఉండడానికి దానిని నాలుగు శాతానికి తగ్గించడం జరిగింది. ఇప్పుడు దానిని పన్నెండు శాతం చేయడం అంటే కేంద్ర ప్రభుత్వంను, సుప్రీంకోర్టును సవాలు చేయడమే. పైగా ఇక్కడ ఈ బిల్లును బలంగా వ్యతిరేఖిస్తూ, ఇది మైనారిటీలకు దగ్గర కావడానికి తెలంగాణ ప్రభుత్వం ఇస్తున్న మతపరమైన రిజర్వేషన్లుగా చూస్తున్న బి.జె.పి కేంద్రంలో అధికారంలో ఉండగా ఇది ఎలా సాధ్యమవుతుందో చూడాలి.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడ్డ తర్వాత ముస్లింల జనాభా శాతం తొమ్మిది నుండి పన్నెండు కి పెరిగింది. దీనిని దృష్టిలో పెట్టుకొని జనాభా దామాషా ప్రకారం వారికి చెందాల్సిన రిజర్వేషన్ వాటా వారికి కేటాయిస్తున్నట్టు ప్రభుత్వం ఈ పెంపుని సమర్ధించుకుంటుంది. అయితే దీనిని కేంద్రంతో ఒప్పించి, సుప్రీంకోర్టు పరిమితిని దిక్కరించి ఎలా అమలు చేస్తారో చూడాలి. హైద్రాబాద్‌లోని ముస్లిం రాజకీయ నాయకుల భయం ఏమంటే పరిమితికి మించి ఇచ్చిన ఈ పన్నెండు శాతం సాకుగా చూపించి ఉన్న నాలుగు శాతం కూడా రద్దు చేసే ప్రమాదం ఉందని.

ముఖ్యమంత్రి కె.సి.ఆర్ చెప్పేదేమంటే ఒకవేళ కేంద్రం ఈ బిల్లుకి ఆమోదం తెలపకపోతే, సుప్రీంకోర్టుకి వెళ్తాం. తమిళనాడులో అరవై తొమ్మిది శాతం రిజర్వేషన్లు అమలవుతున్నాయి. ఆ విషయంలో సుప్రీం కోర్టులో కేసు రెండు దశాబ్దాలుగా అక్కడే ఎటు తేలకుండా ఉంది. తమిళనాడు ప్రభుత్వం రిజర్వేషన్లు అమలు చేస్తుంది. కాబట్టి సుప్రీంకోర్టు కి వెళ్తే కేసు ఇప్పట్లో తేలదు కాబట్టి అప్పటి వరకు దీనిని అమలు చేయవచ్చు. అనేది స్వయంగా కె.సి.ఆర్ అసెంబ్లీ సాక్షిగా వినిపించిన వాదన. రాష్ట్ర ప్రభుత్వం వాదనలో ఎక్కడా రాజ్యాంగబద్ధత లేదు. రాజ్యాంగబద్ధంగా ఎటువంటి ఆటంకం కలగకుండా ఈ రిజర్వేషన్లు అమలు చేస్తాం అని చెప్పకుండా. కేవలం సుప్రీంకోర్టులో కేసు ఆలస్యం అయ్యే అవకాశాల మీద ఆధారపడి ఇటువంటి నిర్ణయం చేయడం కేవలం ముస్లింల ఓట్ల కోసం తప్ప మరేమీ కాదు. పైగా తమిళనాడు విషయం పూర్తిగా విరుద్ధం. రాజ్యాంగానికి 1994లో అప్పటి పి. వి. నరసింహారావు ప్రభుత్వం76వ సవరణ చేసి తొమ్మిదో షెడ్యూల్‌లో చేర్చడం ద్వారా తమిళనాడు ప్రభుత్వం పెంచిన రిజర్వేషన్లు అమలు చేసుకోవడం

జరిగింది. అది కేంద్రం సహకారం లేకుండా అయ్యే పని కాదు. అక్కడ రిజర్వేషన్లను కేంద్ర ప్రభుత్వం సహాయంతో రాజ్యాంగంలోని తొమ్మిదవ షెడ్యూల్‌లో చేర్చి న్యాయ సమీక్షకు అవకాశం లేకుండా చేయగలిగారు. దానిని కూడా ప్రశ్నిస్తూ సుప్రీం కోర్టులో కేసు వేయడం జరిగింది. తెలంగాణ విషయంలో కేంద్రమే దీనికి పూర్తి వ్యతిరేఖం. అలాంటప్పుడు రాష్ట్రపతి ఆమోదం ఇప్పించి, తొమ్మిదవ షెడ్యూల్‌లో ఈ విషయాన్నీ చేర్చడం దాదాపు అసాధ్యం.

దీంతో బి.సి లు రిజర్వేషన్లలో తమ వాటా పెంచాలని కోరుతున్నారు. అలాగే ఎస్.సి రిజర్వేషన్లు పెంచాలనే వాదన, వర్గీకరణ డిమాండు చాల ఏళ్లుగా ఉంది. ఇవన్ని ముందుకు వచ్చి ఒకవర్గం ఇంకో వర్గాన్ని శత్రువుగా చూసే పరిస్థితి వస్తది అంతే కాని సమస్య పరిష్కారం కాదు. టి.ఆర్.ఎస్ ప్రభుత్వంగా మేము మీకు మంచే చేయాలనీ అనుకుంటున్నాం కాని కేంద్ర ప్రభుత్వం సహకరించట్లేదు అని ప్రజలకి మధ్య గొడవ పెట్టి పబ్బం గడుపుకొనే భూస్వామ్య విధానాన్ని అమలు చేస్తుంది. ఈ రిజర్వేషన్ల విషయంలో కె.సి.ఆర్ కి నిబద్ధత ఉంటే మొదట కేంద్రాన్ని ఒప్పించి తర్వాత బిల్లు ఆమోదించుకునేవాడు. పోలవరం ముంపు ప్రాంతాల విషయంలో కూడా అదే జరిగింది. ఒక్క గ్రామం కూడా వదులుకోమని చెప్పి ఏకంగా ఏడు మండలాలని, ఆదివాసులని పోలవరంలో ముంచే ఒప్పందాలని చేసుకున్నాడు. కంటి తుడుపుగా ఒకరోజు బంద్‌కి పిలుపునిచ్చి చేతులు కడిగేసుకున్నారు. ఇప్పటికే బి.సిలు తమ కోటాను 25 నుండి 52కి పెంచాలని డిమాండు తెస్తున్నారు అదే కనుక జరిగితే రిజర్వేషన్లు 89 శాతానికి చేరుతాయి. అది ప్రజల మధ్య విబేదాలకి దారి తీస్తుంది. ఇప్పుడున్న రాష్ట్రాల్లో తమిళనాడు 69 శాతం, జార్ఖండ్ 60 శాతం, మహారాష్ట్ర 52 శాతం, అరుణాచల్, మేఘాలయ, నాగాలాండ్ 80 శాతం రిజర్వేషన్లు అమలు చేస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్ ఇది 2007లో అమలు చేసారు. బి.జె.పి ప్రభుత్వం జాట్లు, గుజ్జర్లకు రిజర్వేషన్లు ఇవ్వడానికి చట్టం సవరించి 59 శాతం రిజర్వేషన్లు అమలు చేస్తుంది. అది కూడా కేంద్రం దగ్గర ఆగిపోయింది. అందరికి ఒకే రకమైన న్యాయం ఉండాలని కె.సి.ఆర్ అన్నాడు. వాల్లకెందుకిచ్చారు మాకెందుకు ఇవ్వరు అని మేము నిలదీస్తం అని చెప్తుండు.

మొదట ముస్లింలకు, క్రిష్టియన్లకు రిజర్వేషన్లు కల్పించింది 1936లో కేరళలోని ట్రావెన్కోర్-కొచ్చిన్ స్టేట్. ముస్లింలు స్వాతంత్ర్యానికి పూర్వం అనుభవించిన రిజర్వేషన్లు విభజనతో ఆగిపోయాయి. ఎవరైనా ప్రత్యేక దేశం, రిజర్వేషన్లు రెండూ అడగడం సాధ్యం కాదు అనే వాదనతో వాటిని ఆపడం జరిగింది. మతపరమైన రిజర్వేషన్లు సామాజిక అశాంతి సృష్టించి మరో పాకిస్తాన్ రూపకల్పనకు దారి తీస్తుంది అనేది కేంద్ర మంత్రి వెంకయ్యానాయుడు వాదన. రాజశేఖర రెడ్డి, చంద్రబాబు నాయుడు హయాంలో కూడా ముస్లిం రిజర్వేషన్లు బి.జె.పి వ్యతిరేఖించింది. 'అన్ని కులాల్లోని అన్ని మతాలలోని వెనుకబడిన వర్గాలకు రిజర్వేషన్లు కల్పించినపుడు. ముస్లింలకు ఎందుకు వద్దు. వారు మన పౌరులు కాదా!' అనేది కె.సి.ఆర్ వాదన. ఈ పన్నెండు శాతం రిజర్వేషన్లకు రాష్ట్ర బి.సి కమిషన్ మద్దతు తెలిపింది. అలాగే ముస్లింల సామాజిక, ఆర్థిక స్థితిగతుల పై నియమించిన సుధీర్ కమిషన్ 9-12 శాతం రిజర్వేషన్లు సిఫారసు చేసింది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో తొమ్మిది శాతంగా ఉన్న ముస్లింలు విభజన తర్వాత తెలంగాణలో పన్నెండు శాతం అయ్యారు. అందులో తొంబై శాతం పేద వెనుకబడిన వర్గాల వారు ఉన్నారు. అందువల్లనే వారికి రిజర్వేషన్లు పెంచుతున్నామని అసెంబ్లీలో కె.సి.ఆర్ ప్రకటించారు. ముస్లింలు తెలంగాణలో ఉద్యోగాల్లో వెనుకబడి ఉన్నారని, వారు కేవలం 7.36 శాతం మాత్రమే ఉన్నారని సుధీర్ కమిషన్ చెప్పింది. ఆంధ్రప్రదేశ్‌లో ముస్లింలలో వెనుకబడిన వర్గాలకు 2007 నుండి అమలు చేస్తున్నారు. అప్పటి రాజశేఖర రెడ్డి ప్రభుత్వం ఆరు శాతంగా నిర్ణయించిన కోటాను సుప్రీం కోర్టు పరిమితి దాటకుండా నాలుగుకి తగ్గించి అమలు చేశారు. దానికి సంబంధించిన కేసు ఇప్పటికి సుప్రీం కోర్టులో ఉండగా ఏకంగా ముస్లిం జనాబా శాతానికి సమానంగా కేంద్ర ప్రభుత్వం వ్యతిరేఖిస్తున్నప్పటికి పన్నెండు శాతంగా రిజర్వేషన్ అమలు చేయాలనుకోవడం తొందరపాటు. ఇది అసదుద్దీన్ ఒవైసీ చెప్పినట్టు అసలు నాలుగు శాతానికి ప్రమాదంగా మారగలదు. ముస్లిం జనాభాకి సమంగా కోటా ఇవ్వడం అంటే ముస్లిం మతానికి ఇచ్చినట్టే చూడాల్సి వస్తుంది అనేది చాల మంది వాదన. అలా కాకుండా ముస్లింలలోని వెనుకబడిన వర్గాలను గుర్తించి వారి జనాబాకి అనుగుణంగా ఇస్తే సమంజసంగా ఉండేది. మండల్ కమిషన్ గుర్తించిన ముస్లింలలో దూదేకుల, కటిక, బుడుబుక్కల మొదలైన పద్నాలుగు కులాలను వెనుకబడినవిగా గుర్తించింది. అలాగే ముస్లింల సామాజిక, ఆర్థిక స్థితిగతుల మీద చాలా కమిషన్లు రిపోర్ట్‌లు ఉన్నాయి. వాటిలో వెనుక బడిన వర్గాలుగా గుర్తించిన వారి జనాభా దామాషా ప్రకారం రిజర్వేషన్‌లు ఇచ్చి ఉంటె సమర్థించుకోవడానికి అవకాశం ఉండేది. ముస్లింలలో పాలక, పెట్టుబడిదారి ఉన్నత వర్గాలను కూడా కలుపుకొని మొత్తం జనాభా శాతానికి రిజర్వేషన్ వర్తింపచేయడం మిగతా బి.సి. కులాల్లో వ్యతిరేకతకు దారితీస్తుంది. పైగా హిందూ ఫాసిస్ట్ మూకలకు, రిజర్వేషన్ వ్యతిరేకించే వర్గాలకు వారి వాదనను ఈ చర్య బలపరిచేదిగా ఉంటుంది. అదే కాకుండా ప్రతిసారి తమిళనాడు ఉదాహరణగా చూపిస్తున్నారు. తమిళనాడు ప్రభుత్వం అప్పటి పి.వి. నరసింహారావు ప్రభుత్వాన్ని ఒప్పించి పెంచిన రిజర్వేషన్లను తొమ్మిదవ షెడ్యూల్‌లో పెట్టి న్యాయ సమీక్షకు అవకాశం లేకుండా చేయగలిగారు. కాని ఈ బి.సి-ఈ కోటాను కేంద్ర ప్రభుత్వంలోని మంత్రులు బహిరంగంగా సభలలో వ్యతిరేకిస్తుంటే, తెలంగాణ బి.జె.పి అసెంబ్లీలో వ్యతిరేకించిన ఏకైక పార్టీ. ఇలాంటి స్థితిలో కేంద్రం ఈ రిజర్వేషన్‌కి రాష్ట్రపతి ఆమోదం ఇప్పించి, రాజ్యాంగంలోని తొమ్మిదవ షెడ్యూల్‌లో పెట్టి రాజ్యాంగ భద్రత కల్పిస్తుందనుకోవడం పొరపాటు.

ఎన్నికల రాజకీయాల్లో భాగంగా వేసే ఇలాంటి ఎత్తుగడలు మొత్తానికి ఎసరు తెచ్చే విషయాలు. ముస్లింల మీదికి మిగతా కులాల వారిని రెచ్చగొట్టి సంఘ్ పరివార్ శక్తులు మాత్రమే బలపడగలవు. అలా కాకుండా బి. సి.లను కలుపుకొని వారికి రిజర్వేషన్ పెంచుతామని ఇచ్చిన హామీలో భాగంగా ఈ బి.సి-ఈ కోటాను కూడా పెంచితే ప్రజల మద్దతు లభించే అవకాశం ఎక్కువగా ఉంటుంది. అలా కాకుండా కేవలం బి.సి.-ఈ కోటాను పెంచితే అది మతపరమైన రిజర్వేషన్‌గా మిగతా వర్గాల ప్రజలు భావించే అవకాశం ఎక్కువగా ఉంటుంది. దీన్ని విడిగా పెంచడం ముస్లింలకు దగ్గర కావడానికి వేసిన ఎన్నికల ఎత్తుగడగానే చూడాలి.

*(రచయిత రిసర్చ్ స్కాలర్, కేంద్రీయ విశ్వవిద్యాలయం)* వీ

# విద్యారంగంపై భౌగోళీకరణ ప్రభావం

***మౌలిక హక్కుగా అందాల్సిన విద్యారంగంపై ప్రపంచీకరణ ప్రభావం పడి అది వ్యాపార సరుకుగా మారిపోయిందనీ, ప్రజలకు ఉన్నత విలువలు గల విద్య అందకుండా పోయిందనీ అంటున్నారు*** **రమేష్ పట్నాయిక్**

*ప్రజల మెదలు వంచడంలో, పెట్టుబడి ప్రయోజనమే తమ ప్రయోజనంగా భావించేట్లు ప్రజలను తయారు చేయడంలో పాలకవర్గాల సమర్థతపైన మాత్రమే భౌగోళీకరణ అనివార్యత ..... ఆధారపడి ఉంది*

**– జేమ్స్ పెట్రాస్**

భారత విద్యారంగంపై భౌగోళీకరణ ప్రభావం మనకు మూడు దశాబ్దాల క్రితం నుంచే కనిపిస్తుంది. విద్యపై భౌగోళీకరణ, విద్యా వ్యాపారం ప్రభావం విద్య అందుబాటుకు సంబంధించినది మాత్రమే కాదు, అది విద్యా ప్రయోజనం నుండి, విద్యా వస్తువు, విద్యా ప్రక్రియ, విద్యారంగ నిర్వహణ, మౌలిక, అనువర్తిత శాస్త్రాల మధ్య సాపేక్ష ప్రాధాన్యతలు, స్వంత భాష, ఆంగ్ల భాషల మధ్య సాపేక్ష ప్రాధాన్యతలు, సాహిత్యంతో సహా లేదా సాహిత్యానికి దూరంగా భాషను పరిగణించడం, ఇలా అనేక విషయాలు మనం చర్చించవలసి ఉంటుంది.

అయితే ఈ వ్యాస పరిమితిలో కొన్ని విషయాలను, అదీ పైపైన మాత్రమే చూడగలం. భౌగోళీకరణ ప్రభావం ప్రధానంగా ఉన్నత విద్యపై ఉన్నందున ఈ వ్యాసం ఉన్నత విద్యారంగంపైననే దృష్టిపెట్టవలసి ఉంటుంది. ఉన్నత విద్యలో వస్తున్న మార్పులు అవసరంగా కొంత అనవసరంగా మరింత పాఠశాల విద్యపై ప్రభావం చూపిస్తున్నాయి. అయినా భౌగోళీకరణ ప్రభావం ఉన్నత విద్యతోనే ప్రారంభమవుతు న్నందున ఈ వ్యాసం ఉన్నత విద్యలో భౌగోళీకరణపైననే కేంద్రీకరిస్తుంది.

విజ్ఞానం దేశసరిహద్దులకు పరిమితమయ్యే విషయంకాదు, కాకూడదు. తక్షశిల, ఏథెన్స్, అలెగ్జాండ్రియా, నలందా, వంటి కేంద్రాలు ఒకనాడు ప్రపంచ విద్యా కేంద్రాలుగా ఉన్నాయి. తత్వశాస్త్రం, తర్కశాస్త్రం వంటి శుద్ధ శాస్త్రాలేకాక, వాతావరణ శాస్త్రం, దాని అవసరాల మేరకు మాత్రమేగాక అద్భుతమైన ఆకాశాన్ని తెలుసుకోవాలనే ఉత్సాహం కారణంగా ఖగోళశాస్త్రం, వైద్యశాస్త్రం, గణితశాస్త్రం, ఆర్థిక, రాజకీయ శాస్త్రాల వంటి వాస్తవిక శాస్త్రాలు కూడా వివిధ దేశాలలో వృద్ధిచెంది ప్రపంచమంతా వ్యాపించాయి.

విజ్ఞాన విశ్వీకరణలో అభ్యంతరం చెప్పవలసింది ఏముంటుంది. మన దేశం నుండి విద్యార్థులు, ఉపాధ్యాయులు ఇతరదేశాలకు వెళ్లడం లేదా ఇతరదేశాల విద్యార్థులు, ఉపాధ్యాయులు మన దేశానికి విద్యా వ్యాసంగానికై రావడం నిజానికి ఆహ్వానించదగ్గవే. అసలు ఈ ప్రక్రియ దేశాలు ఏర్పడక ముందు నుండి సహస్రాబ్దాలుగా జరుగుతున్నదే. అయితే విద్య భౌగోళీకరణ, విజ్ఞాన విశ్వీకరణ ఒకటేనా అన్నదే మనముందున్న సమస్య. విద్య భౌగోళీకరణ, విద్య అంతర్జాతీయకరణకు మధ్య ఉన్న వ్యత్యాసాన్ని ఈ కింద ఇవ్వబడిన ఉటంకింపు నుండి పరిశీలిద్దాం.

"... అంతర్జాతీయాకరణ అనేది బాగా పాదుకున్న అంతర్జాతీయ సహకారం, విద్యార్థుల, ఉపాధ్యాయుల చలనశీలత, గుణాత్మకత, శ్రేష్ఠత (ఎక్స్‌లెన్స్)లకు దగ్గరగా ఉంటుంది. కాగా, పోటీ, ఉన్నత విద్యను వ్యాపారం చేయదగ్గ సరుకుగా ముందుంచడం, ఉన్నతవిద్యను ఒక సామాజిక హితంగా గుర్తించడాన్ని సవాలు చేయడంగా భౌగోళీకరణను వివరించవచ్చు."

(Vught, van der Wende and Wsterheijden,2002)

విద్య భౌగోళీకరణ, అంతర్జాతీయాకరణల మధ్య వ్యత్యాసం లేదనే వారున్నారు. అసలు విద్య భౌగోళీకరణ కొత్త దృగ్విషయం కాదన్నవారూ ఉన్నారు. అయితే పైన ఇవ్వబడిన ఉటంకింపే సరియైన అవగాహన ఇస్తుంది. మనం విద్య భౌగోళీకరణ, అంతర్జాతీయాకరణలను వేరు, వేరు వ్యవహారాలుగానే పరిగణిద్దాం.

పరస్పర సహకారంతో దేశాల మధ్య విద్యావ్యాప్తిని అంతర్జా తీయాకరణ గానూ, వ్యాపార మాధ్యమంలో దేశాల మధ్య ఒక అంగడి సరకుగా విద్య వినిమయం కావడాన్ని భౌగోళీకరణ గానూ వ్యవహరిద్దాం.

భారతదేశంలో ఉన్నతవిద్య భౌగోళీకరణ చెందక ముందు వ్యాపారీకరణ చెందింది. అంతకు ముందు ప్రభుత్వరంగ విద్య నిర్జీవం చేయబడింది. చరిత్ర క్రమంలో చెప్పాలంటే ముందుగా ప్రభుత్వరంగ విద్యను నిర్లక్ష్యం చేసి నిర్జీవం చేశారు. మెరుగైన విద్య కొరకు ప్రైవేట్ రంగంలో విద్యననుమతిస్తున్నాం అన్నారు. వ్యష్టిలాభమే పరమావధిగా గల ప్రైవేట్ రంగం సహజంగానే సమిష్టి ప్రక్రియ అయినా విద్యను మంచి ప్రమాణాలతో అందించలేక పోయింది.

ప్రైవేట్ రంగంలో తీవ్రంగా అవినీతి పెరిగి యోగ్యతా పత్రాలు అమ్మేస్థితికి వచ్చింది. ఇప్పుడు ప్రమాణాలుగల విద్యకొరకు విదేశీ విద్యా సంస్థలను తీసుకురావడానికి విద్యను గ్లోబలైజేషన్ చేయాలంటున్నారు. ప్రైవేట్ విద్య విఫలమయిందని ఒప్పుకోవడం గాని, దానిని అధ్యయనం చేయడం గాని ప్రభుత్వం చేయదు. గతవిధానాల పునర్విమర్శ లేకుండానే కొత్త విధానం తీసుకురావడం ఇప్పుడు ప్రభుత్వాలు అనుసరిస్తున్న నియోలిబరల్ విధానం. రాధాకృష్ణ కమీషన్, కొఠారి కమీషన్‌లలో చేసిన విలువైన ప్రతిపాదనలను ప్రభుత్వాలు అనుసరించకపోవడమే ప్రస్తుత దుస్థితికి కారణమని చెప్పుకున్నాం.

1948 నాటి రాధాకృష్ణ కమీషన్ నివేదిక స్వతంత్ర భారతదేశంలో ఉన్నత విద్యకు ఒక ప్రజాస్వామిక ప్రాతిపదిక వేసింది. 1966 నాటి కొఠారి కమీషన్ మొత్తం విద్యారంగానికి ఒక సమగ్రమైన ప్రణాళిక అందించింది. ఈ నివేదికలలో లోటుపాట్లులేవని కాదు. అయితే ప్రభుత్వాలు కాలక్రమంలో నివేదికలలో ఉన్న లోటుపాట్లను తొలగించు కోవడానికి బదులు అందులో విలువైన అంశాలను అమలుచేయడంలో అలసత్వాన్ని చూపించాయి. ఫలితంగా, 1986 నాటికి ప్రభుత్వ విద్యా వ్యవస్థ అనేక వైఫల్యాలను ఎదుర్కోవడం మనం గమనిస్తాం, ఈ వైఫల్యా

లను వామపక్షం కంటె అధికారపక్షమే ప్రతిభావంతంగా ఎత్తిచూపించింది. అందుకు వారికి అధికారం, అధికార యంత్రాంగం ఉపయోగపడడం, ప్రచారసాధనాలు సహకరించడం ప్రధానకారణాలు కావచ్చు.

1985లో కేంద్ర ప్రభుత్వం ప్రచురించిన 'విద్యారంగ సవాళ్లు – ఒక విధాన దృక్పథం' (ఛాలెంజెస్ ఆఫ్ ఎడ్యుకేషన్ – ఎ పాలసి పర్స్‌పెక్టివ్) అనే చర్చాపత్రంలో నాటి విద్యారంగ దుస్థితిని కళ్లకు కట్టినట్లు చూపించారు. ఆ మరుసటి సంవత్సరం, 1986లో ఆనాడు నూతన విద్యా విధానంగా ప్రచారమైన 'జాతీయ విద్యావిధానం 1986' ను తీసుకువచ్చారు. ఈ విధానం నాటికే ప్రారంభమయిన విద్యావ్యాపారం, ఈ విధానం ద్వారా లభ్యమయిన మద్దతుతో విజృంభించింది. 1992లో వచ్చిన ఆచరణాత్మక కార్యక్రమం (ప్రోగ్రాం ఆఫ్ ఏక్షన్) పెద్ద ప్రభావాన్ని ఏమీ కలిగించలేదు. 1986 పాలసీ వచ్చి మూడు దశాబ్దాలయ్యింది. ఈ మూడు దశాబ్దాల కాలంలో విద్యావ్యవస్థ ఎంత క్షీణించిందో అందరి గమనంలో ఉన్నదే.

2016లో ప్రస్తుత కేంద్ర ప్రభుత్వం ఒక 'జాతీయ విద్యావిధాన ముసాయిదాకు కొన్ని దత్తాంశాలు' అనే పత్రాన్ని ప్రచురించి, చర్చకు పెట్టింది. చర్చ క్రోడీకరించబడకుండానే అందులో ప్రతిపాదించిన వివిధ చర్యలు అమలు చేయడం కనిపిస్తూంది. 1956 నుండి 2016 వరకు జరిగిన చర్చను ఈ వ్యాసంలో మనం వివరంగా చూడలేముకాని, ఉన్నత విద్యా లక్ష్యాలలో వస్తూన్న మార్పును పరిశీలించడానికి ప్రయత్నిద్దాం.

1948లో రాధాకృష్ణ కమీషన్ ఉన్నత విద్యపై ఇచ్చిన నివేదిక ఇప్పటికీ మన విశ్వవిద్యాలయ వ్యవస్థకు చట్రంగా ఉంది. అవును, చట్రంగా మాత్రమే ఉంది! నివేదిక ప్రచురించిన కాలానికి (1948) రాజ్యాంగం ఇంకా ఆమోదించబడలేదు, రాజ్యాంగ పరిషత్ సమావేశాలు జరుగుతూ ఉన్నాయి. రాజ్యాంగ లక్ష్యాలైన న్యాయం, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం సమాజంలో సాధించడమే ఉన్నత విద్యాలక్ష్యాలని రాధాకృష్ణ కమిటి నొక్కిచెప్పింది. విశ్వవిద్యాలయాల గురించి చెప్తూ రాధాకృష్ణ కమీషన్ "మనకిప్పుడు విశ్వవిద్యాలయాల విధులు, బాధ్యతల గురించి మరింత విస్తృతమైన అవగాహన ఉంది. అవి రాజకీయాలలో, పరిపాలనలో, వృత్తివిజ్ఞానంలో, పరిశ్రమలలో, వాణిజ్యంలో నాయకత్వాన్ని అందించాలి. అన్ని రంగాలలో ఉన్నత విద్య కొరకు, శాస్త్రీయమైన, వృత్తిపరమైన, సాంకేతికమైన అన్ని రంగాలలో, అక్షరాస్యతలో వస్తున్న నిరంతరాయంగా పెరుగుతున్న డిమాండ్‌ను విశ్వవిద్యాలయాలు తీర్చాలి. శాస్త్ర, సాంకేతిక విజ్ఞాన అభివృద్ధిద్వారా, వాటిని అనువర్తింపజేయడం ద్వారా విశ్వవిద్యాలయాలు కొరత, అనారోగ్యం, అజ్ఞానం నుండి ఎంత వీలయితే అంత తక్కువ సమయంలో విముక్తిపొందేటందుకు దేశాన్ని సమర్థవంతం చేయాలి." (నూతన భారతదేశం విభాగం 1).

విశ్వవిద్యాలయాల నుండి ఇటువంటి గొప్ప జాతీయ బాధ్యత ఆశించబడింది. వాటికి ఇంత బాధ్యత ఉండింది. ఉండాలి అన్న విషయం ఇప్పుడు విశ్వవిద్యాలయ అధ్యాపకవర్గానికి కూడా ఎంతవరకు తెలుసు? విశ్వవిద్యాలయం నుండి ఆశించబడిన ఈ నాయకత్వ పాత్ర ఇంకా పాదుకొనక ముందే అవి సంకుచిత ప్రయోజనాలకు గురయినాయన్నది వేరే విషయం. 20 సంవత్సరాల అనంతరం, 1966లో ప్రచురితమైన కొఠారీ కమీషన్ ఉన్నతవిద్య గురించి విశ్వ విద్యాలయాల గురించి సుమారు ఇదేస్థాయి ఆకాంక్షలను వ్యక్తపరచింది. "నిజానికి, మొత్తం సమాజ విస్తృత ప్రాధామ్యాల పర్యంతంగా ఉన్న అన్ని విషయాలకు సంబంధించిన విధానాలు, భావనలను విమర్శనాత్మకంగా పరిశీలించడం లోనూ, వాటిని మూల్యాంకనం చేయడంలోనూ, వాటి పరిణామంలోనూ ఒక చురుకైన, ఖచ్చితమైన పాత్ర పోషించడం అకడమిక్ కమ్యూనిటీ, స్వభాలశీలమైన బాధ్యత.

ఏదైతే పాండిత్యం, శ్రేష్ఠత్వాల సాధనకు అవసరమైనది, ఏది దయా దాక్షిణ్యాలులేని, మినహాయింపులు లేని, కాని అదే సందర్భంలో నిర్మాణాత్మకంగానూ, ఒత్తిడి చేయనిదిగా ఉండే విమర్శను ప్రోత్సహిస్తుందో అటువంటి మేధోపరమైన వాతావరణాన్ని అభివృద్ధి చేయడంలో, ప్రోదిచేయడంలో విశ్వవిద్యాలయాలకు బృహత్తరమైన పాత్ర ఉంది. అయితే ఇదంతా ఉపాధ్యాయులు వారి విద్యాసంబంధమైన స్వేచ్ఛను ఉత్సాహంగానూ, వివేకవంతంగానూ, మంచి పరిమాణం లోనూ ఉపయోగించుకోవడాన్ని డిమాండ్ చేస్తూంది.(13.4)"

కొఠారి కమీషన్ ఒక వైపు ప్రభుత్వం విశ్వవిద్యాలయాల విషయంలో అనుచితంగా జోక్యంచేసుకోవడాన్ని విమర్శిస్తూ రెండవవైపు విశ్వ విద్యాలయాల జనసంఘం (కమ్యూనిటి) తమకున్నటువంటి స్వయం ప్రతిపత్తిని సరిగా ఉపయోగించుకోవడంలేదనే విషయాన్ని సున్నితంగా చెప్పింది.

విశ్వవిద్యాలయాల పాత్ర విషయమై రాధాకృష్ణ కమీషన్‌తో పోల్చి చూసినప్పుడు మరొక విషయం కనిపిస్తుంది. రాధాకృష్ణ కమీషన్ విశ్వ విద్యాలయాలు సమాజానికి రాజకీయాలు, పరిపాలనతో సహా అన్ని రంగాలలో అవవసరమైన నాయకత్వాన్ని అందించడం అంటే అందుక వసరమైన విజ్ఞానాన్ని, విద్యావంతులను, వివిధ రంగాలలో నాయకులను ఉత్పత్తి చేయడం విశ్వవిద్యాలయాల బాధ్యతగా పరిగణించింది. కొఠారీ కమీషన్ నివేదిక కూడా విశ్వవిద్యాలయాలపై ఉంచిన బాధ్యత బృహత్తరమైనదే అయినా రాజకీయ, పాలనా రంగాలలో నాయకత్వాన్ని అందించాలని అయితే చెప్పలేక పోయింది.

విశ్వవిద్యాలయాలు సమాజానికి అవసరమైన అన్ని రంగాలలో విధానాలు, భావనలను విమర్శనాత్మకంగా పరిశీలించడం లోనూ, వాటిని మూల్యాంకనం చేయడంలోనూ, వాటి పరిణామంలోనూ ఒక చురుకైన పాత్రను మాత్రము సిఫారసు చేసింది.

కొఠారి కమీషన్ కాలానికే రాజ్యం లక్షణాలు స్పష్టంగా బయట పడ్డాయా అనిపిస్తుంది. రాజ్యానికి విజ్ఞానంతో ప్రధానంగా, రాజకీయ సామాజిక రంగాలలో ప్రజా ప్రయోజనాలతో ముడిపడి ఉన్న విశ్వవిద్యాలయాల చర్చలతో పరిశోధనలతో ఎటువంటి అవసరం లేకపోవడం, రాజ్యం, పాలక వర్గాల అవసరాలు ప్రజల అవసరాలతో వేరుగానూ, అనేక సందర్భాలలో విరుద్ధంగానూ ఉండడం కమీషన్ ఆలోచనపై ప్రభావం కలిగించిందా! ఈ విషయాన్ని మరింత లోతుగా పరిశోధించ వలసి ఉంది.

మరి రెండు దశాబ్దాలు గడిచాయి. 1986లో 'జాతీయ విద్యావిధానం 1986' ప్రకటించబడింది. 1992లో దీనికి కొన్ని మార్పులు చేర్పులు చేశారు. తిరిగి ప్రచురించినప్పుడు చేసిన మార్పులను ప్రత్యేకంగా చూపించారు. మనం కింద ఇచ్చిన 1986 నాటి ఉటంకింపులు 1992 విధాన పత్రంలో కూడా కొనసాగాయి. ఇప్పుడు 1986–92లో ప్రచురించిన విద్యా విధానంలో ఉన్నతవిద్య గురించి, విశ్వవిద్యాలయాల గురించి ఏం చెప్పారో చూద్దాం.

(2.2) "విద్యకు సంస్కృతీకరించే పాత్ర ఉంది. జాతీయ ఐక్యతను, శాస్త్రీయ దృక్పథాన్ని , స్వతంత్ర ఆలోచనను, అంత:కరణను పాదుకొల్పే మృదుత్వాన్ని, దృక్పథాన్ని విద్య సునిశితం చేయగలుగుతుంది.– ఆ విధంగా భారత రాజ్యాంగంలో పొందుపరచబడిన సామ్యవాదం, లౌకికవాదం, ప్రజాస్వామ్యం అనే లక్ష్యాలను ముందుకు తీసుకువెళ్ల గలుగుతుంది."

(2.3) "విద్య ఆర్థిక రంగానికి కావలసిన వివిధ స్థాయిల మానవ శక్తిని అందిస్తుంది. జాతీయ స్వయంపోషకత్వానికి అంతిమంగా పూచీనిచ్చే పరిశోధన, అభివృద్ధికి విద్యనే ఆధారభూతంగా ఉంటుంది."

(5.24) "మానవుడు ఎదుర్కొంటున్న క్లిష్టమైన ఆర్థిక, సాంస్కృతిక, నైతిక, అంత:కరణ (స్పిరిట్యువల్) విలువుల విషయాలగురించి సమాలోచించడానికి ఉన్నతవిద్య ప్రజలకు/ వ్యక్తులకు ఒక అవకాశాన్నిస్తుంది. జాతీయాభివృద్ధికి ఉన్నత విద్య ప్రత్యేకాంశాలలో విషయ పరిజ్ఞానాన్ని, నైపుణ్యాన్ని ఇస్తుంది. ఆ కారణంగా ఉన్నత విద్య ఉనికి కొనసాగింపులో ఒక ప్రధానమైన పాత్రపోషిస్తుంది...."

1986 పాలసీలో పైన ఎత్తిచూపించిన ఉల్లేఖనలలో విద్యకు రాధాకృష్ణ కమీషన్ నిర్దేశించిన నాయకత్వ పాత్ర కనిపించదు. కొఠారీ కమీషన్ సూచించిన 'మొత్తం సమాజ విస్తృత ప్రాధామ్యాల పర్యంతంగా ఉన్న అన్ని విషయాలకు సంబంధించిన విధానాలు, భావనలను విమర్శనాత్మకంగా పరిశీలించడం' కనిపించదు. వ్యవస్థ మార్పులో విద్యారంగా పాత్ర చాలా జాగ్రత్తగా నిరాకరించబడింది. 1986 నాటి జాతీయ విద్యావిధానం 5.24 లో ఉనికి కొనసాగింపు గురించి మాత్రమే మాట్లాడుతుంది గాని ఉనికిని మార్చడం గురించి మాట్లాడదు. అయినా, రాజ్యాంగంలో పొందుపరచబడిన సామ్యవాదం, శాస్త్రీయ దృక్పథం సాధనలో విద్య పాత్ర ఇంకా విధాన పత్రాలు గుర్తిస్తూనే ఉన్నాయి. స్వయం పోషకత్వం ఇంకా జాతీయ లక్ష్యాలలో తన స్థానాన్ని నిలబెట్టుకుంది.

అయితే అనతి కాలంలోనే 1990 లనుండి ఉధృతంగా ముందుకు వచ్చిన లిబరలైజేషన్, ప్రైవేటైజేషన్, గ్లోబలైజేషన్, విధానల ఫలితంగా సోషలిజం, స్వయం పోషకత్వం లక్ష్యాలు తమ ఉనికిని కోల్పోయాయి. నిజానికి ఆ పదాలు మాటవరసకు మాత్రమే 1986 విధాన పత్రంలో చేర్చబడ్డాయి. అప్పటికే గాలి మారిపోయింది. అదలా ఉండగా ఎల్.పి.జి లకు వ్యతిరేకంగా ప్రజల ఉద్యమాలు పెరుగుతున్న కారణంగా ప్రజల ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి ఆయా పార్టీలు పరోక్ష లేదా ప్రత్యక్ష పద్ధతులలో కుల, మత, లింగ ప్రాంత, భాషా ఆధిపత్య వాదాలను ముందుకు తీసుకురావడంతో స్వాతంత్రోద్యమ బలహీనతల కారణంగా తొలినుంచి కొనవూపిరితో ఉన్న లౌకికవాదం కొడిగట్టడం ప్రారంభించింది.

గత మూడు దశాబ్దాల కాలంలో, 1986 నుంచి 2016 నాటికి జరిగిన ప్రధానమార్పేమంటే విద్య పూర్తిగా సరకుగా మారిపోయింది. 2016 కేంద్ర ప్రభుత్వం 'చర్చకుపెట్టిన' ముసాయిదా విద్యావిధానంలో సామ్యవాదం, స్వయం పోషకత్వం, శాస్త్రీయ దృక్పథం అన్న పదాలే లేవు. విధాన పత్రాలలో అటువంటి పదాలు ఉన్నప్పుడు కూడా ఆ లక్ష్యాల కొరకు కృషి జరగలేదు అన్న విషయం నిజమే. అయితే అవి విధాన పత్రాలలో తొలగించబడిన తరువాత వాటికి వ్యతిరేకంగా ప్రత్యేకమైన ప్రయత్నం జరుగుతుంది.

అటువంటి ప్రయత్నాలకు ఆటంకం ఉండకూడదనే అ పదాల తొలగింపు ఒక పట్టుదలతో జరిగింది. ఈ లక్ష్యాలను పౌరపాలన నుంచే కాక ప్రజాజీవితం నుంచి, ఆలోచనల నుంచి రూపుమాపడానికి గట్టి ప్రయత్నం జరుగుతుంది. 2016 ముసాయిదా జాతీయ విద్యావిధానం నుంచి ఇవ్వబడిన ఈ కింది ఉటంకింపును చూడండి.

"...ఉత్పాదకవంతమైన జీవితాన్ని, దేశ అభివృద్ధి ప్రక్రియలో భాగస్వామ్యాన్ని, నిరంతరాయంగా మారుతున్న, భౌగోళీకరణ చెందుతున్న జ్ఞాన ఆధారిత ఆర్థిక వ్యవస్థకు స్పందించేందుకు అవసరమైన విషయ పరిజ్ఞానం, నైపుణ్యం, దృక్పథం, విలువలు... అందించు విద్య అందరికీ అందించడం లక్ష్య దర్శనంగా (విజన్‌గా) ఉంటుంది.. (3వ అధ్యాయం)

"... బాధ్యతాయుతమైన పౌరులుగా, శాంతి, సహనం, లౌకికవాదం, జాతీయ సమగ్రత, సామాజిక సంయోగము, అన్ని మతాల ఎడల పరస్పర గౌరవం పెంపొందించే, అలాగే ప్రపంచ పౌరసత్వం, నిలకడైన అభివృద్ధి పెంపొందించే విలువలను వివిధ స్థాయి విద్యార్థులకు అందించడం కర్తవ్యంగా (మిషన్‌గా) ఉంటుంది... (3 వ అధ్యాయం)"

2016 విద్యా విధాన ముసాయిదాలో ప్రకటించిన విజన్‌లోగాని, మిషన్‌లోగాని రాధాకృష్ణ కమీషన్ చెప్పిన విశ్వవిద్యాలయాల సైంధాంతిక నాయకత్వ పాత్ర గురించిగాని, కొఠారి కమీషన్ చెప్పిన విమర్శనాత్మక, విశ్లేషణాత్మక పాత్రగాని, అలాగే ఉన్నత విద్యా లక్ష్యాలలో దేశం స్వయం సమృద్ధి సాధించడానికవసరమైన స్వతంత్ర విజ్ఞాన అభివృద్ధిగాని మనకు మాటమాత్రంగానైనా కనిపించవు. భౌగోళీకరణ ఆర్థిక, రాజకీయ, విలువులకు విద్యార్థులను తయారు చేయడమే విద్యావిధాన లక్ష్యంగా ప్రకటించబడుతుంది. విలువులు కూడా భౌగోళీకరణ విలువలే!

భౌగోళీకరణకు విద్యార్థులను తయారు చేయడం లక్ష్యంగా ప్రకటించిన తరువాత ఇతర లక్ష్యాలన్నీ అమలు సాధ్యం కానివి అవుతాయి. మిగిలిన మాటలకు ఇంక ఎంతమాత్రం విలువ ఉండదు. ఎందుకంటే ఇంతకు ముందే చెప్పుకున్నట్లు భౌగోళీకరణ అంటే దేశాల మధ్య పరస్పర సహకారం కాదు. విద్యను సరుకుగా దిగజార్చి ప్రపంచ విఫణిలో దానిని నిలబెట్టడం.

విశ్వవిద్యాలయాలు 'రాజకీయాలలో, పరిపాలనలో, వృత్తి విజ్ఞానంలో, పరిశ్రమలలో, వాణిజ్యంలో నాయకత్వాన్ని అందించాలి' అన్న దగ్గర నుంచి విశ్వవిద్యాలయాలు విద్యా వ్యాపారం చేయాలి అనే దగ్గరకు మనం వచ్చాం.

నిజానికి, 1948 నుండి 2016 వరకు విద్యావిధాన విషయంలో విధాననిర్ణేతల ఆలోచనలలో వచ్చిన మార్పులను, వారు విడుదల చేసిన విధాన పత్రాలనుండి పూర్తిగా గ్రహించలేము. 'మీరేంచెప్తారో అది మీ ఆలోచనకాదు, మీరేంచేస్తారో అదే మీ ఆలోచన' అన్న నానుడి తెలిసిందే కదా! అయితే విధాన పత్రాల పరిశీలన ద్వారా చలనం దిశ తెలుస్తుంది. మనం సామాజిక ప్రయోజనం నుంచి మార్కెట్ ప్రయోజనం వైపు, స్వయం పోషకత్వం నుంచి అస్వతంత్ర ఆర్థిక వ్యవస్థవైపు, శాస్త్రీయ దృక్పథం నుంచి అంధకారవాదం వైపు అడుగులు వేస్తున్నామన్నది స్పష్టం. విద్య మార్కెట్ వైపు అడుగులు వేసిన తరువాత సమానత్వం, సామాజిక న్యాయం రెండింటికీ చోటు ఉండదని 'మెరిట్, రిజర్వేషన్ రెండింటి స్థానాన్ని డబ్బు ఆక్రమిస్తుందని వేరుగా చెప్పనవసరంలేదు, ఇక మనం భారత విద్యారంగం భౌగోళీకరణ జరుగుతున్న తీరును పరిశీలిద్దాం.

*(ఇంకా ఉంది)*

*(రచయిత కన్వీనర్ ఆంధ్రప్రదేశ్ విద్యాపరిరక్షణ కమిటీ)* వీ

# విద్య మాఫియాకు అదుపు లేదా?

***విద్యారంగంలో రాజకీయ నాయకులకు ప్రత్యక్ష, పరోక్ష సంబంధం ఉండడంతో ప్రైవేట్ యాజమాన్యాల ఒత్తిళ్లకు ప్రభుత్వాలు, కోర్టులు లొంగిపోయి సామాన్యులకు విద్య అందకుండా పోతోందని అంటున్నారు కె. వేణుగోపాల్***

ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యు.టి.ఒ.) విద్యను వ్యాపార వస్తువుగా గుర్తిస్తూ, భారతదేశంలో విద్యా మార్కెట్ విలువను సంవత్సరానికి లక్షా 36 వేల కోట్లుగా అంచనా వేసింది. ఎవరైనా ఈ మార్కెట్‌లో వ్యాపారం చేసకోవచ్చనే ఒప్పందంపై ఆనాడు కాంగ్రెస్, ఈనాడు బి.జె.పి నాయకత్వాలలోని ప్రభుత్వాలు ఆమోద ముద్ర వేయడంతో రెండు దశాబ్దాలుగా విద్యా వ్యాపారుల వ్యాపారానికి అంతులేకుండా ఉంది. విద్యారంగ ప్రైవేటీకరణ వలన ప్రైవేట్ విద్యా సంస్థల యాజమాన్యాలు ప్రభుత్వాలనే సవాలు చేసే స్థితికి వచ్చాయి. తాజాగా మెడికల్ పీజీ వైద్య ప్రవేశాల్లో జరుగుతున్న తంతును చూస్తే, కోర్టులను కూడా ఈ ప్రైవేటు యాజమాన్యాలు బ్లాక్‌మెయిల్ చేస్తున్నట్టుగా ఉంది.

ప్రైవేటు యాజమాన్యాల ధనదాహం వైద్య విద్యలోనే కాదు, ఇంజనీరింగ్, ఫార్మసీ లాంటి ఇతర వృత్తి విద్యా కోర్సులలో కూడా ఉంది. పాఠశాల విద్యలో, ఇంటర్మీడియట్, డిగ్రీ కోర్సుల్లో నానాటికీ భారమవుతున్న ఫీజుల వ్యవహారంపై తల్లిదండ్రుల నిరసనలు, ఉద్యమాలు ప్రైవేటు యాజమాన్యాలపై ప్రభావం చూపడం లేదు. వృత్తి విద్యా కోర్సుల్లో వసూలు చేసే ఫీజులు, కాపిటేషన్ ఫీ, యాజమాన్య కోటా సీట్ల గురించి జరిగే బేరసారాలు, లక్షలాది రూపాయలు చేతులు మారే వ్యవహారంపై ప్రైవేటు యాజమాన్యాల కళాశాలల్లో జరిగే ప్రవేశాలపై జరుగుతున్న ఆందోళనలను, కోర్టులను ఆశ్రయించడాని దృష్టిలో ఉంచుకొని దేశవ్యాప్తంగా ఒకే విధానం అమలు చేయాలని, ఒకే ప్రవేశ పరీక్ష ద్వారా ప్రవేశాలు జరపాలని గత సంవత్సరం సుప్రీంకోర్టు ఇచ్చిన ఆదేశాల ఫలితంగా వైద్య విద్యలో నీట్ ప్రవేశ పరీక్ష ప్రాతిపదికన ప్రవేశాలు జరుగుతున్నాయి. యాజమాన్యాల ఇష్టానుసారంగా అడ్మిషన్‌లు ఇచ్చే పరిస్థితి లేదు.

మే 17లోగా రెండో విడత పీజీ వైద్య ప్రవేశాల్లో సీట్లు పొందిన విద్యార్థులు చేరాలని కాళోజీ వర్సిటీ విసి చెప్తే, ప్రైవేటు వైద్య కళాశాలల యాజమాన్యాలు మాత్రం తాము కన్వీనర్ కోటాలో చేర్చుకునేది లేదని తేల్చి చెప్పాయి. విద్యార్థులు పిల్లల తల్లిదండ్రులు మాత్రం ఏం చేయాలో అర్థం కాక నలిగిపోతున్నారు, ఆందోళన చెందుతున్నారు. సుప్రీంకోర్టు, హైకోర్టు లాంటి ఉన్నత న్యాయ స్థానాల ఆదేశాలను గాని, ఎం.సి.ఇ, మార్గదర్శకాలను గాని ప్రైవేటు యాజమాన్యాలు బరితెగించి ఉల్లంఘించినా మన ప్రభుత్వాలు చేష్టలుడిగి ఉంటున్నాయి. చివరకు హైకోర్టు తన తీర్పును సవరించుకొని ఉత్తర్వులివాల్సిన పరిస్థితి వచ్చింది. ఆ మేరకు యాజమాన్య కోటా సీట్లకు ప్రవేశాలు జరుపుకొమ్మని తెలిపింది. అంతకు ముందు ఇవే యాజమాన్యాలు వైద్య కళాశాలల్లో ఫీజులను పెంచకుంటే తాము పీజీ వైద్య కోర్సులలో విద్యార్థులను చేర్చుకోబోమని ఉభయరాష్ట్రాల ప్రభుత్వాలను బ్లాక్‌మెయిల్ చేసి, మూడు, నాలుగు రెట్ల వరకు ప్రవేశ రుసుములను పెంచే విధంగా జీవోలను ఇప్పించుకొన్నారు. ఈలోగా ఫీజుల పెంపును వ్యతిరేకిస్తూ కొందరు హైకోర్టునాశ్రయిస్తే, ప్రవేశాల ప్రక్రియ కొనసాగించుకోవచ్చని, పాత రుసుములతోనే విద్యార్థులను చేర్చుకోవాలని మధ్యంతర ఉత్తర్వులిస్తూ, తుది ఆదేశాల మేరకు ఫీజులు ఉండాలని ఆదేశించింది. హైకోర్టు తుది తీర్పు వచ్చేదాకా వేచియుండక, విద్యార్థులను ఇబ్బందులకు గురిచేయడం యాజమాన్యాల ధనదాహానికి నిదర్శనం.

పాఠశాల విద్యలో రకరకాల పేర్లతో పాఠశాలలు స్థాపించి ఎల్.కె.జీ తరగతులకే లక్షలాది రూపాయాలను వసూలు చేస్తున్నారు. విచక్షణా రహితంగా ఫీజులు పెంచడాన్ని వ్యతిరేకిస్తూ తల్లిదండ్రులు అక్కడక్కడా ఆందోళనలు చేస్తే, ఏదో ఒక కారణంతో ఆందోళన చేసిన తల్లిదండ్రుల పిల్లలను పాఠశాలల నుంచి తొలగిస్తూ, వారిని భయభ్రాంతులకు గురిచేస్తున్నారు. 2010లో అమల్లోకి వచ్చిన విద్యా హక్కు చట్టం పాఠశాలల్లో వసూలు చేసే ట్యూషన్ ఫీజు పేరుతో కాకుండా, ఇతర పేర్లతో వసూలు చేసే ఫీజులను నియంత్రించలేదు. పైగా ఆనాటి కేంద్ర మానవ వనరుల మంత్రి కపిల్ సిబాల్ మాట్లాడుతూ పాఠశాలల్లో వసూలు చేసే ఫీజుల నియంత్రణకు నిషేధానికి ఎటువంటి చర్యలు తీసికోవడం లేదని ప్రకటించారు కూడా! విద్యా హక్కు చట్టం అమల్లోకి వచ్చిన తర్వాత రాష్ట్ర ప్రభుత్వాలకు పాఠశాల ఫీజులపై ఉన్న నియంత్రణ కాస్తా లేకుండా పోయింది. ఉమ్మడి రాష్ట్రంలో 1994లో అమల్లోకి వచ్చిన జీవో సంఖ్య 1 ప్రకారమైనా ప్రైవేటు పాఠశాలలు వసూలు చేసే ఫీజులపై, వారు ఉపాధ్యాయులకు ఇచ్చే జీతాలపై జిల్లా/రాష్ట్ర విద్యాశాఖాధికారులు నియంత్రణ చేయలేకున్నారు.

బహిరంగంగా కోర్టుల ఆదేశాలను ధిక్కరించినా, ప్రభుత్వ ఉత్తర్వులను ఉల్లంఘించినా చేసేదేమి లేక యాజమాన్యాల ఒత్తిళ్ళకు కోర్టులు, ప్రభుత్వాలు లొంగిపోతున్నాయి. ప్రవేశాలనాశించే విద్యార్థులు యాజమాన్యాల చర్యలతో దిక్కుతోచని స్థితిలో పడిపోవడం ఇది కొత్తకాదు. గతంలో కూడా ప్రైవేట్ యాజమాన్యాలు ఫీజులు పెంచేదాకా కేటాయించిన విద్యార్థులను చేర్చుకోని దాఖలాలున్నాయి. ప్రైవేటు యాజమాన్యాలకు ఇంత తెగువ ఎక్కడిది? కోర్టులను, ప్రభుత్వాలను, ఎం.సి.ఇ, ఎ.ఐ.సి.టి.ఇ లాంటి రాజ్యాంగ సంస్థలను ధిక్కరించే పరిస్థితి ఏమిటి? ఈ పరిస్థితులను సరిచేసి, విద్యార్థులకు న్యాయం చేయాల్సిన ప్రభుత్వాలు ప్రైవేటు యాజమాన్యాల మాఫియా బెదిరింపులకు ఎందుకు

# అసంఘటిత రంగం - వికేంద్రీకృత కార్మికవర్గం

***పెద్దనోట్ల రద్దు, నగదు రహిత లావాదేవీల నేపథ్యంలో అసంఘటిత కార్మికవర్గానికి రానున్న ఇబ్బందులను వివరిస్తున్నారు***

**కొండూరి వీరయ్య**

కేంద్ర ప్రభుత్వం పెద్ద నోట్లు రద్దు చేసి దాదాపు రెండు నెలలు అవుతోంది. తమ చర్యను సమర్ధించుకోవడానికి ప్రభుత్వం కొత్త కొత్త వాదనలు ముందుకు తెచ్చింది. ఈ వాదనల్లో ఒకటి అసంఘటిత ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన వాదన. స్వయంగా ప్రధాని లాంటి బాధ్యతాయుతమైన స్థానంలో ఉన్న వ్యక్తి దేశంలో 86 శాతం మంది కార్మికులకు జీవనాధారం అవుతూ 45 శాతం స్థూలజాతీయోత్పత్తికి మూలం అయిన అసంఘటిత ఆర్థిక వ్యవస్థను నల్లధనం పోగుచేసే ప్రధాన సాధనంగా వర్ణించడం అత్యంత హేయమైన చర్య. నోట్ల రద్దు నిర్ణయం వల్ల ప్రభుత్వం సాధించదల్చుకున్న లక్ష్యాలు ఒకదాని తర్వాత ఒకటిగా మారుతూ వచ్చాయి. రిజర్వు బ్యాంకు, ఆర్థిక మంత్రి, ప్రధాని, ఇతర కేంద్ర మంత్రులు చేస్తున్న ప్రకటనలు ఒకదానికొకటి పొంతన లేనివిగా మారాయి.

యాభైరోజులు పూర్తి అయ్యే నాటికి దేశవ్యాప్తంగా రెండు లక్షలకు పైగా ఉన్న ఎటిఎం మిషన్లలో దాదాపు 15 శాతం మిషన్లు మాత్రమే కొత్త నోట్లు అందచేస్తున్నాయి. రిజర్వుబ్యాంకు నోట్ల ముద్రణాలయం ప్రచురణా సామర్థ్యం ఏమిటి, ఈ యాభై రోజుల్లో ఎన్ని నోట్లు ముద్రించారు, ఎన్ని నోట్లు బ్యాంకులకు, ఎటిఎంలకు, ఖాతాదారులకు చేరాయి అన్న సమాచారం అత్యంత గోప్యంగా ఉంచబడింది. ప్రభుత్వం తన ఘోరవైఫల్యాన్ని కప్పిపుచ్చుకోవడానికి ప్రజలు కష్టించి సంపాదించిన సొమ్మును నల్లధనంగా ముద్ర వేస్తూ వారిని ఆందోళనకు గురి చేస్తోంది. దేశవ్యాప్తంగా బ్యాంకింగ్ సేవలు అందుబాటులో లేవు అన్నది అందరికీ తెలిసినదే. బ్యాంకింగ్ సేవలు అందుబాటులో లేకపోవడం వల్ల, నోట్ల మార్పిడి చేసుకోలేకపోయిన వారినందరినీ జైల్లో పెడతామని డిసెంబర్ చివరి వారంలో జరిగిన క్యాబినెట్ సమావేశం తీర్మానించడం గమనిస్తే ప్రజలందరూ దోషులే అన్న అవగాహనతోనే ఈ నిర్ణయం రూపొందించారన్నది స్పష్టం అవుతోంది.

ప్రభుత్వం, దాని ప్రచార యంత్రాంగం, మంత్రాంగం ఎంతగా డప్పు కొట్టుకుంటున్నా నల్లధనం నిల్వ ఉంచుకున్న కోటీశ్వరులెవ్వరూ బ్యాంకుల ముందు క్యూల్లో నిలబడలేదన్నది కళ్లముందున్న వాస్తవం. దేశవ్యాప్తంగా గ్రామీణ ఆర్థిక వ్యవస్థ కుదేలైంది. కొత్త నోట్ల కొరత, పాత నోట్లు మార్చుకునే వెసులుబాటు లేకపోవడంతో వ్యవసాయోత్పత్తుల ధరలు పాతాళానికి చేరాయి. గ్రామీణ కార్మికులకు ప్రధాన ప్రత్యామ్నాయ జీవనోపాధి అయిన భవన నిర్మాణ రంగం కుదేలైంది. వలస కార్మికులు తిరుగు టపాల్లో ఇళ్లకు చేరుతున్నారు. శతాబ్దాల క్రితం వదిలేసిన వస్తుమార్పిడి పద్ధతికి గ్రామీణ మార్కెట్లు మళ్లుతున్నాయి. క్యూల్లో వందలాది మంది హత్యలు ఉండనే ఉన్నాయి. కళ్లముందు కనిపిస్తున్న వాస్తవాలు ఇవీ. కానీ ఫలానా గ్రామం పూర్తిగా నగదు రహిత గ్రామంగా మారింది. పేటిఎం లావాదేవీలు మూడువందల రెట్లు పెరిగాయి, నగదురహిత లావాదేవీలు నాలుగువందల రెట్లు పెరిగాయి, ప్రైవేటు పన్నుల ఆదాయం ప్రభుత్వానికి పెరిగింది, నగరాల్లో పెద్దఎత్తున పేరుకుపోయిన ఆస్తిపన్నుల చెల్లింపులు వేగంగా జరుగుతున్నాయి, అడుక్కుతినేవాళ్లు కూడా స్వైపింగ్ మిషన్ ఉపయోగిస్తున్నారు అంటూ ప్రభుత్వం, పత్రికలు, టివిల్లోనూ, బిజెపి వందిమాగధులు సామాజిక మాధ్యమాల్లోనూ కుమ్మరిస్తున్న అభూతకల్పనలు.

ఈ మొత్తంలో అసంఘటిత రంగంలో జరిగే ఉత్పత్తి, దానిద్వారా సంపాదించే వేతన, వేతనేతర ఆదాయాలు మొత్తం నల్లధనం సేకరణలో అంతర్భాగమే అన్న ప్రభుత్వ ప్రచారం సాధారణ అంగీకృత అంశంగా మారింది. నిర్మాణాత్మక ప్రచార యుద్ధంతో ఒక వాస్తవాన్ని అవాస్తవంగా మార్చడం, మసిపూసి మారేడు కాయ చేయడం ఎలా జరుగుతుందో తాజా పరిణామాలు రుజువు చేస్తున్నాయి. దీన్నే నాడు గోబెల్స్ ప్రచారం అన్నారు.

ఇంతకీ అసంఘటిత ఆర్థిక వ్యవస్థ అంటే ఏమిటి? ఎలా ఉనికిలోకి వచ్చింది? పెట్టుబడిదారీ వ్యవస్థ తన లాభాల పతనాన్ని నిలువరించు కోవడానికి దీన్ని ఒక సాధనంగా ఎలా వాడుకొంటోంది, ప్రపంచీకరణకు అసంఘటిత ఆర్థిక వ్యవస్థకు ఉన్న సంబంధం ఏమిటి అన్న మౌలిక అంశాలు వివరించేందుకు ఈ వ్యాసంలో ప్రయత్నం చేశాను.

పెట్టుబడిదారీ ఆర్థికాభివృద్ధి అసమానతలను పెంచుతుంది, నిరుద్యోగ రిజర్వు సైన్యాన్ని తయారు చేస్తుంది, ప్రజల శ్రమ శక్తిని కారుచౌకగా

---

లొంగిపోతున్నాయి? "పార్లమెంటులోని 300 మంది పార్లమెంటు సభ్యులకు ఏదోరూపంలో విద్యా వ్యాపార యాజమాన్యాలతో ప్రత్యక్ష, పరోక్ష సంబంధాలుండడంతో మన పార్లమెంటు విద్యావాణిజ్యీకరణకు వ్యతిరేకంగా ఏ చట్టాలు చేయలేక పోతోందని" విద్యావేత్తలు అంటున్నారు. మన ఉభయ తెలుగు రాష్ట్రాల్లోను ప్రైవేటు విద్యా యాజమానులే మంత్రులుగా, ఎం.ఎల్.సి, ఎం.ఎల్.ఎలుగా ఉంటే విద్యా మాఫియా బెదిరింపులను ఏ ప్రభుత్వ యంత్రాంగం అదుపు చేస్తది? దీనికి పరిష్కారం విద్యా వ్యాపారానికి వ్యతిరేకంగా ఉద్యమించి, విద్యను సరకుగా అమ్మకుండా చర్యలు తీసికునే రాజకీయ పార్టీని గద్దెనెక్కించడం జరగాలి.

*(రచయిత పూర్వ అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్)* వీ

కొని దానికి రెండు మూడు రెట్లు విలువైన ఉత్పత్తులు తయారు చేయిస్తోంది, తద్వారా లాభాలను కాపాడుకోవడానికి ప్రయత్నం చేస్తుంది. దీన్నే శ్రమ దోపిడీ, అదనపు విలువ దోపిడీ అని మార్క్స్ సాక్ష్యాధారాలతో సహా రుజువు చేశాడు. దాంతో ప్రపంచవ్యాప్తంగా మనిషిని మనిషి దోపిడీ చేసే ప్రక్రియకు కేంద్ర బిందువుగా ఉన్న పెట్టుబడిదారీ వ్యవస్థ స్థానంలో దోపిడీ రహిత సమాజం కోసం దేశాలకు దేశాలు ప్రత్యామ్నాయ మార్గాల వైపు మళ్లాయి. సోషలిజాన్ని సాధించాయి. సంఘటిత, అసంఘటిత ఆర్థిక వ్యవస్థల మధ్య ఉన్న వ్యత్యాసాలను తగ్గించి గ్రామీణ శ్రామిక వర్గం కేంద్రీకృతమైన అసంఘటిత ఆర్థిక వ్యవస్థను కూడా ఆధునీకరించే శక్తి సామర్థ్యం సోషలిజానికి ఉందని రష్యా రుజువు చేసింది. దీంతో కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు ప్రత్యామ్నాయ ఆర్థిక నమూనాల వైపు మొగ్గు చూపడం ప్రారంభమైంది.

ఈ సమయంలో వచ్చిందే లూయిస్ మలుపు అన్న సూత్రీకరణ. 1954లో ఆర్థర్ లూయిస్ అనే ఆర్థిక వేత్త పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ సామర్థ్యానికి కొత్త వ్యాఖ్యానాన్ని అందించారు. ఈయన వ్యాఖ్యానం ప్రకారం దేశ ఆర్థిక వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థతో మేళవించే కొద్దీ ఆయా దేశాల్లోని పెట్టుబడిదారీయేతర ఆర్థిక వ్యవస్థలు (ప్రధానంగా వ్యవసాయ ఆధారిత ఆర్థిక వ్యవస్థలు) కనుమరుగు అవుతాయి.

గ్రామీణ ప్రాంతాల్లోని శ్రామిక వర్గానికి కూడా పెట్టుబడిదారీ వ్యవస్థ పరిధిలో ఉపాధి కల్పించేస్థాయికి ఆధునిక పారిశ్రామిక రంగం వృద్ధి చెందుతుంది. ఈ నిర్ధారణకు మూలం రెండో ప్రపంచ యుద్ధానంతర విధ్వంసం నుండి తమను తాము పునర్నిర్మించుకునే దిశగా అమెరికా సహకారంతో ఐరోపాలోని పెట్టుబడిదారీ దేశాలు చేపట్టిన ప్రయత్నాలు. ఈ ప్రయత్నాలు నాటి చితికిపోయి పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలను పట్టాల మీదికి తెచ్చే లక్ష్యంతో సాగినవే.

అయితే ప్రపంచం ముందు మరో ప్రత్యామ్నాయ ఆర్థిక విధానం – సోషలిస్టు శిబిరం రూపంలో– ఉండడంతో ప్రజలకు సాధ్యమైనన్ని రాయితీలు, కనీస మౌలిక సౌకర్యాలు, జీవనోపాధి భద్రత, ఆరోగ్య, ఆహార భద్రత వంటి సామాజిక ఆర్థిక భద్రతలు పెట్టుబడిదారీ దేశాల్లోని కార్మిక వర్గానికి, ప్రజలకు కూడా కల్పించాల్సి వచ్చింది.

సోవియట్ విప్లవం శతవార్షిక ఉత్సవాల సందర్భంగా ఈ విప్లవ పర్యవసానంగా ముందుకొచ్చిన సార్వత్రిక సామాజిక రాజకీయ భద్రతల గురించి కూడా మరోమారు చర్చ జరగాల్సిన సందర్భం ఇది. పైన చెప్పిన పరిణామాలు చూపిస్తూ లూయిస్ తన వ్యాఖ్యానాన్ని బలపర్చుకోవడం, దానికి నోబెల్ బహుమతి అందచేయడం జరిగింది. తద్వారా ప్రతి దేశ ఆర్థిక వ్యవస్థలోనూ లూయిస్ మలుపు సాధ్యమే అన్న వాదనను అంగీకరింపచేయడానికి పెట్టుబడిదారీ వ్యవస్థ శతవిధాలా ప్రయత్నం చేసింది.

వర్ధమాన దేశాలు సోషలిస్టు ఆర్థిక వ్యవస్థను అనుసరించాల్సిన అవసరంలేదని, పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ పరిధిలోనే సోషలిస్టు వ్యవస్థ సాధించిన సామాజిక లక్ష్యాలు సాధించవచ్చుని రుజువుచేసే సైద్ధాంతిక పోరాటంలో 1954 నాటి నోబెల్ బహుమతిని పరిగణించవచ్చు. ఈ క్రమంలోనే విశాల ప్రాతిపదికన వినిమయ వస్తూత్పత్తి రంగం తెర మీదకు రావడం, ప్రజల వినియమ సామర్థ్యాన్ని పెంపొందించేందుకు నిలకడైన ఆదాయాలు, వేతనాలు ఇవ్వాల్సిన పరిస్థితి, నిరంతరం సంక్షోభంలో కూరుకుపోయే స్వభావం ఉన్న పెట్టుబడిదారీ వ్యవస్థను నిలకడగా పట్టాలెక్కించడం వంటి పరిణామాలు కూడా ఈ క్రమానికి చెందినవే. అప్పటికే ప్రపంచ మార్కెట్‌లో మూడో వంతు వాటాను కోల్పోయిన పెట్టుబడిదారీ శిబిరం సోషలిస్టు శిబిరం నుండి ఎదురవుతున్న రాజకీయ ముప్పును పరిగణనలోకి తీసుకుని తనను తాను పాక్షికంగా సంస్కరించబూనుకొన్నది అని నిర్ధారించవచ్చు.

కానీ లూయిస్ మలుపు సాధ్యం కాదు అని తదనంతర రెండు దశాబ్దాల పెట్టుబడిదారీ వ్యవస్థ గమనం రుజువు చేసింది. పెట్టుబడిదారీ వ్యవస్థ గమర్భంలో దాగి ఉన్న పుండు – లాభాపేక్ష– నుండి అది బయటపడలేదు అన్న వాస్తవాన్ని 1970 దశకం నాటి ప్రపంచ ఆర్థిక వ్యవస్థ పరిణామాలు రుజువు చేశాయి.

1950–70 దశకాల్లో పెట్టుబడిదారీ వర్గం లాభాలు ప్రపంచ వ్యాప్తంగా పడిపోయాయి. (ఈ విషయాన్ని మరింత లోతుగా 2008 జనవరి మార్క్సిస్టు వ్యాసంలో చర్చించాను) దీనికి ముఖ్య కారణం ప్రత్యామ్నాయ సోషలిస్టు శిబిరం ముందుకు తెచ్చిన సార్వత్రిక సామాజిక ఆర్థిక భద్రత కోసం పెట్టుబడిదారీ వర్గం తమ లాభాల్లో ఎంతో కొంత ఖర్చు పెట్టాల్సి వచ్చింది. దానికి అనుగుణంగా కొన్ని విధి విధానాలు, చట్టాలు ఉనికిలోకి వచ్చాయి. సంక్షేమ ప్రభుత్వం సంఘటిత కార్మిక శక్తికి, సంఘటిత పెట్టుబడికి మధ్య వారధిగా పని చేసింది.

ఈ రెండు శక్తుల మధ్య వైరుధ్యాన్ని పరిమిత స్థాయిలో నియంత్రించడంలో భాగంగానే కనీస వేతన చట్టం మొదలు, కార్మికులకు ఆరోగ్య భీమా, భవిష్యనిధి, పని గంటలు పరిమితి, సంక్షేమ పథకాలు వంటివన్నీ ఉనికిలోకి వచ్చాయి. (2012 సెప్టెంబరు మార్క్సిస్టు సంచికలో ఈ విషయాన్ని మరింత విపులంగా వివరించాను). అయితే ఆర్థర్ లూయిస్, ఆ కోవకు చెందిన ఆర్థిక వేత్తల సూత్రీకరణలతో నిమిత్తం లేకుండా పెట్టుబడిదారీ వ్యవస్థ తన సహజ చలన సూత్రాలతో ముందుకెళ్తుందని 70 దశకం నాటికి మరోమారు రుజువు అయ్యింది.

1970 దశకంలో చోటు చేసుకున్న అంతర్జాతీయ రాజకీయ ఆర్థిక పరిణామాలు పెట్టుబడిదారీ వ్యవస్థ విచ్చలవిడి తనాన్ని బహిర్గతం చేశాయి. హాన్స్ సింగర్ వంటి ఆర్థిక వేత్తలు లూయిస్ మలుపుకు కాలం చెల్లిందని వ్యాఖ్యానించడం తాజా పరిణామాలను సైద్ధాంతిక చట్రంలో ఒడిసి పట్టే ప్రయత్నమే. ఇదే సమయానికి న్యూయార్క్ కేంద్రంగా నేడమిల్టన్ ఫ్రీడ్‌మన్ నేతృత్వంలో సంక్షేమ రాజ్యవ్యవస్థ మీద మొదలైన సైద్ధాంతిక దాడి నేటి ప్రపంచీకరణ రూపంలో మనముందు ఆవిష్కృతం అయ్యింది. ఈ మధ్యలోనే సంఘటిత, అసంఘటిత ఆర్థిక వ్యవస్థల గురించిన చర్చ మొదలైంది.

1971లో ఘనాలో సామాజిక పరిణామాలపై పరిశోధన చేస్తున్న బ్రిటిష్ మానవనిర్మితి శాస్త్రవేత్త (ఆంధ్రొపాలజిస్టు) కీత్ హార్ట్‌ఈ చిన్న ఆఫ్రికా దేశంలో సాంప్రదాయకంగా సంఘటిత ఆర్థిక వ్యవస్థలో జరిగే ఉత్పత్తికే పరిమితం కావడం లేదని, ఈ దీనికి బయట విస్తృతమైన స్థాయిలో ఉత్పత్తి, వినిమయ కార్యక్రమాలు జరుగుతున్నాయని గుర్తించాడు. దీన్నే అసంఘటిత ఆర్థిక వ్యవస్థగా నామకరణం చేశాడు. ఈ తరహా ఆర్థిక వ్యవస్థలో ఘనా దేశంలో సంఘటిత కార్మికవర్గం

(కనీస ఉపాధి భద్రత, వేతన భద్రత, భవిష్యత్తురక్షణలు కలిగిన కార్మికవర్గం) తగ్గిపోతూ రావటాన్ని పరిశీలించాడు. వారిస్థానంలో అసంఘటి కార్మికవర్గం తెరమీదకు వచ్చింది. ఈ అసంఘటిత కార్మికవర్గం ప్రధానంగా పెట్టుబడిదారీ విధానాల పదఘట్టనల కింద గ్రామీణ ఆర్థిక వ్యవస్థ నలిగిపోవడంతో జీవనోపాధి కోల్పోయిన గ్రామీణ శ్రామిక వర్గం( రైతాంగం, వృత్తిదారులు, వ్యవసాయ కార్మికులు) వలస కార్మికులై పట్టణ ప్రాంతాలకు చేరారు.

ఆర్థర్ లూయిస్ సూత్రీకరణ ప్రకారం విస్తరించిన సంఘటిత పెట్టుబడిదారీ విధానం ఏ దేశంలోనైనా ఉపాధి కోల్పోతున్న గ్రామీణ కార్మికవర్గానికి గౌరవప్రదమైన ఉపాధి కల్పించాలి. కానీ ఘనాలో ఈ పరిణామం చోటుచేసుకోలేదు అన్నది కీత్ ముఖ్యమైన అధ్యయనం. కీత్ పరిశీలన, ఫ్రీడ్‌మన్ సైద్ధాంతిక పునాది మధ్య మనకు కనిపించే ఉమ్మడి అంశం ఒకటి ఉంది. ఫ్రీడ్‌మన్ ముందుకు తెచ్చిన ఉదారవాద పెట్టుబడిదారీ విధానం (సంక్షేమవాదం, సామాజిక ఆర్థిత భద్రత కల్పించే లక్ష్యాలను విస్మరించే పెట్టుబడిదారీ విధానం) ఆచరణలో కీత్ పరిశీలించిన పరిణామాలకు పునాదులు వేశాయి.

ఈ మారిన ప్రాపంచిక రాజకీయ ఆర్థిక చట్రం నేపథ్యంలో అంతర్జాతీయ కార్మిక సంస్థ కూడా పలు స్వతంత్ర అధ్యయనాలు చేపట్టి ఈ పరిశీలనలను ధృవీకరించింది. ఈ ధృవీకరణల ప్రకారం అసంఘటిత ఆర్థిక వ్యవస్థ సంఘటిత ఉత్పత్తి రంగం కోసం రూపొందించిన చట్టాల చట్రం పరిధికి బయట ఉంటుంది. విస్తారమైన ఫోర్డ్ తరహా కేంద్రీకృత ఉత్పత్తి యూనిట్లకు బదులు వికేంద్రీకృత ఉత్పత్తి కేంద్రాలకు ఈ సమయం లోనే కొత్తగా పారిశ్రామికాభివృద్ధి సాధిస్తున్న దేశాల నుండి (కొరియా, సింగపూర్, ఇండొనేషియా, మలేషియా, థాయ్‌లాండ్, జపాన్, లాటిన్ అమెరికా దేశాలు) అంతర్జాతీయ మార్కెట్ కోసం సంపన్నవంతమైన పెట్టుబడిదారీ దేశాలు పెద్దఎత్తున పోటీని ఎదుర్కోవాల్సి వచ్చింది.

దాంతో సంపన్న దేశాలు తమ ఉత్పత్తి రంగాన్ని పున:సమీక్షించుకుని వర్ధమాన దేశాల్లో విస్తారంగా అందుబాటులోకి వస్తున్న నైపుణ్యం కలిగిన కార్మికవర్గ శ్రమ శక్తిని దోచుకునేందుకు వీలుగా మార్చుకున్నాయి. దాంతో పెట్టుబడి ఔట్‌సోర్సింగ్ (విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు) మొదలైంది. ఈ క్రమం నెలసరి జీతాలకు పనిచేసే కార్మికవర్గం స్థానంలో దైనందిన వేతనాలు, పీస్‌రేట్ వేతనాలు, పదవీ విరమణ వరకు ఉపాధి కల్పించే విధానానికి బదులు ప్రాజెక్టు నిర్మాణ కాల వ్యవధికి పరిమితం చేయబడ్డ ఉపాధి కల్పన, రెగ్యులర్ కార్మికులకు బదులు కాంట్రాక్టు, ఔట్‌సోర్సింగ్ కార్మికులు, గౌరవ వేతన కార్మికులు వంటి అనేక రూపాల్లో కార్మికవర్గం వికేంద్రీకరించబడింది.

కానీ ఈ అన్ని రకాల శ్రామిక వర్గాన్ని దోపిడీ చేసే పెట్టుబడిదారీ వర్గం మాత్రం జాతీయ పెట్టుబడిదారీ వర్గం నుండి అంతర్జాతీయ పెట్టుబడిదారీ వర్గంగానూ, పారిశ్రామిక గుత్తాధిపత్యం నుండి ద్రవ్యగుత్తాధిపత్యం స్థాపన దిశగా కేంద్రీకృతమైంది.

ఈ మొత్తం పరిణామాలకు పునాదులు ప్రపంచీకరణలో ఉన్నాయి. ఈ యావత్తు క్రమం ఒక్కో దేశంలో ఒక్కో రూపం తీసుకుంటోంది. దాంతో ఒకదానికి ఒకటి అనుబంధ ప్రక్రియలుగా కాక స్వతంత్ర ప్రక్రియలుగా కనిపించే పరిస్థితి నెలకొని ఉన్నది. ఈ ప్రక్రియల సారాంశం గ్రామీణ కార్మికవర్గంతో పాటు ఉపాధి కోల్పోతున్న పట్టణ ప్రాంతాల కార్మికవర్గం కూడా రక్షణలు లేని ఉపాధి చట్రాల నడుమ బిగించబడుతున్నారు. రక్షిత ఉపాధి చట్రం ద్వారా కార్మికులకు రావల్సిన విస్తృత ప్రయోజనాలు ఈ పద్ధతిలో నిరాకరించబడుతున్నాయి.

అసంఘటిత ఆర్థిక రంగాన్ని సార్వత్రికం చేసిన మరో ముఖ్యమైన పరిణామాన్ని ప్రస్తావించి వ్యాసాన్ని ముగిస్తాను. 1970లోనే ఫ్రీడ్‌మన్ బృందం నేతృత్వంలో నేటి ప్రపంచీకరణకు పునాదులు పడ్డాయని చెప్పుకున్నాము. ఈ విధానాలను తొలుత ప్రయోగాత్మకంగా లాటిన్ అమెరికా దేశాలైన చిలి, పెరు, అర్జెంటీనాల్లో అమలు జరిపారు. అప్పటికి ఆ దేశాలు అమెరికా తొత్తుల ఏలుబడిలో ఉన్నాయి. పెరుకు చెందిన ఆర్థిక వేత్త హర్నాండో డి సోటో అసంఘటిత ఆర్థిక వ్యవస్థను కొత్త కోణంలో పరిచయం చేశాడు. ఆయన అధ్యయనం ప్రధానంగా పేద దేశాలు ఎందుకు పేదదేశాలుగా మిగిలాయి అన్న ప్రశ్నతో మొదలవుతుంది.

వర్ధమాన దేశాల్లో సింహభాగం ఆర్థిక వ్యవస్థ – ఉత్పత్తి, వినిమయ లావాదేవీలు– పెట్టుబడిదారీ వ్యవస్థ లాభాలు పెంపొందించడానికి రూపొందించబడిన చట్టాలు, చట్రాల పరిధికి బయట జరుగుతుందని గుర్తించాడు. ఈ వస్తువులు, వస్తువులుసేవలు మార్కెట్ లావాదేవీల పరిధికి బయట ఉంటున్నాయని, దాంతో వాటికి వెల కట్టడం సాధ్యం కావడం లేదని, ఈ కారణంగా వర్ధమాన దేశాల ఆర్థిక వ్యవస్థ విలువ తక్కువగా ఉంటోందని వాదించాడు. దాంతో ఇటువంటి వస్తు సేవలన్నీ పెట్టుబడిదారీ చట్రం పరిధిలోకి తేవాలని ప్రతిపాదించాడు. ఈ విధంగా పెట్టుబడిదారీ చట్రం పరిధిలోకి వచ్చే సేవలన్నింటిపైనా వినిమయ చార్జీలు విధించడం ద్వారా ప్రభుత్వం ఆదాయం సమకూర్చుకోవచ్చని ప్రతిపాదించాడు. దాంతో ప్రత్యక్ష పన్నుల ద్వారా ఆదాయాలు సమకూర్చుకుని ఈ వనరులు సార్వత్రిక సంక్షేమం కోసం వెచ్చించాలన్న దీర్ఘకాలిక అవగాహనకు తూట్లు పొడవడానికి కావల్సిన పునాదులు వేశాడు. దాంతో లాటిన్ అమెరికాలో ప్రయోగాత్మకంగా ప్రారంభమైన వినిమయ చార్జీలు నేడు సరళీకరణ సంస్కరణల్లో అంతర్భాగంగా మారాయి. ప్రపంచవ్యాప్తంగా అమల్లోకి వచ్చాయి.

డిసోటో పాఠం వంటబట్టించుకున్న మోడీ ప్రభుత్వం బ్యాంకుల పరిధికి బయట ఉన్న నగదు మొత్తాన్ని బ్యాంకుల్లోకి మళ్లించడం ద్వారా జాతి సంపద పెరిగినట్లు నిరూపించాలని ప్రయత్నం చేస్తున్నాడు. ఈ క్రమంలోనే నగదు రహిత లావాదేవీల పేరుతో లక్షల కోట్ల రూపాయల లాభాలు వినియమ చార్జీల రూపంలో డిజిటల్ టెక్నాలజీ కంపెనీలకు కట్టబెట్టేందుకు అవసరమైన పునాదులు వేశారు.

ఈ క్రమంలోనే పెట్టుబడిదారీ వ్యవస్థ లాభాలు కాపాడే సాధనంగా ఉన్న అసంఘటిత ఆర్థిక వ్యవస్థను నల్లధనంతోనే, బ్లాక్‌మార్కెట్‌తోనూ పోల్చారు. ఉపాధి కల్పనలో పెట్టుబడిదారీ ప్రభుత్వాల వైఫల్యాన్ని అసంఘటిత రంగం ఎత్తి చూపుతోంది. మోడీ ఈ రంగాన్ని దోషిగా నిరూపించడం ద్వారా ఉపాధి కల్పనలో సంస్కరణానంతర ప్రభుత్వాల వైఫల్యాలను కప్పి పెట్టే కర్తవ్యాన్ని నెత్తికెత్తుకున్నాడు. ఈ విధంగా కేంద్రీకృత మార్కెట్ దోపిడీ కోరలకు అందని వికేంద్రీకృత కార్మికవర్గాన్ని సైతం బలి చేసేందుకు సిద్ధం అయ్యింది బిజెపి ప్రభుత్వం.

*(రచయిత వ్యవసాయ కార్మిక సంఘం జాతీయ కార్యవర్గ సభ్యులు)* వీ

# ప్రత్యామ్నాయ రాజకీయ శక్తి నక్సల్బరీ

***నక్సల్బరీకి ముప్పై సంవత్సరాల సందర్భంగా వెలువడిన 'నక్సల్బరీ - గమ్యం-గమనం' పుస్తకాన్ని ఇరవై ఏళ్లు గడిచాక మరొకసారి పరిశీలిస్తున్నారు ఎ.కె. ప్రభాకర్***

నక్సల్బరీ ప్రపంచ చిత్రపటంలో ఒక బిందువే కావొచ్చు కానీ అది స్వాతంత్ర్యానంతర భారతదేశ రాజకీయ చరిత్ర నుదుటన మెరిసే నెత్తుటి బొట్టు. చాలా మంది చెప్పినట్టు నక్సల్బరీ ఒక ఊరు కాదు, ఒక రాజకీయ పంథా. అదొక ప్రతీక కాదు, ఒక ధిక్కార జీవిత విధానం. యాభై వసంతాల పూర్వందిక్కులు ప్రతిధ్వనించేలా అక్కడ విచ్చుకొన్న మేఘ గర్జనలో దేశ పీడిత ప్రజల కోసం ఒక సామాజిక స్వప్నం పురుడు పోసుకొంది. అది భూమి కోసం విముక్తికోసం పోరాడే రైతాంగానికి మార్క్సిజం లెనినిజం మావో ఆలోచనా విధానాన్ని పనిముట్టుగా అందించింది. ఆర్థిక పోరాటంగా ప్రారంభమైనప్పటికీ తర్వాతి కాలపు నూతన ప్రజాస్వామిక విప్లవానికి పునాది రాయి అక్కడే పడింది. దేశంలో శ్రామిక రాజ్యాధికార స్థాపనకు నక్సల్బరీ తొలి అడుగు కాకపోవచ్చు గానీ గొప్ప ముందడుగు అనడంలో ఎటువంటి సందేహానికీ తావులేదు. చైనా మార్గమే మా మార్గం చైనా చైర్మనే మా చైర్మన్ అన్న తొలినాటి నినాదాల నుంచి బయటపడి నాయకత్వం దేశీయ అవసరాలకు అనుగుణంగా ప్రజా యుద్ధ పంథాని నిర్మించుకుంది. సామాజిక ఆర్థిక రాజకీయ సాంస్కృతిక రంగాల్లో నక్సలైట్ ఉద్యమం మన సమాజంలో మౌలికంగా తెచ్చిన గుణాత్మకమైన మార్పులు నూతన మానవ ఆవిష్కరణకి దోహదం చేస్తాయని మేధావులు భావించారు. అయితే అందుకు భిన్నంగా వామపక్ష తీవ్రవాదం దేశాభివృద్ధికి గొడ్డలిపెట్టని పాలకులు ప్రచారం చేస్తూ దాన్ని అణచివేయడానికి తమ శక్తియుక్తుల్నీ ఉన్న వనరులన్నిటినీ ఉపయోగిస్తున్నారు. రెండు విరుద్ధ శక్తుల మధ్య ఏర్పడ్డ సంఘర్షణ దేశంలో ఒక అంతర్గత యుద్ధ వాతావరణాన్ని సృష్టిస్తోంది. అయితే యాభై ఏళ్లుగా ఈ సంఘర్షణ నడుస్తున్నప్పటికీ విప్లవం విజయవంతం కావడానికి అడ్డువస్తున్న శక్తులేవి అని ఎప్పటికప్పుడు సమీక్షించుకోవాల్సిన సందర్భం ఎదురవుతూనే ఉంది.




నక్సలిజం శ్రీకాకుళం వెలుగులో ఉత్తర తెలంగాణ నుంచీ నల్లమల ఆంధ్రా ఒరిస్సా సరిహద్దుల మీదుగా దండకారణ్య సందర్భంలో అబూజ్‌మాడ్ జనతన రాజ్యం వరకూ ఈ యాభై ఏళ్ల సుదీర్ఘ ప్రయాణంలో ఎన్నో మలుపులు. ఎన్నో గెలుపులు ఎన్నో ఓటములు. ఆశల విత్తనాలు విత్తేందుకు దున్నిన నాగేటి చాళ్లలో ఎన్నో రక్తపుటేరులు పారాయి. ఎన్నో త్యాగాలు బలిదానాలు. ఆవిర్భావం నుంచే ఆచరణలో, సైద్ధాంతికంగా ఎన్నో విభేదాలు. చీలికలు పేలికలు. కోవర్ట్ కుట్రలు పరస్పర ఆహననోద్యోగాలు. వైఫల్యాల నుంచి నేర్చుకొన్న గుణపాఠాలు. నిర్మాణం లోపల అంతర్గతంగా ఎన్నో పొరపాట్లు మరెన్నో దిద్దుబాట్లు. బయటి నుంచి వచ్చే ఒత్తిడుల కారణంగా పాలకుల అణచివేత విధానాల కారణంగా చోటుచేసుకొనే కొత్త రాజకీయ సమీకరణలు. రహస్యోద్యమ కార్యాచరణలో ఎన్నో వ్యూహాలు యెత్తుగడలు... వెరసి నక్సలిజం ఒక పోరాట మార్గంగా రాజకీయ పంథాగా భారతీయ సమాజంలో భూమిలేని రైతాంగాన్నీ అడవి నుంచీ ఏరివేతకు, తరిమివేతకూ గురౌతున్న ఆదివాసుల్నీ మైదాన ప్రాంతాల మధ్య తరగతి బుద్ధిజీవుల్నీ పెను కుదుపుకు గురిచేసింది.

ఈ క్రమాన్నంతటినీ విపులంగా తెలియజేసే వ్యాసాలైతే పత్రికల్లో వచ్చాయి గానీ గ్రంథాలు చాల తక్కువ. సుమంతా బెనర్జీ రచించిన 'నక్సల్బరీ వెలుగులో'( ఇంగ్లీషు ప్రచురణ :1980, తెలుగు అను. కృష్ణమూర్తి, తొలి ప్రచురణ1982, సామ్యవాద సాహితి – మలి ప్రచురణ 2014, విరసం) వంటి వాటిని వేళ్లమీద మాత్రమే లెక్కపెట్టగలం. 1967 మే నెలలో మొదలైన నక్సల్బరీ ఉద్యమం 72 నాటికే విఫలమవడానికీ 74 నాటికి నామరూపాల్లేకుండా పోవడానికి కారణమైన రాజ్యహింసనీ నిర్మాణ పరమైన స్థితిగతుల్నీ సిద్ధాంత పరమైన అవగాహననీ ఆ గ్రంథం చర్చించింది.

అయితే నక్సల్బరీ అంతం కాలేదు . విరామం మాత్రమే తీసుకుంది. నక్సల్బరీ శ్రీకాకుళాల్లో పుట్టిన ఆ నిప్పు త్వరగానే ఉత్తర తెలంగాణలో మరింత తీవ్రంగా రగులుకుంది. జగిత్యాల జైత్రయాత్ర, భూపోరాటాలు, కల్లోల ప్రాంతాల ప్రకటనల నేపథ్యాల్లో రాడికల్స్ గ్రామాలకు తరలివెళ్తే ప్రజల తిరుగుబాటు తట్టుకోలేక దొరలు గడీలు గ్రామాలు వదిలి పట్టణాలకు వలస పోయారు. గడీలు పోలీసు క్యాంపులై ప్రజల మీద నిర్బంధం అమలుచేశాయి. రైతాంగం గిరిజనులు కార్మికులు ముప్పేటగా భూస్వామ్య ఆధిపత్యాలకూ, అటవీ చట్టాలకూ, గని యాజమాన్యాలకూ వ్యతిరేకంగా హక్కుల పోరాటాలు చేశారు. ఇదంతా దందహ్యమాన దశాబ్దాల చరిత్ర. నక్సల్బరీ ఆవిర్భావం నుంచీ మూడు దశాబ్దాల కాలాన్ని అది 'కైవశం చేసుకున్న ప్రపంచాల' గురించి, 'కోల్పోయిన కోటల' గురించి, పొందిన జయాపజయాల గురించి, నడిచిన తొవ్వల గురించి, నడవాల్సిన రాదారుల గురించి, వాటిలో ఎదురయ్యే ఆటుపోట్ల గురించి, మంచి చెడుల గురించి, విమర్శనాత్మకంగా విశ్లేషిస్తూ 1998లో వచ్చిన గ్రంథం 'మూడు దశాబ్దాల నక్సల్బరీ గమ్యం గమనం (1967–1997)'.

సామాజిక ఆర్థిక పరిణామాలపై నక్సలిజం చూపునూ, అవగాహన లోని లోతుపాతులనూ, లోటుపాట్లనూ, ప్రజాసంఘాల పట్ల పార్టీ వైఖరినీ, వివిధ సెక్షన్ల ప్రజానీకాన్ని ఉద్యమంలోకి సమీకరించడంలో అనుసరిస్తున్న

పద్ధతుల్ని, రాజ్యాధికారం కోసం చేపట్టిన కార్యాచరణ వ్యూహాల్ని, సాంస్కృతిక రంగంలో చేసిన కృషినీ సమీక్షించిన 'మూడు దశాబ్దాల నక్సల్బరీ గమ్యం గమనం (1967– 1997)' పుస్తకం ఎస్ సుధాకర్, ఎం. కోదండరామిరెడ్డిల సంయుక్త సంపాదకత్వంలో వెలువడింది. పర్స్పెక్టివ్స్ ప్రచురించిన ఈ వ్యాస సంకలనంలోని రచయితలందరూ నక్సలైట్ ఉద్యమాన్ని దగ్గరగా పరిశీలిస్తూ వివిధ సామాజిక సాంస్కృతిక రంగాల్లో పనిచేసిన/చేస్తున్నవాళ్లే. ఉద్యమంతో, ప్రజా సంఘాల ద్వారానో, హక్కుల ఉద్యమాల నేపథ్యం నుంచో, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంబంధం ఉన్నవాళ్లే. లేదంటే ఉద్యమం పట్ల దాని సైద్ధాంతిక దృక్పథాల పట్ల సహానుభూతో సానుభూతో కలవారే. అయినప్పటికీ పార్టీ నిర్మాణం విషయంలోనూ ఆచరణలోనూ పొడసూపిన అనేకమైన ప్రజానుకూలమైన / వ్యతిరేకమైన పోకడలను నిష్పక్షపాతంగా విశ్లేషించారు. ప్రతి సందర్భాన్నీ విమర్శనాత్మకంగా చూసారు. పాలకు పాలు నీళ్లకు నీళ్లు విడదీశారు. వ్యాసకర్తలు అందరూ నక్సల్బరీ ఉద్యమం వెలుగు నీడల్ని రెండింటినీ సమభావంతో ఎత్తి చూపారు. ఎక్కువ భాగం 'చీకటి కోణాల' మీదే ఫోకస్ చేయడం వల్ల వాళ్లు లేవనెత్తిన అంశాలు ఎన్నో చర్చలకు దారి తీశాయి. 'విప్లవోద్యమ క్రమంలో దొర్లుతున్న తప్పిదాల్ని దిద్దుకుని ఉద్యమం మరింత బలంగా ముందుకు నడవడానికి దోహద పడాలనే ఉద్దేశంతో' వెలువడ్డ పుస్తకం కాబట్టి రెండు నెలల్లోనే రెండవ ముద్రణకి వెళ్లింది.

ఇరవై ఏళ్ల క్రితం మూడు దశాబ్దాల నక్సల్బరీలో ప్రస్తావించిన అంశాలు ఇవ్వాళ మళ్లీ సమీక్షించుకోవడంలో సైతం కొన్ని ఇబ్బందులూ పరిమితులూ ఉన్నాయి. వ్యాసాల్లో విమర్శ విశ్లేషణల్లో ఎక్కువ భాగం ఆంధ్రప్రదేశ్, ముఖ్యంగా తెలంగాణ నిర్దిష్టత నుంచే చోటుచేసుకోవడం గమనించాల్సిన అంశం( అప్పటి కె.యస్, సత్యమూర్తి దగ్గర్నుంచీ ఇవ్వాల్టి మావోయిస్టు పార్టీ గణపతి, కిషన్ జీ, ఆజాద్, ఆర్కేల వరకూ కేంద్ర నాయకత్వంలోకి ఎదిగిన సిద్ధాంత – వ్యూహ కర్తలు తెలుగువారే). వ్యాసకర్తల ఇవాల్టి సైద్ధాంతిక ప్రమేయాలూ ఆలోచనలూ ఆచరణలూ మారిఉండొచ్చు. అందువల్ల ఈ గ్రంథాన్ని ఆ పరిమితుల్లోంచే చూడాలి.

నలభైల నాటి తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటానికి కొనసాగింపుగా నిర్మితమైన ఎం.ఎల్ పార్టీల్లో నిర్మాణ పరంగానే కాదు పోరాట రూపాల విషయంలో సైతం తొలి నుంచీ వైరుధ్యాలున్నాయి. పార్లమెంటరీ పంథాకు సాయుధ మిలిటెంట్ పంథాకు మధ్య రేగిన భిన్నాభిప్రాయాల చరిత్రని ప్రస్తావిస్తూనే – 1967 నుంచి 1997 వరకు దేశంలో దాదాపు పదిహేను రాష్ట్రాల్లో తన ఉనికిని చాటిచెప్పి అంతర్జాతీయ భాషా నిఘంటువులకెక్కిన నక్సలైట్ ఉద్యమంపై తొంభైలకు ముందూ వెనుకా ప్రపంచీకరణ, వివిధ సామాజిక సాంస్కృతిక ప్రాంతీయ అస్తిత్వ చైతన్యాలు, తూర్పు యూరప్ పరిణామాలు... ఇవన్నీ ఎటువంటి ప్రభావం చూపాయో, అందుకు మా.లె. పార్టీలు ఎలా స్పందించాయో 'నక్సల్బరీ గమ్యం గమనం' విపులంగా తెలియజేస్తుంది.

ప్రజలు కోరుకొంటున్నట్టు కులం మతం పురుషాధిక్యత వంటి ఆధిపత్య వ్యవస్థలను కూలదోయడానికి ఈ పార్టీల (ఎంఎల్ పార్టీల) వ్యూహం సరిపోవడంలేదు (కోదండరాం) అన్న విషయం గురించి అనేక వ్యాసాల్లో రచయితలు లోతుగా చర్చించారు. కుల వైరుధ్యాలను విశ్లేషించలేక పోవడంవల్ల సాంస్కృతిక రంగంలో నష్టం జరిగిందని పాణి – దళితులూ, వెనుకబడిన కులాలు, మహిళలు లేవనెత్తుతున్న ప్రశ్నల నేపథ్యం గురించి ఎన్. వేణుగోపాల్ – నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమ చరిత్రలో స్త్రీల మీద అంతకుముందు వ్యవస్థల నుండే అమలవుతూ వస్తున్న పితృస్వామిక లైంగిక పీడన సరికొత్త రూపాలతో, రాక్షస బలంతో కొనసాగుతున్న విధం గురించి జ్యోతీరాణి కాత్యాయనీలు – భారత సమాజంలోని కుల వైరుధ్యానికి సంబంధించిన వాస్తవికతకు ఉద్యమం త్వరితంగా స్పందించలేకపోయిందని, కారంచేడు, చుండూరు వంటి కొన్ని సందర్భాల్లో స్పందించినా దాన్ని తన విప్లవ సిద్ధాంతంలో ఐక్యం చేసుకోగల సమగ్ర వైఖరిని రూపొందించుకోలేక పోయిందనీ మనోరంజన్ మొహంతి (అను: హెచ్చార్కె) బలంగానే హెచ్చరించారు.

తొలి రోజుల్లో ప్రజా సంఘాల అవసరాన్ని గుర్తించక పోవడం వల్ల ఉద్యమం నష్టపోయినప్పటికీ తర్వాతి కాలంలో సైతం పార్టీకీ, ప్రజా సంఘాలకు మధ్య ఉండవలసిన సంబంధం గురించి సరైన స్పష్టత లేకపోవడాన్ని వేణు తన వ్యాసంలో ప్రస్తావిస్తే 'విప్లవోద్యమాల్లో ప్రజా సంఘాల పాత్ర' అన్న వ్యాసంలో నిషేధాల్లో నిత్య నిర్బంధాల్లో రహస్య నిర్మాణంలో పోరాట చైతన్యాన్ని ప్రచారం చేయడంలో ప్రజా సంఘాలకు ఏర్పడిన పరిమితుల గురించి వాటిని అధిగమించడానికి తీసుకోవాల్సిన సాంకేతిక జాగరూకత గురించి సుధాకర్ లోతుగా విశ్లేషించాడు.

అదే విధంగా పార్టీ విద్యార్థి యువజన మేధావి రైతుకూలీ రంగాల్లో నిర్మించుకున్నట్టు కార్మిక రంగంలో ప్రజా సంఘాల్ని రూపొందించుకోలేక పోయిందనీ(వేణు), అందువల్ల రహస్య పద్ధతులకు పరిమితమవ్వడం ద్వారా బహిరంగ ఆందోళనలూ సమ్మెలూ నిర్వహించి కార్మిక చైతన్యాన్ని మిలిటెంట్ పోరాటంగా మలిచే ప్రయత్నాలు జరగలేదనీ (శేషయ్య), ఉద్యమంలో విప్లవకర పెటీ బూర్జువావర్గం, మధ్యతరగతి, పేద రైతాంగ భాగస్వామ్యం ఉన్నంతగా కమ్యూనిస్టు ఉద్యమాల్లో అత్యంత క్రియాశీలంగా ఉండాల్సిన కార్మికవర్గం పాత్ర లేదనీ(రవి) ఆవేదన వెలిబుచ్చారు. సింగరేణి కార్మిక సమాఖ్య అందుకు మినహాయింపని శేషయ్య సరిగానే గుర్తించారు. కానీ కట్ల మల్లేశం, రమాకాంత్ నాయకత్వంలో ట్రేడ్ యూనియనిజాన్ని ఎదిరించి బొగ్గు గనుల్లో సికాస సాధించిన విజయాల్ని తర్వాతి కాలంలో ఎందుకు నిలుపుకోలేక పోయారు – ఇతర పరిశ్రమలకీ ప్రాంతాలకీ ఎందుకు విస్తరించలేక పోయారు అన్న ప్రశ్నలకు సమాధానం లేదు. అయితే వ్యవసాయ విప్లవం మీదే దృష్టి పెట్టి ఫ్యూడల్ అణచివేతకి వ్యతిరేకంగా పోరాట పద్ధతుల్ని రూపొందించుకున్నంతగా పెట్టుబడీ దోపిడీకి వ్యతిరేకంగా రూపొందించుకోక పోవడం వల్ల జరిగిన నష్టాన్ని పార్టీ కొత్త శతాబ్దంలో పూడ్చుకోడానికి ప్రయత్నించింది.

భూమి కింద ఖనిజాల్ని తవ్వుకుపోయే క్రమంలో ఆదివాసిని అడవికి దూరం చేయడానికి ప్రభుత్వ మిలటరీతో ప్రైవేటు సైనిక దళాలతో సల్వాజుడుం వంటి రాజ్యాంగేతర గుండాలతో పాశవిక హింసని అమలు చేస్తున్న పోస్కో, ఎస్ఆర్. జిందాల్, వేదాంత వంటి బహుళజాతి కార్పొరేట్ సంస్థలని నిలవరిస్తూ జల్ జమీన్ జంగిల్ కోసం ప్రాణాల్ని పణంగా పెట్టి కొట్లాడుతున్న అశేష పీడిత ప్రజలకు నక్సల్బరీ రాజకీయ పంథాని కొనసాగిస్తున్న మావోయిస్టు పార్టీ ఇవ్వాళ అండగా అగ్రగామిగా నిలబడింది. 1/70, పెసా వంటి చట్టాల ద్వారా ఆదివాసీలకు లభించిన హక్కుల పరిరక్షణకు మడమ తిప్పని పోరాటం చేస్తుంది. నందిగ్రాం లాల్ గడ్ సింగూరు ప్రాంతాల్లో చేపట్టిన ప్రజా ఉద్యమాలకు నాయకత్వం

వహించి మంచి ఫలితాల్ని సాధించగలిగింది (అయితే ఆ యా సందర్భాల్లో బూర్జువా ప్రతిపక్షాలు పార్టీ శ్రేణుల ఉద్యమ చైతన్యాన్నీ పాలక పక్షం మీద ప్రజలకు ఉన్న వ్యతిరేకతనీ తమకు అనుకూలంగా ఉపయోగించుకుని గద్దెనెక్కి తర్వాత ఉద్యమ నాయకత్వంపై ఉక్కుపాదం మోపిన దాఖలాలు కూడా కళ్ల ముందు కదలాడుతూనే ఉన్నాయి).

ఉన్నతమైన ఉదాత్తమైన మానవీయమైన విలువల్ని స్థాపించి అభివృద్ధి చేసి కొనసాగించాల్సిన నూతన ప్రజాస్వామిక విప్లవం అనేక సందర్భాల్లో తప్పుదారి పట్టడానికి కారణమైన పరిస్థితులు వ్యాసాల్లో చర్చకు వచ్చాయి. ఏకేశ్వరోపాసనా దృక్పథం, సమస్యలను వస్తుగతంగా, బహు ముఖాలతో, సంకీర్ణతలతో అర్థం చేసుకోలేకపోవడం, మధ్యతరగతి అవలక్షణాలు, పొంగిపోవడంలోనూ, కుంగిపోవడంలోనూ, తొందరపాటు, అధికారం ఒక విలువ సాధించే సాధనమని కాక అదే అంతిమం అనుకుని తలకెక్కించుకోవడం, ఆయుధం మీద మోజు... దాని ద్వారా సంక్రమించే అహంకారం నిరంకుశ ధోరణి, వ్యక్తిగత పని విధానం, వ్యక్తి పూజ, గుర్తింపు తపన అవినీతి, అరాచకత్వం, క్రమ శిక్షణా రాహిత్యం ఇలావర్గ పోరాటాన్ని సకల అర్థాలతో గ్రహించలేని అవలక్షణాలెన్నో ఉద్యమానికి కీడు చేస్తున్నాయని రచయితలు నేరుగానే విమర్శించారు (వేణు- నక్సల్బరీ వెలుగు నీడలు).

రాజ్యాధికారం సామ్రాజ్యవాద నిర్మూలన వంటి దీర్ఘకాలిక లక్ష్యాల్ని ఆదర్శాలనూ వల్లిస్తూ విద్య వైద్యం నీళ్లు అధిక ధరలు వంటి దైనందిన సమస్యల పట్ల నిరాసక్తత ఒకవైపు స్థానికంగా చిన్న చిన్న పంచాయితీలు నిర్వహిస్తూ భూమి తగాదాలు కుటుంబ కలహాలు వంటి వాటిని పరిష్కరిస్తూ తక్షణ అవకాశవాద రాజకీయాలకు పరిమితమయ్యే వైఖరి మరోవైపు పార్టీకీ ప్రజలకూ ఎలా కీడు చేసాయో అన్న విషయాలు కూడా వ్యాసాల్లో చర్చకు వచ్చాయి ( మావోయిస్టు పార్టీ విముక్తి ప్రాంతంగా ప్రకటించిన బస్తర్‌లో జనతన రాజ్యం ప్రత్యామ్నాయ విద్య, వైద్యం, నీటి వనరుల నిర్వహణ వంటి వాటిపై ప్రత్యేకంగా దృష్టి పెట్టిందని ప్రత్యక్షంగా చూసి వచ్చిన వారి ముఖత: వింటున్నాం, రాతల్లో చదువుతున్నాం). ప్రజల్లో అప్పటికప్పుడు పెల్లుబికే అసంతృప్తికి పార్టీ నాయకత్వం అందించలేకపోయింది. దీర్ఘకాలిక తక్షణ అవసరాల మధ్య సమన్వయం సాధించలేక పోయింది. ఆధిపత్యం అవకాశవాదం వంటి రాజ్య స్వభావాల్ని విలువల్ని నిరాకరించి ప్రత్యామ్నాయ విలువల్ని స్థాపించి పెంపొందించాల్సిన ఉద్యమ నాయకత్వం మళ్లీ అవే విలువల్లో కూరుకు పోవడం వల్ల ప్రజా జీవితంలో ఆలోచనల్లో నూతన ప్రజాస్వామిక సంస్కృతిని ప్రచారం చేయడంలో విఫలమైంది.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని లొసుగులు తొలగించుకొంటూ – సాయుధ పోరాటానికి ఏర్పడిన పరిమితుల్ని అర్థం చేసుకొని దేశ కాల పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకొని పోరాట పద్ధతుల్ని మార్చుకోవాలనీ మధ్యే మార్గాన్ని స్వీకకరించడం మంచిదనీ బొజ్జ తారకం లాంటి ఒకరిద్దరు సూచించారు. అదే విధంగా నక్సల్బరీ రాజకీయాల్ని అటువంటి ప్రమేయాలనే పాటించే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాలతో అనుసంధానించాల్సిన అవసరాన్ని కూడా గుర్తించారు (శ్రీధర్). దండకారణ్యం నుంచీ నేపాల్ వరకు విప్లవ శక్తుల కారిడార్ నిర్మించ తలపెట్టిన పార్టీ డాక్యుమెంట్లు ప్రకటనలు గుర్తుకువస్తాయి కానీ తర్వాతి కాలంలో నేపాల్ మావోయిస్టు పార్టీ తన పంథా మార్చుకుంది.

తెలంగాణ రైతాంగ పోరాటంలో మూడు వేల గ్రామాల్లో పది లక్షల ఎకరాలు ప్రజలు స్వాధీనం చేసుకొని గ్రామ సంఘాల అజమాయిషీలో పంపకాలు జరిగాకా కొన్ని సంవత్సరాల పాటైనా అనుభవించగలిగారని ఒక లెక్క ఉంది. అదే ప్రయోగాన్ని అమలు చేయడానికి పూనుకొన్న నక్సలైట్ ఉద్యమంలో ఎర్ర జెండాలు పాతిన భూస్వాముల భూముల్లో ఎంత భాగం ప్రజలు అరక కట్టి సేద్యం చేసి పంట తీయగలిగారు అన్నది పడావు పడ్డ భూములు నెర్రెలిచ్చిన నోళ్లతో అడుగుతున్న పెద్ద ప్రశ్నకు సమాధానం వెతకాల్సే ఉంది.

ప్రజా పంథా కన్నా మిలటరీ పంథాకి ప్రాముఖ్యం పెరగడం దళ చర్యలే ప్రధాన భూమిక వహించడం మావోయిస్టు పార్టీ ఏర్పడ్డాక సైతం కొనసాగిందని హితైషులు బాధపడిన సందర్భాలున్నాయి. ఈ కారణంగా మధ్య తరగతి వర్గంలో ఉద్యమం పట్ల ఉన్న సానుభూతి రాను రానూ తగ్గిందన్న వాదనలు చోటుచేసుకున్నాయి. ఈ గందరగోళాన్ని పాలక వర్గాలు బాగా ఉపయోగించుకుని ఉద్యమం పట్ల మధ్య తరగతిలో వ్యతిరేకత పెంచడానికి ప్రయత్నిస్తూనే ఉంది.

అదే సందర్భంలో ఉద్యమంలో అమలవుతున్న హింసను గురించి మేధావుల్లో శాంతి కాముకుల్లో హక్కుల సంఘాల్లో చర్చ మొదలైంది. వ్యవస్థీకృత రాజ్యహింసను కూలదోసి రాజ్యాన్ని చేతిలోకి తీసుకున్న రాజకీయ శక్తులు హింసను పూర్తిగా రద్దు చేస్తాయా అని మధ్యతరగతిలో మౌలికంగా పుట్టే ప్రశ్నని మానవ హక్కుల దృష్టి కోణం హరగోపాల్ లేవనెత్తితే, బాలగోపాల్ మొత్తం విప్లవోద్యమంలో విచక్షణారహితంగా అమలవుతున్న హింసనీ ఆయుధ సంస్కృతి నుంచీ ఒంటబట్టిచ్చుకున్న ఆధిపత్య విలువల్నీ తీవ్ర స్వరంతో ఖండించాడు. ఆయుధం చేతిలో ఉండటం వల్ల బెదిరించి భయపట్టి లొంగదీసుకోవడం ద్వారా అమలయ్యే అరాచక ధోరణుల గురించి, వర్గ శత్రు నిర్మూలన పేరు మీద వ్యక్తిగత హింసా వాదానికి తెర ఎత్తడం గురించి, బల ప్రయోగం దళాల ప్రాథమిక సాధనంగా పరిణమించడం వల్ల కలిగే అనర్థాల గురించి బాలగోపాల్ రాసిన 'చీకటి కోణాలు' వ్యాసం సాయుధ పోరాటానికి సంబంధించిన రాజకీయ తాత్త్విక పార్శ్వాల నెన్నిటినో తడిమింది.

కరువు దాడులు, ఇన్ఫార్మర్ల ముద్ర వేసి ఎవర్నయినా చంపే అవకాశవాద రాజకీయాలు, స్థానిక అవసరాల రీత్యా విరుద్ధ భావజాలానికి చెందిన వ్యక్తులతో పార్టీలతో చేసుకునే అనైతిక పొత్తులు, వేర్వేరు గ్రూపుల మధ్య వైరుధ్యాలు విద్వేషంగా పరిణమించడం ప్రాంతాల మీద ఆధిపత్యం కోసం పరస్పరం చంపుకోవడం, పార్టీకోసం చందాల వసూళ్లు, అంతర్గత ప్రజాస్వామ్యం, ఆశ్రిత పక్షపాతం, సైద్ధాంతిక అనవగాహన... వంటి ఎన్నో అంశాల్ని ఉదాహరణలతో సహా ఒక గ్రౌండ్ రిపోర్ట్ లా ఎటువంటి సంకోచాలకూ తావు లేకుండా బాలగోపాల్ తొలిసారిగా బహిర్గతం చేయడంతో నక్సలైట్ ఉద్యమం గురించి లోపలా బయటా గ్రేట్ డిబేట్ లాంటిది జరిగింది.

పుస్తకంలో తక్కిన వ్యాసాల్లో కూడా మరీ ముఖ్యంగా ఎన్ వేణుగోపాల్ వ్యాసంలో కూడా ఈ అంశాలు ప్రస్తావితమైనప్పటికీ వేణు తనను ఉద్యమంలో ఇంక్లూసివ్ చేసుకుని లోపలి మనిషిలా ఆత్మ విమర్శనాత్మకంగా సమస్యల్ని సాధారణీకరిస్తే, బాలగోపాల్ నిర్దిష్ట సంఘటనల్ని ఎత్తిచూపుతూ కటువుగా ప్రశ్నించాడు. తనను రివిజనిస్టనో రియాక్షనరీ అనో యథాతథవాది అనో పెటీ బూర్జువా అనో ముద్రవేసే అవకాశం

ఉన్నప్పటికీ అన్ని ఎం.ఎల్ పార్టీల నాయకత్వాన్నీ కేడర్నీ దళాల్ని బోనులో పెట్టి బహిరంగంగా ప్రశ్నించడానికి బాలగోపాల్ వెనుకాడలేదు.

పుస్తకంలో రచయితలు ఎంతో ఆర్తితో వివేచనతో లేవనెత్తిన అనేక అంశాలపై పార్టీ లోపలా బయటా విస్తృతంగా చర్చలు జరిగాయి. పార్టీ కొన్ని విషయాల్లో ఆత్మ రక్షణలో పడింది. లోపాలు కొన్నిటిని సవరించుకుంది. తనవైపు నుంచి సమాధానం కూడా ఇచ్చింది. దరిమిలా ఉద్యమ గమనంలో చాలా మార్పులు చోటు చేసుకున్నాయి. తర్వాత ఈ రెండు దశాబ్దాలలో స్థానికంగా జాతీయంగా, అంతర్జాతీయంగా శరవేగంతో మార్పులు సంభవించాయి. వై 2 కె తెచ్చిన ఉపద్రవం మధ్య తరగతికి వరమైంది. చదువుల కోసం ఉపాధి కోసం బయటకు పోయే దార్లు తెరుచుకున్నాయి. సంపద చలనం పెరిగింది. గ్లోబలైజేషన్ దేశాన్ని అంగడిగా మార్చింది. ప్రత్యేక ఆర్థిక మండళ్ల పేర బయట నుంచి పెట్టుబడుల్ని ఆకర్షించడానికి శాంతి వాతావరణం ఏర్పరచాల్సిన అగత్యం పాలకులకి ఎదురైంది.

నక్సల్బరీ ఎజెండా మీదికి తెచ్చిన భూమి సమస్య వంటి ఎన్నో విషయాలు పాలక వర్గాల ఎన్నికల వాగ్దానాలుగా మార్చుకున్నాయి ( నక్సలైట్లే నిజమైన దేశ భక్తులు... నక్సలైట్ల ఎజెండాయే మా ఎజెండా... వంటివి చాలా విన్నాం). ఒక విధంగా అది ఉద్యమ విజయంగానే భావించాలి. దాదాపు నక్సలైట్ పార్టీలన్నీ తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాన్ని బలపరిచాయి. రాష్ట్ర సాధనలో కీలక పాత్ర పోషించాయి. భౌగోళిక తెలంగాణ సాధించాక అవి ఇప్పుడు ప్రజా తెలంగాణ నినాదాన్ని ఎత్తుకుని ముందుకు సాగుతున్నాయి. నిర్బంధాలు మాత్రం తప్పలేదు. కానీ మొదట్నుంచీ ఉద్యమ శ్రేణుల్లో క్రియా శీలంగా వ్యవహరించిన ఎందరో కార్యకర్తల్ని ఈ క్రమంలో కోల్పోయింది. కొందరు పాలక వర్గంతో స్వచ్ఛందంగా జతకట్టారు. ప్రాథమ్యాలు మారడంతో ఉద్యమానికి మధ్య తరగతి దూరమయింది. దళిత శ్రేణులు, స్త్రీవాద మహిళా సంఘాలు కూడా తమదైన పోరాట రూపాలు ఎంచుకొని హక్కుల కోసం పెనుగులాడుతున్నాయి. నిత్య నిర్బంధాలు నిషేధాలు, అణచివేత రహస్య జీవితాల కారణంగా ఉద్యమ శ్రేణులు ప్రాంతాలు కుదించుకు పోవడం, కొత్త రిక్రూట్ మెంట్లు లేకపోవడం, ప్రజా సంఘాలు కొన్ని స్వచ్ఛంద సంస్థలుగా రూపాంతరం చెందడం వంటి కొత్త సవాళ్లు సైతం నూతన శతాబ్దంలో ఎదురయ్యాయి. అటువంటి ప్రత్యేక సందర్భంలో నాయకత్వం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంతో చర్చలకి సిద్ధమైంది. చర్చల తొలి రోజునే పీపుల్స్‌వార్ ఎం.సి.సి వంటి ఇతర పార్టీలు కలిసి మావోయిస్టు పార్టీ ఆవిర్భావమైంది.

ఇది యాభైయేళ్ల ఉద్యమ చరిత్రలో కీలక ఘట్టం. గెరిల్లా జోన్లు, విముక్తి ప్రాంతాలు వంటి సైనిక వ్యూహాల్ని నడిపిన ఎల్.టి.టిని శ్రీలంకలో క్రూరంగా అణచివేసింది. అవే పద్ధతుల్ని మావోయిస్టు ఉద్యమంపై ప్రయోగించాలని ఇక్కడి పాలకుల ప్రయత్నం. ఆపరేషన్ గ్రీన్ హంట్ అందులో భాగమే. రాష్ట్ర ప్రభుత్వంతో చర్చల తర్వాత జరిగిన ప్రాణ నష్టం గురించి తెలిసి కూడ మావోయిస్టు కేంద్ర నాయకత్వం భారత ప్రభుత్వంతో మరోసారి చర్చలకి సిద్ధమైంది. అందుకు పూనుకున్న ఆజాద్‌ని చంపి పాలక వర్గం తన విధానం ఏంటో తెలియజేసింది. శాంతి సామరస్యాల స్థాపన పట్ల ఆసక్తి గానీ తాము రక్షించాల్సిన రాజ్యాంగాన్ని గౌరవించడం పట్ల గానీ పాలకులకు చిత్తశుద్ధి లేదని అర్థమౌతుంది.

బస్తర్లో ఇవ్వాళ రాజ్యాంగ బద్ధమైన హక్కులేవీ ఆదివాసీలకు లేవు. ప్రశ్నించడానికి వీల్లేని పోలీసు రాజ్యం అక్కడ అమలౌతుంది. సోనిసోరిపై అత్యాచారం– యాసిడ్ దాడి, బేలా బాటియా ఇంటిపై దాడి, మాలినీ సుబ్రహ్మణ్యం వంటి జర్నలిస్టుల్ని, ఇషా కందేల్‌వాల్, శాలినీ గేరా వంటి న్యాయవాదుల్ని సైతం అక్కడ అడుగుపెట్టనీక పోవడం... రోజుకో కొత్త వార్త వింటున్నాం. తెలంగాణ నుంచి అక్కడి పరిస్థితుల్ని అంచనా వేయడానికి వెళ్లిన ప్రజా సంఘాల ప్రతినిధులు జైల్లో మగ్గుతున్నారు. ఒక రాజకీయ భావజాలం కలిగి ఉండడటమే సాయిబాబా చేసిన నేరం. అందుకు ఫలం అమానుషమైన కారాగార శిక్ష. ఇంత నిర్బంధం మధ్య యాభై యేళ్ల ఉద్యమ ఫలాల్ని జనతన రాజ్యాన్ని కాపాడుకోడానికి చేపట్టాల్సిన చర్యే నక్సల్బరీ పంథా ముందున్న పెను సవాలు.

(తా.క. : ఈ సమీక్ష ముగించే సమయానికి నక్సల్బరీ గ్రామంలో ఒక దళితుని ఇంట్లో బిజెపి జాతీయ అధ్యక్షుడు నేలపై కూర్చొని భోజనం చేసిన వార్త టివిలో ప్రసారమౌతోంది. హిందూత్వ రాజకీయాల కొత్త ఎజెండా స్పష్టమే. ప్రత్యామ్నాయ రాజకీయ శక్తిగా కొనసాగాల్సిన లౌకిక ప్రజాస్వామ్య ప్రగతి శీల శక్తుల ఐక్య కార్యాచరణే ఇప్పుడు తేలాల్సి ఉంది.)

*(రచయిత సాహిత్య విమర్శకుడు)* వీ

*(... 4వ పేజీ తరువాయి)*

*ఎంతో కూడా ప్రజలకు తెలియాల్సి ఉంది. ఆయేషా మీరా తల్లి, ప్రధాన ఫిర్యాదు దారు అయిన షంషాద్ బేగం ఆది నుండి ఈ కేసులో సత్యంబాబు దోషి కాదు, కోనేరు రంగారావు మనవడు నేరస్తుడు అంటూ ఆరోపిస్తున్నారు. తాజాగా జరగాల్సిన పునర్విచారణలోనైనా ఫిర్యాదుదారు ఆరోపణలను చట్టాలు పరిగణనలోకి తీసుకుంటాయో లేదో వేచి చూడాలి. నాటి రాజశేఖరరెడ్డి ప్రభుత్వాన్ని నిందించడానికి తెలుగుదేశం పార్టీ గతంలో తమ సభలలో చంద్రబాబునాయుడు సమక్షంలో షంషాద్ బేగంతో ప్రసంగం చేయించింది. మరి ఈ రోజు సాక్షాత్తూ తెలుగుదేశం పార్టీ అధికారంలో ఉంది. చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా ఉన్నారు. మరి ఆయన నేతృత్వంలోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం షంషాద్ బేగంకు తగు న్యాయం చేస్తుందా! వేచి చూడాలి.*

*ప్రభుత్వ యంత్రాంగం వైఫల్యం వలన అన్యాయంగా ఎనిమిది సంవత్సరాల జైలు జీవితం గడిపిన నిర్దోషి సత్యంబాబు పట్ల సానుభూతిని వ్యక్తం చేస్తూ సంబంధిత ప్రభుత్వం తనవంతుగా ఆర్థిక సహాయం, ఉపాధి రూపంలో ఏమైనా ఉదారత చాటుకుంటుందా! చూడాలి. మళ్లీ మొదలుకొచ్చిన ఈ కేసు పునర్విచారణ ఎప్పుడు ఆరంభం అవుతుందో, ఈ కేసులో తప్పుడు విచారణ జరిపిన అధికారులతో పాటు ఆయేషా మీరా అసలు హంతకులకు ఎంత కాలానికి శిక్ష పడుతుందో వేచి చూడాలి. 1992లో విడుదలైన 'అంకురం' సినిమాలో అక్రమంగా నిర్బంధించబడిన గిరిజన యువకుడు 'సత్యం'ను కాపాడడానికి సింధూర రూపంలో ఒక మహిళ న్యాయవ్యవస్థతో పోరాడి విజయం సాధించినట్లుగా.. తాజాగా అన్యాయంగా జైలుజీవితం గడుపుతున్న 'సత్యంబాబు' కోసం వసుధ రూపంలో ఒక మహిళ స్వయంగా న్యాయ వ్యవస్థతో పోరాడి విజయం సాధించారు. అభినందనీయులు.*

**– ఎస్. కిశోర్ కుమార్**
హైదరాబాద్

# భారత ప్రజాస్వామం - మావోయిస్టు ఉద్యమం

*నక్సల్బరీ ఉద్యమ చరిత్రపై వెలువడిన రెండు గ్రంథాలను సమీక్షిస్తూ* ***బెర్నార్డ్ డిమెల్లో*** *రాసిన ఇంగ్లిష్ వ్యాసానికి అనువాదం*

**భా**రత దేశంలో మావోయిస్టుగా ఉండటం సురక్షితంగా మనుగడ సాగించడం దుర్లభం. భారతనేలపై ఉన్న వ్యదార్దుల పక్షాన నిలబడి జీవించడమో, చావటమో మాత్రమే జరిగే నిజమైన విప్లవమది. వారు చేస్తున్న పోరాటం వాళ్ల ప్రాణాలను సైతం పణంగా పెట్టాల్సినంత విలువైన పోరాటమని వాళ్లకు బాగా తెలుసు. పీడిత జన విముక్తి ప్రాణాలను దారపోసైనా పోరాడాల్సిన మహత్తర రాజకీయ, నైతిక లక్ష్యం. భారతదేశంలోని అభాగ్యులకు జీవిగంజి మాత్రమే కాదు అంతకు మించిన ఆత్మగౌరవ లక్ష్యం అది భారత పాలక వర్గాల, రాజకీయ వ్యవస్థ స్వభావం రిత్యా అంత సులభంగా సిద్ధించదు.

"స్టార్మింగ్ ది గేట్స్" పుస్తక రచయిత అమిత్ భట్టాచార్య 1972 నుండి 2014 మధ్యకాలపు మావోయిస్టు ఉద్యమాన్ని తన ముందుమాటలో చెప్పినట్టుగా విమర్శనాత్మకంగా, సానుభూతితో, సానుకూలంగా వారి సంవేదనలను అర్థం చేసుకొని బయటికి చెప్పగలిగే స్థితిని కల్గి ఉండటం వల్ల సాధారణ దృష్టితో సాధ్యంకాని విషయనిష్టత సాధ్యపడింది. ఒక ప్రజాస్వామిక బుద్ధిజీవిగా మావోయిస్టు ఉద్యమహేతుబద్ధతను, వారి ప్రశంసాపూర్వకమైన ఉద్దేశ్యాలను నిక్కచ్చిగా చెప్పగలిగాడు.

నందిని సుందర్ బస్తర్‌లో మావోయిస్టు ఉద్యమానికి వ్యతిరేకంగా ఇండియా చేస్తున్న యుద్ధాన్ని వెలికితీసినట్టుగా ప్రకటించిన 'ది బర్నింగ్ ఫారెస్ట్' అమార్త్యసేన్ 'ఆర్గ్యుమెంటేటివ్ ఇండియన్' సారాన్ని స్ఫురించేలా ఉన్నది. ఆమె భారత రాజ్య విశృంఖల చర్యలను, అహంకారపూరిత వైఖరిని గర్హిస్తూ మావోయిస్టు త్యాగాలను కొనియాడుతూనే వారు అనుసరిస్తున్న పంథాతో విభేదిస్తున్నది. హింసను అన్యాయానికి వ్యతిరేకంగా ప్రయోగించినా అది ఆటవికతకు, నీతి బాహ్యతకు దిగజారుతుందని నమ్ముతున్నది. (.......) సుందర్ తన పుస్తకంలో మావోయిస్టుల గురించి విస్తారంగా వ్రాసినప్పటికి మొత్తంగా ఆ పుస్తకం మావోయిస్టు ఉద్యమం గురించి కాదని, నిజానికి అది భారత ప్రభుత్వం తన దేశ అభాగ్యులతో మాట్లాడే బదులు వారిపైననే యుద్ధం చేసే, హక్కుల కోసం సమన్యాయం కోసం జరిగే రాజకీయ పోరాటాన్ని, ప్రత్యామ్నాయ హితాన్ని శాంతి భద్రతల అంశంగా మాత్రమే కుదించబడిన భారత ప్రజాస్వామ్యం గురించి అని చెబుతున్నది (పే-14). ప్రజాస్వామిక పాలనలో రాజ్యాధికారం కోసం తిరుగుబాటు చేసే వాళ్లపై చర్యకు పాల్పడే వ్యవస్థ వ్యవహరించే తీరుకు, మిలిటరీ లేదా వలస పాలనలో రాజ్యాధికారం కోసం తిరుగుబాటు చేసే వాళ్లపై చర్యకు పాల్పడుతున్నట్లు భ్రమింపజేసే ప్రజాస్వామిక వ్యవస్థ వ్యవహరించే తీరుకు తేడా ఏముంటుందని ఆమె నిగూఢంగా ప్రశ్నిస్తున్నది.

మావోయిస్టు ఉద్యమంపై ప్రభుత్వం అనుసరిస్తున్న సైనిక విధానంపై మావోయిస్టు, వారి సానుభూతిపరుల ఖచ్చితత్వాల పట్లను ఆమె అదే విమర్శను కల్గి ఉన్నది. వీరిని తీవ్రవాదులుగా పరిగణిస్తూ వారి విప్లవ సామాజిక పరివర్తన అంశాన్నే కొట్టిపారేస్తున్నది. ఆమె జరిపిన క్షేత్ర పర్యటనలు తను అమితంగా ప్రమేయాన్ని కల్గి ఉన్న ప్రజాప్రయోజన వ్యాజ్యాల (నందిని సుందర్ & అదర్స్ వర్సెస్ స్టేట్ ఆఫ్ చత్తీస్‌ఘర్) లో రాజ్య ప్రేరేపిత, పోషిత, రాజ్యంచేత ఆయుధాలు అందించబడి రాజ్యం వెన్నంటి ఉండి నడిపిన సల్వాజుడుం లాంటి ప్రైవేట్ ఆర్మీలను రద్దుపర్చాలని, మైనర్‌లను ప్రత్యేక పోలీస్ అధికారులుగా (ఎస్.పి.ఓలు) నియమించే బలవంతపు పద్ధతికి స్వస్థి పలకాలని కోరడం లాంటి చర్యల వల్ల కల్గిన అనుభవ జ్ఞానంతో బస్తర్‌లో జరుగుతున్న పౌర యుద్ధం గురించి "ది బర్నింగ్ ఫారెస్ట్" లో వివరించింది. చాలామటుకు ఎస్.పి.ఓలుగా పనిచేసిన వారంతా మాజీ మావోయిస్టులో, సంఘ సభ్యులుగానో పిలువబడిన గ్రామస్థాయి కార్యకర్తలే ఉన్నారు. వీరంతా జుడుం ర్యాలీలలో లొంగిపోయేలా ఒత్తిడి చేయడమే కాకుండా వారి మాజీ కామ్రేడ్‌ల జాడ చెప్పేలా పోలీస్‌లతో చేతులు కలపమని ఒత్తిడి తెచ్చేవారు. దక్షిణ చత్తీస్‌ఘర్‌లో గెరిల్లా జోన్‌లలో సాధారణ ఆదివాసీల జీవితాలెలా ఉన్నాయనే అంశాన్ని ప్రధానంగా చెబుతున్నది. మెజారిటీ ఆదివాసీలు మావోయిస్టుల ఉద్యమంతో మమేకమయ్యారన్న వాస్తవాన్ని ఆమె గుర్తించినప్పటికి ఆసక్తిదాయకమైన, అనుభవపూర్వకమైన తన అధ్యయనంలో ఈ అంశాన్ని నొక్కిచెప్పాలని ఆమె అనుకోలేదు. సరిగ్గా ఇచ్ఛాపూర్వకమైన ఈ దోరణే మావోయిస్టు ఉద్యమ అంశం కేంద్రంగా జరిపిన అధ్యయనం నుండి సుందర్‌ని వేరుపరిస్తే స్టార్మింగ్ ది గేట్స్‌లో భట్టాచార్య అన్వేషించారు.

### ప్రజా సంఘాలు, పీపుల్స్ వార్

భట్టాచార్య క్యాన్వాస్ స్థల కాలాల పరంగా చాలా విస్తారమైనది. ఆయన ఎంచుకున్న అధ్యయనం కూడా ప్రపంచంలో సుదీర్ఘ కాలంగా కొనసాగుతూఉన్న భారత విప్లవ పోరాటం. కొంతమేరకు మావోయిస్టు నాయకత్వంతో చేరువయ్యే సాధ్యత వల్ల, ముఖ్యమైన మావోయిస్టు సాహిత్యం, చారిత్రక పత్రాలు పరిశోధనాత్మక నివేదికలు ఆయనకు అందుబాటులో ఉండటం కూడా ఈ అధ్యయనానికి ఎంతో ఉపకరించింది. ప్రధానమైన, విశిష్టమైన అంశం ఏంటంటే మావోయిస్టు రాజకీయ భావనలను విస్తృతంగా అధ్యయనం చేయడమే కాకుండా తనకు వారి పట్ల ఉన్న సానుభూతితో వారి అంతర్గత చర్చలను కూడా

కించపర్చటం, అపహాస్యం చేయటం తీసిపారేయడం లాంటివి లేకుండానే భిన్నవాదనలను సృష్టించారు. 1965-67 నాటి చారు మజుందార్ 8 డాక్యుమెంట్లనుండి మొదలైన ఆయన అధ్యయనం నిషేధానికి, పాక్షిక నిషేధానికి గురై రాజద్రోహ సాహిత్యంగా రాజ్యంచేత ముద్రపడిన సాహిత్యం వరకు కొనసాగింది. 1970ల నాటి రాజకీయ తీర్మాణం, సి.పి.ఐ(ఎం.ఎల్) కార్యక్రమం, థియేటర్, పాటలు, చిన్న కథలు మొదలుకొని నక్సలైట్ ఉద్యమ ప్రేరేపణతో పురుడుపోసుకున్న సంప్రదాయేతరమైన ప్రతి అంశానికి కూడా వేటికందాల్సిన ప్రాధాన్యత వాటికి అందింది. మొత్తం ఆధునిక భారత చరిత్ర రచనా విధానంపై కూడా విప్లవోద్యమం వేసిన ప్రభావం, 'చరిత్ర చిరుస్వరం' సైతం వినిపించేలా జరిగిన రంజిత్ గుహలాంటి మేదోపురోగతి సాధించిన చరిత్రకారులలాంటి రచనలను సైతం ప్రత్యేకంగా ప్రభావితం చేసింది. 1972 జులై 28న కలకత్తాలోని లాల్‌బజార్ పోలీస్ లాకప్‌లో చారుమజుందార్ అమరత్వం మావోయిస్టు మొదటి దశ ముగింపుగా తదుపరి దశ ప్రారంభంగా మొదటి దశకంటే మరింత పురోగతిని కల్గినదిగా భట్టాచార్య భావించాడు (పే-87) చిట్టచివరికి విప్లవ భూతం వెళ్లిపోయిందని కుడి,ఎడమ పక్షాలు హమ్మయ్యా అనుకున్నాయి. అయితే సి.పి.ఐ(ఎం.ఎల్) లో అంతర్గత విభేదాలు పార్టీ చీలికకు కారణమైనాయి. ఎం.ఎల్ రాజకీయ ప్రవంతిలోని మొదటి దశ యొక్క అంతర్గత విమర్శను, చారుమజుందార్ రాజకీయ లైన్‌పై చైనా కమ్యూనిస్టు పార్టీ విమర్శను కూడా కవర్ చేయడమే కాకుండా, ప్రధానంగా తలెత్తిన మూడు దోరణులు ప్రత్యేకించి సెంట్రల్ ఆర్గనైజింగ్ కమిటి సరిదిద్దాలనుకున్న 'వామపక్ష' తప్పిదాలకు సంబంధించిన అనేక అంశాలను చాలా సమర్ధవంతంగా రాయగలిగాడు.

1980లో సి.పి.ఐ (ఎం.ఎల్.) (పి.యు), సి.పి.ఐ (ఎం.ఎల్) (పి.డబ్ల్యు)ల ఆవిర్భావానికి కారణభూతమైన, దిశానిర్దేశం చేసిన చారిత్రక పత్రాలైన సి.ఓ.సి. 'స్వీయ విమర్శనాత్మక సమీక్ష', 'రోడ్ టు రెవల్యూషన్' వంటివి వెలుగులోకి వచ్చాయి. 1995 లో సి.పి.ఐ(ఎం.ఎల్) (పి.డబ్ల్యు) చేత తీసుకురాబడిన ముఖ్యమైన స్వీయ విమర్శగా భావించబడిన 'భారత విప్లవోద్యమ ప్రత్యేక లక్షణాలు, వాటి పరిష్కారంలో మార్క్సిస్టు దృక్పధం' లాంటి డాక్యుమెంటును కూడా వెలుగులోకి తెచ్చాడు బట్టాచార్య. ఆ తరువాత జరిగిన పరిణామాల్లో 1998 సి.పి.ఐ(ఎం.ఎల్) (పి.యు). పీపుల్స్ వార్ విలీనం, భారత రాజ్యం చేత అంతర్గత భద్రతకు ఏకైక ముప్పుగా పరిగణించబడిన సి.పి.ఐ. మావోయిస్టు గా సి.పి.ఐ(ఎం.ఎల్) (పి.డబ్ల్యు), ఎం.సి.సి. కలిసి 2004లో ఏర్పడ్డాయి. భట్టాచార్య సి.పి.ఐ(ఎం.ఎల్) (పి.యు), పి.డబ్ల్యు, ఎం.సి.సి.ల ఆవిర్భావం, వాటి విలీనాలను చారిత్రకంగా పట్టుకోవడమే కాకుండా ఈ పార్టీల చరిత్రలో చీకటి అధ్యాయంగా, దశగా గుర్తించబడిన 1993-98, కొద్దిమేరకు 2001 నాటి 'ప్రాంత ఆదిపత్యం' కోసం జరిగిన రక్తపాతాలు, సోదరపార్టీల కార్యకర్తల హత్యలను కూడా లోతుగా పరిశీలించి చర్చించారు. కొన్ని మధ్య భారత, తూర్పు ఇండియాలోని గెరిల్లా బేస్ ప్రాంతాలు, విప్లవపార్టీ ప్రభావము వాటిని కాపాడే విప్లవ ప్రజాకమిటీల రూపంలో ఉన్న ప్రజా విముక్తి గెరిల్లా సైన్యాలు, ప్రజా మిలిషియాకు సంబంధించిన వ్యవహారాలు ఈ పుస్తకంలో ఒక ప్రధానమైన అంశం.

**భూస్వామ్య - పితృస్వామ్య ప్రవర్తన**

విరసం, రాడికల్ విద్యార్థి సంఘం, రాడికల్ యూత్ లీగ్, రైతు కూలి సంఘం, జన నాట్య మండలి వంటి ప్రజా సంఘాలకు సంబంధించిన కూర్పు మరో ప్రధాన అంశంగా ఈ పుస్తకంలో ఉన్నది. భట్టాచార్య మరో కథనం మహిళలు, విప్లవం, వృత్తి విప్లవకారులుగా సాయుధ దళాల్లో వారి భాగస్వామ్యం (లెనినిస్టు అర్థంలో) మహిళా ప్రజా సంఘాలు ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్‌లో విప్లవ మహిళా సంఘం 1990లో సారా వ్యతిరేక ఉద్యమంలో దాని పాత్ర, భూ సమస్యపై రైతు కూలి సంఘంతో కలిసి పనిచేయడం వంటి అంశాలు ఇందులో చర్చించబడ్డాయి. విప్లవోద్యమం బలంగా ఉన్నచోట భూమిని స్వాధీనపరచుకోవడం, పంపిణీ చేయడంలోను మహిళలకు భూమిపై యాజమాన్య హక్కు వర్తించేలా విప్లవ మహిళా సంఘం రైతు కూలి సంఘాల ఉమ్మడి కృషి ప్రత్యేకంగా పేర్కొనదగిన అంశం. మహిళా ఉద్యమం ప్రధాన విప్లవోద్యమం నుండి వేరు పడి ఏ రోజూ లేదనే విషయాన్ని నొక్కి చెప్పాల్సిన మరో అంశం. ఆంధ్రప్రదేశ్‌లో భూసంస్కరణల కోసం జరిగిన పోరాటాల్లాగానే దండకారణ్యం, పాత బస్తర్ లాంటి ప్రాంతాల్లో సమాన పనికి సమాన వేతనం కోసం మహిళా సంఘం అయిన క్రాంతి కార్య ఆదివాసి మహిళా సంఘం , రైతు కూలి సంఘాలు, దండకారణ్య ఆదివాసి కిసాన్ మజ్దూర్ సంఘాలు సంయుక్తంగా పోరాటాలు నిర్వహించినాయి. 1995లో సి.పి.ఐ(ఎం.ఎల్) (పి.డబ్ల్యు) 'విప్లవ మహిళా ఉద్యమం నిర్మించడంలో

మన దృక్పథం' పేరుతో వచ్చిన రెండు డాక్యుమెంట్లు, అంతర్గత దిద్దుబాటు పేరిట వచ్చిన పత్రం "పార్టీలో పితృస్వామిక ఆలోచనలకు వ్యతిరేకంగా పోరాటం, శ్రామిక వర్గ సంస్కృతి పెంచడం" వాటిని పార్టీ సమూహాల్లో బహిరంగంగా చర్చించబడిన అంశాన్ని రచయిత చెప్పడం గొప్ప స్ఫూర్తిదాయకంగా, జ్ఞానాన్ని అందిచేలా ఉంది. రెండవ డాక్యుమెంట్ అయితే కఠ్శమైన నిజాయితీతో "మన ఆలోచనల్లో ఒక్కోసారి పాత దోపిడియుతమైన వ్యవస్థ విలువల్నే ఆలింగనం చేసుకొని, ఆ సంప్రదాయాలనే, అలవాట్లనే కొనసాగించటం కొద్దిమేరకు విప్లవపార్టీలోను అవకాశం ఉన్నది" అని అంగీకరించింది. మహిళలను చులకనగా చూడటం, అబలలుగా భావించటం, మగవాళ్ల లైంగిక వాంఛలు తీర్చే వస్తువులుగా పరిగణించటం, భార్యలపై అత్యాచారాలకు పాల్పడటమే కాకుండా భౌతిక హింసను ప్రయోగించటం, ఆత్మ న్యూనతకు గురిచేసేలా వ్యవహరించటం, స్త్రీలను వ్యక్తిగత ఆస్తులుగా భావించటం, ఇతర పురుషులతో సన్నిహితంగా మెదిలే భార్యలను అనుమానించటం లాంటి భూస్వామ్య పితృస్వామిక లక్షణాలన్ని కొద్దిమేరకు పార్టీలోని పురుష సభ్యుల్లో కూడా విస్తృతంగానే ఉన్నాయి. (పే.310) పితృస్వామిక ఆలోచనలపై పోరాటం చేయటం సాయుధ శత్రువును ఎదుర్కోవడంకంటే కష్టమైనదని సి.పి.ఐ(ఎం.ఎల్) (పి.డబ్ల్యు) దిద్దుబాటు పేరుతో తాము వ్రాసుకున్న అంతర్గత పత్రాల్లో అంగీకరించినది (పే.309) మహిళా విముక్తి అనివార్యంగా నూతన ప్రజాస్వామిక విప్లవంతోనే ముడిపడి ఉన్నదని ఇటీవలనే సి.పి.ఐ. మావోయిస్టు పార్టీ ప్రకటించిన తన నూతన "బాఔ-2 మ్యానిఫెస్టో" లో పేర్కొన్నది. స్త్రీపురుషుల మధ్య శ్రమ సంబంధిత అంశాల్లో 'పురుషుల పని', 'స్త్రీల పని' అనే అడ్డుగోడల్ని కూల్చివేయాలని, రాజకీయ రంగంలో పూర్తి స్థాయిలో మహిళా భాగస్వామ్యం పెంచేలా నిర్ణయప్రక్రియని

నిర్దేశించే నిర్మాణాలల్లో మహిళా ప్రాతినిథ్యాన్ని మరింత పెంచేలా చర్యలు తీసుకోవాలని, పితృస్వామిక విలువలతో కూడిన కుటుంబాన్ని ప్రజాస్వామికరించాలని, ప్రజాస్వామికమైన కుటుంబ నిర్మాణం కోసం తీవ్రమైన కృషి జరగాలని అదే మ్యానిఫెస్టోలో ఉద్దేశ్యాలు, లక్ష్యాల్లో భాగంగా విస్పష్టంగా ప్రకటించింది.

### విప్లవానికి శాంతియుత మార్గం ఉందా?

సి.ఓ.సి. కాకుండా నక్సలైటు / మావోయిస్టు ఉద్యమంలో ఇతర పాయల గురించి ఏమిటి? నవంబర్ 29 1975 న హత్యగావించబడిన సుబ్రతదత్త నాయకత్వంలో బోజ్‌పూర్‌లో రూపుదాల్చిన సి.పి.ఐ(ఎం.ఎల్) లిబరేషన్ సాయుధ సంగ్రామానికి మొత్తం ఒక అధ్యాయాన్నే భట్టాచార్య కేటాయించాడు. మధ్య బీహార్‌లో సి.పి.ఐ(ఎం.ఎల్) లిబరేషన్‌కు ప్రజాసంఘంగా వ్యవహరించిన బీహార్ ప్రదేశ్ కిసాన్ సభ గురించి కూడా రచయిత చాలానే చర్చించాడు. వినోద్ మిశ్రా నాయకత్వంలో సి.పి.ఐ. (ఎం.ఎల్) లిబరేషన్ ఏ విధంగా ఇండియన్ పీపుల్స్ ఫ్రంట్ ద్వారా పార్లమెంటరీ వ్యవస్థలోకి చేరుకున్నదనే అంశాన్ని కూడా చారిత్రకంగా వివరించాడు. చారుమజుందార్ నాయకత్వంలోని నక్సలైట్ ఉద్యమం చేత శాశ్వతంగా తిరస్కరించబడిన పార్లమెంటరీ రాజకీయాల బురదగుంటలోకి సి.పి.ఐ(ఎం.ఎల్) లిబరేషన్ జారిపోయిందని భట్టాచార్య విశ్వసించాడు. నేను మొత్తంగా కొట్టి పారేయలేకపోయినా భారత దేశంలో నూతన ప్రజాస్వామిక విప్లవానికి లేదా సామ్యవాదానికి శాంతియుత మార్గం ఉండదనే ఆలోచనకైతే వచ్చాను అని ప్రకటించాడు. ఓ వైపు ఈ వ్యవస్థ యదాతదస్థితిని కొనసాగించడానికి, ఆ వ్యవస్థ పనివిధానం ద్వారా లాభాలు మూటగట్టుకున్న వర్గాలేమో హింసాయుతంగా ఆదిపత్యం చెలాయింస్తుంటే మరోవైపు కమ్యూనిస్టు పార్టీలు అహింసా పద్దతులపై మొక్కవోని నిబద్దతను కనబరుస్తూ ఈ పెట్టుబడిదారీ వ్యవస్థ పరిధికిలోబడే సంస్కరణలు తీసుకురావాలనే కోరుకుంటున్నారు. అలా అని కేవలం హింసాయుత మార్గంలోనే నూతన ప్రజాస్వామిక విప్లవమో, సామ్యవాదమో, సాధ్యమని అదే సరియైన ప్రభావంతమైన మార్గమనీ చెప్పటం లేదు. అయితే పోరాట మార్గంలో, కమ్యూనిస్టు విప్లవోద్యమంలో ఏదో ఒక దశలో వ్యూహాత్మకంగా, ఎత్తుగడలరీత్యా అయిన హింసాయుత ఘర్షణ అనివార్యమౌతుంది.

అది ఒక విషాధ అనివార్యతే తప్ప దాని కదేగా కేంద్ర స్థానాన్ని పొందదు, లెనిన్ చెప్పినట్టు అసలు మొత్తం కమ్యూనిస్టు పార్టీ ఆస్తిత్వ ప్రయోజనమే విప్లవ ఉపకరణంగా పనిచేయాలనే దానిని నేను అంగీకరిస్తాను. కాబట్టి ఇదేదో కేవలం పార్లమెంటరీ ఎన్నికల ద్వారా భారత కార్యనిర్వహణా వ్యవస్థపైననో, రాష్ట్రాల శాసన వ్యవస్థలపైననో నియంత్రణ సాధించడమనే అంశం మాత్రమే కాదు. వ్యవస్థను 'తలక్రిందులు' చేయడానికి (విలియం హంటన్ ఫాన్షిన్ అని అంటాడు) రాజ్యాధికారం చేపట్టడం, లెనినిస్టు పార్టీ పార్లమెంటరీ మార్గంలో తన అధికారాన్ని ఏర్పరచటం అనేది రాజ్య ఇతర అంగాలైన శాసన, న్యాయ, అణిచివేత యంత్రాంగాలైన పోలీసు, సైనిక వ్యవస్థలతో కూడియున్నది. రాజ్యాధికారం చేపట్టడానికి ఈ వ్యవస్థలన్నింటిపై నియంత్రణ, ఆధిపత్యం చెలాయిస్తున్న పాలకవర్గాలు, వారి రాజకీయ ప్రతినిథుల నుండి విముక్తం చేయాలి. ఏదైనా దశలో పార్లమెంటరీ మార్గం ద్వారా రాజ్యాధికారం చేపట్టినా, కమ్యూనిస్టులు అధికారంలో ఉన్నంత కాలం ప్రతిపక్షాలు పాలక వర్గాలతో కలిసి నిరంతరం విప్లవ ప్రతిఘాతుక హింసాచర్యలకు పాల్పడుతూనే ఉంటారు. అటువంటి సంక్షుభిత స్థితిలో పోలీసులు, సైనిక వ్యవస్థ కమ్యూనిస్టు కార్యనిర్వహణ వర్గానికి విధేయులై ఉంటాయా? రాజకీయంగా చైతన్యవంతమైన ప్రజలు కమ్యూనిస్టు ప్రభుత్వాల చుట్టూ సమీకరించబడినప్పటికి పోలీసు, సైనిక వ్యవస్థలపై పూర్తి స్థాయిలో ఆధారపడే అవకాశం లేకపోగా అక్కడే విప్లవ వ్యతిరేక హింస, హింసాయుత ఘర్షణను ఎదుర్కోవాల్సి వస్తుంది! గత అనుభవాల ప్రాతిపదికన ఏం జరుగుతుందో అని చూసినప్పుడు 1970–73 నాటి చిలీ అనుభవంలో అలెండీ ప్రభుత్వాన్ని కూలదోసినప్పటికి సమానత్వం, సహకారం, సంఘీభావ సహజీవనమైన సామ్యవాద సాధనా క్రమంలో శాంతియుత మార్గంలోనే రక్తపాతం ఉండదనే అంశాన్ని తోసిపుచ్చలేం. మొత్తంగా పార్లమెంటరీ మార్గంలో సోషలిజంను సాధించాలనుకునే లెనినిస్టు పార్టీ అసలుసిసలైన కార్యక్షేత్రం అంతా పార్లమెంటు, పార్లమెంటు రాజకీయాలకి ఆవలనే ఉంటుంది. ఇంకేమాత్రం దీన్ని కొనసాగించ కుండా భట్టాచార్య వెలిబుచ్చిన ఇతర అంశాలవైపు మరలుదాం.

### ప్రజా రాజకీయ అధికారం

భట్టాచార్య ప్రధాన ఆసక్తి అంతా నక్సలైటు ఉద్యమ సి.ఓ.సి. దోరణి యొక్క అవకాశాల గురించే. ఈ లక్ష్య దిశలో మహారాష్ట్ర గడ్చిరోలీ ప్రాంతంలో పోరాట ఫలితంగా కలిగిన సామాజిక ఆర్థిక పరివర్తనలపై దృష్టి నిలిపాడు. బస్తర్ లాగానే గడ్చిరోలీ కూడా యుద్ధ క్షేత్రం అవటం వల్ల ఎటువంటి క్షేత్ర స్థాయి పర్యటన ప్రత్యేకించి మావోయిస్టు పార్టీ నియమించిన వారికి చాలా కష్టమైన పని. వారినుంచే అనేక విషయాలు భట్టాచార్య స్వీకరించారు. ఆయన దృష్టంతా భూమి సమస్యపైననే. దున్నేవాడిదే భూమి అనే నినాదం సాగుయోగ్యమైన అటవీ భూముల విషయంలో కూడా పోరాటం జరిపి ప్రభుత్వం చేత పట్టాలు ఇప్పించబడిన భూమి, సమిష్టి పోరాటాల ద్వారా భూమిపై యాజమాన్య లేదా స్వాధీనపర్చుకునే హక్కులు పొందిన 'జబరన్' భూముల అంశం ప్రధానంగా ఉంది. ఆదివాసి సాగుదారులపై ఎటువంటి తొందరపాటు చర్యలకు దిగే అవకాశం లేకుండా కూడా ఈ పోరాటాలు పనిచేసాయి. పీపుల్స్ గెరిల్లా ఆర్మీ దన్నుతో ప్రజల రాజకీయ అధికారాన్ని నొక్కి చెప్పడమే కాకుండా 1990 లలో స్వాధీనపర్చుకున్న భూముల కంటే జబరన్ భూముల సాగే మరింతగా పెరిగింది. భూస్వాములు, భూమిలేనివారి మధ్య సంబందాలను, వెట్టిచాకిరికి వ్యతిరేకంగా జరిగిన పోరాటం, తునికాకు సేకరణకు కాగితపు మిల్లులలో ప్రధాన ముడిసరుకు అయిన వెదురుబొంగులకు ఎక్కువ కూలి చెల్లించాలనే పోరాటం వంటి అంశాలను భట్టాచార్య స్పృషించారు. ఇవే కాకుండా స్త్రీ పురుష సంబంధాల్లో, వివాహ వ్యవస్థలో వచ్చిన మార్పులను వివరించాడు. అంతకు మించి ప్రజలు ప్రభుత్వ వైద్య సేవలకంటే మావోయిస్టు గెరిల్లాలందించే వైద్య సేవలలోనే ఎక్కువ నమ్మకం కల్గి ఉన్నారన్న అంశంతోపాటు పోరాట ప్రాంతాల్లో మావోయిస్టు గెరిల్లా దళాలు అనేక వైద్య కేంద్రాలను ఏర్పర్చినట్లు వివరించాడు.

(అనువాదం బి. సతీష్) వీ

# శాస్త్ర ప్రచార సంస్థలు - సామాజిక బాధ్యత

***శాస్త్రీయ దృక్పథంతో చేసే పరిశోధనలు అన్నీకూడా సామాజిక బాధ్యతలో జరగాలనీ, వాటి ఫలితాలు సామాన్యునికి అందుబాటులో ఉండాలని అంటున్నారు* డా. విజయకుమార్**

ప్రజా సైన్స్ వేదిక ఆలోచనల ప్రాతిపదికన శాస్త్రీయ దృక్పథం. దీనిని అర్థం చేసుకోవడం, వివిధ అంశాలకు అన్వయించడం, ఆచరించడం అనుకున్నంత సులభం కాదు. తాము నూటికి నూరు శాతం శాస్త్రీయంగా ఉన్నామనుకునే అనేక సంస్థలూ, గ్రూపులూ ఆచరణలో ఎంత అశాస్త్రీయంగా ఉండగలవో ఉదాహరణలు కోకొల్లలు. అందుకే ప్రజా సైన్స్ వేదిక బాధ్యుల నుండి సాధారణ కార్యకర్తల వరకు శాస్త్రీయ దృక్పథమంటే ఏమిటో, దాని చుట్టూ ఉన్న వివిధ అంశాలేమిటో లోతుగా తెలుసుకోవడమే గాక, నిరంతర అధ్యయనం – ఆచరణ కలిసి కొనసాగించాలి. శాస్త్రీయ దృక్పథంలో (సైంటిఫిక్ వ్యూ) లో మూడు ముఖ్య అంశాలున్నవి. 1. ప్రశ్నించేతత్వం (స్పిరిట్ ఆఫ్ ఎంక్వైరి), 2. శాస్త్రీయ పద్ధతి (మెథడ్ ఆఫ్ సైన్స్), 3. శాస్త్రీయ తెంపరితనం (సైంటిఫిక్ టెంపర్).

శాస్త్రీయ దృక్పథాన్ని కలిగి ఉండడంలో ప్రశ్న చాలా కీలకమైంది. ఒక్క మాటలో చెప్పాలంటే విజ్ఞానం ప్రశ్నతో ప్రారంభమవుతుంది. ప్రశ్నించేటప్పుడు అవతలి విషయం ఏమిటి అనేదానికే ప్రాధాన్యత ఉండాలి తప్ప ఇతరేతర అంశాలు ముందుకు రాకూడదు. ప్రశ్నించే తత్వాన్నే 'జిజ్ఞాస' అనవచ్చు. ఇందులో కొత్త విషయాలను తెలుసు కోవాలనే తపన ఉంటుంది. దేన్నైనా, ఎవరినైనా నిష్కల్మషంగా ప్రశ్నించడంతోనే సర్వ విజ్ఞానం ప్రారంభమవుతుంది. పసిపిల్లల్లో ఈ స్వభావం చాలా స్పష్టంగా కనిపిస్తుంది.

**శాస్త్రీయ పద్ధతి**

శాస్త్రీయ పద్ధతిలో తిరిగి మూడు అంశాలుంటాయి.

1. విషయ సేకరణ (కలెక్షన్ ఆఫ్ డాటా), 2. సిద్ధాంతీకరణ (థియొరైజేషన్), 3. ప్రయోగం (ఎక్స్‌పెరిమెంట్).

**1 విషయ సేకరణ:** ప్రశ్నతో ప్రారంభమైన జ్ఞానప్రక్రియ ఈ ప్రశ్నకు సమాధానాన్ని కోరుతుంది. సరైన సమాధానాన్ని పొందాలంటే మనం ఏ విషయాన్ని లేదా అంశాన్ని ప్రశ్నిస్తున్నామో దానికి సంబంధించిన వివిధ విషయాలను, వివిధ కోణాల నుండి సేకరించాలి. ఈ విధమైన విషయ సేకరణ లేకుండా ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేం. ఒకవేళ ముందుకు వెళ్లాలనుకున్నా అనేక తప్పులు చేస్తాం.

**2 సిద్ధాంతీకరణ:** సేకరించిన వివిధ విషయాలను ఒక క్రమంలో ఉంచి సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తాం. అంటే మనసులో ఒక తాత్కాలిక నిర్ధారణకొస్తాం. ఈ సిద్ధాంతం లేదా నిర్ధారణ మార్పులకు అతీతం కాదు. తరువాత జరగబోయే ప్రయోగాన్ని బట్టి నిర్ధారణలు మారుతాయి. అలా మార్చుకోకపోతే మనం పిడి వాదులుగా మిగులుతాం.

**3 ప్రయోగం:** శాస్త్రీయ పద్ధతిలో మూడోదశ అన్నింటిలోకి కీలకమైనది. దీనినే ప్రయోగం లేదా ఆచరణ (ప్రాక్టిస్) అనవచ్చు. మనం వచ్చిన తాత్కాలిక నిర్ధారణకు ప్రయోగాత్మకంగా సరిచూడడం. అంటే ఏదైనా ఆచరణలో రుజువు కావాలి. అలా కాకపోతే అదెంత గొప్పదైనా ప్రతిపాదిత సిద్ధాంతంగానే లేక తాత్కాలిక నిర్ధారణగానే ఉండి పోతుంది. ప్రయోగంలో రుజువు చేయబడితే అది 'సిద్ధాంతంగా' లేదా 'శాస్త్రంగా' స్థిరపడుతుంది. ప్రయోగం ఎన్ని సార్లు చేసినా అదే ఫలితం రావాలి (అండర్ గివెన్ కండీషన్స్). అలా రాకపోయినట్లయితే మనం మళ్లీ ప్రశ్న నుండి ప్రారంభమై మళ్లీ ప్రయోగం వరకూ రావాలి. ప్రయోగంలో రుజువు కానిదే దేనినీ సిద్ధాంతంగా అంగీకరించజాలం.

**శాస్త్రీయ తెంపరితనం**

సైంటిఫిక్ టెంపర్ అంటే శాస్త్ర పరిశీలనకు మనల్ని గురిచేసుకోవడం. మనం దేన్నయినా ఎవరినైనా ప్రశ్నిస్తాం. అలాంటి ప్రశ్నలే మనకెదురైతే నమ్రతగా సమాధానం ఇవ్వడానికి, ప్రయోగానికి గురి కావడానికి ఉండే సంసిద్ధతనే సైంటిఫిక్ టెంపర్ అంటారు. నేను మాత్రం ఏ సిద్ధాంతాన్నైనా ప్రతిపాదించవచ్చు. కాని సదరు సిద్ధాంతం ప్రశ్నించబడకూడదు అంటే నాకు సైంటిఫిక్ టెంపర్ లేకుండా 'మానవాతీత శక్తిని లేదా వ్యక్తి'ని అని చెప్పుకోవడమే. ప్రశ్నకు గురి కాబడి నమ్రతగా సమాధానం చెప్పగలిగే తత్వం. భారత పౌరులందరికీ ఉండాలని భారత రాజ్యాంగం చెబుతుంది.

ఉదాహరణలు లేకుండా శాస్త్రీయ దృక్పథంలోని ప్రశ్న, శాస్త్రీయ పద్ధతి, సైంటిఫిక్ టెంపర్‌లను పేర్కొనడం జరగదు. అనేక ఉదాహరణ లను ఈ కోణంలో నుండి పరిశీలించడానికి అందరం ప్రయత్నించాలి. దాని వలన మనకు శాస్త్రీయ దృక్పథం ఏమిటో అర్థమవుతుంది. తర్వాత మనం తెలుసుకోగోరే, ప్రతిపాదించే, ఆచరించే అనేక విషయాలను ఈ దృక్పథంలో నుండి చూడడానికి ప్రయత్నించాలి. అలా చేస్తూ ఉండే కొద్ది మనలో శాస్త్రీయ దృక్పథం పరిపుష్టమవుతూ ఉంటుంది.

**శాస్త్రీయ దృక్పథం – సమాజం**

మానవ సమాజం ముందుకు నడవడానికి శాస్త్రీయ దృక్పథం కీలక పాత్ర నిర్వహిస్తుంది. అయినా సమాజంలో వివిధ ప్రయోజనాలు గల ప్రజా సమూహాలు, అశాస్త్రీయ భావాలను సిద్ధాంతాలుగా నమ్మి ప్రచారం చేసేవాళ్లు కావాలని మూఢ నమ్మకాలను వ్యాప్తి చేసే వాళ్లు ఉంటారు. సమాజం గత చరిత్ర నుండి వర్తమానంలో నుండి భవిష్యత్తులోకి ప్రయాణిస్తుంది. కనుక లెక్కలు లాగానో, భౌతిక, రసాయన శాస్త్రాల ప్రయోగ శాలల్లో లాగానో అక్కడికక్కడే సమాజంలో రుజువులు దొరకవు.

సిద్ధాంతాల ప్రయోగాలకు ఎంతో సమయం పడుతుంది. దాని విశ్లేషణనూ, ఆచరణ ద్వారా వచ్చే ఫలితాలను బట్టి తిరిగి సిద్ధాంతాల ప్రతిపాదనలూ ఒక జీవిత కాలంలో జరక్కపోవచ్చు. అంటే సమాజంలో విడివిడి వ్యక్తుల జ్ఞానం ప్రత్యేకంగా ఉన్నప్పటికీ మొత్తం సమాజం జ్ఞానం సామాజిక జ్ఞానంగా (సోషల్ కాన్షస్‌నెస్) ఉంటుంది. అయితే మనం ఖచ్చితంగా తెలుసుకోవలసిన అంశమేమంటే ఏ శాస్త్రీయ దృక్పథమైనా, తద్వారా ఆచరణలోకి వచ్చిన సాంకేతిక అంశాలైనా ఆ సమాజంలో ఉండే వివిధ గ్రూపుల ప్రజల మధ్య ఉండే సంబంధాల ద్వారా వ్యక్తీకరించబడతాయి.

**శాస్త్రీయ వాదం (సైంటిజం)**

శాస్త్రీయ దృక్పథం ఒక చైతన్యవంతమైన దృష్టి. కాని దీన్ని కూడా అచేతనమైన పిడివాదం కింద మార్చి మానవ సమాజాన్నీ, సాంప్రదాయాలనూ, చరిత్రనూ తక్కువ చేసిన నేలమీద కాక గాలిలో సాము చేయడాన్ని శాస్త్రీయ వాదమనవచ్చు. మనం ఆచరణ వాదులమైనట్లయితే, శాస్త్రీయ దృక్పథం మానవాళి సాధారణ దృక్పథంగా మారాలని కోరుకునే వాళ్లమైతే సామాన్య జనం భావజాలం వదలి 'శాస్త్రం' వల్లించే బోధకులుగా మారిపోకూడదు. అలా అయితే మనం జనం నుండి దూరమై, నీళ్లకు దూరమైన చేపలా మారుతాం.

**శాస్త్రం - సాంకేతికం**

శాస్త్ర విజ్ఞానం అనేది మౌలికమైన విజ్ఞానం (కోర్ సైన్స్) అది నిర్వచనాలుగా, సిద్ధాంతాలుగా, విస్పష్టంగా, రుజువు కలిగి ఉంటుంది. దీని ఆధారంగా శాస్త్ర విజ్ఞాన స్పృహ లేని రోజుల నుండీ, బహుశ భాష కూడా పుట్టక ముందు నుండే అనేక పనిముట్లు తయారు చేయబడ్డాయి. వాటి నుండి పురాతన యంత్రాలైన విల్లంబు, నాగలి, తిరగలి, నిప్పు.... లాంటివి తయారైనవి. అలా శాస్త్ర విజ్ఞానాన్ని రోజువారీ వినియోగించుకోవడానికి అవసరమైన పనిముట్లను లేదా యంత్రాలను లేదా పద్ధతులను సాంకేతికం (టెక్నాలజీ) అంటారు.

ఆవిరి యంత్రాలు, కరెంటు, కాగితం నేటి అత్యాధునిక సమాచార విప్లవం, జీవశాస్త్ర విప్లవాలు వచ్చింతర్వాత సాంకేతికం కూడా ఎంతో అభివృద్ధి చెందింది. శాస్త్రం మూలాధారమే అయినా శాస్త్ర సాంకేతికాలు (సైన్స్ అండ్ టెక్నాలజీ) ఒక దానితో ఒకటి మమేకమైపోయి దాదాపు సమానార్థకాలుగా వ్యవహరించబడుతున్నవి. శాస్త్రం-సాంకేతికం పరస్పర సంబంధం వల్లే 'విజ్ఞానం' ఆచరణలోకి రావడం మానవాళికి వినియోగ పడడం (మేలుకు గానీ కీడుకు గానీ) జరుగుతున్నది.

**శాస్త్ర విజ్ఞాన విస్తృతి**

మానవుడి అభివృద్ధితో పాటే శాస్త్ర విజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందుతూ వస్తున్నది. శాస్త్రం పెరిగే కొద్ది ప్రకృతిలోని అనేక అంశాలను పరిశీలించి సిద్ధాంతాలు చేసే కొద్దీ శాస్త్రం శాఖోప శాఖలుగా విస్తరించడం ప్రారంభమైంది. జీవశాస్త్రం, భౌతిక, రసాయన శాస్త్రం, గణిత శాస్త్రాలుగా ఉన్న శాస్త్రం కొన్ని వేల శాఖలుగా అభివృద్ధి చెందింది. వాటికి తగిన పద్ధతిలో టెక్నాలజీ కూడా పెరిగి నేటి నాగరిక సమాజాన్ని భవిష్యత్తులోకి నడిపిస్తోంది. చివరికి సామాజిక శాస్త్రాలైన ఎకనామిక్స్, హిస్టరీ లాంటివి కూడా శాస్త్రాలుగా మారాయి.

శాస్త్రం మానవ మస్తిష్కంలో అభివృద్ధి చెందిన అత్యంత ఉన్నతమైన భావనాపరంపర. అది మనిషి తాను చేసిన రోజువారీ కృషి నుండి, అవసరాల నుండి, సమస్యల నుండి అభివృద్ధి చెందింది. మనిషి చేసే పనికి లేదా మానవ శ్రమకు సంబంధం లేని శాస్త్ర జ్ఞానం లేదు.

మహా సముద్రం లాంటి శాస్త్ర జ్ఞానం ప్రతి మనిషీ జోడించిన నీటి బిందువులతో ఏర్పడ్డది. తెలిసో తెలియకో ప్రతి మానవుడూ శాస్త్ర జ్ఞానంలోని ఏదో ఒక అంశానికి ఎంతో కొంత అదనంగా చేరుస్తాడు. మానవ సమాజపు పూర్వం నుండి నేటి వరకు సమస్త మానవాళి సంయుక్త శారీరక, మేధో శ్రమల ఫలితమే నేటి శాస్త్రజ్ఞాన సర్వస్వం. అంటే మనమంతా ఆ యుగానికి ఒక్క సమిధనయినా ఆహుతిచ్చామన్నమాట.

**శాస్త్రజ్ఞాన స్వభావం - వినియోగం**

అందరి సమిష్టి ఫలితంగా రూపుదిద్దుకున్న శాస్త్రం మీద అందరికీ హక్కు ఉంటుందనేది స్పష్టం. విశ్వజనీనమైన శాస్త్రం సమస్త మానవాళికీ సమానంగా అందుబాటులో ఉండడం ధర్మం. అయితే ఆచరణలో శాస్త్రజ్ఞాన ఫలితాలను అనేక కారణాలతో కొందరే వినియోగించుకోవడం శాస్త్ర స్వభావానికి విరుద్ధం. శాస్త్రీయ దృక్పథం కలవాళ్లు, సంస్థలూ, విధిగా శాస్త్ర ఫలాలను సమస్త మానవాళికీ అందేట్టు చూడాలి. సరిగ్గా ఇక్కడే సమాజం-రాజ్యం-చట్టం ఇవన్నీ రంగంలోకి వస్తాయి. ఏ సమాజమైనా, ఏ రాజ్యమైనా, ఏ చట్టమైనా శాస్త్ర ఫలాలను ప్రజలందరికీ అందించగలిగేట్టు ఉండాలి. అలా లేని రాజ్యాలు, చట్టం, సమాజం న్యాయంగా లేవని లెక్క. వాటికి వ్యతిరేకంగా శాస్త్ర సంస్థలు నిలబడాలి. ఆ క్రమంలో కష్టాలను భరించాలి. అలా చేయలేని మనిషి గాని, సంస్థ గాని తమ ధర్మం తాము నిర్వర్తించడం లేదని అర్థం. శాస్త్రం వినియోగాన్ని గమనించి అది అందరికీ అందుబాటులో ఉందా లేదా అన్నది మాత్రమే గీటురాయిగా కార్యక్రమాలు, సామాజిక దృక్పథం ఉండాలి.

**శాస్త్రం - పర్యావరణం**

భూమి అందులోని సహజ సంపదలు పరిమితం... అపరిమితం. అపరిమితమైన కాంక్ష కలకు పరిమితమైన వనరుల మధ్య సంఘర్షణ తప్పని సరిగా ఉంటుంది. మానవ అవసరాలను నిరంతరం తీర్చుకుంటూ, ఎప్పటికప్పుడు ఏర్పడే కొత్త అవసరాలను అప్పటికప్పుడు తీర్చుకోగల శక్తి 'అభివృద్ధి' (డెవలప్‌మెంట్) దీనిని సాధించడానికి ప్రకృతిలోని వివిధ వనరుల్ని మనిషి వినియోగించుకుంటాడు. అయితే మనం ఉపయోగించుకునే ప్రతి వనరూ ప్రకృతిలో తిరిగి ఏర్పడాలి. (రెప్లినిష్) అలా కాకుండా ఈ భూమి, గాలి, నీరు, అడవులు, గనులు సర్వం హరించబడి భవిష్యత్తరాలు బతకడం సాధ్యం కాదు. మనం కట్టే ఫ్యాక్టరీలు, భారీ నీటి ప్రాజెక్టులు, అత్యంత అధునాతన పరికరాలు... ఏవైనా పర్యావరణాన్ని నశింపచేయ కూడదు. మనతో కలిపి మన చెట్టు పక్కల ఉండే ప్రకృతిలో ఒక విధమైన సమతుల్యం ఉంది. సాంకేతికాభివృద్ధి ఏదయినా ఈ సమతుల్యాన్ని దెబ్బతీస్తే భూమి మీద మనిషి ఉనికికే ప్రమాదం వస్తుంది. పర్యావరణాన్ని పరిరక్షిస్తూ జరిగే అభివృద్ధి అభిలషణీయం. దీనినే 'నిరంతరాయ అభివృద్ధి (సస్టేనబుల్ డెవలప్‌మెంట్) అంటారు. శాస్త్ర సంస్థ కార్యకర్తలు అభివృద్ధికీ, నిరంతరాయ అభివృద్ధికీ గల తేడాలను స్పష్టంగా అంచనా వేసి వివిధ పర్యావరణ ఉద్యమాలలో మమేకం కావాలి. నేటి ప్రపంచంలో పర్యావరణ ఉద్యమాలు ఎన్నో జరుగుతున్నాయి.

**శాస్త్రజ్ఞానం – విలువలు**

టెక్నికల్‌గా మాట్లాడితే శాస్త్రానికి విలువలు లేవు. కానీ శాస్త్రం మనుషుల ద్వారా వ్యక్తీకరించబడుతుంది. సమాజంలో మనుషుల మధ్య ఉండే సంబంధాల వల్ల అనేక విలువలు ఏర్పడుతున్నాయి. పేదరికం, స్త్రీల పట్ల వివక్ష, అంటరానితనం, పసి పిల్లల పట్ల వివక్ష, గిరిజనులు, వరకట్నం, మద్యం–మాదకద్రవ్యాలు, వర్ణ బేధాలు... ఇలా ఎన్నో అంశాలు మనవ సమాజంలో పరిష్కారాలు కోరుతున్నాయి. శాస్త్రం అందరినీ సమానంగా చూస్తుంది. కాబట్టి ఇవన్నీ శాస్త్ర జ్ఞానానికి సంబంధం లేని అంశాలని భావిస్తే అది చాలా పొరపాటు. అంటే శాస్త్రాన్ని ప్రయోగశాలల్లోని బవిరిగడ్డపు శాస్త్రజ్ఞులకే పరిమితం చేస్తున్నామన్న మాట. అంతేగాక ఆ శాస్త్ర ఫలితాలను అనుభవిస్తూ వివిధ సమాజ రుగ్మతలకు కారణమైన మనుషుల, సమూహాల, వాళ్ల అడుగులకు మడుగులొత్తే చట్టాలకు మనమూ వంతు పాడుతున్నామన్నమాట.

నిజమైన శాస్త్ర సంస్థ అలా ఉండకూడదు. వివిధ సామాజికాంశాలను శాస్త్రీయంగా విశ్లేషించి బాధితుల పట్ల పక్షపాతం కలిగి ఉండడమే 'మన విలువ'గా గ్రహించాలి. విలువలు లేని శాస్త్రజ్ఞానం వ్యర్థం, అనర్థం కూడా!

**శాస్త్ర ప్రచార సంస్థ – రాజకీయాలు**

పౌర సమాజంలో వరకట్నం, సతి, అంటరానితనం, అంతరాలు, ఆకలి చావుల లాంటి అనేక అంశాలతో పాటు సమాజాన్ని ఒక పద్ధతి ప్రకారం నడుపుకోవడానికి కొన్ని నియమ నిబంధనలతో మానవ సమాజం ఒక చారిత్రక క్రమంలో ఏర్పరచుకున్న సంస్థ 'రాజ్యం' (స్టేట్). పోలీసులు, చట్టం, న్యాయ వ్యవస్థ, సైన్యం, రాజకీయ పక్షాలు (అధికారం – ప్రతిపక్షం) వీటన్నింటినీ మించి ప్రజల 'సమ్మతి' (కాన్సెంట్) ద్వారా రాజ్యం ఉనికిలో ఉంటుంది. ఆ రాజ్యంలో ఎవరు అధికారంలోకి రావాలి అని జరిగే ప్రయత్నాలే రాజకీయాలు. రాజకీయాలు వాస్తవంగా పౌర సమాజంలోని ప్రతి అంశాన్ని పరిశీలించేవయినా ఆచరణలో అధికారం చుట్టూ తిరగడమే జరుగుతోంది. అధికారం ప్రధానమే అయినప్పటికీ అదే సర్వస్వంగా మారిపోయింది. ప్రధానానికి, సర్వస్వానికి చాలా తేడా ఉందనేది నిర్ద్వంద్వం. సదరు అధికారం కొరకు చాలా అపసవ్య మార్గాలు అనుసరించబడుతున్నాయి. సమాజంలో రాజకీయాలు నిర్వహించేది ప్రధానంగా రాజకీయ పక్షాలు. రాజకీయ పక్షాలు తమ తమ సిద్ధాంతాల్ని జనంలో ప్రచారం చేసి, వారిని చైతన్య పరిచి వారి ఆకాంక్షల కొనసాగింపుగా అధికారంలోకి రావాలి. కానీ ఆచరణలో కుల మత విద్వేషాలను రెచ్చగొట్టి, మద్యం, డబ్బు ఎరజూపి, ఎన్నికలను రిగ్గింగ్ చేసి అధికారంలోకి రావడం ప్రధానమై పోయింది. అందుకే శాస్త్ర జ్ఞానం ఇంతగా అభివృద్ధి అయినా సాధారణ జనం ఇంకా బాధలతో, వేదనలతో బతుకును భారంగా వెళ్లదీస్తున్నారు.

శాస్త్ర సంస్థలు రాజకీయాలను నిశితంగా పరిశీలించి విశ్లేషించాలి. రాజకీయ పక్షాలు ఎంత తీపి సిద్ధాంతాలను చెప్పినా వాటి 'ఆచరణ'ను బట్టి మాత్రమే అంచనా వేయాలి. అదే అందర్భంలో శాస్త్ర సంస్థల ప్రధాన కార్యరంగం అధికార రాజకీయాలు కాదు. విశాలమైన పౌర సమాజమే మన కార్యక్రమాలకు వేదిక. పౌర సమాజంలో దీర్ఘకాలం కృషి చేయడం ద్వారానే రాజకీయాల్లో కూడా మార్పులు వస్తాయని మనం విశ్వసిస్తాం. పౌర సమాజంలో ప్రజల సమ్మతితో వచ్చే మార్పులు దీర్ఘకాలమైనవే గాక సమాజం వాటిని అంతర్లీనంగా (ఇంటర్నలైజ్) మార్చుకుంటుంది.

**శాస్త్రానికి సంబంధించిన మరికొన్ని అంశాలు**

**1. కుహనా శాస్త్రం (సూడో సైన్స్):** మొత్తం సైన్సులాగే మాటలు, సిద్ధాంతాలు, పారిభాషిక పదాలు అన్నీ ఉంటాయి. చూసేవాళ్లకు, వినేవాళ్లకు అది శాస్త్రమనే నమ్మకం, ఒక్కొక్కసారి శాస్త్రం కంటే అవే కమ్మగా ఉండే పరిస్థితి. కానీ అంతిమంగా అశాస్త్రీయ అంశాలనే అది ప్రచారం చేస్తుంది. సూడో సైన్స్ దాదాపు మేడిపండు లాంటిది. నిత్య జీవితంలో ఉదాహరణలు కోకొల్లలు.

**2. అశాస్త్రీయం (అన్‌సైంటిఫిక్):** ఇవి చాలా స్పష్టంగానే అప్పటికి ఉన్న శాస్త్రయ భావాలకు విరుద్ధంగా ఉంటాయి. ప్రచారంలో ఆచరణలో కూడా ఉంటాయి. ఎంతో మంది వీటి ప్రభావంలో ఉంటారు. కేవలం జీవ, భౌతిక శాస్త్రాంశాలే కాక సామాజిక శాస్త్రాల్లో అశాస్త్రీయ అంశాలు దాదాపు రాజ్యమేలుతుంటాయి. ఏది అశాస్త్రీయమో ఏది శాస్త్రయమో గుర్తించడం కష్టమేమి కాదు. కుహనా శాస్త్రం లాగా ఇది సామాన్య జనాన్ని తికమక పెట్టదు.

**3. మూఢ నమ్మకాలు (సూపర్‌స్టిషన్స్):** ఇవి అశాస్త్రీయంగా కుహనా శాస్త్రాలుగా ఉంటాయి. అయితే 'నమ్మకం' వీటి ప్రాతిపదిక. సాధారణ నమ్మకమైతే దానిని మనం అశాస్త్రీయమో, శాస్త్రీయమో విడదీసి, విశదీకరించే అవకాశం ఉంటుంది. మూఢ నమ్మకం హేతువుకు దూరం. అది చర్చను, విశ్లేషణను అంగీకరించదు. మూఢ నమ్మకం పట్టిన కుందేలుకు కాళ్లు మూడే! కాని ఈ నమ్మకాలు కలిగిన వాళ్లు సంపన్నులు కొందరున్నా ఎక్కువ మంది సాధారణ జనం మన జనం. అభ్యుదయ రాజకీయ ప్రచారాల వల్ల గాని ఆమాటకొస్తే విప్లవ అధికారాల వల్ల కాని మూఢ నమ్మకాలు, అశాస్త్రీయత, కుహనా శాస్త్రీయతలు పూర్తిగా అంతం కావు. వాటి నుండి విశాల ప్రజానీకాన్ని విముక్తి చేయడానికి ప్రత్యేక కృషి అవసరం

మూఢ నమ్మకాల గురించి ప్రచారం చేసేటప్పుడు శాస్త్ర సంస్థ కార్యకర్తలు చాలా జాగ్రత్తగా ఉండాలి. మూఢ నమ్మకాలను ప్రచారం చేసే వాళ్లు తెలిసే ఆ పని చేస్తారు. కానీ అనుసరిస్తున్న వాళ్లను నిజాయితీగా నమ్మి ఆచరిస్తారు. ఈ విధంగా అనుసరించే జనం మనకు స్నేహితులు. మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా శాస్త్ర సంస్థలు ఏ ప్రచారం, లేక కార్యక్రమం నిర్వహించినా అమాయక జనం మనకు వ్యతిరేకంగా మారకుండా జాగ్రత్తపడాలి.

**4. రాజకీయ పార్టీ తోక (టెయిలింగ్ ఎ పొలిటికల్ పార్టీ)**

రాజకీయ పార్టీ తన సిద్ధాంతాన్ని ఆచరించడానికి కార్యక్రమాలను రూపొందించుకుంటుంది. ఆ కార్యక్రమాల నిర్వహణకు అనేక ప్రజా సంస్థలను ఏర్పరుస్తుంది. అందులోని కీలక అంశం ఒక్కటే. ప్రజా సంస్థలు ఏమి ఆలోచించినా, ఏ కార్యక్రమం నిర్వహించినా నేరుగా గాని, రహస్యంగా గాని సదరు రాజకీయ పార్టీకి లాభించాలి. ఒక్క మాటలో ఆ సంఘం ఎంత 'జనరల్'గా పైకి కనిపించినా రాజకీయ పార్టీ అనే రిమోట్ కంట్రోల్ ద్వారా నడుస్తుంది. దీని వలన మన

కమిటీకి నష్టం ఉంది. శాస్త్ర సంస్థ విశ్లేషించి రాజకీయ పార్టీని ప్రశ్నించి సరైన దారిలో ఉండడానికి ప్రయత్నించే పని అటుంచి, పాలిటిక్స్ ఆఫ్ కన్వీనియన్స్‌కు శాస్త్ర సంస్థ, శాస్త్ర భావాలూ తలవంచవలసి వస్తుంది. అందుకే శాస్త్ర సంస్థ సంపూర్ణ స్వతంత్ర సంస్థగా ఉంటూ ఇతర సంస్థలతో సంబంధాలు కలిగి ఉండవచ్చు. దీని అర్థం రాజకీయాలు ఉండకూడదని కాదు. రాజకీయాలు కలిగి ఉండడానికి రాజకీయ పార్టీకి అనుబంధంగా ఉండడానికి చాలా తేడా ఉంది.

**శాస్త్ర సంస్థ నిర్మాణం**

సంస్థకు నిర్మాణం లేనిదే స్వరూపం ఉండదు. అనేక రకాల నిర్మాణాలను మనం ఆచరణలో చూస్తున్నాం. నిర్మాణమంటే సాధారణ భావం అందరికీ ఉంటుంది.




నిర్మాణం ఒక అచేతనమైన దొంతర కాదు. అనేక మంది వల్లించే సిద్ధాంతాలు నిర్మాణంలో ప్రతిఫలించవు. చాలా సందర్భాల్లో నిర్మాణం పై కమిటీల్లో ఉండే నాయకుల 'మంచితనం' మీద ఆధారపడి ఉంటుంది. ఇది శాస్త్రీయం కాదు. 'మంచితనం' లేని వాళ్లు ఆ స్థాయిలోకి ఎదగడం లేక పొరపాటుగా ఆ స్థాయికి వెడితే వాళ్లని వెంటనే స్థానభ్రంశం చెందించగల అంతర్గత చలనశీలత నిర్మాణానికి ఉండాలి. చాలా సార్లు నాయకుల లిమిటేషన్ సంస్థ లిమిటేషన్‌గా మారుతూ ఉంటుంది. దానిని జాగ్రత్తగా గమనించి అసలు సంస్థ నిర్మాణ అవసరమేమిటో స్పష్టత ఏర్పరచుకోవాలి. అందరికీ శాస్త్రం చెప్పి మనం మాత్రం శకునం చూస్తున్నట్లుగా మన నిర్మాణం ఉండకూడదు.

ఇతరేతర అంశాలెన్ని ఉన్నా మన నిర్మాణానికి 'ప్రజాస్వామ్యం' పట్టుగొమ్మలు ప్రజాస్వామ్యానికి వికేంద్రీకరణ, కేంద్రీకరణలాంటి విశేషణాలవసరం లేదు. అది ఒక చైతన్యవంతమైన మైనార్టీ అభిప్రాయాల్ని సదా గౌరవించి గమనంలో ఉంచుకుంటూ ముందుకు సాగే ప్రక్రియ. మైనారిటీ అభిప్రాయాల వాళ్లని నిర్మాణంలో కిందకి తొక్కివేసే ప్రక్రియ కాదు. మెజారిటీ కోసం లాబీయింగ్‌లు, గ్రూపులు లాంటి అపసవ్య పద్ధతుల్లోకి పోవడమూ కాదు. 'ప్రజాస్వామ్యం' అత్యంత జాగరూకతతో మనం నేర్చుకుంటూ, ఆచరిస్తూ నిర్మించుకోవలసిన చలన శీల ప్రక్రియ. అది విస్మరించిన ధనిక రాజ్యాలు, మన రాజ్యాలు తమ ప్రజలను కడగళ్లపాలు చేశాయి. చివరికి పేదల రాజ్యాలు కూడా అదే పేదల చేత ఛీ కొట్టబడి చరిత్రలో కలిసి పోయాయి. వాటన్నిటి నుండీ మనం ఏమి నేర్చుకోకపోతే మనదసలు శాస్త్ర సంస్థే కాదు.

**కార్యక్రమాలు**

అధికారాన్ని కైవసం చేసుకునే రాజకీయ కార్యక్రమాలు మన కార్యరంగం కాదు. విస్తృత పౌరులు సమాజంలోని అనేక అంశాలు శాస్త్రీయ దృక్పథం ప్రాతిపదికగా మన కార్యక్రమాలు రూపొందించబడాలి. కార్యక్రమాలు తెరచాపల్లాంటివి. వాటిని మన దిశగా అనుగుణంగా మార్చుకోకపోతే గాలి ఎటు వీస్తే అటుగా మన సంస్థ కొట్టుకొని పోతుంది. అయితే స్థూలంగా మనం కొన్ని విషయాలు గమనంలో ఉంచుకోవాలి. మన సంస్థలో అనేక అంశాల పట్ల ఆసక్తి గల నాయకులు, కార్యకర్తలు ఉన్నారు. వారు ఆయా కార్యక్రమాన్నిటినీ చేసుకునే వెసులుబాటు సంస్థలో ఉండాలి. అయితే సంస్థ మొత్తంగా ఏకోన్ముకంగా కదిలి అందరూ కలిసి పనిచేసే ప్రధాన కార్యక్రమాలు నిర్దేశించుకోవాలి. నిర్ణీత సమయంలో వచ్చిన కార్యక్రమ ప్రయోజనాన్ని, నిర్మాణ ప్రయోజనాన్ని బేరీజు వేసుకుంటూ ముందుకు సాగాలి. ఇలాంటి ప్రధాన కార్యక్రమం లేకపోతే సంస్థలో ఐక్యత కొరవడుతుంది. కార్యక్రమాల్లో స్పాంటేనియస్ కార్యక్రమాలు, నిర్మిత కార్యక్రమాలు ఉంటాయి. వాటిని అధ్యయనం చేయాలి. ఏ కార్యక్రమాలైనా నిర్వహించే క్రమంలో కార్యకర్తల మధ్య, జనం మధ్య సమాంతర, వర్టికల్ బంధాలేర్పడతాయి. వాటిని జాగ్రత్తగా పరిశీలించి నిర్మాణంలోకి ఇముడ్చుకోవాలి.

ఉద్యమాలు – వీటినే నూతన సామాజిక ఉద్యమాలు అని వ్యవహరిస్తున్నారు. ప్రతి ఉద్యమానికీ ఒక పుట్టుక, పెరుగుదల, కొనసాగింపు, తరుగుదల ఉంటాయి. తరుగుదలను ఓటమిగా చూడకూడదు. ఆ ఉద్యమాల అనుభవాలే మన ఆస్తులు.

**భవిష్యత్తు**

మానవ శ్రమ నుండి శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం ఆవిర్భవించింది. ఒక్క మాటలో అది శ్రమ ప్రతిరూపమే అయితే అది సాధారణ శ్రమ కంటే భిన్నంగా వ్యవహరిస్తుంది.

సమాజ ప్రారంభంలో సామాజిక అస్తిత్వానికి పరిమితంగా వినియోగపడ్డ శాస్త్ర సాంకేతికాంశాలు. నేటికి ప్రముఖ పాత్రలో ఉన్నాయి. జీవ, సమాచార విప్లవాల వల్ల గత పది సంవత్సరాల్లో జరిగిన మార్పుల్లో గత శతాబ్దమంతా కలిపి జరిగిన మార్పుకంటే ఎక్కువ. భవిష్యత్తులో శాస్త్ర సాంకేతిక పురోగతి, మానవ సమాజం మీద దాని ప్రభావం విశ్వరూపం దాల్చబోతున్నాయి. ఆ సవాలును స్వీకరించడానికి శాస్త్ర సంస్థను సిద్ధపరచడమే మన కర్తవ్యం. భవిష్యత్తరాలు మన కృషిని ముందుకు తీసుకుని వెడతాయి. భవిష్యత్తు శాస్త్ర సంస్థలదే!

*(రచయిత మరణానికి కొద్ది ముందు రాసిన ఈ రచన ప్రజా సైన్స్ వేదిక మౌలిక పత్రాలలో ఒకటి. రెండు సంవత్సరాలకు పైగా అముద్రితంగా ఉండిపోయింది.* వీ

# కార్ల్ మార్క్స్ కాపిటల్‌కు నూట యాభై ఏళ్లు-2

***వ్యవస్థను అర్థం చేసుకోవడానికీ, మార్చడానికీ కరదీపిక కార్ల్ మార్క్స్ రచన కాపిటల్ మొదటి సంపుటం వెలువడి నూటయాభై ఏళ్లు అయిన సందర్భంగా దాన్ని వివరిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

*(గత సంచిక తరువాయి)*

**కాపిటల్‌లో ప్రవేశించబోయే ముందు**

ప్రజా ఉద్యమాల ఆచరణలో ఉన్నవాళ్లూ, ప్రజా ఉద్యమాల గురించి ఆలోచించేవాళ్లూ మాత్రమే కాక సమాజాన్ని అర్థం చేసుకోదలచుకున్న వాళ్లందరూ కూడ, తమ అవగాహనలను, ఆలోచనా సంవిధానాన్ని, ఆచరణను మెరుగు పరచుకోవడానికి ఎప్పుడో ఒకప్పుడు తప్పనిసరిగా కాపిటల్ చదవవలసిందే. కాపిటల్ చదవదలచుకున్న చాలమందికి అప్పటికే మార్క్సిజం గురించి ఎంతో కొంత అవగాహన, ఆచరణ ఉండే ఉంటాయి. లేదా, మార్క్సిజం గురించి నిజాలూ, అబద్ధాలూ, అర్ధసత్యాలూ కలగలిసిన వినికిడి జ్ఞానం ఉండి ఉంటుంది. మార్క్సిజం గురించి ఏవో కొన్ని పుస్తకాలు చదివే ఉంటారు. కాపిటల్ అధ్యయనం అంతకు ముందు తమకు తెలిసిన విషయాలను మరింత వివరంగా, లోతుగా, విశ్లేషణాత్మకంగా అర్థం చేసుకోవడానికి ఉపకరిస్తుంది. అంతకుముందు తాము సందర్భశుద్ధి లేకుండా విన్న, చదివిన ఉటంకింపుల సందర్భం తెలిసి, ఆ ఉటంకింపుల, సూత్రీకరణల సమగ్ర అవగాహన కలుగుతుంది. అంతకు ముందు మార్క్సిజం గురించి అరకొరగా విన్న, చదివిన విషయాలు సంపూర్ణంగా, నిర్దుష్టంగా అర్థమవుతాయి. అంతకు ముందు మార్క్సిస్టు వ్యతిరేకుల రచనల్లో, మార్క్సిజం సరిగా జీర్ణం కాక పొరపాట్లు రాసిన రచయితల రచనల్లో తాము చదివిన, విన్న అబద్ధాలనూ, అర్ధసత్యాలనూ, వక్రీకరణలనూ కాపిటల్ అధ్యయనం పటాపంచలు చేస్తుంది.

అయితే కాపిటల్ అధ్యయనంలోకి ప్రవేశించబోయే ముందు అర్థం చేసుకోవలసిన అంశాలు కొన్ని ఉన్నాయి. 'ఎ కంపానియన్ టు మార్క్స్ కాపిటల్' ఉపోద్ఘాతంలో డేవిడ్ హార్వే ఈ అంశాలను అద్భుతంగా వివరించాడు (ఈ ఉపోద్ఘాతం అనువాదం వీక్షణం నవంబర్ 2010లో వచ్చింది). "కాపిటల్ లో కలగలిసిపోయిన మూడు మహా భావనా చట్రాలు ఇవి: మొదటిది, సాంప్రదాయిక రాజకీయార్థ శాస్త్రం – పదిహేడో శతాబ్ది నుండి పందొమ్మిదో శతాబ్ది మధ్య దాకా సాగి వచ్చిన రాజకీయార్థ శాస్త్రం....రెండవ భావనాత్మకమైన నిర్మాణ పరికరం తాత్విక చర్చ, అన్వేషణ. మార్క్స్ కు సంబంధించినంతవరకు ఇది గ్రీకుల దగ్గర ప్రారంభమైంది...మార్క్స్ తన ప్రధాన జర్మన్ విమర్శనాత్మక, తాత్విక సంప్రదాయాన్ని బ్రిటిష్, ఫ్రెంచ్ రాజకీయార్థిక సంప్రదాయంతో కలగలుపుతాడు...మార్క్స్ అవలంబించిన మూడో సంప్రదాయం ఊహాత్మక సోషలిజానికి సంబంధించినది...మార్క్స్ కాపిటల్ లో ఒక్కచోటికి వచ్చిన మూడు ప్రధానమైన భావనాత్మక ధారలు ఇవి. విప్లవాత్మక రాజకీయ కార్యక్రమాన్ని నిస్సారమైన ఊహాస్వర్గ సోషలిజం నుంచి శాస్త్రీయ కమ్యూనిజం దిశగా మార్చడమే తన లక్ష్యంగా ఆయన భావించాడు. ఆ పని చేయాలంటే కేవలం ఊహా స్వర్గ వాదులను, రాజకీయార్థిక శాస్త్రవేత్తలను పోటీ పెట్టి చూపితే సరిపోదు. సామాజిక శాస్త్ర సంవిధానం అంటే ఏమిటో పునర్నిర్మించాలి. పునస్సంఘటితం చేయాలి. సూటిగా చెప్పాలంటే, ఈ కొత్త శాస్త్రీయ సంవిధానం ప్రధానంగా బ్రిటిష్ సాంప్రదాయిక రాజకీయార్థ శాస్త్ర ధోరణిని విశ్లేషించడం మీద ఆధారపడి ఉంది. ఆ విశ్లేషణకు ప్రధానంగా జర్మన్ సంప్రదాయ విమర్శనాత్మక తత్వశాస్త్రపు పరికరాలు వాడవలసి ఉంది. ఈ విశ్లేషణ ద్వారా ఫ్రెంచి ఊహాత్మక ఆలోచనల మీద వెలుగు ప్రసరింపజేయవలసి ఉంది" అని డేవిడ్ హార్వే అన్నాడు.

అంటే మొత్తంగా మార్క్స్ ను గాని, ప్రత్యేకంగా కాపిటల్ ను గాని చదవదలచినవారు ఈ మూడు భావనా చట్రాల గురించి అవగాహన కలిగించుకోవలసి ఉంటుంది. అలాగే, తొలి అధ్యాయాలు కఠినంగా ఉండడం తాను అనుసరించిన సంవిధానం వల్ల అని మార్క్సే ఒకచోట రాశాడు. అందువల్ల ఆ సంవిధానం గురించి అవగాహనకూడ అవసరమని డేవిడ్ హార్వే అంటాడు.

"మార్క్స్ పరిశోధనాపద్ధతి వాస్తవికంగా ఉనికిలో ఉన్న ప్రతి అంశంతోనూ ప్రారంభమవుతుంది. మనం అనుభవిస్తున్న వాస్తవికత, ఆ వాస్తవికతకు రాజకీయార్థ శాస్త్రవేత్తలు, తత్వవేత్తలు, నవలా రచయితలు, తదితరులు చేసిన వర్ణనలు – మార్క్స్ ఈ సమాచారాన్నంతా పోగుచేసి దాన్ని అతి నిశితమైన విమర్శకు గురిచేస్తాడు. తద్వారా వాస్తవికత పనిచేసే తీరుపై వెలుగు ప్రసరించగల భావనలను కనిపెడతాడు. అవి చాలా మామూలైనవే. కాని, చాలా శక్తిమంతమైనవి. దీన్ని ఆయన అవరోహణ పద్ధతి అన్నాడు. అంటే, మనం మన చుట్టూ తక్షణమే ఉన్న వాస్తవికత దగ్గర ప్రారంభిస్తాం. అక్కడ నుంచి లోపలికి దిగుతూ ఆ వాస్తవికతకు పునాదిగా ఉండే భావనలను కనిపెడతాం. ఆ మౌలిక భావనలు ఒకసారి మన చేతికి అందిన తర్వాత మళ్లీ ఉపరితలానికి వచ్చే ప్రయాణం మొదలుపెట్టవచ్చు. దీన్ని ఆరోహణ పద్ధతి అంటాం. ఈ లోతుకు వెళ్లి పైకి వచ్చే పరిశోధనా పద్ధతి ద్వారా మనకు ప్రపంచంలో కనబడుతున్న రూపాలు ఎంత మోసపూరితమైనవో కనిపెట్టగలుగుతాం. ఇటువంటి దృక్పథం ఏర్పడిన తర్వాత ప్రపంచాన్ని మౌలికంగా భిన్నమైన పద్ధతిలో వ్యాఖ్యానించే శక్తి కలుగుతుంది.

మొత్తంగానే మార్క్స్ ఉపరితలంలో కనబడే రూపాల దగ్గర మొదలుపెట్టి లోతయిన భావనల దగ్గరికి వెళతాడు. కాపిటల్‌లో మాత్రం ఆయన ప్రారంభించడమే మౌలిక పునాది భావనల వివరణ దగ్గర మొదలుపెట్టాడు. తన పరిశోధనా పద్ధతి ద్వారా తాను ఇదివరకే కనిపెట్టిన నిర్ధారణల దగ్గర మొదలుపెట్టాడు. తొలి అధ్యాయాలలో గబగబా తన భావనలను సాదాగా వివరిస్తూ పోయాడు. ఒకదానివెంట ఒకటి త్వరత్వరగా వాటిని పేర్చాడు. నిజంగా అది చూస్తే ఆయన ముందే ఏర్పరుచుకున్న, తన ఇష్టారాజ్యపు నిర్మాణాలతో మొదలు పెట్టాడనిపిస్తుంది.

కనుక మొదటిసారి చదివేటప్పుడు ఇలా అనిపించడంలో ఆశ్చర్యం లేదు. ఈ అభిప్రాయాలు, భావనలు అన్నీ ఈయనకు ఎక్కడి నుంచి వస్తున్నాయి? ఆ అభిప్రాయాలను, భావనలను ఈయన ఇలా ఎందుకు వాడుతున్నాడు? అసలు సగం సమయం ఆయనేం మాట్లాడుతున్నాడో అర్థమే కాదు. కానీ, మీరు పుస్తకంలో ఇంకా ముందుకు సాగినకొద్దీ ఈ భావనలు నిజంగానే మన ప్రపంచంపై ఎటువంటి వెలుగు ప్రసరిస్తాయో స్పష్టమవుతుంది. విలువ, ఆరాధన వంటి భావనలు ఎంత అర్థవంతమైనవో కొంత సమయం గడిచాక తెలిసి వస్తుంది.

అంతేకాదు, పుస్తకం చివరికి చేరినాక మాత్రమే ఈ భావనలు ఎలా పనిచేస్తాయో మనకు పూర్తిగా అర్థమవుతుంది. మరి ఇది చాలా విచిత్రమైన, ప్రతేకమైన రచనా వ్యూహం. మనందరికీ బాగా తెలిసిన రచనా పద్ధతి ఏమంటే ఒక వాదనను ఇటుక మీద ఇటుక పేర్చినట్టుగా నిర్మిస్తూ పోవడం. కాని, మార్క్స్ విషయంలో వాదనా పద్ధతి ఉల్లిపాయ లాగ ఉంటుంది....మార్క్స్ ఉల్లిపాయ పై భాగం నుంచి ప్రారంభిస్తాడు. బయటికి కనబడే వాస్తవికతను ఒక్కొక్క పొర విప్పుతూ దాని కేంద్ర భాగానికి, భావనాత్మక మూలానికి చేరుతాడు. అప్పుడిక మళ్లీ తన వాదనను పైకి వివరిస్తూ వస్తాడు. వేరు వేరు పొరల సిద్ధాంతం ద్వారా మళ్లీ ఉల్లిపాయ ఉపరితలానికి చేరుతాడు. అందువల్ల ఈ వాదన నిజమైన శక్తి మనకు ఎప్పుడు స్పష్టమవుతుందంటే మన అనుభవ ప్రపంచంలోకి మళ్లీ ప్రవేశించిన తరువాతనే. ఆ అనుభవాన్ని అర్థం చేసుకోవడానికి, వ్యాఖ్యానించడానికి సంపూర్ణంగా కొత్తదయిన జ్ఞాన చట్రం ఒకటి మన చేతిలో ఉన్నదని మనకు తెలిసి వస్తుంది...” అని డేవిడ్ హార్వే అంటాడు.

**కాపిటల్ లో ఏముంది?**

కాపిటల్ మొదటి సంపుటం మొత్తంగా పెట్టుబడిదారీ ఉత్పత్తి స్వభావాన్ని, దాని చలన నియమాలను వివరిస్తుంది. ఇందులో ఎనిమిది భాగాలున్నాయి. ఒక్కొక్క భాగంలోనూ మూడు నుంచి ఎనిమిది అధ్యాయాలుగా మొత్తం ముప్పై మూడు అధ్యాయాలున్నాయి. మళ్లీ కొన్ని అధ్యాయాలు వాటి విషయ విస్తృతిని బట్టి కొన్ని విభాగాలుగా కూడ విడిపోయి ఉన్నాయి.

సరుకులూ డబ్బూ అనే మొదటి భాగం సరుకుల స్వభావాన్ని విశ్లేషిస్తుంది. పెట్టుబడిదారీ సమాజంలో సంపద అంటే సరుకులు పోగుపడడమే అనే అభిప్రాయం ఉన్నందువల్ల అసలు సరుకు అంటే ఏమిటో వివరించేదగ్గర మార్క్స్ ప్రారంభిస్తాడు. సరుకు అనేది మౌలికంగా మానవ శ్రమ వల్ల ఉత్పత్తి అవుతుంది. ప్రతి సరుకుకూ ఉపయోగం ఉంటుంది. అందువల్ల దాన్ని ఎవరితో ఎట్లా మారకం చేసుకోవచ్చునా అనే ఆలోచనతోనే సరుకుల ఉత్పత్తి జరుగుతుంది. అంటే ప్రతి సరుకుకూ ఉపయోగ విలువ, మారకపు విలువ లేదా వినియోగ విలువ, వినిమయ విలువ అనే రెండు స్వభావాలు ఉంటాయి. ఉపయోగ విలువ అవసరాన్ని బట్టి ఏర్పడుతుంది. కాని మారకపు విలువను నిర్ణయించేది ఏమిటి, రెండు సరుకుల మధ్య మారకం జరిగేటప్పుడు వాటిని సమానం చేసే ఉమ్మడి అంశం ఏమిటి, అని ప్రశ్నించుకుని అన్ని సరుకుల్లోనూ సమానాంశం మానవ శ్రమ అని, ప్రతి సరుకులోనూ ఒక కచ్చితమైన పరిమాణంలో సామాజికంగా అవసరమైన శ్రమ నిక్షిప్తమై ఉంటుందని, ఆ శ్రమ ఆధారంగానే ఆ సరుకు మారకపు విలువ నిర్ణయమవుతుందని మార్క్స్ అన్నాడు. ఇలా సరుకు స్వభావాన్ని, దాని విలువను విశ్లేషించిన తర్వాత విలువకు సార్వత్రిక కొలమానంగా, సరుకుల పంపిణీ సాధనంగా డబ్బు రూపొందిన పద్ధతిని మార్క్స్ వివరించాడు.

పెట్టుబడిగా డబ్బు పరివర్తన అనే రెండో భాగం కార్మికుని శ్రమశక్తిని కొనుగోలు చేయగలిగిన స్థితిలోని డబ్బు పెట్టుబడిగా పరివర్తన చెందుతుందని వివరిస్తుంది. మానవ శ్రమశక్తి అమ్మగలిగిన, కొనగలిగిన సరుకుగా మారుతుందని, అన్ని సరుకుల విలువ నిర్ణయమైనట్టుగానే ఈ సరుకు విలువ కూడ దాన్ని తయారు చేయడానికి సామాజికంగా అవసరమైన శ్రమ ఆధారంగా నిర్ణయమవుతుందని మార్క్స్ అన్నాడు. అయితే మిగిలిన ఏ సరుకుకూ లేని ప్రత్యేక లక్షణం ఈ శ్రమ శక్తి అనే సరుకుకు ఉందని, దాన్ని ఉపయోగించినప్పుడు అది తన విలువ కన్న అధిక విలువను ఉత్పత్తి చేయగలుగుతుందని, అలా కార్మికుల శ్రమ అదనపు విలువను ఉత్పత్తి చేస్తుందని, దాన్ని పెట్టుబడిదారు సొంతం చేసుకుంటాడని మార్క్స్ విశ్లేషించాడు.

సంపూర్ణ అదనపు విలువ ఉత్పత్తి అనే మూడో భాగంలో మార్క్స్ మొత్తం పెట్టుబడిదారీ ఉత్పత్తిని, అందులో భాగంగా అదనపు విలువ ఉత్పత్తిని అర్థం చేసుకోవడానికి కీలకమైన చర్చ చేస్తాడు. ముడి సరుకులు, శ్రమ సాధనాలు కొనడానికి ఉపయోగించే స్థిర పెట్టుబడిగానూ, శ్రమశక్తిని కొనడానికి ఉపయోగించే చలన పెట్టుబడిగానూ పెట్టుబడిని విభజించాలని, స్థిర పెట్టుబడి ఎటువంటి మార్పులు లేకుండా ఉత్పత్తి విలువలో భాగమవుతుందని, కాని చలన పెట్టుబడి మాత్రం అదనపు విలువను ఉత్పత్తి చేస్తుందని మార్క్స్ వివరించాడు. ఇలా తయారయ్యే అదనపు విలువకు, మొత్తం చలన పెట్టుబడికి మధ్య నిష్పత్తిని అదనపు విలువ రేటుగా మార్క్స్ సూత్రీకరించి, ఆ రేటు కార్మికులను పెట్టుబడిదారు ఎంత తీవ్రతతో దోపిడీ చేస్తున్నాడో వివరిస్తుందన్నాడు. అదనపు విలువ పరిమాణం పెంచడానికీ, అదనపు విలువ రేటు పెంచడానికీ పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో జరిగే ప్రయత్నాన్ని వివరిస్తూ పనిదినం భావనను విశ్లేషించాడు.

సాపేక్ష అదనపు విలువ ఉత్పత్తి అనే నాలుగో భాగంలో మార్క్స్ అదనపు విలువ రేటును పెంచే మార్గాల గురించి చర్చించాడు. యంత్రాలను ఉపయోగించి శ్రమ ఉత్పాదకతను పెంచడం ద్వారా కార్మికుల పోషణకు సామాజికంగా అవసరమైన శ్రమ కాలం తగ్గి శ్రమశక్తి విలువ తగ్గుతుంది. అంటే పెట్టుబడిదారుకు అదనపు విలువ పెరుగుతుంది. పనిదినాన్ని పొడిగించినందువల్ల ఉత్పత్తి అయ్యే అదనపు విలువను స్థిర అదనపు విలువ అని, అవసర శ్రమను తగ్గించడం ద్వారా ఉత్పత్తి అయ్యే అదనపు విలువను సాపేక్ష అదనపు విలువ అని మార్క్స్ అన్నాడు. ఈ భాగంలోనే మార్క్స్ పెట్టుబడిదారీ ఉత్పత్తిలో సాధారణ శ్రమ సమీకరణ ద్వారా సరుకుల ఉత్పత్తి, శ్రమ విభజన ద్వారా సరుకుల ఉత్పత్తి, ఆధునిక యంత్రాల ద్వారా ఉత్పత్తి అనే మూడు దశల ప్రయాణం ఉందని, ఆ మూడు దశల అభివృద్ధి క్రమాన్ని, కార్మికులపై వాటి ప్రభావాన్ని చర్చించాడు.

సంపూర్ణ, సాపేక్ష విలువ ఉత్పత్తి అని ఐదో భాగంలో మార్క్స్ స్థిర అదనపు విలువకూ, సాపేక్ష అదనపు విలువకూ సంబంధించిన సంక్లిష్ట అంశాలను, పనిదినం పొడిగింపు, ఉత్పాదకత పెంపు, శ్రమ తీవ్రతలో మార్పుల ప్రభావం వంటి అంశాలను చర్చించాడు.

వేతనాలు అనే ఆరో భాగంలో మార్క్స్ సాధారణంగా వేతనాలు అంటే శ్రమ ధర అనే పొరపాటు అభిప్రాయం ఉందని, కాని వేతనం ఉపయోగించి కొనుగోలు చేసేది శ్రమ శక్తి మాత్రమే తప్ప శ్రమ కాదని వివరిస్తాడు. ఉత్పత్తి చేసిన సరుకులను బట్టి వేతనం వంటి రూపాలు కూడ కాలాన్ని పరిగణించి వేతనాలు చెల్లించే శ్రమశక్తి కొనుగోలుకు పరివర్తనా రూపాలు మాత్రమేనని వివరించాడు.

పెట్టుబడి సంచయం అనే ఏడో భాగంలో పెట్టుబడి చలనం గురించి వివరిస్తూ మార్క్స్ అందులో మొదటి దశలో డబ్బు (ఎం) సాధనాల రూపంలోకి, శ్రమశక్తి రూపంలోకి మారుతుందని, రెండో దశలో శ్రమను వినియోగించడం ద్వారా ఉత్పత్తి సాధనాలు సరుకులుగా (సి) మారుతాయని, మూడో దశలో ఆ సరుకుల అమ్మకం జరిగి మళ్లీ డబ్బు (ఎం' – ఎం ప్రైమ్) రూపంలోకి మారుతుందని చెప్పాడు. ఈ మూడు దశల చలనం అదే సమయంలో పెట్టుబడి పోగుపడే క్రమం కూడ అని మార్క్స్ అన్నాడు. పెట్టుబడి తనంత తానుగా పెరగదని, అదనపు విలువను పెట్టుబడిగా మార్చడం ద్వారా అది విస్తరిస్తూ పోతుందని అన్నాడు. అలా పెట్టుబడి పోగుపడుతున్నకొద్దీ స్థిర పెట్టుబడికీ, చలన పెట్టుబడికీ మధ్య నిష్పత్తి మారుతుంది. పెట్టుబడి బడా పెట్టుబడిదారుల చేతుల్లో కేంద్రీకృతమవుతుంది. మరొకపక్క పారిశ్రామిక రిజర్వ్ సైన్యం, నిరుద్యోగ సైన్యం నిరంతరం పెరుగుతూనే ఉంటుంది. స్థిర పెట్టుబడి వాటా పెరుగుతూ, చలన పెట్టుబడి వాటా తగ్గినకొద్దీ కార్మికులు మిగులుగా మారి పారిశ్రామిక రిజర్వ్ సైన్యం పెరుగుతూ పోతుంది. అంటే పెట్టుబడి అభివృద్ధి క్రమపు గర్భంలోనే పెట్టుబడి పెరిగినకొద్దీ సామాజిక దారిద్ర్యం పెరిగే అనివార్య వైరుధ్యం ఉందని బైటపడుతుంది.

ఆదిమ (ప్రాథమిక) సంచయనం అనబడేది అనే ఎనిమిదో భాగంలో మార్క్స్ పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ఉనికిలోకి రావడానికి దారితీసే పరిస్థితులను చర్చించాడు. ముందుగా పెట్టుబడిదారులకు ఉత్పత్తి సాధనాలను, శ్రమశక్తిని కొనడానికి తగిన సంపద పోగుపడి ఉండాలి. శ్రమశక్తి తప్ప అమ్ముకోవడానికి ఏమీ లేని స్వేచ్ఛా కార్మికులు, భూస్వామ్య బంధనాల నుంచి స్వేచ్ఛ పొందినవారూ, ఏ ఆస్తీ లేకుండా తమను తాము ఎవరికైనా అమ్ముకోవడానికి స్వేచ్ఛ ఉన్నవారూ ఏర్పడాలి. ఈ పరిస్థితులు ఏర్పడే క్రమాన్ని మార్క్స్ ఆదిమ సంచయం (ప్రిమిటివ్ అక్యుములేషన్) అన్నాడు. ఇంగ్లండ్ లో ఈ ఆదిమ సంచయనం వలస దోపిడీ ద్వారా, రైతాంగాన్ని భూములనుంచి వెళ్లగొట్టడం ద్వారా ఏర్పడిందని చూపాడు. అంతవరకూ చిన్న రైతులుగా ఉన్నవారిని నిర్బంధంగా వేతన కార్మికులుగా మార్చడం, వారికి శ్రమశక్తి అమ్ముకోవడం తప్ప గత్యంతరం లేని స్థితి కల్పించడం, అంతవరకూ వారు తమంత తాముగా ఉత్పత్తి చేసుకునే మనుగడ సాధనాలకు కూడ వారిని కొనుగోలుదారులుగా మార్చడం వంటి వాటి ద్వారా పెట్టుబడిదారీ ఉత్పత్తికి గృహ మార్కెట్ రూపొందుతుంది. అయితే ఈ పెట్టుబడిదారీ సంచయపు చారిత్రక క్రమం అంతిమంగా పెట్టుబడిదారీ వ్యవస్థ అంతానికి దారి తీయకతప్పదని మార్క్స్ వాదించాడు.

**తెలుగులో కాపిటల్**

కాపిటల్ మొదటి భాగం 1867లోనే వెలువడి, 1880ల నాటికే ఇంగ్లిష్‌లోకీ, ఇతర యూరపియన్ భాషలలోకి అనువాదం అయినప్పటికీ, అది భారతదేశంలోకి, తెలుగు భాషా ప్రాంతాలకు రావడానికి మరొక నాలుగైదు దశాబ్దాలు పట్టినట్టుంది. భారతదేశంలోకి కాపిటల్ ఇంగ్లిష్ ప్రతి ఎప్పుడు ప్రవేశించిందనే కచ్చితమైన ఆధారాలు లేవు గాని, భారతీయ భాషలలో మొట్టమొదటగా మరాఠీ అనువాదం 1953లో, హిందీ అనువాదం 1965లో, మలయాళం అనువాదం 1968లో వెలువడ్డాయని ఉరోయెవా రాసింది. అయితే ఈ ఉరోయెవా వ్యాసాన్ని జర్మన్ నుంచి ఇంగ్లిష్ లోకి అనువదించిన డా. జి అధికారి మాత్రం మరాఠీ అనువాదం గురించి ఉరోయెవా పొరపాటు పడిందని పాదసూచిక చేర్చారు. బొంబాయికి చెందిన పి.వి. గాడ్గిల్ 1943లోనే కొన్ని ఎంపిక చేసిన భాగాలను మరాఠీలో ప్రచురించారని ఆయన రాశారు. కాని పి.వి. గాడ్గిల్ 'కార్ల్ మార్క్స్ అణి హిందుస్తాన్' అని 1941లో ప్రచురించిన పుస్తకానికి కాపిటల్ గ్రంథాచ పార్శ్వభూమి, మార్క్స్ చె కాపిటల్ సార్ గ్రంథ అనే అనుబంధాలు ఉన్నాయని, ఆ పుస్తకానికి రెండో కూర్పు 1949లో వెలువడిందని పరిశోధకుడు ప్రదీప్ బక్షీ 2008లో రాసిన పత్రంలో అన్నారు. బహుశా ఆ మరాఠీ సంక్షిప్త రూపమే భారతీయ భాషల్లో కాపిటల్ తొలి ప్రవేశం కావచ్చు. భారతదేశంలో కమ్యూనిస్టుల మీద పెట్టిన మొదటి కుట్రకేసు, మీరట్ కుట్రకేసు అభియోగపత్రంలో నిందితులు చదివిన పుస్తకాలలో కాపిటల్ ను కూడ పేర్కొన్నారు. అలా ఏది ఏమైనా 1920లకల్లా కాపిటల్ భారతదేశంలోకి వచ్చిందని, కాపిటల్ అనువాదాలు 1940ల్లో ప్రారంభమయ్యాయని చెప్పవచ్చు.

కాని కాపిటల్ తొలి ప్రచురణ జరిగి వంద ఏళ్లు గడిచేసరికి కూడ ప్రధానమైన భారతీయ భాషలలోకీ, తెలుగులోకీ అనువాదం కాలేదని చెప్పవచ్చు. తెలుగు సమాజంలో మార్క్సిస్టులుగా మారిన తొలితరానికే కాపిటల్ పరిచయం ఉన్నట్టు ఆధారాలున్నాయి గాని, తెలుగు అనువాద మైనా, కనీసం పరిచయ వ్యాసాలైనా వెలువడ లేదు. 1940ల నాటికే తెలుగు మార్క్సిస్టులలో కొందరు కాపిటల్ చదివారని వారి ఆత్మకథల లోనో, జీవితచరిత్రలోనో, జ్ఞాపకాల వ్యాసాలలోనో ఆధారాలున్నాయి. బనారస్ హిందూ విశ్వవిద్యాలయ విద్యార్థులుగానో, జాతీయోద్యమంలో, రైతాంగ ఉద్యమాలలో, కార్మిక ఉద్యమాలలో, సాహిత్యోద్యమాలలో పాల్గొంటున్న కార్యకర్తలుగా, నాయకులుగా అరెస్టయి జైళ్లలోనో, బయటనో అప్పటి మార్క్సిస్టులలో కొందరు కాపిటల్ చదివే ఉంటారు. అలా కంభంపాటి సత్యనారాయణ, మహీధర జగన్మోహనరావు, మహీధర రామమోహనరావు, కెబి కృష్ణ, చండ్ర రాజేశ్వరరావు, పుచ్చలపల్లి సుందరయ్య, మద్దుకూరి చంద్రశేఖరరావు, కొడవటిగంటి కుటుంబరావు, నండూరి ప్రసాదరావు వంటి వారు కాపిటల్ చదివి ఉంటారనడానికి వారి రచనల్లో ఆధారాలున్నాయి. 1939లో యుద్ధం సందర్భంగా అరెస్టయి, జైళ్లలో ఉన్న తెలుగు మార్క్సిస్టులు కాపిటల్ అధ్యయనం చేశారని, జైళ్లలో అధ్యయన తరగతులు జరిగాయని ఆధారాలున్నాయి.

అయితే కాపిటల్ తెలుగు అనువాదం ఆలస్యం కావడంవల్ల, కాపిటల్ కన్న ఎక్కువగా తెలుగు మార్క్సిస్టులను ఇతర రాజకీయార్థ శాస్త్ర పుస్తకాలు ప్రభావితం చేశాయి. సోవియట్ యూనియన్ లో కాపిటల్ అధ్యయనంతో స్వతంత్రంగా, సమాంతరంగా మార్క్సిస్టు రాజకీయ అర్థశాస్త్రం మీద వందకు పైగా గ్రంథాలు వెలువడ్డాయి. వాటిలో ఎ లియాంటీవ్ (లేదా లియాన్ టీవ్) (లియో అబ్రామోవిచ్ లియాంటీవ్ (1901–1974) రాసిన 'పొలిటికల్ ఎకానమీ – ఎ బిగినర్స్ కోర్స్' తొలికూర్పు మాస్కోలో 1936లో వెలువడింది. లండన్ లోని మార్క్సిస్టు పుస్తక ప్రచురణ సంస్థ లారెన్స్ 1943లో దాని అంతర్జాతీయ పునర్ముద్రణ తీసుకు వచ్చింది. నేషనల్ బుక్ ఏజెన్సీ లిమిటెడ్, కలకత్తా అనే ప్రచురణ సంస్థ "రెండో భారతీయ కూర్పు" పేరుతో 1944 జనవరిలో దీన్ని పునర్ముద్రించింది. దీని మొదటి భారతీయ కూర్పు ఎప్పుడో తెలియదు. బనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో చదువుకుంటున్న సమయంలో మార్క్సిజం ప్రభావంలోకి వచ్చిన నండూరి ప్రసాదరావు ఈ పుస్తకాన్ని అప్పుడే చూసి ఉంటారు. ఆయన దాన్ని తెలుగు చేయగా, 'అర్థశాస్త్రం' పేరుతో ప్రజాశక్తి ప్రచురణాలయం 1947లో అచ్చువేసిందని తెలుస్తున్నది. ఆ తొలి ముద్రణ ప్రతులు దొరకడం లేదు గాని ప్రజాశక్తి బుక్ హౌస్ 1974లోనూ, 1979లోనూ దాన్ని పునర్ముద్రించింది.

ఎల్ లియాన్ త్యెవ్ రాసిన 'పొలిటికల్ ఎకానమీ – ఎ కండెన్స్‌డ్ కోర్స్' అనే పుస్తకాన్ని ప్రోగ్రెస్ పబ్లిషర్స్ 1974లో ప్రచురించగా, దానికి రాచమల్లు రామచంద్రారెడ్డి అనువాదం 'అర్థశాస్త్రం – సంక్షిప్త పాఠం'

ప్రగతి ప్రచురణాలయం మాస్కో 1978లో ప్రచురించింది. నండూరి ప్రసాదరావు అనువదించిన అర్థశాస్త్రం పుస్తకంలోని అంశాలకూ, ఈ పుస్తకంలోని అంశాలకూ తేడా ఉంది. ఈ ఇద్దరు లియాన్ టీవ్ లు ఒకరే కావచ్చు. ఆయన పూర్తిపేరు లెవ్ అబ్రామోవిచ్ లియాన్ టీవ్ కాగా రచయిత పేరు మొదటి పుస్తకానికి ఎ లియాన్ టీవ్ అనీ, రెండో పుస్తకానికి ఎల్ లియోనెత్యెవ్ అనీ పెట్టారు.

సోవియెట్ యూనియన్ లోని సోషల్ అండ్ ఎకనమిక్ లిటరేచర్ పబ్లిషింగ్ హౌజ్, ఎకనమిక్స్ ఇన్ స్టిట్యూట్ ఆఫ్ ది అకాడమీ ఆఫ్ సైన్సెస్ రాజకీయార్థ శాస్త్రంలో సులభమైన పాఠ్యపుస్తకం కోసం 1959లో పోటీ నిర్వహించగా పి నికిటిన్ రాసిన 'ఫండమెంటల్స్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ – పాపులర్ కోర్స్' అనే పుస్తకం బహుమతి పొందింది. ఆ పుస్తకాన్ని వయలెట్ దత్, మురాద్ సైఫులిన్ ఇంగ్లిష్ లోకి అనువదించగా ఫారిన్ లాంగ్వేజెస్ పబ్లిషింగ్ హౌజ్ మాస్కో 1963(?) లో ప్రచురించింది. ఈ పుస్తకానికి సంక్షిప్త తెలుగు అనువాదం 1967 (1969?) లో వచ్చింది. ఈ మొదటి ప్రచురణకర్త ఎవరో తెలియదు గాని, ఈ పుస్తకంలో కొంత భాగాన్ని ప్రజాపంథా ప్రచురణలు 1984లో పునర్ముద్రించింది.

అలాగే ఎ బుజూయెవ్ రాసిన 'వాట్ ఈజ్ కాపిటలిజం?' అనే పుస్తకానికి నిడమర్తి ఉమారాజేశ్వర రావు అనువాదం 'పెట్టుబడిదారీ వ్యవస్థ అంటే ఏమిటి?' 1989లో ప్రగతి ప్రచురణాలయం మాస్కో ప్రచురించింది. ఎన్ ఆర్ట్యేయెవ్ తదితరులు రాసిన పుస్తకానికి రాచమల్లు రామచంద్రారెడ్డి అనువాదం 'పెట్టుబడిదారీ అర్థశాస్త్రం' ప్రగతి ప్రచురణాలయం, మాస్కో 1978లో ప్రచురించింది. అలాగే కాపిటల్ మొదటి సంపుటంలోని 'పెట్టుబడి పుట్టుక' అనే భాగానికి రాచమల్లు రామచంద్రారెడ్డి అనువాదాన్ని ఒక చిన్న పుస్తకంగా 1970లలోనే ప్రగతి ప్రచురణాలయం ప్రచురించింది.

చైనాలో శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవ కాలంలో ప్రతి అంశాన్నీ రైతులకు, కార్మికులకు అర్థమయ్యేలా వివరించే సులభమైన పుస్తకాలు రాయాలనే ఉద్యమంలో భాగంగా షాంఘై టెక్స్ట్ బుక్స్ అనే పేరుతో కొన్ని పుస్తకాలు వెలువడ్డాయి. వాటిలో రాజకీయార్థ శాస్త్రం కూడ ఒకటి. 'పొలిటికల్ ఎకానమీ ఆఫ్ సోషలిజం' అని రెండుభాగాలుగా వెలువడిన ఆ పుస్తకంలోని మొదటి భాగం తొలి ఐదు అధ్యాయాలను అనువదించి 'రాజకీయ అర్థశాస్త్ర మూలసూత్రాలు' పేరుతో క్రాంతి ప్రచురణలు 1987లో ప్రచురించింది. మొత్తం పదకొండు అధ్యాయాల మొదటి భాగాన్ని అనువదించి 'రాజకీయ అర్థశాస్త్ర మూలసూత్రాలు' పేరుతో శ్రామికవర్గ ప్రచురణలు 1996లో ప్రచురించింది. రెండో భాగాన్ని 'సోషలిస్టు రాజకీయ అర్థశాస్త్ర మూలసూత్రాలు' పేరుతో శ్రామిక వర్గ ప్రచురణలే 2002లో ప్రచురించింది.

'రాజకీయ అర్థశాస్త్రం 50 ప్రశ్నలు – జవాబులు' పేరుతో ఒక విప్లవ పార్టీ దాదాపు పది సంవత్సరాలు అధ్యయన తరగతులకు ఉపయోగించిన సైక్లోస్టైల్ నోట్స్ ను లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ అదే పేరుతో ఆ తర్వాతి కాలంలో 2004లో ప్రచురించింది. అలాగే 'అర్థశాస్త్రవేత్తగా మార్క్స్' అనే మారిస్ డాబ్ వ్యాసపు అనువాదాన్ని 2004లో, 'మార్క్స్ కాపిటల్ అధ్యయనానికి...' అనే వ్యాస సంకలనాన్ని 2012లో లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురించింది.

ఇవన్నీ ప్రధానంగా ఇంగ్లిష్ నుంచి అనువాదమైన రాజకీయార్థశాస్త్ర పుస్తకాలు కాగా, తెలుగులో స్వతంత్రంగా రాజకీయార్థ శాస్త్రాన్ని వివరించే పుస్తకాలు రచించే ప్రయత్నం కూడ కొంత జరిగింది.

1980ల తొలిరోజుల్లో రాజకీయ అర్థశాస్త్రం పేరుతో విమోచన ప్రచురణగా చిన్న పుస్తకం ఒకటి వెలువడి చాల ప్రాచుర్యం పొందింది. తర్వాత కొద్దిరోజులకే వేములపల్లి వెంకటరామయ్య రాసిన 'మార్క్సిస్టు రాజకీయ అర్థశాస్త్రం' కూడ విమోచన ప్రచురణగా వెలువడింది. భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు)కు చెందిన మేధావి, తత్వశాస్త్రం, రాజకీయార్థ శాస్త్రాల ఉపాధ్యాయుడు జక్కా వెంకయ్య 'రాజకీయ అర్థశాస్త్రం ప్రథమ పాఠాలు' (ప్రథమ భాగం) పేరుతో 1989లో ఒక చిన్న పుస్తకం ప్రచురించారు. ఈ పుస్తకానికి తర్వాతి భాగాలు వెలువడినట్టు లేవు. 'రాజకీయార్థిక శాస్త్రం – ఒక పరిచయం' పేరుతో సి వి సుబ్బారావు 1992 మార్చ్ లో ఒక స్వతంత్ర పుస్తకం ప్రచురించారు. సిపిఐ (ఎం) రాజకీయార్థశాస్త్ర ఉపాధ్యాయుడు టి నరసింహయ్య రాసిన 'రాజకీయ అర్థశాస్త్రం – మౌలిక అవగాహన' ను ప్రజాశక్తి బుక్ హౌస్ 2012లో ప్రచురించింది.

అలా అనువాదాలు గాని, స్వతంత్ర రచనలు గాని రాజకీయార్థ శాస్త్రం గురించి దాదాపు డజను పుస్తకాలు తెలుగులో 1950ల నుంచీ, మరీ ముఖ్యంగా 1980ల నుంచీ లభిస్తున్నాయి గాని నేరుగా కాపిటల్ పరిచయం 1978 దాకా, అనువాదం 1990 దాకా జరగలేదు.

కాపిటల్ పరిచయం మొదటి భాగాన్ని రంగనాయకమ్మ 1978 అక్టోబర్‌లో ప్రచురించారు. మొత్తం కాపిటల్ పరిచయం మొదట ఐదు భాగాలుగానూ, ఆ తర్వాత రెండు భాగాలు గానూ వెలువరించారు. ఈ పరిచయం చాలసార్లు పునర్ముద్రణలు కూడ పొందింది. జూలియన్ బొర్చార్ట్ రాసిన 'ది పీపుల్స్ మార్క్స్ – అబ్రిడ్జ్‌డ్ పాపులర్ ఎడిషన్ ఆఫ్ ది త్రీ వాల్యూంస్ ఆఫ్ కాపిటల్' పుస్తకానికి ఇంగువ మల్లికార్జునశర్మ అనువాదం 1980ల తొలిరోజుల్లోనే ప్రచురించారు. డేవిడ్ స్మిత్, ఫిల్ ఇవాన్స్ రాసిన 'కాపిటల్ ఫర్ బిగినర్స్' అనే బొమ్మల పుస్తకానికి రాచమల్లు రామచంద్రారెడ్డి అనువాదం 'మార్క్స్ రాసిన పెట్టుబడి' పేరుతో హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణగా 1985లో వెలువడింది.

నేరుగా కాపిటల్ అనువాదాలు ఇప్పటికి తెలుగులో రెండు వచ్చాయి. నండూరి ప్రసాద రావు, అన్నే కోటేశ్వరరావు, వాసిరెడ్డి సత్యనారాయణ, కేశవరెడ్డి, మిక్కిలినేని సుబ్బారావు, ఎం వీరభద్రరావు, మిక్కిలినేని అక్కయ్య అనువాదకులుగా, అరవింద పబ్లిషర్స్, విజయవాడ కాపిటల్ మొదటి భాగం 1988లో, రెండో భాగం 1990లో, మూడో భాగం 1992లో ప్రచురించింది.

రెండో అనువాదానికి సన్నాహాలు ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు సమితి, ప్రగతి ప్రచురణాలయం, మాస్కో సంయుక్తంగా 1980ల మధ్యలోనే ప్రారంభించాయి. కాని 1989లో సోవియట్ యూనియన్ పతనంతో ఆ అనువాదం, ప్రచురణ ఆగిపోయి, చివరికి విశాలాంధ్ర విజ్ఞాన సమితి, విజయవాడ ప్రచురణగా మొదటి సంపుటం 1996లో, రెండో సంపుటం 1998లో, మూడో సంపుటం 200లో వెలువడ్డాయి. ఈ ప్రచురణకు అనువాదకులు రాచమల్లు రామచంద్రారెడ్డి, బిట్రగుంట రామచంద్రరావు, జి కోటేశ్వర రావు, ఎ. గాంధీ, సోదుం రామ్మోహన్. ఈ అనువాదాన్ని పరిష్కరించి మూడు సంపుటాలూ ఒకేసారి ఇటీవలే మళ్లీ విడుదల చేశారు.

అలా కాపిటల్ నేరుగా తెలుగులోకి ఆలస్యంగా వచ్చినా, కాపిటల్‌లోని భావనలను, మొత్తంగా మార్క్సిస్టు రాజకీయార్థశాస్త్ర భావనలను అన్వయిస్తూ తెలుగులో పుస్తకాలు, వ్యాసాలు, ఉపన్యాసాలు, అధ్యయన తరగతులు అసంఖ్యాకంగానే జరిగాయి. ఈ పునాది మీద, ఈ నూట యాభై ఏళ్ల సందర్భంగానైనా కాపిటల్ అధ్యయనానికి తెలుగు పాఠకులు పూనుకోవాలి.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# దళితుల జీవించే హక్కును కాలరాస్తున్న ప్రభుత్వం

*దళిత, ముస్లిం, మైనారిటీ ప్రజలను ఆర్థికంగా, సామాజికంగా దెబ్బతీయడంలో భాగంగానే హిందూ మతోన్మాద శక్తులు గోమాంస విక్రయాలను నిషేధించారనీ, ఇది వారి జీవించే హక్కును కాలరాయడమే అవుతుందనీ అంటున్నారు* **డా. కత్తి పద్మారావు**

**భా**రతదేశ వ్యాప్తంగా ఈనాడు హిందూ మతోన్మాదం పెరగడమే కాక విశ్వవిద్యాలయాల్లో హిందూ మతతత్వ భావజాలాన్ని విస్తృతంగా ప్రచారం చేస్తోంది. ఆర్‌ఎస్‌ఎస్, విశ్వహిందూ పరిషత్‌కు సంబంధించిన ఉపాధ్యాయులు, ఆచార్యులు ఆ ప్రచారాన్ని పాఠ్య గ్రంథాల్లో చొప్పించి భారతదేశ సంస్కృతి అంటే రాముడు, కృష్ణుడు, పరశురాముని వంటివారి భావజాల సంస్కృతే అని ప్రచారం చేస్తున్నారు. ముఖ్యంగా ఒక్క ఉత్తరప్రదేశ్‌లోనే 15 వేల కోట్ల రూపాయల గోమాంస విక్రయాలకు సంబంధించి 25 లక్షల మంది జీవనోపాధిని దెబ్బతీయాలని హిందూ మత ఆచారాలను అడ్డుపెట్టి ప్రయత్నం చేస్తున్నారు. దేశవ్యాప్తంగా ప్రభుత్వం అనుమతించిన 72 కబేళాలు ఉన్నాయి. ఉత్తరప్రదేశ్‌లో ప్రభుత్వం అనుమతించినవి 38 ఉన్నాయి. 140 వధ్యశాలలు, 50 వేల మాంసపు దుకాణాలు ఉన్నాయి. ఈ మాంసాన్ని అమ్మి, తిని, ఇతర దేశాలకు పంపి ఎంతోమంది జీవిస్తున్నారు. ఈ మాంసానికి గల్ఫ్ దేశాల నుంచి మంచి డిమాండ్ ఉంది.

భారతదేశం నాగరికతలో మాంసం కొయ్యడం, తినడం అనేది అంతర్భాగం. ఇది కేవలం ముస్లింలు వచ్చిన తర్వాత వచ్చింది కాదు. ఆర్యులే మొదట గోమాంస భక్షణను విరివిగా చేశారు. ఆర్యులు క్రీ.పూ. 2000 సంవత్సరాలు 1500 సంవత్సరాల మధ్యలో అనగా 1750 ప్రాంతంలో భారతదేశానికి వచ్చారు. వారు సింధూ నాగరికతను నాశనం చేశారు. సింధూ నాగరికతకు ప్రతినిధులైన ద్రావిడులు వారిలో అంతర్భాగంగా ఉన్న దళితులు ఆర్యులను ఎదిరించి నిలిచారు. ఇదే దళితుల ఆవిర్భావానికి కీలకమైన అంశం. దీనికి కావలసినవన్ని ఉపపత్తులు ఆర్యుల వాఙ్మయమైన రుగ్వేదంలో మనకు లభిస్తున్నాయి. భారతదేశంలోని ప్రజలు వ్యవసాయ సంస్కృతిలోకి ప్రవహించిన తరువాత ఆర్యులు భారతదేశానికి వచ్చారు.

ఆర్యులు ప్రధానంగా గోపాలకులు అనేది వారికి వాడిన విశేషణాలను బట్టి మనకు గోచరమవుతుంది. "గోపాలకులు (గోవులను పరిపాలించే వారు), గవేషణ (గోవులను వెతకడం), గోపతి (గోవుల కధిపతి), గోమేధం (గోవులతో చేయు యజ్ఞం), గోఘ్నుడు (అతిథిగా వచ్చి గోవులను చంపించువాడు), గోత్రం (గోశాల) అని వారిని వెన్నాడుతూ వచ్చిన ఈ విశేషణాలే తమ శత్రువర్గాలను జయించే శక్తిని ఇమ్మని వారు ఇంద్రుని కొనియాడారు. వీరు ఇంద్రుని కొనియాడిన విధమును రుగ్వేదంలో పరిశీలిస్తే వీరి శత్రువర్గం ఎవరనేది మనకు అవగతమవు తుంది. సురూపకృత్ను మూతయే సుదుఘామివ గోదుహే జుహూమ సిద్యవిద్యవి॥ మంచి పాలిచ్చు గోవును పాలుపిదుకుటకు (పాలు దీయువాడు) పిలచున్నట్లు మంచి రూపము గల కర్మలను జేయునట్టి ఇంద్రునిమా రక్షకొరకు మేము ప్రతిరోజు పిలుస్తున్నాం. ఉపవస్సవనాగహి సోమస్య సోమపాఃపిబ। గోదా ఇద్రేవతోమదః॥ సోమపానం చేయు ఓ ఇంద్రా! మాయజ్ఞముల వద్దకు రమ్ము, సోమమును ద్రావుము, నీ సంతోషం (మాకు) తప్పక గోవుల నిచ్చును అంటున్నారు.

రుగ్వేదంలో ఎక్కడ చూసినా గోవధే కనిపిస్తుంది. చుట్టం వస్తే గోవులను కోసేవాళ్లు. యజ్ఞం చేస్తే గోవులను కోసేవాళ్లు. వాళ్లు గోపాలకులుగా ఉండే గోవులను కోసుకుని తినడానికి. నిజానికి ముస్లింలు ఆర్యుల తర్వాత భారతదేశానికి వచ్చారు. అంతకుముందు జరిగిన యుద్ధం అంతా ఆది భారతీయులకు, ఆర్యులకే. ఆది భారతీయులు అంటే దేశీయులు. దేశీయులు అంటే ఈనాడు శూద్ర, అతిశూద్ర కులాలుగా చెప్పబడుతున్నవారు. రుగ్వేదం నిండా వీరిని వధించాలనే అభ్యర్థనలే ఇలా ఉన్నాయి.

ఇంద్రా! ఈ సోమములోని భాగం తాగి వృత్రులను (అసురులను) చంపు వాండవుకమ్ము, యుద్ధం చేయుచున్న నీ భక్తుని రణరంగమున రక్షింపుము. రుగ్వేదం 31వ రుక్కును బట్టి ఆర్యులు గోపాలకులని, ఆలమందలను రక్షించు నిమిత్తం ఇంద్రుని వారు కొనియాడుతున్నట్లు అర్థమవుతుంది. 32వ రుక్కును బట్టి ఆర్యులు సోమపానము చేస్తారని, యజ్ఞము చేస్తారని, గోసంపద పెరిగే నిమిత్తం ఈ సోమపానంనకు ఇంద్రుని ఆహ్వానిస్తున్నారని తెలుస్తుంది. రుగ్వేదం 36వ రుక్కును బట్టి శత్రువులనణచు నట్టి ఓ ఇంద్రా అని సంబోధిస్తున్న ఆర్యుల వేదాలు ప్రధానంగా తమ శత్రు వర్గమైన ఆది భారతీయులను జయించే శక్తినిమ్మని తమ దేవతల్ని కొనియాడిన కీర్తనలే అనేది అర్థమవుతూ ఉంది.

రుగ్వేదం 39వ రుక్కును బట్టి ఇంద్రుడిని సోమమును తాగి వృత్రులను చంపుమనుచున్నారు. వృత్రులంటే వ్యవసాయ భూములకు నీరు పారించువారు. వారిని జయించడమే ఆర్యుల ధ్యేయం. ఆనాటికి, ఈనాటి వ్యవసాయ భూములకు నీరు పారించువారు దళితులే. ఇంద్రునికి 'అప్సు-జిత్' అనే బిరుదు ఉండేది. అంటే నీటి వనరులను ఆక్రమించే వాడని అర్థం. రుక్కులను బట్టి ఆర్యులు తాము భారతదేశానికి వచ్చేనాటికి వ్యవసాయ నాగరికతకు వారసులుగా ఉన్న ఆది భారతీయ తెగలను శత్రువులుగా ప్రకటించి, వారిని జయించడానికి, తమ దేవతలైన అగ్ని, వాయు, ఇంద్రాదులను తమకు శక్తిని ఇమ్మని స్తుతించారు. ఆ కీర్తనలే రుగ్వేదంలో ప్రధాన పాత్రను వహిస్తున్నాయి.

ఆర్యుల శక్తివంతమైన శత్రువులు దస్యులుగా చెప్పబడుతున్న ఈనాటి అస్పృశ్య జాతులేనని జాన్ మార్షల్ అభిప్రాయపడ్డారు. ఆర్యులు మాంస ప్రియులే కాకుండా మద్యపాన ప్రియులని కూడా అంబేద్కర్ రుగ్వేదాన్ని ఉటంకిస్తూ ఇలా చెప్పారు.

"వైదిక దేవుళ్లు మద్యాన్ని సేవించేవారు. దేవుళ్లు తాగే మద్యాన్ని సోమ (సోమరసం) అని పిలిచేవారు. ఆర్యుల దేవుళ్లు మద్యాన్ని సేవించేవారు కాబట్టి మద్యపానం విషయంలో ఆర్యులకు ఎలాంటి శంకలూ ఉండేవి కావు. నిజానికి మద్యం ఆర్యుల మత సంబంధమైన విధులలో ఒక భాగమైంది. ప్రాచీన ఆర్యులు ఎప్పుడూ సోమయజ్ఞాలు చేస్తూనే ఉండేవారు. వారు సోమపానం చేయని రోజులు చాలా తక్కువ. పై వర్గాలైన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు మాత్రమే సోమం పరిమితం అయింది. అంటే శూద్రులు మద్యం తాగేవారు కాదు అని భావించ కూడదు, సోమపానం వీరికి నిషిద్ధం కాబట్టి వీరు మామూలుగా బజారులో దొరికే సురను తాగేవారు".

ఈనాడు భారతదేశంలో ఉన్న యోగులు, స్వాములు ఎక్కువ మంది మద్యాన్ని సేవించేవాళ్లే. అనేక మంది స్వాములు మాంసం కూడా తింటారు. ఆశ్రమాలు అంతా మద్యపాన మత్తులతో నిండిపోయి ఉంటాయి. పుణ్యక్షేత్రాలు అన్నింటిలోను మద్యం, మాంసం ఎక్కువ అమ్ముతుంది. స్త్రీలను అపహాస్యం చేసే అనేక కార్యక్రమాలు ఈ ఆశ్రమాలలో జరుగుతున్నాయి.

అంబేద్కర్ ఇంకా ముందుకు వెళ్లి ఆర్య రుషుల మధ్య మాంస సాంప్రదాయాన్ని ఇలా వివరిస్తున్నారు. "నేటి హిందువుల పూర్వీకులైన ప్రాచీన ఆర్యులు మాంసాహారులేకాక, గోమాంసాన్ని కూడా భుజించే వారని చెప్పడానికి బలమైన నిదర్శనాలు అపారంగా ఉన్నాయి. ఇందుకు నిదర్శనంగా కింది వాస్తవాలను దృష్టిలో ఉంచుకుంటే సరిపోతుంది. అవి నిర్వివాదమైనవి. మధుపర్కం విషయాన్ని తీసుకుందాం. ప్రాచీన ఆర్యులలో అతిథిని ఆహ్వానించే విషయంలో నెలకొని ఉన్న సంప్రదాయ పద్ధతిని మధుపర్కం అంటారు. దాని గురించిన విపులమైన వర్ణన వివిధ గృహ్యా సూత్రాలలో ఉంది.

గృహ్యా సూత్రాల ప్రకారం మధుపర్కానికి అర్హులైన వారు ఆరుగురున్నారు. వారు 1) యజ్ఞాన్ని నిర్వహించే బ్రాహ్మణుడు లేదా రుత్విజుడు, 2) ఆచార్యుడు (ఉపాధ్యాయుడు), 3) పెండ్లి కుమారుడు, 4) రాజు, 5) గురుకులంలో అప్పుడే విద్యను పూర్తిచేసిన విద్యార్థి (స్నాతకుడు), 6) ఆతిథ్యమిచ్చేవారికి ప్రియమైన వారెవరైనా (కొందరు ఈ జాబితాలో అతిథిని చేరుస్తారు). రుత్విజుడు, రాజు, ఆచార్యుడు అనే ముగ్గురినీ తప్పించి మిగతా వారందరికీ మధుపర్కాన్ని సంవత్సరానికి ఒకసారి సమర్పిస్తారు. రుత్విజునికి, రాజుకు, ఆచార్యునికి మాత్రం వారు వచ్చిన ప్రతిసారీ మధుపర్కం సమర్పించవలసి ఉంటుంది. మధుపర్కం మాంసం లేకుండా ఉండకూడదు. దాన్ని తర్వాత మార్చారు. ఆ పద్ధతి ఎలా అంటే మొదట అతిథి పాదాలను గృహస్థు కడగాలి. అనంతరం మధుపర్కాన్ని సమర్పించాలి. దానిని ఆయన కొన్ని నిర్దిష్ట మంత్రాలతో పాటుగా స్వీకరిస్తాడు (తాగుతాడు)".

హిందూ మతం వ్యాప్తిలో తాగుడు, ఇతర దుర్వ్యసనాలు ఎక్కువగా ఉన్నాయి. ఇతర మతాల్లోకి కూడా ఈ దుర్వ్యసనాలు బలంగానే ప్రవహించాయి. మొదట ఆర్యులను ఎదిరించారనే కక్షతోనే ఆది భారతీయులకు చండాలురు అనే నామకరణం చేశారు.

ఆర్యులు చండాలురపై ద్వేషం పూనారు. తైత్తరీయ ఆరణ్యాకాన్ని బట్టి ఒక్క యజ్ఞాలు నిర్వహించేటపుడే కాదు జీవన క్రమం అంతటిలోను దూరంగా వారిని ఉంచడం జరిగిందని తెలుస్తుంది. ఆర్యులు వారి దేవుళ్లకు పెట్టగా మిగిలిన ఆహారాన్ని చండాలురకిచ్చే పద్ధతిని సామాజిక శాస్త్రవేత్త జి.ఎస్. ఘుర్యే ఇలా వివరించారు.

"చండాలుడు లేకుండా జీవనం లేదు. చండాలుడికి ఇచ్చేది మాత్రం అసహ్యమైంది. ఛాందోగ్యోపనిషత్తులోనే అనేక సందర్భాల్లో చండాలుని సంతానం నీచమైనదని వర్ణించబడింది. వీరిని కుక్కలుగా, పందులుగా, అంతకంటే హీనంగా పరిగణించడం జరిగింది. చాతుర్వర్ణాల, ప్రతిలోమ, విలోమాలకు సంబంధించిన ఏ వర్ణంతో కలిసినా, చండాలునితో మాత్రం కలువరాదని కౌటిల్యుడు కూడా చెప్పడం జరిగింది. సంకర వర్ణాలన్నింటినీ చట్టబద్ధం చేసిన కౌటిల్యుడు చండాలునితో కలవడాన్ని మాత్రం నిషేధించాడు. కారణం చండాలురు బలంగా ఆర్య సామాజిక వ్యవస్థను వ్యతిరేకించడమే".

పతంజలి తన భాష్యంలో శ్వపచులను పేర్కొన్నాడు. స్త్రీవాచకానికి ఇకారాంతంగా 'శ్వపచి' అనే పదాన్ని ఉపయోగించకుండా 'శ్వపచ' శబ్దాన్నే ఉపయోగించాడు. పైగా 'శ్వపచులకు' సంబంధించిన ప్రయోగాన్ని ఏదీ ఇవ్వకుండానే దాటవేసి ముందుకు వెళ్లాడు.

ఈ బ్రాహ్మణాల కాలంలోనే వర్ణవ్యవస్థ ఒక సామాజిక రూపాన్ని మలచుకొంది. ఆది భారతీయులకు అవర్ణుల ముద్ర ఈ కాలంలోనే పడింది. ఛాందోగ్యోపనిషత్తులో కొన్ని ఆత్మలు చందమామ ప్రపంచంలోకి వెళితే మంచి పనులు చేసినవాళ్లు బ్రాహ్మణులుగా జన్మించారని, నీచకార్యాలు చేసినవారు చండాలురుగా, కుక్కలుగా, పందులుగా జన్మించారని చెప్పబడింది.

ఈ విధంగా చండాలుర జన్మానికి ఒక కథ చెప్పారు. వీరిని నీచవర్ణంగా పరిగణించాడు. దీనిలో శూద్రవర్ణ ప్రస్తావన లేదు. ఈ విధంగా సృష్టించిన 'చండాల' కథనాన్ని చరిత్రకారులు నిజం చేశారు. 'చండాలురు' అస్పృశ్యులని, వీరు ఎప్పటి నుండి అస్పృశ్యులో తెలియదని, ఊరికి దూరంగా నెట్టివేయబడడం దైవ కార్యమని వాళ్లు వ్యాఖ్యానిస్తూ వెళ్లారు. చండాలుర మీద అకారణ ద్వేషం పూనారు.

నిజానికి శూద్రులను కూడా బానిసలుగా చేసి తమ సొంత కార్యాలకు వాడుకున్నారు ఆర్యులు. అయితే కాలం మారింది. బ్రాహ్మణుల్లో నుంచి అనేక మంది సంస్కర్తలు వచ్చారు. మతాన్ని సంస్కరించారు. ఎంతోమంది సోషలిస్టులుగా, కమ్యూనిస్టులుగా ఆవిర్భవించారు. అయితే హిందూ మతంలో ఉన్న హింస, హిందూ మతంలో ఉన్న మాంసాహార స్వీకరణ బౌద్ధం తర్వాతే కొత్తరూపం తీసుకుంది. బౌద్ధం ప్రభావంతో అహింస సిద్ధాంతాన్ని బోధించడం ప్రారంభించారు. కానీ కులతత్వాన్ని, అస్పృశ్యతను అలాగే కొనసాగించారు.

ఈనాడు మోడీ, యోగి మరో ఇంద్రుడిలా, వరుణుడిలా అవతరించి వైదిక ఆర్యులు తీసుకువచ్చిన గోమాంస స్వీకారాన్ని ముస్లింల మీద, దళితుల మీద ద్వేషంతో నిరాకరిస్తున్నారు. మరి గోమాంసం వల్ల వచ్చే శక్తి పాలు, పండ్లు, కూరగాయలు, ఆకుకూరలు, పప్పుదినుసులు అన్నీ తింటేకాని రావు. అన్నీ తినాలంటే రోజుకు 500 రూపాయలు కనీసం ఆహారానికి ఖర్చవుతుంది.

భారతదేశంలో ఉన్న శ్రామిక జనం కేవలం శాఖాహారాన్ని భుజించి శారీరక శ్రమ చేయగలుగుతారా! బొగ్గు గనుల్లో, యంత్ర పరికరాలతో, పరిశ్రమల్లో రాళ్లు మోస్తూ ఇళ్లు నిర్మించడంలో, మోటారు వాహనాలు నడపడంలో ఇవన్నీ దళితులు, ముస్లింలు ఎక్కువ చేస్తున్నారు. విగ్రహాల ముందు పూజా, పునస్కారాలు చేయడానికి దద్దోజనాలు, చక్కెర పొంగళ్లు,

# సంస్కృతి-వర్గ-కుల సమాజ ప్రతిఫలనాలు

***సంస్కృతికీ సమాజానికీ మధ్య ఉండే సంబంధాన్ని చర్చిస్తూ సంస్కృతిలో వర్గ, కుల సమాజం ఎలా ప్రతిఫలిస్తుందో వివరిస్తున్నారు* అనిత కుమారి**

ప్రకృతికి – మానవ సమాజానికి మధ్య ఉన్న సంబంధాన్ని అన్వేషిస్తూ, వైరుధ్యాల్ని పరిష్కరిస్తూ నాగరికత ఆవిర్భవించింది. నాగరికతలో సంస్కృతి అనేది ముఖ్యమైనది. కాలానుగుణంగా మారుతూ ఆయా సమాజాల్ని, నాగరికతల్ని అంతర్లీనంగా ప్రభావితం చేస్తున్న సంస్కృతి అంటే ఏమిటో తెలిపే నిర్వచనాలు అనేకం ఉన్నాయి. వందల నిర్వచనాలున్నా సంస్కృతికి పునాది మానవ శ్రమ – శ్రమ ద్వారా జరిగే ఉత్పత్తి, దాని పంపిణీ ద్వారా ఏర్పడే సంబంధాలు, ఆయా మానవుల మధ్య ఎలాంటి పద్ధతులు, సాంప్రదాయాల్ని నెలకొల్పుతాయో అవే ఆయా సమాజాల్లో నీతిగా ప్రచారం అవుతాయి. ఆ సంబంధాలు మనుగడ సాగించిన కాలమంతా, వాటిపై ఆధారపడ్డ ఆచార వ్యవహారాలు (ట్రెడిషన్స్ అండ్ కస్టమ్స్) ఒక సంస్కృతిగా ముద్ర పడతాయి. అందుకే 'మనిషికి మనిషికి ఉండే వైరుధ్యాన్ని ఐక్యత ప్రధానంగా ఒక సమాధానాన్ని చారిత్రకంగా గ్రహించి పొందుపరిచే సాధనమే సంస్కృతి' అని ప్రొఫెసర్ ఆర్.ఎస్. రావు 'భూమి – సంస్కృతి – నాగరికత' అనే పుస్తకానికి ముందుమాట రాస్తూ పేర్కొంటాడు.

స్వయం పోషక గ్రామీణ వ్యవస్థ చాలాకాలం మనుగడ సాగించిన భారత్‌లో మానవ సమాజ అవసరాలన్నీ ఆయా గ్రామాల్లోనే తీరిపోయేవి. అందుకే సముద్రయానం అపరాదంగా బావించబడేది. దక్షిణాఫ్రికా నుండి భారత్‌కు గాంధీజీని గంగా జలంతో శుద్ధి చేసి మరీ పవిత్రం చేశారు. వర్ణ వ్యవస్థకు సాధికారత కల్పించడానికి 'చాతుర్వర్ణం మయాసృష్టి' అంటూ సూత్రీకరించారు. దీనికి మరొక తోక తగిలించి 'గుణకర్మ విభాగం' అని విశదీకరించారు. 'ఆర్యానాం త్రైవర్ణికం' అనేది గమనించినప్పుడు మూడు వర్ణాలుగా వచ్చిన ఆర్యులు తమ దండయాత్రల్లో లొంగదీసుకున్న వారిని నాలుగో శూద్రవర్ణంగా మార్చి వారికి ఎలాంటి హక్కులు లేకుండా కేవలం ప్రతిఫలం ఆశించకుండా పై మూడు వర్ణాలకు సేవచేసే శూద్రులుగా దిగజార్చారు. వారికి కత్తి – కలం బట్టే అధికారం లేకుండా చేశారు. స్వంత ఆస్తికి దూరం చేశారు. వేదాల సారం అర్థం కాకుండా వాటిని వినడం, కనడం, చూడడమే నేరంగా ప్రకటించి ఆంక్షలతో పాటు కఠిన శిక్షలు విదించారు. అయితే ఒక విశాల సమాజాన్ని ఆంక్షలతో కట్టివేయడం సాధ్యం కాదు కాబట్టి, శూద్రుల్లో ఉన్న సమర్థకులను వారి ప్రతిభ ఆధారంగా ఆయా వర్ణాల్లో ఇముడ్చుకోవడానికి 'గుణకర్మ విభాగం' అనే అంశాన్ని జొప్పించారు. ఆ మేరకు పాక్షికంగా మార్పుకు అనుగుణంగా కొద్దిగా చలనశీలంగా ఉన్న వర్ణ వ్యవస్థను నిశ్చల వ్యవస్థగా మార్చడంతో కుల వ్యవస్థ రూపుదిద్దుకున్నది. శూద్రులను వందల – వేల కులాలుగా, ఉప కులాలుగా విభజించి గుణాలను బట్టి కాకుండా కులాన్ని బట్టి వృత్తిని గ్యారంటీ చేశారు. మాతృ గర్భమే కులానికి జన్మ స్థలంగా మారడంతో పుట్టుక, నివాసం, వృత్తి, వివాహం, మరణం అన్నీ కలిసి ఘనీబవించుకున్న కుల సమూహాలుగా కుల వ్యవస్థ ఏర్పడ్డది.

పుట్టుక పవిత్రత కోసం స్త్రీలను కట్టడి చేసే బాల్య వివాహాలు, సంకరం జరగకుండా జరిపిన సతీసహగమనాలు సంస్కృతి కాలానుగుణంగా నేరంగా భావించబడ్డ సంఘ సంస్కరణ ఉద్యమాలకు ఇవే మూలం ఆధునిక వృత్తులలోకి (ఉదా: వడ్రంగం, చేనేత, దర్జీ) అన్య కులాల ప్రవేశం జరిగినా అంతర్వివాహం (ఎండొగామి) కుల పరిధులు దాటకుండా చేసేది. సంచార జాతులుగా ముద్రపడ్డ వారికి కొద్దో గొప్పో భూమి లభించినా వ్యవసాయానికి బదులు, ఏదో ఒక వేటలో దినమంతా గడపడం సంచార తెగల సంస్కృతిగా మారింది. ఆదిమ సమాజ అవశేషాలు ఇంకా కొనసాగడానికిది తార్కాణం. ఇక తరతరాలుగా అణచబడుతున్న దళితులే ప్రధానంగా భూమి లేని కూలీలు. భూమిపై గుత్తాధిపత్యం కలిగిన అగ్రకుల భూస్వాముల సంపద సృష్టిలో వీళ్లే ప్రధాన బాగస్వాములు. శ్రమశక్తిని కొల్లగొట్టడంలో భూమిపై ఆధిపత్యం ఒక అంశం కాగా కులాధిపత్యం మరొక అంశంగా మారి,

---

చిట్టిగారెలు, వడియాలు తింటే సరిపోతుందా! శ్రామికులకు ఇవి ఎలా సరిపోతాయి? ఏదైనా ఒక నిషేధం చేసేటప్పుడు ఆ దేశ సంస్కృతిని, ఆ దేశ ప్రజల జీవన విధానాన్ని అర్థం చేసుకుని చేయాలి.

కొన్ని కబేళాలకు ఎందుకు పర్మిషన్ ఇచ్చారు? అంటే గోమాంసం తినవచ్చు అనే కదా! ఇతర దేశాలకు ఎగుమతులు ఎందుకు చేస్తున్నారు. ఇతర దేశాలు వెళ్లినప్పుడు మీరెందుకు గోవుతో పాటు బీఫ్‌ను తింటున్నారు. కాబట్టి ద్వేషంతో, మాత్సర్యంతో, క్రోధంతో, అణచివేత ధోరణితో దళితులను, ముస్లింలను చూడడం రాజ్యాంగబద్ధం కాదు.

డా. బి.ఆర్.అంబేడ్కర్ ఆలోచనలతో మార్క్స్, ఏంగెల్స్ రాసిన కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగాల 'పుట్టుక' వంటి గ్రంథాల అధ్యయనంతో హిందూ మతోన్మాద శక్తులను ఎదుర్కోవాల్సిన తరుణమిది. లౌకిక రాజ్యాన్ని నిర్మించాల్సిన సమయమిది. భారత రాజ్యాంగ స్ఫూర్తే దేశ పునర్నిర్మాణానికి ఆయువు.

హిందూ మతోన్మాద భావజాలానికి ప్రత్యామ్నాయం నిర్మించాలంటే చారిత్రక అవగాహన, అధ్యయనం ప్రతి ఒక్కరి కర్తవ్యం. లౌకికవాద శక్తుల పునరేకీకరణకు ఈ అధ్యయనమే చైతన్యాన్ని కలిగిస్తుంది. ఏదైనా నిర్మించడమే కష్టం. ఐక్యతను నిర్మించడంలో విజయం దాగుంది.

*(రచయిత సామాజిక తత్వవేత్త, వ్యవస్థాపక అధ్యక్షులు, నవ్యాంధ్రపార్టీ)* వీ

వర్గ – కుల ఆధిపత్య సంస్కృతి రాజ్యమేలుతుంది. ఉత్పత్తి సాధనాలపై ఆధిపత్యం గల వర్గాలు, శ్రమజీవుల ఉత్పత్తిని, శ్రామిక సంస్కృతిని కబళించడమనేది మార్చాలంటే ఉత్పత్తి సంబంధాల మార్పుతో, సాంస్కృతిక పరివర్తనను జతచేసి పోరాడాల్సిన ఆవశ్యకత ఉంటుంది. కారల్ మార్క్స్ సంస్కృతి ఉపరితల రంగంలోని విషయమంటే, ఉపరితలాంశం ఒక్కోసారి పునాదిని కూడా మార్చేస్తుందని చైనాలో మావో–సేటుంగ్ తేల్చి చెప్పి సాంస్కృతిక విప్లవాన్ని కూడా కొనసాగించాడు. చరిత్ర పొడవునా భారత్‌లో అనేక సాంస్కృతిక ఉద్యమాలు కొనసాగుతున్నా సంపూర్ణ మార్పు సాధించలేకపోయాయి.

అందుకే ఆధిపత్య వాదులు విశ్వవ్యాపితంగా ఒక జాతినో, ఒక దేశాన్నో, ఒక తెగనో లొంగదీసుకోవాలంటే ముందు దాని సంస్కృతిని విధ్వంసం చేస్తారు. ఆ జాతి జీవన విధానాన్ని పరాయికరిస్తారు. బ్రిటిష్ వలస వాదులు మర్చంటయిల్ క్యాపిటలిస్టులుగా మన దేశంలోని పలు రాజ్యాలను కబలించి మన సాంప్రదాయిక ఆహార పంటలను దెబ్బతీసి వ్యాపార పంటలను ప్రోత్సహించారు. వాటినే తమ పెట్టుబడి నగరాలైన మాంచెస్టర్‌కు ముడిసరుకుగా తరలించారు. బ్రిటిష్ ప్రత్యక్ష వలస పాలనలో మగ్గిన కోస్తాంధ్రలోని కొన్ని ఆధిపత్య వర్గ అగ్రకులాలు పుణికి పుచ్చుకుని తెలంగాణను అంతర్గత వలసగా మార్చడం మన కాలపు అనుబవంగా చూశాం. అందుకే తెలంగాణ రాష్ట్ర సాధనోద్యమం ఎంత మిలిటెంటుగా ఎన్నో తడవలుగా సాగినప్పటికి సాంస్కృతిక పునరుద్ధరణోద్యమంగా సాగడంతోనే అది విజయం సాదించింది. పొలిటికల్ కంపల్షన్‌ను సృష్టించడం అందుకు దోహదపడ్డది. అందుకే సంస్కృతి అంటే ఏమిటనే నిర్వచనం కంటే, ఉద్యమ చరిత్ర – పరివర్తనతో మేళవించి దాన్ని అర్థం చేసుకోవడమే సులభంగా ఉంటుంది.

నూటికి తొంభై మూడు శాతం బహుజన సముదాయంతో నిండిన తెలంగాణ సమాజం అధికారం – సంపదలకు దూరమై వందల ఏండ్లుగా సంఘర్షిస్తూనే ఉంది. ఈ సంఘర్షణకు సంబంధించిన చారిత్రక ఆనవాల్లు లిఖిత పూర్వకంగా మనకు ఎక్కడా అందుబాటులో లేవు. సర్వాయి పాపన్న బహుజన రాజ్యాధికార పోరాటాన్ని శారదగాండ్లు మౌఖిక సాంప్రదాయం ద్వారా మనకందించారు. ఆ తర్వాత తెలంగాణ సాయుధ పోరాట కాంక్ష సూటిగా పీడితులకు రాజ్యాధికారమే. దాని తర్వాత నక్సల్బరీ పోరాటం వెలుగులో ముందుకు వచ్చిన తెలంగాణ యువతీ – యువకులు వేలాదిగా ప్రాణ త్యాగాలు చేశారు. 1969 ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధనోద్యమ అణిచివేత తర్వాత సాగిన విప్లవోద్యమం ఇలా నెత్తుటేరుల్లో మునిగి వెనుకంజ వేసిన తర్వాత, తిరిగి అదే తెలంగాణోద్యమం 1995 నుండి సిద్ధాంత – రాజకీయ – సాంస్కృతిక బలంతో ముందుకు వచ్చి దాదాపు రెండు దశాబ్దాలు సంఘర్షించి విజయం సాధించింది. వలస విముక్తి లక్ష్యంతో సాగిన తెలంగాణోద్యమం రాజకీయంగా స్వపరిపాలనను సాధించుకున్నది. కాని వలస విముక్తి లక్ష్యాన్ని పూర్తి చేసుకోలేదు.

ప్రధానంగా తెలంగాణది నవదాన్యాల సంస్కృతి. ఇక్కడ విప్లవాత్మక భూ సంస్కరణలు జరుగకుండానే ఆర్గానిక్ వ్యవసాయంపై పెట్టుబడుల భారం రుద్దబడింది. జలవనరుల దోపిడీ, రసాయన ఎరువుల – పురుగుమందుల భారం, సాంప్రదాయక విత్తన విలువల విధ్వంసం, చెరువులు – కుంటల విధ్వంసం కుల వృత్తుల్ని దెబ్బతీయడంలో విపరీతమైన వలసలు, ఆత్మహత్యలు అనే రెండు దుష్పరిణామాలు ముందుకు వచ్చాయి. అందువల్ల నవదాన్యాల సంస్కృతిని, చిన్న నీటిపారుదల వ్యవస్థను పునరుద్ధరించి, వీటి ఆధారంగా భూమి పంపిణి జరగాల్సిన అవసరం ఉండెను. దీనికి భిన్నంగా వ్యవసాయిక భూములను రియల్ ఎస్టేట్ వ్యాపారాల భూమిగా దిగజార్చి, దేశ – విదేశీ బహుళజాతి కంపెనీలకు ధారదత్తం చేయడం దిశగా ప్రయాణం సాగడంతో పెనం నుండి పొయ్యిలోనికే అన్నట్లు పరిస్థితి దిగజారుతున్న ప్రమాదం ఉంది. ఆలస్యంగా మేల్కొని ప్రభుత్వం వాణిజ్య పంటలు వేయొద్దని చెబుతున్నా, నవధాన్యాల సంస్కృతిని ఒక ఉద్యమంగా చేపట్టకపోవడం వల్ల సంక్షోభం నుండి సంక్షోభానికే మన ప్రయాణం సాగాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. చెరువుల మరమ్మత్తుకుద్దేశించిన మిషన్ కాకతీయ ఒక ప్రజా ఉద్యమంగా మారవకపోవడం వల్ల దాని ఫలితాలను వేచి చూడాల్సి ఉంటుంది. చెరువుల్లో మత్స్యకారులకు ఉపాధి, బంజర్లలో గొర్రెల – మేకల పెంపుడల, తాటి – ఈతవనం అభివృద్ధి మొదలగు అనేక అంశాల్లో తెలంగాణ సమాజం తన కాల్లపై తాను నిలబడాలి. అది అంతర్గత వలసవాదులతో, వారి విధానాలతో దానికున్న వైరుద్యాలను పరిష్కరించుకున్నప్పుడే ఒక గెంతు వేయగలుగుతుంది.

దీంతో పాటు తెలంగాణ సాంస్కృతిక పతాకగా చెప్పుకుంటున్న బతుకమ్మ, బోనాల పండుగల్లో అంటరానితనం జాడలు సైతం కనపడుతున్నాయి. తెలంగాణ సాధనకు ముందు ప్రాంతీయ వైరుద్యాలను పరిష్కారం చేసుకోవడంలో మనం ఈ విషయాలకు ప్రాధాన్యతను ఇవ్వకున్నా అంటరాని బతుకమ్మలు, మూడు బోనాల పద్ధతులు నేటికి కొనసాగుతున్నాయి. ఈ సామాజిక అసమానతలు అంతర్గతంగా తెలంగాణ సమాజం పరిష్కరించుకోవాలి. వందల ఏండ్లుగా సామాజిక న్యాయం దక్కకుండా తెలంగాణ సమాజం తిరుగుబాటునే తన సాంస్కృతి అస్థిత్వంగా మలుచుకుని సంఘర్షిస్తూ వస్తున్నది. ఈ సంఘర్షణకు తెరదించడానికి మరొక సాంస్కృతిక అస్థిత్వ పోరాటం సాగవల్సి ఉన్నది.

సంస్కృతి అంటే మతమేనని టి.ఎస్. ఇలియట్ వెలువరించిన భావనను అందుకొన్నట్లు సాంస్కృతిక జాతీయవాదం అంటూ మరో కోణంలో మత మెజారిటీ వాదం మన ముందుకు వస్తుంది. ఇది హిందూ మతమే జాతీయవాదమని బలంగా చాటుకుంటూ వస్తున్న సమయంలో కులం లేకుండా హిందూ మతం లేదన్న బాబాసాహెబ్ మాటల్ని ఇక్కడ మనం పునశ్చరణ చేసుకోవాలి. అందుకే కుల వ్యవస్థకు దన్నుగా నిలుస్తున్న కాల్పనిక పురాణాలు, ఇతిహాసాల సాధికారతను ఓడించకుండా కుల నిర్మూలన జరగదు. ఎందుకంటే మనదేశంలో సంస్కృతి అంటే కులమే, చాతుర్వర్ణ ధర్మమే అనే ప్రచారం జరుగుతుంది.

ప్రపంచంలోని అనేక దేశాల కంటే వైవిద్యం పాల్లు ఎక్కువున్న మనదేశంలో మనుషుల మధ్య వైరుద్యాల్ని తగ్గించడానికి అంతే వైవిద్యమైన సంఘర్షణ జరగాల్సి ఉన్నది. నిజమైన సాంస్కృతిక వికాసం కలిగిన మానవులు మాత్రమే, మనుషుల మధ్య తేడాలు లేని సమసమాజ భావనకు పునాది అవుతారు. అలాంటి సమాజ నిర్మాణానికి దోహదపడే విధంగా సంస్కృతికి సంబంధించిన చర్చకు అర్థవంతమైన ముగింపు పలుకుదాం. మానవ సమాజం తన అంతర్గత వైరుద్యాలు పరిష్కరించుకుంటూ ప్రకృతితోనూ సంఘర్షించి లోక కళ్యాణం జరిగితే అనంతమైన సాంస్కృతిక వికాసమే ఉన్నతమైన మానవ సమాజానికి బాటలు వేస్తుంది.

*(రచయిత అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య కార్యకర్త)* వీ

### గుంటూరులో మిర్చి రైతుల ఆందోళన

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల వైఖరికి నిరసనగా గుంటూరు మిర్చియార్డు వద్ద రైతులు మే 4న ఆందోళన నిర్వహించారు. కేంద్రం మిర్చి క్వింటా ధర రు. 5,000 ప్రకటించింది. దీంతో గుంటూరు మిర్చి యార్డులో ధరలు మరింత పడిపోయాయి. మొదటి రకం ఆరు వేల నుంచి ఏడు వేలు ఉండగా మే 4న రెండున్నర వేలకు పడిపోయింది. అలాగే ఇప్పటివరకు రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన సాగు ధృవపత్రాల స్వీకరణ కూడా నిలిపివేశారు. దీంతో ఆగ్రహించిన రైతులు రోడ్డుపై రాస్తారోకో చేపట్టారు. దాదాపు మూడు గంటల పాటు రోడ్డుమీదే బైఠాయించారు. దీంతో ఎక్కడి వాహనాలు అక్కడే ఆగిపోయాయి. సాగు ధృవపత్రాలు స్వీకరిస్తామని జాయింట్ కలెక్టర్-2, మిర్చియార్డు చైర్మన్ మన్నవ సుబ్బారావు హామీ ఇవ్వడంతో ఆందోళన విరమించారు.

### నయీం కేసులో పోలీసు అధికారుల సస్పెన్షన్

నయీం కేసు విచారణలో భాగంగా నయీంతో సంబంధాలున్నట్లు ఆధారాలు లభించడంతో ఐదుగురు పోలీసు అధికారులను సస్పెండ్ చేస్తూ డి.జి.పి అనురాగ్ శర్మ మే 11న ఉత్తర్వులు జారీచేశారు. ఇందులో ఒక అదనపు ఎస్.పి, ఇద్దరు ఏఎస్‌పిలు, ఇద్దరు ఇన్‌స్పెక్టర్లు ఉన్నారు. అట్లాగే ముగ్గురు డి.ఎస్.పిలతో పాటు మరో ఇన్‌స్పెక్టర్‌పై మౌఖిక విచారణకు ఆదేశించారు. వివిధ స్థాయిల్లో విధులు నిర్వహిస్తున్న 16 మంది సిబ్బందిపై తగు చర్యలు తీసుకోవాలని ఆదేశాలిచ్చారు.

### గిట్టుబాటు ధర అడిగిన రైతులకు జైళ్లు, బేడీలు

మిర్చికి గిట్టుబాటు ధర కోసం చూస్తున్న రైతులకు క్వింటాకు ఖమ్మం మార్కెట్ యార్డులో రు. 1500-2000 వరకు ఇస్తామని చెప్పిన మార్కెట్ యార్డు వ్యాపారులపై ఏప్రిల్ 28న రైతులు ఆగ్రహం వ్యక్తంచేశారు. దీంతో కొంత మంది రైతులు కాంటాలను, ఫర్నిచర్, కంప్యూటర్‌లను ధ్వంసం చేశారు. దీనికిగాను వారిపై పోలీసులు లాఠీ చార్జీ చేసి అరెస్ట్ చేశారు. కేసు నమోదు చేసి కోర్టుకు హాజరుపరిచారు. నాయమూర్తి వారికి 14 రోజులు రిమాండ్ విధించారు. మే 11న వారిని విచారణ కోసం బేడీలు వేసి తీసుకొచ్చారు. ఇరువర్గాల వాదనలు విన్న జస్టిస్ బి. జ్ఞానేశ్వరరావు రైతులకు షరతులతో కూడిన బెయిల్ ఇచ్చారు. బెయిల్ పొందిన రైతులు 90 రోజులపాటు ప్రతీ ఆదివారం ఉదయం 9 గంటల నుంచి సాయంత్రం 5 గంటలలోపు ఖమ్మం త్రీటౌన్ పోలీస్ స్టేషన్‌కు హాజరవ్వాలని షరతు విధించారు.

### చైతన్య మహిళా సంఘం 6వ రాష్ట్ర మహా సభలు

చైతన్య మహిళా సంఘం (సిఎంఎస్) 6వ రాష్ట్ర మహాసభలు హన్మకొండలోని అంబేద్కర్ భవన్‌లో మే 13,14న జరిగాయి. రెండు రోజులు జరిగిన ఈ సభలకు తెలుగు రాష్ట్రాల్లోని మహిళా సంఘ సభ్యులు హాజరయ్యారు. సభకు ముఖ్య అతిథిగా వచ్చిన ప్రొ. పద్మజా షా మహిళలపై హింస నిత్యం పెరుగుతోందని అన్నారు. ఈ వ్యవస్థ నిర్మాణంలోనే స్త్రీని విలాస వస్తువుగా, సరుకుగా చూసే విధానం ఉందన్నారు. ఈ పరిస్థితిని భూస్వామ్య పెట్టుబడి అగ్రకుల వ్యవస్థ, దళారి నిరంకువ బూర్జువా పాలకులు తీవ్రం చేశారన్నారు. రెండు తెలుగు రాష్ట్రాల సిఎంఎస్ సభ్యులు పాల్గొన్నారు.

### విజయవంతమైన ధర్నా చౌక్ ముట్టడి

ఇందిరా పార్క్ వద్ద ఉన్న ధర్నా చౌక్‌ను హైదరాబాద్ శివారు ప్రాంతానికి తరలించాలన్న ప్రభుత్వ నిర్ణయాన్ని వెనక్కు తీసుకోవాలని ధర్నా పరిరక్షణ కమిటీ గత కొంత కాలంగా ఆందోళన చేస్తోంది. అందులో భాగంగా మే 15న ధర్నా చౌక్ ఆక్రమణకు కమిటీ పిలుపునిచ్చింది. ఇందిరా పార్క్ వద్ద ఉన్న ధర్నా చౌక్‌ని ఎత్తివేయాలని కోరుతూ స్థానికులకు కూడా పోలీసులు అదే రోజు అనుమతించారు. ధర్నా చౌక్ పరిరక్షణ కమిటీ ఆధ్వర్యంలో ధర్నా చౌక్ ముట్టడికి ప్రజా సంఘాలు, టిఆర్ఎస్ మినహా అన్నీ ప్రతిపక్ష పార్టీలు ఇందులో పాల్గొన్నాయి. ధర్నా స్థలంలో కూర్చున్న స్థానికులు ఆందోళనకారులను లోనికి రాకుండా అడ్డుకునే ప్రయత్నం చేశారు. దీంతో ఇరువురి మధ్య తోపులాట జరిగి రాళ్లు రువ్వుకున్నారు. దీన్ని గమనించిన పోలీసులు లాఠీ చార్జీ చేశారు. దీంతో ప్రజా సంఘాల కార్యకర్తలు, పోలీసులు గాయపడ్డారు. వేలాది మంది ప్రజా సంఘాల నాయకులు కార్యకర్తలు ధర్నా చౌక్‌ను ఆక్రమించి తమ నిరసనను తెలియజేశాయి.

### మళ్లీ మొదలైన ఫ్యాక్షన్ హత్యలు

కర్నూలు జిల్లా పత్తికొండ నియోజకవర్గ వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ఇన్‌చార్జీ చెరుకులపాటి నారాయణరెడ్డిని ఆయన ప్రత్యర్థులు మే 21న హత్యచేశారు. ఆయన కర్నూలు నుండి రామక్రిష్ణాపురం వెలుతున్న క్రమంలో దారికాసి నారాయణ రెడ్డి వాహనాన్ని ఢీకొట్టి బాంబులు వేసి ఆయన్ను బయటకు లాగి వేటకొడవళ్లతో నరికివేశారు. దీంతో ఆయన అక్కడికక్కడే మృతిచెందారు.

### రాయలసీమ బంద్

ఆంధ్రప్రదేశ్‌లోని వెనుకబడిన రాయలసీమకు ప్రత్యేక ప్యాకేజీ ఇవ్వాలని, కరువు సహాయక చర్యలు చేపట్టడంలో తెలుగుదేశం ప్రభుత్వం అనుసరిస్తున్న నిర్లక్ష్య వైఖరికి నిరసనగా సిపిఐ(ఎం), సిపిఐ పార్టీలు మే 25న బంద్ నిర్వహించాయి. బంద్‌ను బగ్నం చేసేందుకు మే 24 అర్ధరాత్రి నుంచే ప్రభుత్వం నాయకుల అరెస్టులు మొదలుపెట్టింది. బంద్ సందర్భంగా వాణిజ్య సంస్థలు, ప్రభుత్వ కార్యాలయాలు, సినిమాహాళ్లు మూతపడ్డాయి. బంద్‌కు సిపిఐ (ఎంఎల్), కాంగ్రెస్, ఎపి మాదిగ హక్కుల పోరాట సమితి, ఎపి బిసి సంఘర్షణ సమితి వంటి సంఘాలు సంఘీభావం తెలిపాయి. బంద్‌లో పాల్గొనడానికి వచ్చిన కార్యకర్తలను ఎక్కడికక్కడ పోలీసులు అరెస్టులు చేశారు.

### నక్సల్బరీకి యాభై ఏళ్లు

నక్సల్బరీకి యాభై ఏళ్లయిన సందర్భంగా విప్లవ రచయితల సంఘం ఆధ్వర్యంలో మే 22 నుండి 25 వరకు మార్క్సిస్టు పాఠాలు హైదరాబాద్‌లోని బాగ్‌లింగంపల్లి సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో బోధించింది. చివరి రోజు 'నక్సల్బరీకి విప్లవ జేజేలు' పేరిట బహిరంగ సభ జరిగింది. సభలో వక్తలు నేడు ఈ దేశ ప్రజల ముందు ఉన్న ఒకే ఒక ప్రత్యామ్నాయం నక్సల్బరీ మార్గమేనన్నారు. సామ్రాజ్యవాద, ఫాసిజానికి, బ్రాహ్మణీయ కాశాయీకరణకు వ్యతిరేకంగా పోరాడాలని, స్వావలంబనతో కూడిన విప్లవ రాజ్యాన్ని కాపాడుకుందామని పిలుపునిచ్చారు. ఈ సభకు తెలంగాణలోని ప్రజా సంఘాల కార్యకర్తలు, నాయకులు, అభిమానులు హాజరయ్యారు.

### విలేఖరిపై ఇసుక మాఫియా దాడి

పశ్చిమగోదావరి జిల్లా ఆచంట నియోజకవర్గంలో ఇసుక, మట్టి మాఫియా ఐ న్యూస్ ఆచంట విలేఖరి నల్లిమిల్లి వెంకట రామిరెడ్డిపై అర్ధరాత్రి దాడికి పాల్పడ్డారు. అక్రమ ఇసుక రవాణాపై ఐ న్యూస్‌లో మే 4న కథనం ప్రసారమైంది. దీంతో కొందరు గుర్తుతెలియని వ్యక్తులు పెరవలి మండలం పిట్టల వేమవరంలోని స్వగృహంలో రామిరెడ్డి ఉండగా ఇనుప రాడ్లతో దాడి చేశారు. వెంటనే రామిరెడ్డిని ఆస్పత్రికి తరలించారు.

### జిఎస్‌టికి ఎపి ఆమోదం

వస్తుసేవల పన్ను బిల్లును ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ ప్రతిపక్ష పార్టీ నిరసనలు, ఆందోళనల మధ్య మే 16న ఆమోదించింది. దీంతో పాటు పబ్లిక్ సర్వీసుల నియామకాల క్రమబద్ధీకరణ సవరణ బిల్లునూ ఏకగ్రీవంగా ఆమోదించారు. జిఎస్‌టి ఆమోదానికి అసెంబ్లీ ప్రత్యేకంగా సమావేశమైంది. వివిధ పంటలకు గిట్టుబాటు ధరలు, రైతుల ఆత్మహత్యల గురించి చర్చించాలంటూ వాయిదా తీర్మానాన్ని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ప్రవేశపెట్టింది కాని స్పీకర్ చర్చకు అవకాశం ఇవ్వలేదు. వీ

## ఢిల్లీ జంతర్ మంతర్‌లో ధర్నా

జైలు శిక్షపడిన ప్రొ. సాయిబాబా ఆయన అనుచరుల విడుదల కోరుతూ ఢిల్లీలోని జంతర్ మంతర్ వద్ద కో ఆర్డినేషన్ ఆఫ్ డెమోక్రటిక్ రైట్స్ ఆర్గనైజేషన్స్ ఆధ్వర్యంలో రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని డిమాండ్ ఏప్రిల్ 30న ధర్నా నిర్వహించారు. మావోయిస్టులతో సంబంధాలు ఉన్నాయనే కారణంతో జైలు శిక్ష విధించిన సాయిబాబాను అతని సహచరులను వెంటనే విడుదల చేయాలని వక్తలు మాట్లాడారు.

## కశ్మీర్‌లో నిత్యం కాల్పుల మోత

జమ్మూ కశ్మీర్‌లో హిజ్‌బుల్ ముజాహిదీన్ సంస్థకు చెందిన మిలిటెంట్లు జమ్మూ కశ్మీర్ బ్యాంకు వ్యాన్‌పై దాడిచేసి మే 1న ఏడుగురు సిబ్బందిని కాల్చిచంపారు. దక్షిణ కశ్మీర్‌లోని కుల్గాంలోని జమ్మూ కశ్మీర్ బ్యాంకు వ్యాన్ మే 1న నగదు జమచేసి తిరిగి కుల్గాం వస్తోన్న సమయంలో ఈ ఘటన జరిగింది. మే 9న కల్గాం జిల్లా సుర్సోనా గ్రామానికి చెందిన లెఫ్టినెంట్ ఉమర్ ఫయాజ్‌ను ఇంట్లో నుంచి తీసుకెళ్లి కాల్చిచంపారు. మే 20న కుప్వారాలో భద్రతా బలగాలకు మిలిటెంట్లకు మధ్య జరిగిన కాల్పుల్లో ఇద్దరు మిలిటెంట్లు, ఇద్దరు జవాన్లు మృతిచెందారు.

## నిర్భయ కేసులో నిందితులకు ఉరి శిక్ష

నిర్భయ కేసులో దోషులైన ముఖేశ్, పవన్, వినయ్ శర్మ, అక్షయ్‌కుమార్ సింగ్‌లకు ఢిల్లీ హైకోర్టు విధించిన మరణ శిక్షను సుప్రీం కోర్టు సమర్థించింది. ఇది ఉరి శిక్ష విధించేందుకు అర్హమైన 'అరుదైన' కేసంది. దోషులు దాఖలు చేసిన పిటిషన్‌పై దాదాపు మూడేళ్ల పాటు విచారణ జరిపిన కోర్టు మే 5న తుది తీర్పు వెల్లడించింది. ఈ కేసులో మరో నిందితుడు రాంసింగ్ 2013 మార్చ్‌లో తీహార్ జైలులో ఆత్మహత్య చేసుకున్నాడు. అత్యంత క్రూరంగా వ్యవహరించాడని గుర్తించిన బాల నేరస్తుడు మూడేళ్ల జైలుశిక్ష అనంతరం జువెనైల్ హోం నుంచి విడుదలయ్యాడు. జస్టిస్ దీపక్ మిశ్రా నేతృత్వంలో జస్టిస్ బానుమతి, జస్టిస్ అశోక్ భూషణ్‌లతో కూడిన ధర్మాసనం దోషులను ఉరికంభం ఎక్కించాల్సిందేనని తేల్చింది.

## నక్సల్స్‌పై 'సమాధాన్' యుద్ధం

మావోయిస్టులను అణచివేసేందుకు కేంద్ర హోం శాఖ మంత్రి రాజ్‌నాథ్ సింగ్ ఉద్యమ ప్రాంత ముఖ్యమంత్రులు, డి.జి.పిలు, ఇతర ఉన్నతాధికారులతో మే 8న ఢిల్లీలో సమావేశమయ్యారు. ఈ సమావేశానికి జార్ఖండ్, ఛత్తీస్‌గఢ్, మహారాష్ట్ర, బీహార్, ఒడిశా, ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రులు హాజరయ్యారు. మావోయిస్టు ప్రభావం ఉన్న 35 జిల్లాల ఎస్.పిలు, కలెక్టర్‌లు పాల్గొన్నారు. మావోయిస్టుల అణచివేతకు ఏకైక మార్గం 'సమాధాన్' అని కేంద్ర హోంశాఖ మంత్రి రాజ్‌నాథ్ సింగ్ అన్నారు. బహుముఖ వ్యూహాలతో మావో యిస్టులపై దాడికి సిద్ధం కావాలని ప్రభావిత రాష్ట్రాలకు పిలుపునిచ్చారు. నక్సల్స్ ఆర్థిక మూలాలను దెబ్బతీయడమే ఈ పోరులో ప్రధానం అన్నారు.

## డెబ్బై ఏళ్ల తరువాత దళిత వాల్మీకీలకు క్షవరం

ఉత్తరప్రదేశ్‌లోని సంభాల్ జిల్లా ఫతేపూర్ షాంషోయ్ గ్రామంలో అగ్రవర్ణాల ఆదేశం మేరకు దళిత వాల్మీకీలకు క్షవరంపై 70 ఏళ్లుగా నిషేధం కొనసాగుతోంది. దళితులకు వాడే 'అపవిత్ర, అపరిశుభ్రమైన' రేజర్లను తమకు వాడితే క్షవరాలు చేయించుకోబోమని అగ్రవర్ణాలు బెదిరించారు. దీంతో క్షురకులు దళితులకు క్షవరం చేయడం లేదు. తమకు క్షవరం చేయకపోతే ఇస్లాం మతం పుచ్చుకుంటామని బాధితులు హెచ్చరించడంతో అగ్రవర్ణాలు దిగొచ్చాయి. పోలీసులు, ఇతర అధికారుల జోక్యంతో మే 16 నుండి దళితులకు క్షవరం చేయడం మళ్లీ ప్రారంభించారు.

## మాంసాహారం తినే హక్కును హరించలేం

ఉత్తరప్రదేశ్‌లో కబేళాల మూసివేతను వ్యతిరేకిస్తూ దాఖలైన 27 పిటిషన్లపై విచారణ జరిపిన అలహాబాద్ హైకోర్టు మే 12న తీర్పు వెల్లడించింది. మాంసాహారం తినే విషయంపై ఏ వ్యక్తిపైనా నిషేధాజ్ఞలు విధించకూడదని, కబేళాలకు సంబంధించిన లైసెన్స్‌లను పునరుద్ధరించడంతో పాటు, కొత్త లైసెన్సులు మంజూరు చేయాలని యోగి సర్కారును ఆదేశించింది. ఈ తీర్పుపై సమాధానమివ్వాలని యుపి సర్కార్‌ను కోర్టు ఆదేశించింది. ఈ కేసును జూలై 17కు వాయిదా వేసింది.

## జస్టిస్ కర్ణన్‌కు జైలు శిక్ష

కోర్టు ధిక్కరణ కేసులో కలకత్తా హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ కర్ణన్‌ను దోషిగా తేలుస్తూ సుప్రీం కోర్టు ఆయనకు ఆరు నెలల జైలు శిక్ష విధించింది. తక్షణమే కస్టడీలోకి తీసుకోవాలని భారత ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ జె.ఎస్. ఖేహర్ నేతృత్వంలోని రాజ్యాంగ ధర్మాసనం మే 9న పశ్చిమ బెంగాల్ డిజిపికి ఆదేశాలు జారీచేసింది. జస్టిస్ కర్ణన్ ఇకపై ఇచ్చే ఆదేశాలను ప్రచురించకుండా, ప్రసారం చేయకుండా ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాపై నిషేధం కూడా విధించింది. సుప్రీం కోర్టుకు, న్యాయమూర్తులకు వ్యతిరేకంగా పలు ఆదేశాలు జారీ చేసినందున ఆయనను కోర్టు ధిక్కారం కింద శిక్షించాలని అసిస్టెంట్ సోలిసిటర్ జనరల్ మణీందర్ సింగ్ కోర్టుకు తెలిపారు.

## అశోక్ పి. కులకర్ణి మృతి

వృత్తిరీత్యా న్యాయవాది, కార్మిక నాయకుడు అశోక్ పి. కులకర్ణి (72) జనవరి 18న ముంబైలో అనారోగ్యంతో మరణించారు. ఆయన మొదట కార్మికునిగా మొదలై ట్రేడ్ యూనియన్ లీడర్‌గా ఎదిగి కార్మికుల న్యాయమైన హక్కుల కోసం పోరాడారు. కంపెనీ మేనేజ్‌మెంట్‌లతో రాజీ లేకుండా పోరాడి కార్మికుల హక్కులను సాధించడంలో ముందుండే వారు. మేనేజ్‌మెంట్‌కు వ్యతిరేకంగా పోరాడినందుకు కులకర్ణిని కంపెనీ తొలగించింది. కులకర్ణి న్యాయవాదిగా ప్రాక్టిస్ చేస్తూ కార్మికులకు అన్ని రకాలుగా అండదండలు అందించి చివరి వరకు కార్మికుల పక్షాన పోరాడారు.

## ఛత్తీస్‌గఢ్‌లో జవాన్ల బీభత్సం

ఛత్తీస్‌గఢ్‌లోని సుక్మా జిల్లా బుర్కాపాల్‌లో సిఆర్‌పిఎఫ్ జవాన్లపై జరిగిన ఘటనకు ప్రతీకారంగా 350 మంది సాయుధ బలగాలతో మే 13 నుండి 15 వరకు జరిపిన గాలింపు జరిపారు. ఈ గాలింపు చర్యల్లో చిన్న గోద్కే, పెద్దగోద్కే, రాయగూడెం గ్రామాల్లో సిఆర్‌పిఎఫ్ బలగాలు తీవ్ర బీభత్సం సృష్టించాయి. ఇళ్లల్లో ఉన్న బంగారం, నగదు, ఆహార పదార్థాలను తీసుకెళ్లాయని, పదహారు ఇళ్లను తగులబెట్టాయని ఆదివాసులు తెలిపారు.

## జార్ఖండ్‌లో ఇసుక మాఫియా హత్యలు

జార్ఖండ్‌లో ఇసుక మాఫియా తవ్వకాలను అడ్డుకున్నారన్న కారణంతో ఒకే కుటుంబానికి చెందిన ముగ్గురిని కాంట్రాక్టర్, అతడి అనుచరులు మే 19న కాల్చి చంపారు. జార్ఖండ్‌లోని గర్వా జిల్లా పిప్రీ జాద్‌పురాలోని బాలు ఘాట్ వద్ద నానక్ యాదవ్ అక్రమంగా ఇసుక తవ్వకాలు చేపడుతున్నాడు. అదే గ్రామానికి చెందిన ఉదయ్ కుటుంబంతో పాటు స్థానికులు తవ్వకాలను వ్యతిరేకించారు. దీంతో నానక్ అతడి అనుచరులతో కలిసి కాల్పులు జరిపాడు. ఈ కాల్పుల్లో ఉదయ్ యాదవ్, అతడి ఇద్దరు కొడుకులు చనిపోయారు. దీంతో స్థానికులంతా కాంట్రాక్టర్ ఇంటిపై దాడిచేసి అతడి అనుచరున్ని చంపారు. కాంట్రాక్టర్‌కు చెందిన 21 వాహనాలకు నిప్పు పెట్టారు. వీ

### మేడే ప్రదర్శనలు

ప్రపంచ కార్మిక దినోత్సవం మేడే రోజున ప్రపంచ వ్యాప్తంగా కార్మికులు పెద్ద ఎత్తున ప్రదర్శనలు నిర్వహించారు. క్యూబా, రష్యా, చైనా, పారిస్, ఇస్తాంబుల్, గ్రీస్, ఫిలిప్పీన్స్ ఇతర దేశాల్లో మేడే ప్రదర్శనలు గొప్పగా జరిగాయి. రష్యా రాజధాని మాస్కోలో రెడ్‌స్క్వేర్ దగ్గర పదిహేను లక్షల మంది ప్రదర్శనల్లో పాల్గొన్నారు. చైనా, క్యూబా, మెక్సికో, వెనెజులా, ఇతర లాటిన్ అమెరికా దేశాలలో అంతర్జాతీయ కార్మిక దినోత్సవంలో మెరుగైన వేతనం, పని పరిస్థితులు కల్పించాలని డిమాండ్ చేస్తూ కార్మికులు లక్షలాదిగా పాల్గొన్నారు. ర్యాలీలు, ప్రదర్శనలు జరిపారు. పారిస్‌లో మేడే ప్రదర్శనపై పోలీసులు తీవ్రంగా అణిచివేసే ప్రయత్నం చేశారు. టర్కీలో తక్సిమ్ స్క్వేర్ వద్ద ప్రదర్శనగా వెళ్లడానికి ప్రయత్నించిన రెండు వందల మందికి పైగా కార్మికులను పోలీసులు అరెస్టు చేశారు. కాగా, ఇస్తాంబుల్, అంకారాల్లో కార్మికులు భారీగా తరలివచ్చి ర్యాలీలు నిర్వహించారు.

### 'ఒబామా కేర్' రద్దుకు రంగం సిద్ధం

అమెరికా మాజీ అధ్యక్షుడు బరాక్ ఒబామా అధికారంలో ఉండగా అత్యంత ప్రజాధరణ పొందిన ఒబామా కేర్ ఆరోగ్య రక్షణ చట్టం రద్దుకు అమెరికా దిగువ సభ మే 2న ఆమోదం తెలిపింది. అధ్యక్ష పదవి చేపట్టినప్పటి నుంచి డోనాల్డ్ ట్రంప్ ఈ చట్టం స్థానంలో నూతన ఆరోగ్య చట్టాన్ని తీసుకు వచ్చేందుకు పూనుకున్నారు. ఈ చట్టం ప్రతిపాదనను దిగువ సభ కేవలం నాలుగు ఓట్ల తేడాతో ఆమోదించింది. డెమోక్రాట్లు ఈ చట్టానికి మద్దతు తెలపలేదు. దిగువ సభలో 217-213 ఓట్ల తేడాగో ఈ బిల్లు నెగ్గింది. ఒబామా కేర్ రద్దు కావడంతో అమెరికా వ్యాప్తంగా పెద్ద ఎత్తున నిరసలు వెల్లువెత్తాయి.

### ఫ్రాన్స్ నూతన అధ్యక్షుడు మేక్రాన్

ఫ్రాన్స్‌లో మే 7న అధ్యక్ష పదవికి ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో 66 శాతం ఓట్ల (2.07 కోట్లు)తో స్వతంత్ర అభ్యర్థి, ఎన్ మార్చ్ ఉద్యమ రూపకర్త ఇమ్మాన్యుయల్ మేక్రాన్ గెలుపొందారు. ఆయన ప్రత్యర్థి జాతీయ అతివాది, విభజనవాది అయిన నేషనల్ పార్టీ అభ్యర్థి లీ పెన్‌కు కేవలం 33 శాతం ఓట్లు (1.06 కోట్లు) వచ్చాయి. ఫ్రాన్స్ చరిత్రలో నెపోలియన్ తరువాత పిన్న వయస్కుడిగా 39 ఏండ్ల మేక్రాన్ చరిత్ర సృష్టించారు. మే 14న ప్రమాణ స్వీకారం చేశారు. విజయం తరువాత మేక్రాన్ మాట్లాడుతూ ఫ్రాన్స్ చరిత్రలో కొత్త అధ్యాయం మొదలైందని, ఈ అధ్యాయం ఆశా, దేశ సమైక్యతకు, యూరప్ రక్షణకు హామీ ఇస్తానని అన్నారు.

### దక్షిణ కొరియా అధ్యక్షుడిగా మూన్

దక్షిణ కొరియా మాజీ అధ్యక్షురాలు పార్క్ గ్యెయిన్‌పై అభిశంసన తరువాత అధ్యక్ష పీఠానికి మే 9న ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో డెమోక్రాటిక్ పార్టీ ఆఫ్ కొరియా నేత, ప్రతిపక్ష నాయకుడు మూన్ జా ఇన్ గెలిచారు. ఆయనకు 41 శాతం ఓట్లు (13 కోట్లు) వచ్చాయి. ఆయన ప్రత్యర్థి లిబర్టీ కొరియా పార్టీ నాయకుడు హోంగ్ జూన్ ప్యోకు 24 శాతం ఓట్లు (7.8 కోట్లు) వచ్చాయి. ఉదారవాద, వామపక్ష భావాల్ని వెలిబుచ్చే వ్యక్తిగా మూన్ గుర్తింపు పొందారు. మే 11న అధ్యక్షుడిగా ప్రమాణ స్వీకారం చేశారు. ఉత్తర కొరియాతో ఇప్పటివరకు అనుసరిస్తున్న వైఖరిని తప్పుపట్టే వారు. రెండు కొరియా దేశాల మధ్య ఉన్న వివాదాల్ని పరిష్కరించుకోని, సంబంధాలు మెరుగు పడాలని కోరుకుంటున్నాని మూన్ కోరారు.

### ఎఫ్‌బిఐ డైరెక్టర్ తొలగింపు

అమెరికా ఫెడరల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ డైరెక్టర్ జేమ్స్ కోమెనిని అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ తొలగించారు. కోమె నాలుగేండ్లుగా ఎఫ్‌బిఐ డైరెక్టరుగా ఉన్నారు. ట్రంప్ ఎన్నికల ప్రచార బృందం రష్యాతో కుమ్మక్కయిందా? లేదా? అనే విషయాలపై ఎఫ్‌బిఐ దర్యాప్తు ప్రారంభించింది. ఈ నిర్ణయాన్ని డెమోక్రాట్ పార్టీ, మీడియా తీవ్రంగా విమర్శించింది. దర్యాప్తు సమయంలో ఆ సంస్థను ప్రభావితం చేయడానికే డైరెక్టర్‌ను తొలగించినట్లు ట్రంప్‌పై ఆరోపణలు చేసింది. ఈ నేపథ్యంలో ప్రజల నుంచి పెద్ద ఎత్తున వస్తున్న డిమాండ్ మేరకు ట్రంప్-రష్యా సంబంధాలపై మరో కొత్త విచారణ ప్రారంభమైంది. మాజీ ఎఫ్‌బిఐ డైరెక్టర్ రాబర్ట్ ముల్లర్ నేతృత్వంలో ప్రత్యేక కౌన్సిల్‌ను ఏర్పాటు చేస్తున్నామని, ఈ కౌన్సిల్ స్వతంత్ర విచారణ జరుపుతుందని డిప్యూటి అటార్నీ జనరల్ రోసెన్ స్టెయిన్ మే 17న ప్రకటించారు.

### ప్రపంచ దేశాలను కుదిపేసిన 'వాన్నాక్రై' వైరస్

ప్రపంచ వ్యాప్తంగా సుమారు 99 దేశాలలో మే 12న కంప్యూటర్లపై సైబర్ దాడి జరిగింది. సుమారు పది గంటల వ్యవధిలో దాదాపు 45 వేల హ్యాకింగ్‌ల ద్వారా అరవై వేల కంప్యూటర్ల సమాచారం దొంగిలించారు. ప్రపంచంలోనే అత్యంత భద్రతా విభాగంగా చెప్పుకునే అమెరికా జాతీయ సెక్యూరిటీ సంస్థ ఉపయోగించే హ్యాకింగ్ పరికరాలతోనే ఈ సైబర్ దాడులు జరిగాయి. ఈ దాడి ముందుగా బ్రిటన్ ఆరోగ్య సంస్థలు తీవ్ర ప్రభావానికి చూపింది. ఇంగ్లండ్‌లోని నేషనల్ హెల్త్ సర్వీస్ సెంటర్‌పై సైబర్ దాడితో చాలా ఆస్పత్రుల్లో అత్యవసర సేవలు ఆగిపోయాయి. ఆ తరువాత క్రమంగా మిగతా ప్రపంచ దేశాలకు విస్తరించింది. ఈ దాడిలో రష్యా తీవ్రంగా నష్టపోయింది. ప్రభుత్వ రంగ బ్యాంకులు, హోం, ఆరోగ్య, రైల్వే, మొబైల్ ఫోన్ నెట్‌వర్క్ రంగాలు తీవ్రంగా దెబ్బతిన్నాయి.

### జూలియ అసాంజేకు ఊరట

వికీలీక్స్ వ్యవస్థాపకుడు జూలియ అసాంజేకు లైంగిక దాడి కేసు నుంచి ఊరట లభించింది. ఈ కేసుకు సంబంధించి దర్యాప్తు, విచారణలను పూర్తిగా నిలిపివేస్తున్నట్లు స్వీడన్ పబ్లిక్ ప్రాసిక్యూషన్ మే 18న ఒక ప్రకటనలో తెలిపింది. ఏడేండ్లుగా ఈ కేసు నడుస్తోంది. అరెస్టు నుంచి తప్పించుకునేందుకు గత ఐదేండ్లుగా లండన్‌లోని ఈక్వెడార్ కార్యాలయంలో అసాంజే రాజకీయ ఆశ్రయం పొందుతున్నాడు. కేసు విచారణ పేరుతో స్వీడన్ ప్రభుత్వం తనను అరెస్టు చేసి అమెరికాకు అప్పగిస్తుందని ముందు నుంచీ అసాంజే చెబుతున్నారు. అయితే అతను బయట అడుగుపెట్టిన మరుక్షణం అమెరికా అరెస్ట్ చేసే అవకాశాలున్నాయి. కాబట్టి ఇప్పుడిప్పుడే అసాంజే ఈక్వెడార్ ఎంబసీ నుంచి బయటకి రాలేని పరిస్థితి ఉంది.

### ఇరాన్ అధ్యక్షుడిగా మరోసారి రౌహానీ

ఇరాన్ అధ్యక్ష పదవికి మే 19న ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో ప్రస్తుత అధ్యక్షుడు, మోడరేషన్ అండ్ డెవలప్‌మెంట్ పార్టీ (ఎండిపి) నేత హసన్ రౌహానీ గెలిచారు. మొత్తం నాలుగు కోట్ల మందికి పైగా (70 శాతం) ఎన్నికల్లో ఓటు వేశారు. మే 20న వెలువడిన ఫలితాల్లో రౌహానీకి 57 శాతం (2.3 కోట్లు) ఓట్లు రాగా, ఆయన ప్రత్యర్థి కంబాటెంట్ క్లెరిక్స్ అసోసియేషన్ (సిసిఎ) పార్టీ నేత ఎబ్రహీమ్ రైసీకి 38.5 శాతం (1.57 కోట్లు) ఓట్లు వచ్చాయి.

### బ్రిటన్‌లో ఆత్మాహుతి దాడి

బ్రిటన్‌లోని ప్రఖ్యాక పారిశ్రామిక నగరం మాంచెస్టర్‌లో మే 22న రాత్రి ఎరీనా ఇండోర్ స్టేడియంలో ఆత్మాహుతి దాడి జరిగింది. ఈ దాడిలో ఇరవై రెండు మంది మరణించారు. మరో యాభై మందికి పైగా గాయపడ్డారు. మే 22 రాత్రి ఎరీనా ఇండోర్ స్టేడియంలో పాప్‌స్టార్ అరియానా గ్రాండే మ్యూజిక్ షోకు ఇరవై వేల మందికి పైగా జనం వచ్చారు. షో అయిపోతున్న సమయంలో ఒక్కసారిగా పేలుడు సంభవించింది. ఒక్కసారిగా జనం భయపడి బయటికి వెళ్లడానికి ప్రయత్నించడంతో తొక్కిసలాట జరిగి ఇరవై మందికి పైగా ప్రాణాలు కోల్పోయారు.

### ప్రచండ రాజీనామా

నేపాల్ ప్రధానమంత్రి పుష్పకమల్ దహల్ ప్రచండ రాజీనామా చేశారు. రాజకీయ ఒప్పందంలో భాగంగా ఆయన తన పదవికి మే 24న రాజీనామా చేశారు. కొత్త ప్రధానిగా నేపాలీ కాంగ్రెస్ నేత షేర్ బహదూర్ దేవ్ బా ప్రమాణం చేయనున్నారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(ఏప్రిల్ 1 నుండి ఏప్రిల్ 30, 2017 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (919), ఆంధ్రప్రదేశ్‌లోని 11 జిల్లాలలో (730) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1649)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 5 | – | 26 | 29 | 10 | 4 | 6 | 3 | 1 | 2 | 2 | 1 | 5 | 27 | 32 | – | – | – | 3 | 12 |
| హైదరాబాద్ | – | – | – | 11 | 12 | 3 | 4 | 1 | – | 1 | 2 | 4 | 3 | 2 | 16 | 18 | – | – | – | – | 1 |
| కరీంనగర్ | – | 2 | – | 5 | 4 | 2 | 1 | – | 1 | – | 2 | 3 | 3 | 3 | 21 | 11 | – | – | – | – | 6 |
| ఖమ్మం | – | 2 | – | 9 | 10 | 2 | 3 | – | – | – | 2 | 2 | 4 | 4 | 25 | 5 | – | – | – | – | 21 |
| మహబూబ్‌నగర్ | 1 | 2 | – | 4 | 3 | 5 | 3 | 3 | – | 3 | 6 | 5 | 10 | 11 | 38 | 6 | – | – | – | – | – |
| మెదక్ | – | 19 | – | 6 | 9 | 9 | 5 | 1 | 5 | 6 | 8 | 9 | 16 | 29 | 42 | 19 | – | – | – | 8 | 1 |
| నల్గొండ | – | 2 | 1 | 4 | 7 | 3 | 1 | 1 | – | – | 1 | 1 | 1 | 3 | 30 | 13 | – | – | – | – | 23 |
| నిజామాబాద్ | – | – | – | 6 | 2 | 3 | 1 | – | 1 | 4 | 2 | 1 | – | 3 | 12 | 11 | – | – | – | – | 2 |
| వరంగల్ | – | 5 | – | 2 | 7 | – | 2 | – | – | – | – | 1 | 1 | 2 | 22 | 12 | – | – | – | – | 3 |
| వికారాబాద్ | – | 1 | – | 7 | 1 | 1 | 2 | 1 | – | – | 1 | 1 | – | 4 | 8 | 6 | – | – | – | – | – |
| **తెలంగాణ** | **1** | **38** | **1** | **80** | **84** | **37** | **26** | **13** | **10** | **15** | **26** | **29** | **39** | **66** | **241** | **133** | **-** | **-** | **-** | **11** | **69** |
| అనంతపురం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| చిత్తూరు | – | – | – | 3 | 3 | 6 | 8 | – | 1 | 2 | 3 | 4 | 2 | – | 27 | 2 | – | – | – | – | 11 |
| కడప | – | – | – | 1 | 4 | – | – | – | – | 3 | – | – | 1 | 3 | 6 | 10 | – | – | – | – | – |
| గుంటూరు | – | 2 | – | 3 | 5 | – | 3 | – | 1 | 2 | 2 | 1 | – | 3 | 23 | 17 | – | – | – | – | 3 |
| కృష్ణా | – | – | – | 2 | 5 | 1 | 2 | – | – | 2 | 2 | 1 | 2 | 1 | 16 | 9 | – | – | – | – | – |
| కర్నూలు | – | 6 | – | 4 | 6 | 5 | 6 | 5 | 4 | 2 | 5 | 7 | 10 | 6 | 21 | 19 | – | – | – | – | 15 |
| తూర్పు గోదావరి | – | – | – | 6 | – | 1 | 6 | 1 | – | 4 | 3 | – | – | 5 | 18 | 9 | – | 1 | – | – | 9 |
| ప్రకాశం | – | 3 | – | 4 | 6 | 1 | 8 | 1 | 1 | 2 | 1 | – | – | 3 | 25 | 11 | – | – | – | – | 14 |
| శ్రీకాకుళం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| పశ్చిమ గోదావరి | – | – | – | 3 | 7 | 1 | 4 | – | – | 3 | – | – | – | 3 | 12 | 11 | – | – | – | – | 3 |
| నెల్లూరు | – | – | – | 5 | 4 | 1 | 2 | – | 2 | 3 | – | 2 | 2 | 5 | 24 | 9 | – | – | – | – | 22 |
| విజయనగరం | – | – | – | 4 | 4 | 3 | 4 | – | – | 2 | – | 1 | – | 1 | 15 | 11 | – | – | – | – | 7 |
| విశాఖపట్నం | – | 1 | – | 3 | 8 | 1 | – | 1 | 2 | 5 | 2 | 3 | 1 | – | 20 | 15 | – | – | – | 4 | 12 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **12** | **-** | **38** | **52** | **20** | **43** | **8** | **11** | **30** | **18** | **19** | **18** | **30** | **207** | **123** | **-** | **1** | **-** | **4** | **96** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు




Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 191 - June 2017 • **ISSN 2231-6892**

• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/05/2017 • Postal Regn. No. L II/RNP/HD/1100/2017-19 Date of Posting : 29th, 30th


గత ఐదారు సంవత్సరాలుగా వీక్షణం ఆర్థిక పరిస్థితి దినదినగండంగా గడుస్తున్నదని మీ అందరికీ తెలుసు. వీక్షణం కార్యాలయాన్ని మామూలు కన్న సగం అద్దెకు ఇచ్చిన ఇంటి యజమాని, ఏనెలకానెల బిల్లు చెల్లించలేకపోయినా అరువుకు అచ్చువేసిపెట్టే ప్రింటింగ్ ప్రెస్ యజమానులు వంటివారి ఔదార్యం వల్ల, కనీసం ఐదుగురు సిబ్బంది అవసరమయ్యే చోట ముగ్గురు మాత్రమే మామూలుగా వచ్చే జీతంలో సగం జీతానికే పనిచేస్తున్న సిబ్బంది వల్ల వీక్షణం తక్కువ ఖర్చుతో నడుస్తున్నది. అయినా వీక్షణం వార్షిక ఖర్చు పన్నెండు లక్షల రూపాయలు కాగా, చందాలు, విడిప్రతి అమ్మకాలు, వీక్షణం దగ్గర అమ్మిన పుస్తకాల మీద వచ్చే ఆదాయం కలిసి సంవత్సరానికి ఆరు – ఏడు లక్షల రూపాయలు మాత్రమే తిరిగి వస్తున్నది. ఖర్చుకు సమానమైన ఆదాయాన్ని రాబట్టాలంటే పత్రిక విడిప్రతి ధర, చందా కనీసం రెట్టింపు చేయవలసి ఉంటుంది. పాఠకుల కొనుగోలు శక్తిని దృష్టిలో పెట్టుకున్నప్పుడు అది అసాధ్యం.

అందువల్లనే వీక్షణం ఆ లోటును విరాళాల ద్వారా, వ్యాపార ప్రకటనల ద్వారా పూరించుకోవడానికి ప్రయత్నిస్తున్నది. గతంలో లోటులో సగం దాకా పూరిస్తుండిన ప్రకటనలు కూడ ఇటీవల తగ్గిపోయాయి. వీక్షణం ప్రతి సంవత్సరం దాతల దగ్గరికి వెళ్లి విరాళాలు సేకరించి, అప్పులు తీర్చి, మరుసటి సంవత్సరానికి తనను తాను సిద్ధం చేసుకుంటున్నది. మూడు సంవత్సరాల కింద తెలుగు సామాజిక, సాహిత్య రంగాల ప్రముఖులు కొందరు వీక్షణంకు చేయూతనిమ్మని చేసిన విజ్ఞప్తికి ప్రతిస్పందించి ఎందరో దాతలు విరాళాలు ఇవ్వడానికి ముందుకొచ్చారు. అలా 2016లో వీక్షణం అభిమానుల నుంచి ఏనెలకానెల అందిన విరాళాలు రు. 2,59,500. అప్పటికీ ఆ సంవత్సరంలో ఏర్పడిన మరొక రెండున్నర లక్షల రూపాయల లోటును దాతల దగ్గరికి వెళ్లి తీర్చుకున్నాం.

ఈ సంవత్సరం మళ్లీ అదే పరిస్థితి కొనసాగుతున్నది. ఏనెలకానెల దాతల ఔదార్యంతో, విరాళాలతో, సహకారంతో పత్రిక క్రమం తప్పకుండా వెలువడుతూ వస్తున్నది. కాని ఆ ఆశావహ పరిస్థితి కూడ నానాటికీ తరిగిపోతున్నదని అనిపిస్తున్నది. ఇప్పుడిక వీక్షణం మరొకసారి పాఠకుల, అభిమానుల, దాతల వైపు చూడక తప్పడం లేదు. మాకేమీ శాశ్వత నిధి ఆశలు లేవు. పత్రిక ఒక సామాజిక, చారిత్రక అవసరాన్ని తీరుస్తున్నదని, దీన్ని క్రమం తప్పకుండా తీసుకురావాలని తప్ప మాకు గొంతెమ్మ కోర్కెలేమీ లేవు. ఈ కనీస అవసరాన్ని తీర్చే బాధ్యత తీసుకోవలసింది వీక్షణం పాఠకులు, అభిమానులు, శ్రేయోభిలాషులు, దాతలు మాత్రమే... తెలుగు సమాజం తనతో తాను చేసుకుంటున్న సంభాషణావేదిక, రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వీక్షణం ఆగిపోకుండా ఆదుకోవలసింది మీరే.

## వీక్షణంను ఆదుకోండి

## చందాలు చేర్పించండి, ప్రకటనలు, విరాళాలు సేకరించండి

## మళ్లీ ఒకసారి మీ స్నేహహస్తం కోసం

## వీక్షణం విజ్ఞప్తి

• ప్రతి చందాదారూ మరొక

• తమ తమ ప్రాంతాల్లో లైబ్రరీల్లో, కాలేజీల్లో, ఆఫీసుల్లో వీక్షణం చందాలు చేర్పించవచ్చు


**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 191 - June 2017 • **ISSN 2231-6892**
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/05/2017 • Postal Regn. No. L II/RNP/HD/1100/2017-19

Date of Posting : 29th, 30th

# వీక్షణంను ఆదుకోండి

# చందాలు చేర్పించండి, ప్రకటనలు, విరాళాలు సేకరించండి

## మళ్లీ ఒకసారి మీ స్నేహహస్తం కోసం వీక్షణం విజ్ఞప్తి

గత ఐదారు సంవత్సరాలుగా వీక్షణం ఆర్థిక పరిస్థితి దినదినగండంగా గడుస్తున్నదని మీ అందరికీ తెలుసు. వీక్షణం కార్యాలయాన్ని మామూలు కన్న సగం అద్దెకు ఇచ్చిన ఇంటి యజమాని, ఏనెలకానెల బిల్లు చెల్లించలేకపోయినా అరువుకు అచ్చువేసిపెట్టే ప్రింటింగ్ ప్రెస్ యజమానులు వంటివారి ఔదార్యం వల్ల, కనీసం ఐదుగురు సిబ్బంది అవసరమయ్యే చోట ముగ్గురు మాత్రమే మామూలుగా వచ్చే జీతంలో సగం జీతానికే పనిచేస్తున్న సిబ్బంది వల్ల వీక్షణం తక్కువ ఖర్చుతో నడుస్తున్నది. అయినా వీక్షణం వార్షిక ఖర్చు పన్నెండు లక్షల రూపాయలు కాగా, చందాలు, విడిప్రతి అమ్మకాలు, వీక్షణం దగ్గర అమ్మిన పుస్తకాల మీద వచ్చే ఆదాయం కలిసి సంవత్సరానికి ఆరు – ఏడు లక్షల రూపాయలు మాత్రమే తిరిగి వస్తున్నది. ఖర్చుకు సమానమైన ఆదాయాన్ని రాబట్టాలంటే పత్రిక విడిప్రతి ధర, చందా కనీసం రెట్టింపు చేయవలసి ఉంటుంది. పాఠకుల కొనుగోలు శక్తిని దృష్టిలో పెట్టుకున్నప్పుడు అది అసాధ్యం.

అందువల్లనే వీక్షణం ఆ లోటును విరాళాల ద్వారా, వ్యాపార ప్రకటనల ద్వారా పూరించుకోవడానికి ప్రయత్నిస్తున్నది. గతంలో లోటులో సగం దాకా పూరిస్తుండిన ప్రకటనలు కూడ ఇటీవల తగ్గిపోయాయి. వీక్షణం ప్రతి సంవత్సరం దాతల దగ్గరికి వెళ్లి విరాళాలు సేకరించి, అప్పులు తీర్చి, మరుసటి సంవత్సరానికి తనను తాను సిద్ధం చేసుకుంటున్నది. మూడు సంవత్సరాల కింద తెలుగు సామాజిక, సాహిత్య రంగాల ప్రముఖులు కొందరు వీక్షణంకు చేయూతనిమ్మని చేసిన విజ్ఞప్తికి ప్రతిస్పందించి ఎందరో దాతలు విరాళాలు ఇవ్వడానికి ముందుకొచ్చారు. అలా 2016లో వీక్షణం అభిమానుల నుంచి ఏనెలకానెల అందిన విరాళాలు రు. 2,59,500. అప్పటికీ ఆ సంవత్సరంలో ఏర్పడిన మరొక రెండున్నర లక్షల రూపాయల లోటును దాతల దగ్గరికి వెళ్లి తీర్చుకున్నాం.

ఈ సంవత్సరం మళ్లీ అదే పరిస్థితి కొనసాగుతున్నది. ఏనెలకానెల దాతల ఔదార్యంతో, విరాళాలతో, సహకారంతో పత్రిక క్రమం తప్పకుండా వెలువడుతూ వస్తున్నది. కాని ఆ ఆశావహ పరిస్థితి కూడ నానాటికీ తరిగిపోతున్నదని అనిపిస్తున్నది. ఇప్పుడిక వీక్షణం మరొకసారి పాఠకుల, అభిమానుల, దాతల వైపు చూడక తప్పడం లేదు. మాకేమీ శాశ్వత నిధి ఆశలు లేవు. పత్రిక ఒక సామాజిక, చారిత్రక అవసరాన్ని తీరుస్తున్నదని, దీన్ని క్రమం తప్పకుండా తీసుకురావాలని తప్ప మాకు గొంతెమ్మ కోర్కెలేమీ లేవు. ఈ కనీస అవసరాన్ని తీర్చే బాధ్యత తీసుకోవలసింది వీక్షణం పాఠకులు, అభిమానులు, శ్రేయోభిలాషులు, దాతలు మాత్రమే... తెలుగు సమాజం తనతో తాను చేసుకుంటున్న సంభాషణావేదిక, రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వీక్షణం ఆగిపోకుండా ఆదుకోవలసింది మీరే.

- **ప్రతి చందాదారూ మరొక చందాదారును చేర్పించవచ్చు**
- **తమ తమ ప్రాంతాల్లో న్యూస్ స్టాల్స్‌లో వీక్షణం అమ్మడానికి ఏర్పాట్లు చేయవచ్చు**
- **తమ తమ ప్రాంతాల్లో లైబ్రరీల్లో, కాలేజీల్లో, ఆఫీసుల్లో వీక్షణం చందాలు చేర్పించవచ్చు**
- **ప్రకటనలు, విరాళాలు ఇవ్వగలిగిన దాతలకు వీక్షణంను పరిచయం చేయవచ్చు**

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao